# హిమాలయ యోగులు

Cat-12 35



70,579

డా॥ వి.వి. బాలకృష్ణ ఎం.ఎస్‌సి., పిహెచ్.డి.

బా.ల. 70,579

6018
Cat-1235

Himalayan Masters (Swamy Rama Experiences) in Telugu -
By: Dr. V.V. Bala Krishna

ప్రథమ ముద్రణ : సెప్టెంబరు, 1994

ద్వితీయ ముద్రణ : జనవరి, 1997

© అన్ని హక్కులు రచయితవి

200.92

టైటిల్ డిజైను: వాసు

వెల: రూ.50/-




ప్రతులకు :
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-1-435, విజ్ఞానభవన్, బ్యాంకు స్ట్రీట్,
హైదరాబాదు - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్
హైదరాబాదు, విజయవాడ, గుంటూరు, విశాఖపట్నం,
అనంతపురం, తిరుపతి, హన్మకొండ, కాకినాడ.

ముద్రితము : శ్రీ కళాంజలీ గ్రాఫిక్స్, 3-5-323, విఠల్‌వాడి,
నారాయణగూడ, హైదరాబాదు-500 029 * ఫోన్ : 597831

# అంకితం

నాకు తొలిగురువు
ఆధ్యాత్మిక సంపన్నులు, నాదయోగి, భక్తియోగి, కర్మయోగి,
ఉత్తమ అధ్యాపకులు అయిన మా నాన్నగారు

**కీ॥శే॥ వి.యస్. వెంకటనారాయణ గారి**

దివ్యస్మృతికి....



మా నాన్నగారు : శ్రీ వి.యస్. వెంకటనారాయణ గారు
అమ్మగారు : శ్రీమతి వి. రాజేశ్వరి

# మొదటి ముద్రణకు - నామాట

'లివింగ్ విత్ ది హిమాలయన్ మాస్టర్స్' అనే పుస్తకం స్వామీ రామా అనుభవాల సంకలనం. స్వామీ రామా భావవాహినిని ఈ రూపంలో సవినయంగా సమర్పించుకుంటున్నాను. ఇది మన ప్రాచీన వారసత్వం. యోగుల చింతనామృతం. యోగుల జీవనగతుల చిత్రణను, అనుభవాలను అందించే మధురస భాండం.

"పరమహంస యోగానంద రచన 'ఒక యోగి ఆత్మకథ' వంటిదే ఈ పుస్తకం. చదవాలి మీరు" అంటూ ఈ పుస్తకాన్ని తొలిసారి నాకు పరిచయం చేసినవారు సుభాష్ పత్రిగారు, బి.వి. రెడ్డిగారు (పిరమిడ్ ధ్యాన కేంద్రం, కర్నూలు). మొదట యధాలాపంగా చదివినా తర్వాత మరోసారి మిత్రులు డాక్టర్ ఐ. సత్యనారాయణ (ఎవరెస్ట్ ఇంగ్లీష్ మీడియం స్కూల్, కర్నూలు) ఈ పుస్తకం మరోసారి నా దృష్టికి తెచ్చారు. నా జీవిత గమనాన్ని, దృక్పథాన్ని ఎంతో మార్చిన 'ఒక యోగి ఆత్మకథ' వంటి పుస్తకం తెలుగులో రాయాలని, నా బతుకు పండించుకోవాలని ఎంతో కాలంగా అనుకుంటున్నాను. మిత్రులు మైలవరపు శ్రీనివాసరావుగారు (ప్రిన్సిపాల్, ఓరియంటల్ కాలేజి, తెనాలి) ఒకసారి రాసిన వుత్తరంలో 'ఋషి ఋణం తీర్చుకుంటున్నారు మీరు' అనడంలో నాలో ఈ కోరికను మరింతగా పెంచింది.

నాలుగు సంవత్సరాల క్రితం నాలో ప్రవేశించి, నా కొడుకుకు ప్రాణం పోసి, నన్ను చక్కదిద్దిన షిర్డీ సాయినాథుడు ఆ కోరికను చాలా త్వరగా తీర్చడం నా అదృష్టం.

చిన్ననాటి నుంచీ నాకు ఆదర్శంగా నిలిచిన నాన్నగారు 1988వ సంవత్సరం మే 13న దేహత్యాగం చేయడంతో నాలో మన సంస్కృతి, ధర్మం వగైరాల చింతన పెరిగింది. గడచిన ఆరేళ్ళుగా స్వప్న దర్శనం ద్వారా నన్ను మరింతగా తీర్చిదిద్దారాయన. ఆయన గుర్తుగా చిరకాలం వుండిపోయే పని చేయాలనుకున్నాను. ఇన్నాళ్ళకు అది రూపు దిద్దుకుంది.

శ్రీరావినూతల శ్రీరాములు నాయనగారు (రిటైర్డ్ సబ్ రిజిస్ట్రార్, హైదరాబాదు) తొలి పరిచయంలోనే నన్ను ఆకట్టుకున్న వ్యక్తి. మా నాన్నగారి మిత్రులు. ఆయన సన్నిహితులైన శ్రీ శ్యామ్‌చరణ్ బాబా (నంద్యాల) గారు పూర్వాశ్రమంలో మా నాయనగారి శిష్యులు, శ్రీరాములు నాయనగారి పుణ్యమాని ఆయన పరిచయ భాగ్యం కలిగింది. సరిగ్గా సంవత్సరం క్రితం ఆయన నన్ను సోదరుడుగా ఎంతో ఆదరించారు. నాద యోగాన్ని సాక్షాత్కారింపజేశారు. 'శ్రీరాములు నాయన వంటి నాయన, నీ వంటి తమ్ముడు వుంటే నేను ఎంతైనా సాధించవచ్చు' అంటూ ఈ పుస్తక రచనకు నన్ను ప్రోత్సహించారాయన. ఆయన ఋణం తీర్చుకోలేనిది. గత సంవత్సరం, అక్టోబర్, నవంబర్ నెలల్లో దీన్ని పూర్తి చేశాను.

ఈ పుస్తక రచనాకాలంలో నేను పొందిన మధురానుభూతి అనిర్వచనీయం. హిమాలయ యోగులను స్వామీ రామాతో పాటు ప్రత్యక్షంగా పలకరించిన అనుభూతి

కలిగింది. బ్రహ్మానందం అనుభవించాను. ఈ విధంగా పితృరుణం, ఋషి రుణం తీర్చుకుంటున్నందుకు సంతోషిస్తున్నాను. ఈ రచనాకాలంలో నన్ను ప్రోత్సహించిన మిత్రులందరికీ ఋణపడి వున్నాను. అందరూ మహానుభావులే. అందరికీ వందనాలు.

జులై 14, గురువారం, 1994. - డా॥ వి.వి. బాలకృష్ణ
కర్నూలు.

## రెండవ ముద్రణకు - నామాట

నా ద్వారా తెలుగువారికి చేరిన 'హిమాలయ యోగులు' పుస్తకం అశేషాంధ్ర ప్రజానీకం ఆదరణకు నోచుకోవడం నాకెంతో సంతోషాన్నిచ్చింది. ఈ పుస్తకం ఎంతోమందిని విశేషంగా ఆకట్టుకుంది. వారి జీవిత విధానాలనే మార్చింది. అవధూత కాశిరెడ్డి నాయనగారు కూడా ఈ పుస్తకాన్ని ఆశీర్వదించారు. 'ఇందులో ఏమీ లేదురా – మరణంతో ముఖాముఖీ అనేది తప్ప. అది చదవండి' అన్నారని ఆయన శిష్యుడు చిరంజీవి మురళి చెప్పాడు. రాతప్రతిగా ఈ పుస్తకం ఆయన దగ్గరకు వెళ్ళింది. అందులో ఏమీ చూడకుండానే ఫలానా పేజీలో దీన్ని చూడండి అని చెప్పడం ఆయన గొప్పదనం. తర్వాత కర్నూలులో ఒకసారి ఆయన దర్శన భాగ్యం నాకు లభించింది. ఇందుకు కారణం ఈ పుస్తకమే.

మొదటి ముద్రణ వెయ్యికాపీలు దాదాపు సంవత్సరం క్రితమే అయిపోయాయి. ఇదో అద్భుతం! ఇదంతా స్వామీరామాకే చెందుతుంది.

ఆయన గురుంచి మరిన్ని వివరాల కోసం ప్రయత్నిస్తూనే వున్నాను. 1996 ఫిబ్రవరిలో అనుకుంటాను. సినీనటి మాధవి వివాహం గురించి జ్యోతిచిత్ర పత్రికలో వచ్చిన ఒక వార్తలో ఆమె స్వామీ రామా శిష్యురాలనీ, ఆమె వివాహం ఆయన ఆశీస్సులతోనే జరిగిందనీ వుంది. అంతకుమించి వివరాలు లేవు. లభ్యమైతే మరో ముద్రణలో విన్నవించుకుంటాను. ఈపుస్తకం ఇప్పుడు మరోసారి మీముందుకు రావడానికి మూలకారకులైన రాజేశ్వరరావుగారు (విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు) ధన్యులు. ఆయన పూనుకోకుంటే ఇది ఇంత త్వరగా బయటపడేది కాదు.

అలాగే అనంతపురం విశాలాంధ్ర బుక్ హౌస్ ఈశ్వరరెడ్డి గారు, వారి సిబ్బంది ఈ పుస్తకానికి చేసిన ప్రచారం వర్ణనాతీతం. వీరందరికీ మరోసారి నా కృతజ్ఞతాంజలి.

నవంబరు 25, 1996
18/86–5, శ్రీలక్ష్మీనగర్,
బి. క్యాంప్, కర్నూలు – 518 002.
ఫోన్: 26111

డా॥ వి.వి. బాలకృష్ణ
రీడర్, కెమిస్ట్రీ డిపార్ట్‌మెంట్,
శ్రీకృష్ణదేవరాయ యూనివర్సిటీ
పోస్టు గ్రాడ్యుయేట్ సెంటర్,
కర్నూలు – 518 001.

# పరిచయం

మా నాన్నగారు వి.యస్. వెంకటనారాయణగారు 1916వ సంవత్సరం ఏప్రిల్ నెల అయిదవ తేదీనాడు నెల్లూరు జిల్లా ఉదయగిరి తాలూకాలోని నందిపాడు గ్రామంలో జన్మించారు. తల్లిదండ్రులు శ్రీమతి లక్ష్మీదేవి, శ్రీవజ్ఝల శేషగిరి అయ్యర్ దంపతులు. తండ్రిగారు అదే వూర్లో రెవెన్యూ శాఖ ఉద్యోగి. పుట్టిన రెండేళ్ళకే తల్లిని పోగొట్టుకుని, కొవ్వూరు మేనత్త కమలమ్మ, తర్వాత మేనమామ అల్లాడి రామబ్రహ్మంగార్ల పెంపకంలో ఎదిగారు. విద్యాభ్యాసం చాలావరకు నెల్లూరులోనే జరిగింది. ఎఫ్.ఏ; ఏమ్.ఎ. (ఆనర్స్) మద్రాసు లయోలా కాలేజీలో చేశారు. ఉపాధ్యాయ శిక్షణ (బి.టి. లేక బి.ఇడి.) గవర్నమెంట్ ట్రెయినింగ్ కాలేజీ, రాజమండ్రిలో పొందారు.

ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించి – కొవ్వూరు నాయుడు పేటలోని సెయింట్ పీటర్స్ హైస్కూలులోనూ, తర్వాత నెల్లూరు సెయింట్ పీటర్స్ హైస్కూల్‌లో అసిస్టెంట్ హెడ్‌మాస్టర్‌గానూ పనిచేశారు. 1945వ సంవత్సరం మే నెల 23వ తేదీన తిరుపతిలోని ప్రముఖ న్యాయవాది, ఆధ్యాత్మిక చింతనాపరులు అయిన శ్రీ అల్లాడి పద్మనాభయ్య, శ్రీమతి అమ్మాయమ్మ గార్లకు అల్లుడై వారి రెండవ అమ్మాయి రాజేశ్వరిని జీవిత భాగస్వామిగా స్వీకరించారు. వారు అరుగురు పిల్లలకు (ముగ్గురు ఆడపిల్లలు, ముగ్గురు మగపిల్లలు) తల్లిదండ్రులై అందరినీ క్రమశిక్షణతో, బాధ్యతాయుతులైన పౌరులుగా తీర్చిదిద్దారు.

1950–52 ప్రాంతంలో కర్నూలు పురపాలకోన్నత పాఠశాలలో అధ్యాపకులుగా ఉన్నారు. తర్వాత కావలి జవహర్ భారతి కాలేజీలో ఉద్యోగంకోసం ప్రయత్నించి, అది రాకపోవడంతో 1952లో తిరుపతిలోని పురపాలకోన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులైనారు. 1988వ సంవత్సరం మే నెల 13న శరీర త్యాగం చేసేవరకూ ఆదర్శ ఉపాధ్యాయులుగా, ఉత్తమ వ్యక్తిగా, మంచి మనిషిగా జీవనయాత్రను కొనసాగించారు.

1960వ సంవత్సరంలో పండిత నెహ్రూ ఉపన్యాసానికి ఆయన చేసిన తెలుగు అనువాదం వేలాది ప్రజల అభినందనలకు పాత్రమైంది. ఆయన సన్నిహితుల స్మృతిపథంలో అదో మధుర ఘట్టం. 1962లో జాతీయ ఉత్తమ ఉపాధ్యాయులుగా పండితనెహ్రూ, రాధాకృష్ణన్ వంటి మహనీయుల చేతులమీదుగా సత్కారం పొందారు. ఆఖరి నిమిషం వరకూ విద్యాదానం చేశారు.

తిరుపతిలో ఏటా జరిగే త్యాగరాజ ఆరాధన ఉత్సవాలలో 35 సంవత్సరాలు పైగా వ్యాఖ్యాతగా శ్రోతలకు రసానందం పంచిపెట్టారు. వందన సమర్పణ వెంకట నారాయణగా పేరు తెచ్చుకున్నారు. త్యాగరాజ ఆరాధన సావనీర్లకు సాహితీగౌరవం కల్పించారు. 'శ్రీకాళహస్తీశ్వర శతనామాష్ట మాలిక', 'జ్ఞానప్రసూనాంబికా సహస్ర నామావళి', 'ప్రత్యక్షదైవం శ్రీలశ్రీ పరిమళై స్వామిగళ్' మొదలైన గ్రంథాలు ఆయన ఆధ్యాత్మిక జీవన వికాసానికి ప్రతీకలు. తిరుమల – తిరుపతి దేవస్థానం

వారి సమాచార బులెటిన్ (తర్వాత అదే 'సప్తగిరి' అయింది)లో వందలాదిగా ఆధ్యాత్మిక వ్యాసాలు రాశారు. ఉపన్యాసాలు ఇచ్చారు. సింహపురి పత్రిక 'శశి'లో ఎన్నో కథలు, వ్యాసాలు రాశారు.

సాంఘికంగా ఎన్నో బాధ్యతలు నిర్వహించారు: నెల్లూరు టౌన్‌హాల్ వర్ధమాన సమాజం గ్రంథాలయ కార్యదర్శి, గీతాభక్తి సంఘం కార్యదర్శి, తిరుపతి త్యాగరాజు ఆరాధన ఉత్సవ కమిటీలో పలురకాల బాధ్యతలు. తిరుపతి కో-ఆపరేటివ్ హౌస్ బిల్డింగ్ సొసైటీ సభ్యత్వం, డిస్ట్రిక్ట్ టీచర్స్ గిల్డ్ కార్యదర్శి, శంకర మఠం కార్యదర్శి, జిల్లా గ్రంథాలయ కమిటీ సభ్యత్వం – మొదలైనవి ఆయన నిర్వహించిన బాధ్యతలలో కొన్ని.

విజయం సాధించిన పురుషుని వెనుక ఒక మహిళ వుంటుందన్న ఆర్యోక్తికి నిదర్శనంగా బహుముఖ ప్రజ్ఞాశాలిగా సమాజంలో తన వంతు కర్తవ్యం నిర్వహించిన ఆ ధన్యజీవికి అర్ధాంగిగా అండదండగా నిల్చి అన్ని విధాలుగా సహకరించిన మా అమ్మ శ్రీమతి రాజేశ్వరిని ఈ సందర్భంలో తలచుకోవడం సమంజసం. ఆమె ప్రస్తుతం పిల్లలతో, మనుమలు, మనుమరాళ్ళతో కాలక్షేపం చేస్తూ ప్రశాంత జీవనం గడుపుతోంది.

ఉన్నతమైన జన్మను నాకు ఇచ్చి, నాలో సంస్కార బీజాలను నాటిన తల్లిదండ్రులకు ఇది నా భక్తిపూర్వకమైన కానుక, నా ఆత్మీయ సోదరులు, గురువులు శ్రీ శ్యామ్‌చరణ్ బాబాగారి కోరిక మేరకు దీనిని ఆరేళ్ళ క్రితం దేహ త్యాగం చేసినా అనుక్షణం నాకు తోడునీడగా వున్న మా తండ్రిగారి దివ్యస్మృతికి అంకితం చేసుకుంటున్నాను.

తేది:– 14–7–1994 — డా॥ వి.వి. బాలకృష్ణ

# ప్రత్యేక కృతజ్ఞతలు

ఈ పుస్తక రచనకు ప్రోత్సహించిన ఆత్మీయులందరికీ, సహకరించిన నా శ్రీమతి గీతకూ, పిల్లలు సౌమ్య, హేలీ కల్యాణ్‌లకూ, రాతప్రతిని చదివి సలహాలు ఇచ్చిన శ్రీరాములు నాయనగారికీ, ఎంతోమందిచేత పారాయణం చేయించిన సోదరులు, గురువులు అయిన శ్యామ్‌చరణులకూ, ముద్రణకు హార్దికంగా సహకరించిన మిత్రులు శ్రీ పి. రాజేశ్వరరావు (విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్) గారికీ, శ్రీ ఈశ్వరరెడ్డి (విశాలాంధ్ర బుక్‌హౌస్, అనంతపురం) గారికీ తొలి ముద్రణకు పదిహేను వేల రూపాయల ఆర్థిక సహకారం అందించిన తిరుమల – తిరుపతి దేవస్థానం వారికీ, అందమైన ముఖపత్రం రూపొందించిన ఆర్టిస్టు వాసు గారికీ నా ప్రత్యేక కృతజ్ఞతలు.

నవంబర్ 25, 1996 — డా॥ వి.వి. బాలకృష్ణ

# ఇందులో...

★ ★ ★

# హిమాలయ యోగులు

## (స్వామీ రామా అనుభవాలు)

## పరిచయం

స్వామీ రామా హిమాలయాల యోగి పరంపరలోని వారు. ఆయన ఒక శాస్త్రజ్ఞుడు, తాత్వికుడు, యోగి, మహాదాత. ఎంతో మందికి ఆధ్యాత్మికంగా మార్గదర్శి. పగలు శిష్యులకు సాయం చేయడంలోనూ, బోధించడంలోనూ, రాత్రిళ్ళు ధ్యానంలోనూ గడిపే మహాయోగి, మానవతావాది. ఎంతోమందికి తమ ధర్మనిధి ద్వారా ఆయన ధనసహాయం అందించారు. హిమాలయాలలో లాండ్స్ డౌన్ సమీపంలో ఒక సైన్సు కళాశాలను స్థాపించారు. హరిద్వార్‌లో నేత్ర వైద్యశాలకు ఆర్థిక సహకారం అందించారు. ఆయన ఎక్కడికి వెళ్తే అక్కడ ఘన స్వాగతం లభించేది. ఆయన గురించి ఎంతోమంది భక్తులు ఆనందంగా చెప్పుకుంటారు. అక్కడివారు ఆయనను 'భోలేబాబా' అంటారు. ఆయన ఆధ్యాత్మిక అనుభవాలు అందరికీ ఉపయోగపడే అద్భుతగనులు.

మన సంస్కృతి, ఆధ్యాత్మిక సంపదల గురించి శాస్త్రీయంగా పరిశోధించేందుకు అమెరికాలో ఒక సంస్థను స్థాపించాలనుకున్నారు. అది తూర్పు పడమరల వారధి కావాలనుకున్నారు అది జరిగింది. ఆయన దృష్టిలో క్రైస్తవం, జుడాయిజం (యూదుమతం), బౌద్ధం, జైన్, సూఫీ తత్వం – అన్నీ యోగులు చెప్పిన సత్యాలనే చెబుతున్నాయి.

'మనకు దాహం వేసినప్పుడు నేరుగా నీటిని తాగేందుకు బదులు, జీవన సరస్సు అంచులో తేలియాడే చిన్న ముక్కలు నములుతున్నాము. ఈ ముక్కలలో నీళ్ళు చాలా తక్కువ. అవి మన దాహం తీర్చలేవు. మన దాహం పూర్తిగా తీరాలంటే మనం మనకున్న సంప్రదాయాలను, భావాలను ఛేదించుకుని మరింత లోతులకు వెళ్లాలి. జీవితంలో దాగివున్న సత్యాలు కనిపెట్టాలి' అంటారాయన. ఆయన తన జీవిత కాలంలో హిమాలయాలలోని మహాయోగులను ఎంతోమందిని కలిశారు. ఆయన డైరీలు, ఇతర సమాచారం ఆధారంగా ఆయన శిష్యులైన అజయ 'లివింగ్ విత్ ది హిమాలయన్ మాస్టర్స్' అనే గ్రంథం తయారుచేశారు ఇందులో స్వామీరామా అనుభవాలున్నాయి. అయితే, అవి కాలక్రమం ప్రకారం కాకుండా విషయపరంగా ఒక క్రమపద్ధతిలో కథారూపంలో వున్నాయి. ఇందులోని ప్రతికథా ఒక విలువైన పాఠం. మన గురించి మనం అన్ని స్థాయిలలో తెలుసుకునేందుకు ఇవి సాయపడుతాయి. హిమాలయ యోగుల జీవితాలు, బోధనలు, హిమాలయాలలో స్వామీ రామా తిరిగిన ప్రదేశాలు మొదలైన విషయాలు ఇందులో వున్నాయి.

★ ★ ★

# స్వామీ రామా మాటల్లో ఈ పుస్తకం

## 'మీ పాదపద్మాల చెంత'

*ప్రియతమ గురుదేవా!*

ఇది నా జీవితంకాదు. హిమాలయ యోగుల నుండి నేను పొందిన అనుభవాల వరాలమూట! ఒంటరిగా వున్న సాయం సంధ్య వేళలో చిమ్మచీకట్లు తొలగించే ఒక కాంతికిరణం చూశాను. అదేమిటో అని ఆశ్చర్యపోయాను. అదేరోజు మీరు నాకు దివ్యప్రేమను కాస్త ప్రసాదించారు

తర్వాత మీ పెదవులనుండి భగవంతుని నామం వెలువడింది విన్నాను. అది నా జీవితంపై కొత్త వెలుగును ప్రసరింపజేసింది. నా చీకటి గుండెగదులలో జ్యోతి వెలిగింది. అది గుడిలో దీపంలాగా వెలుగుతూనే వుంటుంది

నా జీవిత గీతంలో సుఖదుఃఖాలు కలబోసి, బాధలనే తామరపూలపై నీటిచుక్కవంటి సంతోషం, తన దగ్గరున్న వాటినన్నిటినీ దుమ్ములో పారవేసే సంతోషం, మాట ఎరుగని సంతోషం నేను తెలుసుకునేలా చేయడంలో మీకు సాటి ఎవరున్నారు? మీ సందేశం అర్థమైనవారికి ఈ భూమిపై భయం అన్నది మిగలదు. అందువల్ల ఈనాడు అమరమైన ఈ కృతజ్ఞతాసుమం తన రేకులను మీ పాదపద్మాల చెంత సమర్పిస్తున్నది.

\- స్వామీ రామా

అధ్యాయం ఒకటి

# హిమాలయాలలో ఆధ్యాత్మిక విద్య

"మన జీవితం అనే భవంతికి పునాది బాల్యమే బాల్యంలో నాటిన విత్తనం జీవిత వృక్షంగా ఎదుగుతుంది కాలేజీలలో, యూనివర్సిటీలలో పొందే చదువుకన్నా చిన్నతనంలో మనకు నేర్పే చదువే ముఖ్యం మనిషి ఎదిగేందుకు పరిసరాలనుండి నేర్చుకోవడంతో పాటు, సరైన బోధనా సహాయంకూడా ముఖ్యమే.'

## 1.1 పావన హిమాలయాలు

హిమాలయాలు దాదాపు 2400 కి.మీ. పొడవున్న పర్వతాలు. వీటిలో నేపాల్, టిబెట్ సరిహద్దున 29,000 అడుగుల ఎత్తున్న ఎవరెస్ట్ ప్రపంచంలోకెల్ల ఎత్తైనది వీటి వైభవం గురించి, అందం గురించి పర్షియన్‌లు, టిబెటన్‌లు, చైనీయులు, భారతీయులు ఎంతో గొప్పగా రాశారు. హిమాలయం అనేది సంస్కృతపదం. హిమం అంటే మంచు ఆలయం అంటే నివాసం హిమాలయం అనేది మంచు ఇల్లు. అది కేవలం మంచుకొండ మాత్రమేకాదు యోగ విజ్ఞానానికి ఆధ్యాత్మికతకు పుట్టిల్లు అని కోట్లాదిమంది మత విశ్వాసాలతో నిమిత్తం లేకుండా భావిస్తారు. ఈ నాటికీ ఈ ప్రాచీనమైన ఘనమైన సంప్రదాయం వుంది ఈ ఆధ్యాత్మిక వైభవాన్ని వినదలచుకున్న వారికి హిమాలయాలు వినిపిస్తూనే వుంటాయి

స్వామీ రామా పుట్టి పెరిగిందీ, నలభై అయిదు సంవత్సరాలపాటు తిరిగిందీ, యోగులనుండి నేర్చుకున్నదీ హిమాలయాలలోనే. పంజాబ్ హిమాలయాలనుండి కుమావూన్ ఘర్‌వాల్ హిమాలయాల వరకు, సిక్కిమ్ నుండి భూటాన్ టిబెట్ వరకు యాత్రికులు వెళ్లలేని చోట్లలో కూడా ఆయన తిరిగారు. ఆక్సిజన్ పరికరాల సాయం లేకుండా ఇరవై వేల అడుగుల ఎత్తున కూడా వెళ్లారు ఎన్నోసార్లు తిండి తిప్పలు లేక స్పృహ తప్పిన రామాను ఎవరో ఒక యోగి ఆదుకునేవారు

ఆయన దృష్టిలో హిమాలయాలు ఆయనకు ఆధ్యాత్మికంగా తల్లిదండ్రులు అక్కడ ఉండడం అంటే తల్లి ఒడిలో వున్నట్లే ప్రకృతి సహజమైన వాతావరణంలో పెరిగారు ఆయన పధ్నాలుగు సంవత్సరాల కుర్రవాడుగా వున్నప్పుడు గంగోత్రిలోని ఒక అవధూత ఆయనకు ఒక భోజపత్రం ఇచ్చాడు ఆధ్యాత్మికంగా నీవు పురోగమించాలి. ప్రపంచం నీ ముందు వినయంగా వుండాలి' అనేది అందులోని సందేశం.

హిమాలయ యోగులు ఆయనకు ప్రేమామృతం అందించారు అది ఎడతెగక వెండికొండల్లో కురిసి, నదులుగా మారిన మంచు వంటిది ప్రేమ అన్నది ఆయన జీవితానికి యజమాని అయింది అందువల్ల ఆయనకు భయం లేకుండా పోయింది. యోగులను కలిసేందుకు కాలువలు, మంచు కొండలు దాటుకుంటూ గుహల

వెంబడి తిరిగాడు అన్ని పరిస్థితులలోనూ ఆయన హాయిగానే వున్నారు ప్రపంచంలో ప్రకటన కావడం ఇష్టంలేని యోగులను ఎందరినో కలిశారు

ఈ ప్రకృతి, అన్ని ప్రాణులు – అంతా ప్రేమమయం అన్నిటినీ ప్రేమించాలి ప్రకృతి సంగీతం ఎంతో మధురమైనది పూలు వికసించే సంగీతం పక్షుల కిలకిలల సంగీతం అతి చిన్న గడ్డిమొక్క కూడా వినిపించే సంగీతం, ముళ్ళపొదలు వినిపించే సంగీతం – అన్నిటినీ వినాలి. వీటిని వినగలిగిన వారికే ప్రేమనిధి అందుతుంది ప్రకృతిని ప్రేమించినవాడు మనీషి కాగలడు ప్రతి వస్తువు అందమైనదే వీటిని అనుభవించగల్గిన వ్యక్తికి మొత్తం పరిసరాలతోనే ఒకటిగా నిలిచే అవకాశం వుంటుంది అతని లేక ఆమె ప్రతి కదలిక, ప్రతి మాట మానవ సమాజంలో సముచిత స్థానం పొందుతాయి అప్పుడు జ్ఞానోదయం అవుతుంది ఆపైన బాధలుండవు కష్టాలుండవు చావు భయం వుండదు ప్రకృతి గొప్పదనం పూర్తిగా గ్రహించిన వ్యక్తికి ప్రకృతిలో వున్నప్పుడు ఆలోచనలు వాటంతట అవే వస్తాయి ఈ అనుభూతిని గంగాతరంగాల చెంత పొందవచ్చు. ఆత్మజ్ఞానం పొందిన వ్యక్తి శిఖరాగ్రం చేరి, విశాలమైన క్షితిజరేఖను చూస్తాడు. అగాధమైన నిశ్శబ్దంలో ప్రేమానందం అనుభవిస్తాడు '

–అనాదిగా ఋషులు అనుభవించిన ఈ సత్యం స్వామి రామాకు కూడా అనుభవంలోకి వచ్చింది.

ప్రేమతత్వం బోధించేవారు ఋషులే మానవాళిని విశ్వచైతన్యంతో కలిపే వారూ ఋషులే మనిషికి జ్ఞానజ్యోతిని చూపించేవారూ అందరికీ స్వేచ్ఛ, ఆనందం ఇచ్చే సత్యం శివం, సుందరం మనకు చూపించేవారూ ఋషులే. మనిషికి నీడలు మాయలు చూపించేదీ వారే సత్యాన్ని మాయ అనే బంగారు పళ్లెం కప్పి వుంచుతోంది. ఆ మాయను తొలగించి, సత్యం చూపించమని ఋషులు ప్రార్థిస్తారు ఈ ప్రేమవాణిని ఋషులు మనకు వినిపించారు

స్వామి రామా చిన్ననాటనే కైలాస పర్వతం వెళ్లి అక్కడి మానస సరోవరం నీటిని తాగారు గంగోత్రి, కేదారనాధ్ ప్రాంతాలలో ప్రకృతిమాత పండించిన కూరగాయలు, దుంపలు వండుకుని తిన్నారు. హిమాలయ గుహలలో ఆనందంగా జీవించారు. పగటిపూట పర్వత ప్రాంతాలలో తిరిగేవారు. నోట్సు రాసుకుని చీకటిపడేవేళ తిరిగి వచ్చేవారు ఆవిధంగా ఎంతోమంది ఆధ్యాత్మిక నాయకులతో తాము పొందిన అనుభవాలను ఆయన గ్రంధస్తం చేశారు

హిమాలయాలలోనే సంధ్యాభాష పుట్టింది ఇది పూర్తిగా యోగులభాష. కొద్దిమందికి మాత్రమే తెలిసిన భాష. తాత్వికంగా, భావపరంగా ఇది సంస్కృతాన్ని పోలి వుంటుంది ఇది కేవలం ఆధ్యాత్మిక భాష వ్యవహారానికి పనికి వచ్చేది కాదు. సూర్యచంద్రులు కలిసేవేళను, ఇడా పింగళనాడులు సమంగా ప్రవహించే వేళను సంధ్య లేక సుషుమ్న అంటారు ఇది సంధ్యాభాషకు తల్లి సుషుమ్న కాలంలో యోగి పరమానందం అనుభవిస్తాడు అటువంటి యోగులు పరస్పరం మాట్లాడుకునేటప్పుడు సంధ్యాభాషలో మాట్లాడుతారు వైదికభాష వ్యాకరణాన్ని నిరుక్తం అంటారు సంస్కృత వ్యాకరణం వేరు ఇది వేరు అలాగే సంధ్యాభాష వ్యాకరణం పూర్తిగా శబ్దంపై ఆధారపడినది అదికూడా క్రమంగా నశిస్తోంది

సంగీతస్వర రచనలాగానే సంధ్యాభాష నుండి స్వర రచన చేసుకోవచ్చు. ఇది దేవభాష' అంటారు స్వామి రామా.

పర్వత శిఖరంపై ఉదయం, సాయంకాలం కూర్చున్న వ్యక్తి అంతటా అందం చూడగలడు. ఇది సత్యం శివం, సుందరం మూర్తీభవించిన పరమాత్మునిలో విడదీయలేని అంశం అని గ్రహించేందుకు ఆధ్యాత్మిక జ్ఞానం వుండాలి. హిమాలయాలలో ఉషః సంధ్య, సాయం సంధ్య కేవలం భూమి తిరగడంవల్ల వచ్చే మార్పులు మాత్రమే కావు వాటికి సాంకేతికమైన అర్థం చాలా వుంది పర్వతంమీద ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం, రాత్రి – వేటికవే ప్రత్యేకమైన అందంతో మెరిసిపోతూ వుంటాయి చాలాసార్లు పగలే రంగులు మారిపోతాయి ఉదయం వెండి రంగు, మధ్యాహ్నం బంగారు రంగు, సాయంకాలం ఎరుపు వగైరా రంగులు చూస్తే తన తల్లి రంగు రంగుల చీరలు కట్టుకుని కొడుకును సంతోషపెడుతూందని దీనిని మనోభాష మాత్రమే వివరించగలదని స్వామీ రామా అంటారు

ఉదయంపూట హిమాలయాలు చాలా ప్రశాంతంగా నిశ్శబ్దంగా వుంటాయి ఫలితంగా సాధకుడు కూడా మౌనాన్నే కోరుకుంటాడు. అందుకే హిమాలయాలలో ధ్యానులుగా మారేవారు ఎక్కువ ప్రకృతి ఈ ధ్యానులకు ఎంతగానో సహకరిస్తుంది. స్వామీ రామా తన గుహలో వుండగా ఉషోదయాన ఉషాదేవి సూర్యుని అరచేతిలో పెంచుకుని అమ్మలాగా ఆయనను నిద్రలేపేది. గుహలోకి సూర్యకిరణాలు నెమ్మదిగా ప్రసరించేవి. ఆ గుహలోనే గురుదేవుల దగ్గర ఎంతోమంది యోగులు ఉపనిషత్ జ్ఞానం గ్రహించారు.

సాయంకాలం మబ్బులు చీల్చుకుని సూర్యుడు రాగానే గొప్ప చిత్రకారుడైన పరమాత్ముడు లక్షలాది రంగులను మంచుకొండల శిఖరాలపై కుమ్మరించాడా అన్నట్లుంటుంది ఈ వర్ణచిత్రాలు ఏ కళాకారుడు గీయలేనివి. టిబెట్, చైనా, ఇండియా, పర్షియాలలోవున్న ప్రతి కళపై హిమాలయాల ప్రభావం ఎంతో వుంది ఎన్నిసార్లు ఆ బొమ్మలు గీయాలని స్వామీ రామా ప్రయత్నించారు. అయితే అవి చిన్నపిల్లవాడి పిచ్చిగీతలు అనిపించి మానేశారు ప్రకృతి సౌందర్యం ఉన్నత స్థాయికి చెందినది. దానిని అర్థం చేసుకున్నవాడే నిజమైన కళాకారుడు ఈ అందం దానికిని అర్థం చేసుకున్న వ్యక్తి బొమ్మలు గీసేందుకు బదులుగా పద్యాలు రాస్తాడు చైతన్యంలో సూక్ష్మమైన విషయాల గురించి చెప్పేందుకు రంగులు, బ్రష్‌లు చాలవు ఆధ్యాత్మిక సౌందర్యం గురించి చెప్పాలంటే మరింత లోతుకు వెళ్ళాలి

హిమాలయాలలో చాలాకాలం నుంచి తిరుగుతున్న ప్రయాణీకులెవరో తెలుసా? బంగాళాఖాతం వైపునుంచి వచ్చే మబ్బులే అవి భరతభూమిని తమ దీవెనలతో తడుముతాయి కవికులగురువు కాళిదాసు అపూర్వ సృష్టి మేఘసందేశ కావ్యం, రామాయణ భారతాలు కూడా హిమాలయాల వైభవాన్ని హిమాలయ యాత్రలను వివరిస్తాయి

'మహిమ్నా స్తోత్రం' వంటి సంస్కృత శ్లోకాలు ఎవరో హిమాలయాలలో సంచరిస్తూ పాడినట్లు అనిపిస్తాయి స్వామీ రామా కూడా హిమాలయాలలో తిరిగేటప్పుడు పద్యాలు రాసి పాడేవారు శాస్త్రీయ సంగీతంలో పహాడీరాగం కొండ ప్రాంతాలనుండి వచ్చినదే. హిమాలయాలు కవులకు, చిత్రకారులకు, సంగీతజ్ఞులకు, యాత్రికులకు ఎన్నో అద్భుతాలు చెప్పగలవు. అయితే, అవి అందుకు సిద్ధపడిన వారికే

అందుబాటులో వుంటాయి. యోగులు మాత్రమే వీటి రహస్యాలు కనిపెట్టగలరు

ఈ పర్వతాలలో స్వామీ రామా, తన పెంపుడు ఎలుగుబంటితో తిరిగేవారు దానిని 'భోలా' అనేవారు. ఆయన ఎక్కడికి వెళ్ళినా ఆయనతోబాటు అదికూడ వుండేది. ఆ విధంగా 11 సంవత్సరాలు గడిచాయి.

సాధారణంగా సెప్టెంబర్ 15 తర్వాత హిమాలయాల్లో మంచు ఎక్కువగా కురుస్తుంది. అయినా స్వామీ రామా ఆ చలిలో జగన్మాతను స్తుతిస్తూ, పాటల పాడుతూ తిరిగేవారు. ఒక్కోసారి మన సంప్రదాయాన్ని పాటించేవారికే త జీవితం అంకితం అని ఆయనకు అనిపించేది. ఋషుల ఆచార వ్యవహారాలు ఆయన ఎన్నోసార్లు ఉల్లంఘించారు. అయినా, ఆయనకు క్షమాభిక్ష దొరికేది. రోజులలోనే ఆయనకు ఎన్నో ఆధ్యాత్మికమైన, మానసికమైన అనుభవాలు కలిగాయి ఒక్కోసారి తానో మకుటం లేని మహారాజు అనిపించే దాయనకు మానవ సంచార సంపర్కం లేకపోవడంతో ఆయనకు నిశ్శబ్దంగా ప్రశాంతంగా అనిపించేది ప్రకృ శాంతిమయం అని ఆయన తెలుసుకున్నారు. తనను గౌరవించిన వారికి ప్రకృ జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది హిమాలయాల్లో ఇది మరింత నిజం

ఈ పర్వతాలలో ఎన్నో రకాల పూలు విస్తృతంగా లభిస్తాయి భావుక వున్నవారికి మంచు కప్పివున్న పర్వతశిఖరాలనుండి ఈ లోయ సుశిక్షితుడైన శిష్యు గౌరవంగా గురువుగారికి సమర్పించిన పుష్పగుచ్ఛంలాగా అనిపిస్తుంది. అటువం చోట స్వామీ రామా తదేకంగా చూస్తూ ఆ తోటమాలి ఎవరా అని ఆలోచించేవా

హిమాలయ లోయల్లో పెరిగే పూలల్లో లిల్లీస్, ఆర్చిడ్స్ మొదలైనవి ముఖ్యమైన అక్కడ నీలిరంగులో వుండే అద్భుతమైన హిమకమలంకూడా దొరుకుతుంది. ఒకసా అటువంటి హిమకమలాన్ని చూసి 'ఇక్కడ ఎందుకు ఒంటరిగా వున్నావు? నీ అం ఆరాధనీయం. నీ రేకలు రాలిపోకముందే, దుమ్ములో కలిసిపోకముందే, ఎవరికో ఒక నిన్ను నీవు సమర్పించుకో' అనుకున్నారు స్వామీ రామా చల్లనిగాలి సోకిన నీలికమలం 'నేను ఒంటరినా? అంతా నాలోనే వున్నాయి ఈ పర్వత సానువు ఈ స్వచ్ఛత, పైనున్న నీలాకాశం గొడుగు – అన్నిటికీ నేను ఆనందిస్తున్నా అన్నట్లు అనిపించిందాయనకు దానిని గురువుగారికి సమర్పిస్తే? అనిపించి, చిన్నపిల్లాడి దానినొక చిలిపి ప్రశ్న అడిగారు – 'నీ రేకలు నలిపేస్తే ఏమవుతుంది?'

ఆ నీలికమలం అన్నదికదా – 'చాలా సంతోషిస్తాను. నా పరిమళం వ్యాపిస్తుం నా జన్మ సార్థకం అవుతుంది'

ఆ కమలాన్ని తీసుకెళ్ళి గురువుగారికి ఇస్తే ఆయన మెచ్చుకోలేదు గురువులకు పని గిట్టదు ఎప్పుడో తప్ప పూలు కోయడం ఆయనకు ఇష్టం వుండదు. ప్రకృతిమ ఒడినుండి ముద్దుబిడ్డను బలవంతంగా లాగినట్లు భావిస్తారు ఆ తర్వాత రా ఎప్పుడూ ఆ పని చేయలేదు అందాన్ని ఆరాధించాలి. ఉపయోగించడం, సొం చేసుకోవడం, నాశనం చేయడం తగదు ప్రకృతి సౌందర్యాన్ని మెచ్చుకొనేటప్ప రసాత్మక దృష్టి పెరుగుతుంది అని ఆయన గ్రహించారు. స్వామీ రామా ప్రకృ సాన్నిధ్యంలో గడుపుతూ దానిని అందించేవారు మంచు కరిగి నీరై ప్రవహిం చోట చిన్నచిన్న అలలు ఒకదానికొకటి ఢీ కొట్టుకుంటూ వుండడం చ ఆనందించేవారు. కొండ పైనుండి జాలువారే నదులు, కాలువలు కేశపాశా

వుండేవి. వాటి సంగీతం సుమధురం, అద్భుతం. జీవన ప్రవంతికి, దానికి పోలికలు గమనించారు రామా. అవి రెండూనూ నిరాటంకంగా సాగిపోవలసిందే వెన్నెల రాత్రులలో అవి మెరిసిపోయేవి. గంగాతీరం, పున్నమిరాత్రి ఆయనకు ఎంతో ప్రీతిని కలిగించేవి. లక్షలాది తారల మిలమిలలు ఆయనను పరవశుణ్ణి చేసేవి. ఆ అందం వర్ణనాతీతం కొన్ని తారలు పర్వత శిఖరాల చాటున దాగుడుమూతలు ఆడుతున్నట్లు అనిపించేవి. ఆ తళతళలు ఆయనకు ఎంతో కాలంపాటు గుర్తుకు వచ్చేవి. సాయం సంధ్యలలో పొగమంచు గంగపై మెత్తని పరుపు పరిచినట్లు ఉండేది. ఉషోదయానికి ముందు తెల్లని దుప్పటి కప్పినట్లుండేది దాని అడుగున ఒక పాము గుర్రుపెట్టి నిద్రపోతున్నట్లుండేది. తనలాగా ఉషాకిరణాలు కూడా గంగా జలాలను ఆబగా తాగుతున్నట్లు అనిపించేది ఆ నీరు స్వచ్ఛమైనది. ప్రేరణనిచ్చేది. కైలాస పాదాన మానస సరోవరంనుండి ప్రవహించే నదులు ఎన్నో వున్నాయి అయినా, గంగకు సాటి వేరు లేదు. గంగోత్రి మంచుతిప్పలనుండి పారే గంగానది, ఆరోగ్యాన్నిచ్చే ఖనిజ లవణాలను, ఓషధులను తనలో కలుపుకుని వస్తుంది ఆ ప్రాంత ప్రజలకు చర్మవ్యాధులు లేవు. గంగాజలం చిన్న పాత్రల్లో నింపుకుని చనిపోయేముందు నోట్లో పోయడం అనే ఆచారం మనలో వుంది. ఆ నీరు ఎంతకాలమైనా చెడిపోదు.

ఆ కాలంలోనే కొందరు లండన్‌లోని థేమ్స్ నదీజలం మన దేశానికి తెచ్చేలోగా పాడవడం, కలకత్తానుండి లండన్‌కు తీసుకెళ్ళిన తర్వాతకూడా గంగాజలం స్వచ్ఛంగా ఉండడం గమనించారు. ప్రఖ్యాత శాస్త్రజ్ఞులు డా॥ జగదీశ్ చంద్రబోస్ గంగాజలానికి సాటి ప్రపంచాన వేరేదీ లేదని అన్నారు

అయితే, గంగానది కిందికి వచ్చేకొద్దీ నేలపై ఎన్నో కలుషితమైన కాలువలు, నదులు అందులో కలుస్తాయి గ్రామస్తులు కూడా మోక్షం కోసం శవాలను నదిలో పారేసేవారు. ఇటువంటి పనులు చేసి నీటిని కాలుష్యానికి గురిచేయడం భావ్యం కాదంటారు స్వామి రామా గురుదేవులుకూడా 'పాప ప్రక్షాళనకోసం గంగాజలం తాగవలసిన అవసరం లేదు. కర్మఫలం అనుభవించాల్సిందే. కర్మఫలం ఎవరికైనా తప్పనిసరి. ఎటువంటి వ్యామోహం కానీ, వికర్షణకానీ లేకుండా పనులు చేయడం నేర్చుకోవాలి. పాపకర్మలను ఏదో కడిగేస్తుందని అనుకోకు. అది మూఢనమ్మకమే తర్కానికి నిలువదు' అంటారు

హిమాలయాల ఖనిజ సంపదను కొల్లగొట్టడం నేరం. అక్కడి ప్రజలు నిరాడం బరులు. నిజాయితీపరులు వారికి కనీస సౌకర్యాలు కల్పించకపోగా, హిమాలయాలను దోచుకోవడం ఎంతవరకు సమంజసం? అని ప్రశ్నిస్తారు రామా. అక్కడవారు సాధారణంగా కొండ దిగిరారు నవ నాగరికత ప్రభావం వున్నచోటు మాత్రం కొద్దిగా తరచుగా అబద్ధం చెప్పడం, దొంగతనం చేయడం వుంది.

నేటి సమాజం చాలా పురోగమించిందనీ, సంస్కారవంతమైనదనీ అనడం అంత సరికాదు ముత్యాలను కృత్రిమంగా తయారుచేసినట్లే, ఈనాటి సమాజం కూడా కృత్రిమంగా తయారైనదే. ప్రకృతిని, సహజత్వాన్ని పోగొట్టుకున్నదే. ఇతరులముందు ఆడంబరం చూపుకోవడమే కానీ, ఇతరులకు సేవ చేయడం తగ్గింది. పర్వత ప్రాంతాలలో అలాకాదు అందరూ కొత్తవారిని ఆదరిస్తారు. కావలసిన కనీస సౌకర్యాలు కల్పిస్తారు

ఘర్‌వాల్, కుమావూన్ పర్వత వాసులు మంచివారు మర్యాదా మన్ననా వున్నవారు. తెలివైనవారు కాంగ్రాలోయ, ఘర్ ప్రాంతాల కళలు పేరెన్నికగన్నవి. ఆ బొమ్మలు, రంగులు విశిష్టమైనవి. ఇక్కడ జ్యోతిషం, తంత్రం కలిసిన చదువు ఎక్కువ. ఇక్కడి ప్రజలు నిరాడంబరులు. ప్రకృతితో సహజీవనం చేస్తారు చెక్క ఇండ్లలో వుంటారు. తమ బట్టలు తామే నేసుకుంటారు సాయంకాలాలు అంతా కలిసి నామజపం చేస్తారు. జానపద గీతాలు పాడుతారు వీరి నృత్యం బాగుంటుంది. డప్పు వాయించేవారు, వేణువు ఊదేవారు, కొమ్ముబూరా ఊదేవారు మంచి సంగీతం వినిపిస్తారు. గడ్డికోసం, వంటచెరకు కోసం వెళ్ళే బాలబాలికలు అక్కడికక్కడే పాటలు కట్టి పాడుతూ వుంటారు. పెద్దలను గౌరవించడం హిమాలయ సంస్కృతిలో కొట్టొచ్చినట్లు కనిపించే ఒక మంచి అంశం.

హిమాలయాలలో 4000–6000 అడుగుల ఎత్తున ఓక్, పైన్, దేవదారు మొదలైన చెట్లు పెరుగుతాయి. ఇంకా ఎత్తున భోజ పత్రి పెరుగుతుంది ఇది ఇక్కడి గ్రామీణులకు అవసరమైన కాగితం బెరడును ఇస్తుంది ఇక్కడివారికి వనమూలికల గురించి బాగా తెలుసు. ఇక్కడివారు దీర్ఘాయుష్కులు కాశ్మీర్ నుండి పంజాబ్ వరకు, నేపాల్, సిక్కిం ప్రాంతాల వరకు ఉన్న ప్రజలు దేశానికి బలిష్ఠులు, ఆరోగ్యవంతులు అయిన సైనికులను సమకూర్చారు.

పాకిస్తాన్ హిమాలయాలలో హున్‌జా అనే తెగ ప్రజలున్నారు. వీరు మాంసాహారులు. మన ప్రాంతం హిమాలయవాసులు హంసజాతివారు శాకాహారులు హంసకు పాలు, నీరు వేరుచేసే శక్తి ఉన్నదని అంటారు అదే విధంగా తెలివైనవారు ఈ లోకంలో మంచిని, చెడును వేరుచేసి చూడగలరు ఈ పర్వతాల మొత్తంమీద 'శక్తి' ఆరాధన ఎక్కువ ఇక్కడ ఋషులను ఆదరిస్తారు వారికి ఆహారం, బస మొదలైన సౌకర్యాలను ప్రజలే కల్పిస్తారు. వారి నివాసమే ఆలయం అని అక్కడి ప్రజల విశ్వాసం. ఎవరైనా, ఎక్కడివారైనా సాధువులను ఆదరించడం అక్కడివారి సంప్రదాయం. స్వామీ రామా హిమాలయాలలో ఎంతోమంది సాధువులను, ఋషులను కలిశారు. వారితోనే ఎక్కువకాలం గడిపారు.

హిమాలయాలలో పలురకాల సంస్కృతులున్నా ఎవరిపద్ధతి వారిదే. ఎవరూ మరొకరికి అడ్డురారు. స్వామీ రామా ఒకప్పుడు నేపాలీ, ఘర్‌వాలీ, కుమాయునీ, పంజాబీ, కొద్దిగా టిబెటన్ మాట్లాడేవారు కాశ్మీరీ మాత్రం నేర్చుకోలేదు ఈ భాషలు నేర్చుకోవడంవల్ల అక్కడి వారితో సన్నిహితంగా వుండేందుకు అక్కడున్న మూలికల గురించి తెలుసుకునేందుకు వీలైంది

హిమాలయాలలో ప్రయాణానికి జూలై నెల శ్రేష్ఠమైనది అప్పటికి మంచుతిప్పలు కరిగిపోతాయి. చల్లదనంకూడా హాయిని కలిగించే స్థాయిలోనే వుంటుంది కొండ చరియలు విరిగి పడడం, హిమపాతం మొదలైన ప్రమాదాల గురించి తెలిసినవారు హాయిగా వెళ్ళగలరు. ఇటువంటి ఇబ్బందులున్నా హిమాలయాల ఆధ్యాత్మిక సంపద అందరినీ అక్కడికి ఆకర్షిస్తుంది. వెయ్యేళ్ళనాడు వేలాదిగా టిబెటన్‌లు, చైనీయులు మనదేశంనుండి బౌద్ధ సాహిత్యం తీసుకుని వెళ్లారు వారి సంస్కృతిని సుసంపన్నం చేసుకున్నారు. మన ధ్యాన పద్ధతులు జపాన్ దాకా వెళ్లాయి. భారతీయ గురువులు అక్కడి వారికి బోధలు చేశారు టావోయిజం, కన్‌ఫ్యూషియస్ మార్గం అధ్యయనం చేసేవారు హిమాలయాలను, అక్కడి గురువులను గౌరవించారు. వీటి మూలం

భగవద్గీతలో వుంది. నిర్వాణం గురించిన భావాలు మన ప్రాచీనతత్త్వ శాస్త్రంలో వున్నవే టిబెట్ మంగోలియా చైనా జపాన్‌లకు వ్యాపించాయి. ఈనాడు టిబెట్ కమ్యూనిస్టు దేశం గత వైభవం నశించింది. అయినా దలైలామా, ఆయన శిష్యులు కొందరు మన దేశంలోని హిమాలయాల పాదాలను ఆశ్రయించారు

ఈ పర్వతాలు స్వామీ రామాకు ఆటస్థలాలు. ఇవి నేలతల్లి స్వయంగా పర్యవేక్షించే పచ్చిక బయళ్ళు. ఇక్కడి ప్రజలు ఆనందంగా, సంతోషంగా జీవిత పరమార్థం గ్రహించేందుకు ప్రకృతి వాటిని సృష్టించిందా అన్నట్లు ఉంటాయి. చిన్న గడ్డిపోచనుండి పర్వత శిఖరాగ్రందాకా జీవితంలో దుఃఖానికి తావేలేదని సత్యాన్ని తెలిపే స్థలం ఇదే.

హిమాలయ యోగులతో నలభై అయిదు సంవత్సరాలపాటు గురువులు చూపిన బాటలో స్వామీ రామా తిరిగారు ఆ అనుభవం ఇతరులకు కొన్ని జన్మలెత్తినా రాదు. అందుకు కారణాలు గురువుల వాత్సల్యం, అన్నీ స్వయంగా ఎన్నుకొని నిర్ణయించుకోమన్న వారి ఆదేశం. ఇందువల్ల అంతశ్చేతనలో ఆయన ఎంతో తెలుసుకున్నారు. ఈ అనుభవాలు తర్వాతి అధ్యాయాలలో తెలుసుకుందాం.

ప్రపంచానికి ఒక కథ చెప్పాలనుకున్నప్పుడల్లా అసలు ఈ ప్రపంచమే ఒక కథ అనిపిస్తుందాయనకు. ఆయన అనుభవాలు అందరూ తెలుసుకోదగ్గవి అందరూ వాటినుంచి ప్రయోజనం పొందాలన్నది ఆయన కోరిక. అందుకే ఆయన 'నాదేముంది? నీకు సమర్పించేదేమిటి?' అనుకుంటారు ఈ ఆధ్యాత్మిక కథలనుంచి మన ఎదుగుదలకు అవసరమైన విషయాలు నేర్చుకోవాలి. అభ్యసించాలి. 'అర్థం చేసుకోలేనివి ప్రస్తుతానికి ప్రక్కనపెట్టాలి. ఈ అనుభవాల జ్ఞాపకాలు గుర్తుకు వచ్చినప్పుడల్లా హిమాలయాలు మళ్ళీ పిలుస్తున్నట్లున్నాయి' అంటారు స్వామీ రామా.

## 1.2 స్వామీ రామా తల్లిదండ్రులు - గురుదేవులు

స్వామీ రామా తండ్రి గొప్ప పండితుడు మంచి ఆధ్యాత్మికవేత్త. ఎంతోమంది బ్రాహ్మణులు ఆయనతో చర్చలకు వచ్చేవారు తల్లిదండ్రులు సంపన్నులు భూస్వాములు స్వామీ రామా తండ్రి హరిద్వార్ సమీపంలో మానసదేవి వద్ద ధ్యానంచేసి గురువులను దర్శించారు ఆధ్యాత్మికంగా అది ఆయనకు ఎంతో సాయపడింది ఈ ఆరునెలల కాలంలో ఇంట్లోనివారు, ఊరిలోనివారు ఆయన జాడ తెలియక కంగారుపడ్డారు. ఆయన భార్యకూడా ఆశలు వదులుకుని, ఉపవాసం మొదలుపెట్టింది. గురుదేవులు ఆమెను కంగారుపడవద్దని, ఆమెకు నలభైమూడవ ఏట, ఆమె భర్తకు అరవైయవ ఏట పుత్ర సంతాన ప్రాప్తి వుందని చెప్పారు. రెండేళ్ల తర్వాత ఆయన వచ్చారు ఆ రోజు స్వామీ రామా తల్లి ఆయనే గురుదేవులని తెలియకున్నా మర్యాద చేసింది భర్త భోంచేస్తున్నారని చెప్పింది అలికిడి వినగానే ఆయన పరుగెత్తుకుని వచ్చారు. 'నాదంతా మీకే సమర్పితం ఏం కావాలి స్వామీ?' అన్నారు. 'మీ అబ్బాయి' అన్నారు గురుదేవులు 'మాకు అబ్బాయి లేడే. అయినా వుంటే వాడు మీవాడే లెండి' అన్నారాయన.

ఒకటిన్నర సంవత్సరం గడిచింది స్వామీ రామా పుట్టారు. ఆ రోజు గురుదేవులు వచ్చారు 'బాబును ఇస్తారా' అని అడిగారు రామా తల్లికి ముందు

ఇష్టంలేదు. అయినా ఆమెకూడా ఇచ్చేందుకు సిద్ధపడింది. 'ఇప్పుడే వద్దులెండి. తర్వాత తీసుకుంటాను. వీడిని జాగ్రత్తగా పెంచండి' అని గురుదేవులు వెళ్ళిపోయారు.

మూడు సంవత్సరాల తర్వాత గురుదేవులు మళ్ళీవచ్చారు. రామా చెవిలో మంత్రం చెప్పారు. 'ఈ మంత్రం నాకుముందే తెలుసు' అన్నారు రామా. 'ఆ విషయం నాకూ తెలుసు, నీవు గుర్తుంచుకున్నది నిజమే అని చెప్పేందుకే ఇలా చేశాను' అన్నారు గురుదేవులు. చిన్నప్పటినుంచీ రామాకు అమ్మానాన్నలకన్నా గురుదేవులపైననే అభిమానం మిన్న. రామా కుడిచెవి దగ్గర పుట్టినప్పటినుంచీ వున్న రంధ్రాన్ని చూస్తూ రామాతల్లి ఏడ్చేది. అది ఆమెకు గురుదేవులు చెప్పిన గుర్తు. 'ఎప్పుడో ఒకనాడు మమ్మల్ని వదిలివెళ్తావు నీవు' అని ఆమె తరచూ బాధపడేది.

గురుదేవులు తరచుగా రామాకు కలలో కన్పించేవారు. అందువల్ల రామా ప్రతి రాత్రి మేలుకుని వుండేవారు. గతజన్మలో మిగిలిన పనిని ఈ జన్మలో చేయాలని రామా నిర్ణయించుకున్నారు. దానితో కంగారుపడ్డ తల్లిదండ్రులు పూజారులను, జ్యోతిష్కులను సంప్రదించారు. అప్పుడు గురుదేవులు ఒక వ్యక్తిని పంపించి 'కంగారుపడవద్దు' అనే సందేశాన్నిచ్చారు.

ఆ వూరిలోని ఇద్దరు విధవలు రామాను చదువుకోమన్నారు. అయితే రామా స్కూల్లో ఎక్కువకాలం గడపలేదు. కొన్నాళ్ళకు అమ్మానాన్న మరణించడంతో రామా గురువుల ఆదరణలో పెరిగారు. గురుదేవులు రామాను నిస్వార్థంగా, కన్నబిడ్డలాగా ప్రేమించారు. రామాకు ఎటువంటి ఆలోచన వచ్చినా ఆయన కనిపెట్టేవారు. ఆవిధంగా ఆయన నిర్దేశకత్వం మీద రామాకు ప్రగాఢమైన నమ్మకం ఏర్పడింది.

తల్లిదండ్రులు ఏమిస్తారో రామాకు తెలియదు. అయితే గురువుగారు ఏమిస్తారో బాగా తెలుసు. గురువులు ఎన్నడూ ప్రతిఫలం కోరరు. ఇచ్చేందుకు రామా దగ్గర కూడా ఏమీలేదు. అయితే చదువు చెప్పి, క్రమశిక్షణ నేర్పిన గురువులపట్ల రామాకున్న ప్రేమ, అభిమానం అపారమైనవి. నిజమైన గురువులు ఏమీ తీసుకోకుండా నిస్వార్థంగా వుంటారు. శిష్యులకు అన్నీ ఇస్తారు. తండ్రి ప్రాపంచికమైన విషయాలగురించే ఎక్కువగా చెప్తాడు. ఆధ్యాత్మికంగా తండ్రి అయిన గురువులు వేరెవ్వరూ ఇవ్వలేనివి ఇస్తారు. ప్రత్యక్షమైన అనుభవజ్ఞానాన్నిస్తారు. తండ్రి తన సంపదకు కొడుకును వారసుడిగా చేసినట్లే యోగసంప్రదాయంలో గురువు శిష్యునికి వారసత్వం ఇస్తాడు. అది దివ్యప్రేమ. మనస్సుతో అర్థం చేసుకునేది. నిజానికి ఆధ్యాత్మిక సంప్రదాయంలో గురువు ఎంత ఇస్తాడంటే, దాని ప్రభావానికి పూర్తిగా లోనైన శిష్యుడు మరో జన్మ ఎత్తుతాడు.

రామా గురువుగారి దగ్గరినుండి సహపాఠిని కలిసేందుకు ఒక్కోసారి వెళ్లేవారు. అతను పురాణాలూ అవీ చెప్పేవాడు. రామా అంటే ఆయనకు ప్రేమ వున్నా రామా వాదప్రతివాదాలను ఆయన అంగీకరించేవాడు కాదు. గురువుగారికి ఫిర్యాదులు చేసేవాడు. అప్పుడు గురుదేవులు రామాను కొన్నాళ్ళు తన దగ్గర వుంచుకొని, మళ్ళీ పంపేవారు. గురుదేవులు గతం గురించి ఎప్పుడూ చెప్పరు. సన్యాసులు, గురువులు గతం గురించి చెప్పరనే విషయం రామాకు అర్థమైంది. గురువులకు పూర్వాశ్రమ జీవితంతో పనిలేదు. గతం గురించి మాట్లాడుకోవడం కూడా వారికి నిషిద్ధం.

అయినా రామా గురువుగారిని వేధించి ఆయన గతం గురించి కొంత

తెలుసుకున్నారు. గురువులు పశ్చిమబెంగాల్‌కు చెందిన బ్రాహ్మణ కుటుంబీకులు. వారిది హిమాలయ యోగుల దీవెనలున్న కుటుంబం. చిన్నవయస్సులోనే అయన అనాథ కాగా ఒక మహాయోగి ఆశ్రయం అయనకు లభించింది. ఈ కథను రామాకు చెప్పేటప్పటికి అయన వయస్సు 80 సంవత్సరాలు. అయన మాటల్లో బెంగాలీ యాస స్పష్టంగా కనిపించేది. సంస్కృతం, ఇంగ్లీష్ భాషలుకూడా అయనకు వచ్చు.

అయన ఒక గుహలో వుండేవారు. ఉదయం ఒకసారి గుహ బయటకు వచ్చి తర్వాత మళ్ళీ లోనికి వెళ్లేవారు. రోజుకు రెండుసార్లు ఆసనంపైనుండి లేచేవారు. ఒక్కోసారి గుహ బయట నడిచేవారు. మరోసారి నాలుగైదు రోజులపాటు అసలు ఒకసారి కూడా బయటకు వచ్చేవారు కాదు. అయన దగ్గర ఎప్పుడూ నలుగురైదుగురు మంచి శిష్యులు ఉండేవారు. శిష్యులతో కలిసి అయన 7000-8000 అడుగుల ఎత్తుకు వచ్చేవారు. ఒక్కోసారి నేపాల్ వెళ్లి వచ్చేవారు.

మేకపాలు, నల్లావు పాలు తాగేవారు. ఆ నల్లావు అంటే అయనకెంతో ఇష్టం. అయనకు పాలు ఇచ్చే పని రామాదే. అయన ఎక్కువగా సహజ సమాధిలో వుండేవారు. తక్కువ మాట్లాడేవారు. ఒకసారి ఇద్దరూ తొమ్మిది నెలలపాటు కలిసేవున్నా ఒక మాట కూడా మాట్లాడుకోలేదు. ఎవరి పని వారిది. భావ ప్రకటనకు భాషా శక్తి చాలదు. తీవ్ర ధ్యానంలో మౌనం ద్వారా ఒకరి భావాలు మరొకరికి తెలుస్తాయి. స్వామీ రామా చిలిపి ప్రశ్నలు వేసినప్పుడు గురుదేవులు చిరునవ్వే సమాధానంగా ఇచ్చేవారు. తక్కువగా మాట్లాడినా అయన రామా ఎదుగుదలకు అనువైన వాతావరణం కల్పించారు.

కొంతమంది అయనను 'బెంగాలీ బాబా' అనేవారు. మరికొందరు అయనను కేవలం 'బాబాజీ'గా గుర్తుంచుకునేవారు. రామా అయనను గురుదేవులు అనేవారు. అంతకన్నా సార్థకమైన పేరు మరొకటి తోచలేదాయనకు. అయన బోధనలలో అవాస్తవికమైనవి అంటూ ఏవీలేవు. అయనకు స్వార్థం లేదు. అయన మాటలు, చేతలు, మౌనంగా చేసే బోధనలు - అన్నీ దివ్య ప్రేమతో నిండినవే. హిమాలయాలలోని మహాయోగులలో అయన ఒకరు అని రామా నమ్మకం. ఆత్మజ్ఞానం అందుకునేందుకు సిద్ధంగా ఉన్నవారిని అందుకు సిద్ధం చేయడం, వారిని ప్రేమించి, కాపాడి, వారికి మార్గనిర్దేశం చేయడం గురుదేవుల జీవితాశయం. కష్టాలలో అయనను తలచుకున్న వారికి రక్షణ లభించేది. ఇది స్వామీ రామా స్వానుభవం. గురుదేవులనెంతో ప్రేమించారాయన.

## 1.3 గురుదేవులు - భవాల్ సన్యాసి కేసు

దాదాపు ఇరవై సంవత్సరాల క్రితం తెలుగులో 'రాజా రమేష్' అనే సినిమా వచ్చింది. అక్కినేని, వాణిశ్రీ అందులో ముఖ్య పాత్రధారులు. ఆ సినిమాకు మూలం ఒక బెంగాలీ కథ. అది ఒక యథార్థ గాథ. ఆ కథలో ముఖ్యపాత్రధారి స్వామీ రామా గురుదేవులైన బెంగాలీ బాబా అంటే ఆశ్చర్యంగా ఉండవచ్చు. కానీ, ఇది నిజం.

ఒకప్పుడు బెంగాల్‌లో భవాల్ అనే సంస్థానం వుండేది. దాని వారసుడు భవాల్ సన్యాసి. పెళ్ళయ్యాక అతను భార్యతో డార్జిలింగ్‌లో విలాసంగా గడిపాడు.

అయితే దురదృష్టవశాత్తు అతని భార్య అంతకుముందే ఒక డాక్టరుతో ప్రేమాయణ
నడిపింది. వారిద్దరూ కలిసి సన్యాసిని మట్టుపెట్టాలనుకున్నారు. డాక్టరుగారి
నాగుపాము విషం చిన్న డోసులలో ఇంజక్షన్‌గా ఇచ్చాడు. విటమిన్ ఇంజక్షన్ అ
అతనికి చెప్పాడు. క్రమంగా డోసు పెంచారు. రెండునెలల తర్వాత ఒక రో
భవాల్ సన్యాసి మరణించాడు. పర్వత ప్రాంగణంలో వున్న చిన్న నదీ ప్రవాహ
చెంత అయన దహనానికి ఏర్పాట్లు జరిగాయి. చితి ముట్టించేసరికి కుండపోత
వర్షం కురిసింది. చితి ఆరిపోయింది.

ఆ సమయంలో అక్కడికి మూడు మైళ్ళదూరాన స్వామీ రామా గురుదేవు
గుహలో శిష్యులతో వున్నారు. వారు కాంచన గంగ నుండి కుమావ్యూన్‌లో
గుహకు వెళ్ళేందుకు సిద్ధంగా వున్నారు. శవం కొట్టుకుని రాగానే శిష్యులను పంపార
'ఈ వ్యక్తి నా శిష్యుడు, చనిపోలేదు' అన్నారు. అతనికి స్పృహ తెప్పించార
తర్వాత అతను గురుదేవుల దగ్గరే ఉపదేశం పొందాడు. ఆయనతోనే ఏడేళ్ళున్నాడ
గురువులు ఇతర యోగులను కలవమని పంపాడు: అతను చెల్లెలిని చూసినప్పు
గతం గుర్తుకు వస్తుందని చెప్పి హిమాలయాలలో ఎత్తునవున్న తమ పాత గుహ
వెళ్ళి అక్కడే చాలా ఏళ్ళున్నారు.

ఇక్కడ భవాల్ సన్యాసి గురువుగారు చెప్పినట్లే చెల్లెలిని కలుసుకున్నాడు. గ
గుర్తుకు వచ్చింది. కోర్టులో కేసు వేశాడు. నిజం బయటపడింది. బెంగాలీ బాబా
తరఫున ఇద్దరిని కోర్టుకు పంపారు. ఈ సంఘటనతో అయన గురించి అంద
తెలిసింది. అయినా అయన ఎవ్వరినీ తనవద్దకు రానివ్వలేదు.

ఈ కథ చెబుతూ – "ఆధ్యాత్మికంగా పురోగమించే వారికి పేరు ప్రఖ్యాత
అటంకాలు. పతన హేతువులు. ప్రాపంచిక విషయాలను వదిలేసినా వీటికో
ఆరాటం కొంత దాగి వుంటుంది. వీటికి దూరంగా వుండాలి. ఆ విధ
వున్న యోగి మాత్రమే అందరికీ ఉపయోగపడగలడు. అటువంటి యోగుల
ముఖ్యమైన పరమార్థం మానవాళికి సేవ చేయడమే. వారికి ప్రతిఫలం అక్కర్లే
వారి దృష్టిలో మానవసేవే మాధవసేవ" – అంటారు స్వామీ రామా.

## 1.4 యెతికోసం అన్వేషణ - పాశ్చాత్యుల వెర్రి

పాశ్చాత్యులకు హిమాలయాలలోని మంచుమనిషి షాన్‌గ్రిలా లేక యెతి గురి
అసక్తి ఎక్కువ. యెతి గురించి ఎన్నో కట్టుకథలు ప్రచారంలో వున్నాయి. అందు
వారు షెర్పాల సాయంతో యెతికోసం అన్వేషణ సాగించారు. ఈ షెర్పా
కొండజాతి ప్రజలు. వీరికి హిమాలయాలు ఎక్కడం తెలుసు. అంతేకానీ అక్క
ఆధ్యాత్మిక సంప్రదాయం గురించి వీరికేమీ తెలియదు. నిజానికి యెతి అంటూ ఏ
లేదు. కట్టుకథలకు మూలం హిమాలయాలలోని రెండు ఆశ్రమ గుహలు. వీటి
గురించి మన పురాణ ఇతిహాసాలలో వుంది. వీటికి మంచి సంప్రదాయం, ధా
పరంపర వున్నాయి. ఈ గుహలలో ఒకటి కాంచనగంగపై పద్నాలుగువేల అడుగు
ఎత్తున వుంది. రెండవది టిబెట్, ఘర్‌వాల్ సరిహద్దులలో పన్నెండువేల అడుగు
ఎత్తున వుంది. ఇందులోనే స్వామీ రామా వున్నారు. ఈ గుహలలో సంస్కృ
టిబెటన్, సంధ్యా భాషల రాతప్రతులు ఈనాటికీ వున్నాయంటారు స్వామీ రామ

విదేశీయులు ఎక్కువగా డార్జిలింగ్‌కు వెళ్తుంటారు. ఈ యాత్రా సమయంలోనే వారు షాన్‌గ్రిలా గురించి ఆలోచిస్తారు. ఒకసారి అటువంటి బృందాన్ని స్వామీ రామా కలిశారు. ఆయన యెతి అనేది లేదని అన్నా వారు వినిపించుకోక ముప్పైమూడువేల డాలర్లు వృధాగా ఖర్చు పెట్టారు. ఈ విధంగా ఎంతోమంది వృధా ప్రయత్నాలు చేశారు.

స్వామీ రామా అభిప్రాయం ప్రకారం హిమాలయాలలో చాలా ఎత్తున తెల్లని ఎలుగుబంట్లు ఉంటాయి. వీటి పాదాలు చాలా పెద్దవి. అడుగులు మనిషి అడుగుల మాదిరే వుంటాయి. దూరం నుంచి అస్పష్టంగా వుండడంవల్ల మంచు మనిషిలాగా అనిపిస్తాయి. మనిషి భ్రమకు లోనైనప్పుడు ఇటువంటివి తప్పవు. మాయ విశ్వసంబంధమైన భ్రమ. అవిద్య లేక అజ్ఞానం వ్యక్తిగతం. నిజానికి 'యతి' అనేది శంకరాచార్య సంప్రదాయం సన్యాసులను ఉద్దేశించి వాడే పదం. ఇంకా ఈ మాయలలో పడి యెతిని అన్వేషించడం దండగ అంటారు స్వామీ రామా.

## 1.5 హిమాలయ గుహలలో.....

నిరాడంబరంగా బతకగల్గినవారు హిమాలయాలలో హాయిగా వుండగలరు. అక్కడ చిన్న గుహలలో నలుగురైదుగురు సుఖంగా వుండవచ్చు. హిమాలయాలలో అలనాటి సంప్రదాయాన్ని కొనసాగించే మఠాలు ఆశ్రమాలు కొన్ని వున్నాయి. స్వామీ రామా ఆశ్రమానికి దాదాపు నాలుగైదువేల సంవత్సరాల పరంపర వుంది. అక్కడ ఆది గురువుల నుంచి అందరి చరిత్ర నమోదై వుంది.

స్వామీ రామా గుహ సహజ సిద్ధంగా ఏర్పడింది. అందులో చాలా గదులున్నాయి. శతాబ్దాలుగా వాటిని నెమ్మదిగా తొలిచి, పెద్దచేసి, ఎక్కువమందికి వసతి కల్పించారు. అయితే అది అంత ఆధునికంగా వుండదు. స్నానాల గదులు, వంట గదులు మొదలైన సౌకర్యాలుండవు. అయినా ఆ ఆశ్రమాలు చక్కగా పనిచేస్తున్నాయి.

గుహలో వెలుతురు కోసం మూలికలతో ధూపం వేసేవారు. ఆ ధూపం మండినంతసేపు మంచి కాంతి, ఆ తర్వాత మంచి పరిమళం వుండేవి. ఆ వెలుతురులో పురాణాలు చదవవచ్చు. పైన్, దేవదారు మొదలైన చెట్ల కొమ్మలతో కాగడాలు వేసి వెలిగించేవారు. అవి ఎటువంటి ఇబ్బంది లేకుండా వెలిగేవి. గుహలో ధుని వుండడంవల్ల ఎప్పుడూ వెచ్చగా వుండేది. ఇందుకోసం ఎప్పుడూ కట్టెలు నిలువ వుండేవి. చలికాలం కోసం వేసవిలోనే కట్టెలు వగైరా సేకరిస్తారు. ఆశ్రమానికి అవసరమైన కాయగూరలు వగైరాలను వేసవిలో నదీ తీరాలలో పెంచేవారు. పుట్టగొడుగులు, అడవి కూరలు, దుంపలు మొదలైనవి పెంచేవారు. స్వామీ రామా గుహలో బార్లీ, బంగాళాదుంప, గోధుమలు, పప్పు, జొన్నలు మొదలైనవి వాడేవారు. వీటిని ఆరువేల అయిదువందల అడుగుల ఎత్తున్న పర్వత ప్రాంతాల్లో వున్న పల్లెల్లో పండించేవారు. వారి గుహ నుంచి చిన్న జలపాతం ఎప్పుడూ పారుతూ వుండేది. నవంబర్, డిసెంబర్ నెలల్లో ఆ నీరు గడ్డకట్టినప్పుడు దానిని కరిగించేవారు. మనాలి గుహవంటి ఇతర ప్రదేశాలలో వున్నప్పుడు స్వామీ రామాకు స్వచ్ఛమైన తాజా నీరు దొరికేదికాదు. మూడు, నాలుగు మైళ్ళ దూరంనుంచి తెచ్చేవారు.

హిమాలయాలలో ఈనాటికీ ప్రాచీన సంప్రదాయాన్ని పాటించే గురుశిష్య

పరంపర వుంది. ఆశ్రమాలున్నాయి. శ్రద్ధవున్నవారికి గురువులు ఎంతో ప్రేమగా విద్యను బోధిస్తారు. ఏవో సమస్యలవల్ల ఇల్లువదిలి వచ్చినవారికి ఉన్నతమైన విద్య దొరికేదికాదు. వారు ఈ కష్టాలను ఓర్చుకోలేరు. హిమాలయాలలో ఎక్కడో వున్న గురువుల దగ్గరికి, యోగుల దగ్గరికి వారు చేరలేరు.

గురువులు చేసి చూపేవారు. శిష్యులకు పరీక్ష పెట్టేవారు. ఒక్కోసారి మౌనమే వారి బోధనా మార్గం. శిష్యులు ఒక స్థాయికి చేరుకున్నాక ప్రజల్లోకి వెళ్లమని పంపేవారు. 'మన జీవితం సృజనాత్మకంగా, ప్రయోజనకరంగా మలచుకోవడం ముఖ్యం. ఇందుకు క్రమశిక్షణ, మనోవాక్కాయ కర్మలను అదుపు చేయడం అవసరం. కొద్దికాలంపాటు అయినా ఆశ్రమ క్రమశిక్షణను పాటిస్తే జీవన కుసుమం ఎప్పటికీ వికసిస్తుంది. తనపై అధికారం సాధించిన వ్యక్తికి ప్రాపంచిక గొడవలుండవు' అంటారు స్వామీ రామా.

* * *

అధ్యాయం రెండు

# గురు బోధలు

"జీవిత కుసుమం వికసించే సమయం చిన్న వయస్సు, యౌవనం. ఆ వయస్సులో ఇతరుల అభిప్రాయాలు గందరగోళం కల్గించకుండా వుండే విధంగా రక్షణ వుండాలి. చిన్న వయస్సులో బుద్ధిని వంచడం చాలా సులువు. ప్రేమతో కూడిన మార్గనిర్దేశం, సరైన సమాచారం అందించడం ముఖ్యం. తల్లిదండ్రులు బిడ్డలపై సరైన శ్రద్ధ చూపగలిగితే పిల్లలు తరుణ వయస్సును సులభంగా దాటుతారు. బుద్ధికి అలవాట్లు రూపుదిద్దుకునే కాలం ఇదే".

[స్వామీ రామాకు గురుదేవులు పలురకాలుగా బోధించారు. చెప్పడం ద్వారా, చేసి చూపడం ద్వారా ఎన్నో సత్యాలు ఆయన బోధించారు.]

## 2.1 "ఇవ్వడం నేర్చుకో"

సాధారణంగా చిన్న పిల్లలు అన్నీ తమకే కావాలనుకుంటారు. ఏవీ ఇతరులకు ఇవ్వరు. చిన్నప్పుడు రామాలో కూడా వున్న ఈ ధోరణిని గురుదేవులు సున్నితంగా చెప్పి మార్పించారు. స్వామీ రామా హిమాలయాలలో వున్నప్పుడు రోజుకు ఒకసారి మాత్రమే భోజనం చేసేవారు. ఒక చపాతి, కొంచెం కూరగాయలు, గ్లాసుడు పాలు – ఇదీ ఆయన ఆహారం.

ఒక రోజు మధ్యాహ్నం ఒంటి గంటకు ఆయన అన్నం తినేందుకు కూర్చుంటున్నారు. అప్పుడు గురుదేవులు 'కాసేపుండు' అన్నారు.

'ఎందుకని?' అడిగారు రామా.

'ఒక ముసలి స్వామి వచ్చారు. ఆయనకు చాలా ఆకలిగా వుందిట. నీ భోజనం ఆయనకు ఇవ్వు' – ఆజ్ఞాపించారు గురుదేవులు.

'నేనివ్వను. ఆయన స్వామి అయితే నాకేం? నాకు ఆకలిగా వుంది. మళ్ళీ రేపటి దాకా నాకు ఆహారం వుండదు కదా!' అన్నారు రామా మొండిగా.

'అంతమాత్రాన చచ్చిపోవులే! ఆయనకివ్వు. నేను చెప్పానని కాదు, ప్రేమగా ఇవ్వు' – ఆదేశించారు గురుదేవులు.

'నాకు ఆకలిగా వుంది. నా ఆహారం కోరేవారిపై నాకు ప్రేమా? ఎలా సాధ్యం?'

'నేను ఆజ్ఞాపిస్తున్నాను.'

స్వామి వచ్చారు. ఒంటిపై ఒక దుప్పటి, చేతిలో కర్ర, పాంకోళ్ళు, తెల్లనిగడ్డం – ఇదీ ఆయన రూపం. పర్వతాలలో ఆయన ఒంటరిగా తిరుగుతూ వుంటారు.

'రండి, మీ రాక మాకు ఆనందదాయకం. ఇదిగో, నాకోసం వీడిని ఆశీర్వదించండి' అన్నారు గురుదేవులు.

అప్పుడు రామా మొండిగా – 'నాకు మీ ఆశీస్సులేమి అక్కర్లేదు. నాకు ఆకలి. అన్నం కావాలి' అన్నారు.

'ఈ బలహీన క్షణంలో నీవు అదుపు తప్పితే జీవితసమరంలో ఓడినట్లే. దయచేసి ఆయనకు ముందు నీళ్లివ్వు. తర్వాత కాళ్లు కడిగి అన్నం పెట్టు' అన్నారు గురుదేవులు.

గురుదేవుల ధోరణి రామాకు పూర్తిగా అర్థంకాకపోయినా, అయిష్టంగానే ఆయన చెప్పినట్లు చేశారు. అన్నం తిన్నాక ఆ స్వామి 'దేవుడు నిన్ను దీవిస్తాడు. ఇకపై నీకు ఆహారం దొరికేవరకూ ఆకలివేయదు. ఇదే నీకు నేనిచ్చే వరం' అన్నారు.

ఆనాటి నుండి స్వామీ రామాలో పిల్ల తరహా, మొండి ధోరణి నశించాయి. "స్వార్థం వదిలితే ఇవ్వడంలో వున్న హాయి తెలుస్తుంది. స్వార్థపరుడికి ఈ ఆనందం వుండదు. ప్రపంచమంతటా గొప్పవారిలో ఉమ్మడిగా కన్పించేది ఈ గుణమే. నిస్వార్థసేవ లేకుంటే ఏమీ సాధించలేము. ఎంత పాండిత్యంవున్నా వృథాయే" అంటారు స్వామీ రామా.

## 2.2 శిష్యుడికి పరీక్ష

గురువులు శిష్యులను అనేక విధాలుగా పరీక్షిస్తారు. ఒకసారి స్వామీ రామాను రోజూ ఒక నిర్దిష్ట సమయంలో తప్పకుండా ధ్యానంచేయమని కోరారు. ఒకరోజు ఆ సమయానికి రామాను చూసేందుకు గురుదేవులు వచ్చారు. అప్పటికి రామాకు ధ్యానం సరిగ్గా కుదరడంలేదు. ఆయన వచ్చినదీ తెలియలేదు.

'పైకిలే' అన్నారు గురుదేవులు. రామా ఏమీ చెప్పలేదు.

గురుదేవులు : నేను చెప్పినది వినిపించిందా? నే నిక్కడున్నానని తెలుసా?
రామా : తెలుసు.
గురుదేవులు : ధ్యానం చేస్తున్నావా?
రామా : లేదు.
గురుదేవులు : మరి ఎందుకు లేవలేదు?

రామాకు ఆయన వచ్చింది బాగా తెలుసు. అయినా ధ్యానం నటిస్తున్నాడు. గురువులు శిష్యుని విశ్వాసాన్ని, క్రమశిక్షణను ఈ విధంగా పరీక్షిస్తున్నారు. ఒక రహస్యం చెప్పి, దీన్ని ఇంకెవరికీ చెప్పకు -అని వరసగా చాలామంది శిష్యులకు చెప్తారు. అయినా అందరూ ఆ రహస్యాలు పంచుకుంటారు. ఒక్కోసారి మంచులో, చలిలో, వానలో శిష్యుడు నిలబడాలి. గురువుగారు మళ్ళేదాకా అలాగే వుండాల్సిందే. ఈ విధంగా శిష్యుల సామర్థ్యం పెంచి, వారు ఎదిగేందుకు గురువులు సాయపడుతారు. ఇటువంటి పరీక్షలవల్ల శిష్యునిలో ఆత్మవిశ్వాసం, స్వావలంబన, క్రమశిక్షణ పెరుగుతాయి. పరీక్షల వల్లనే శిష్యునికి తన లోపాలు తెలుస్తాయి. తాను ఎంత ప్రగతి సాధించినదీ తెలుస్తుంది.

## 2.3 ఆత్మజ్ఞానానికి ధైర్యం కూడా ముఖ్యమే!

ఆత్మజ్ఞానానికి ధైర్యం కూడా ముఖ్యం. నిర్భయంగా వుండేవారు మహాత్ములు. అన్ని భయాలకు దూరంగా వుండడం ఆత్మజ్ఞానపథంలో ఒక పెద్దమెట్టు. ఒకసారి

గురుదేవులతోపాటు స్వామి రామా, మరో స్వామి, నేపాల్ నుండి తనక్‌పూర్‌కు వెళ్తున్నారు. గురుదేవులు కొంతదూరం నడిచాక 'ఏదైనా తిందాం' అన్నారు. అప్పుడు రాత్రి రెండు గంటలు. 'రామా! తనక్‌పూర్ వెళ్లు. అడవిదారిలో వెళ్తే పదమూడు మైళ్ళు. అక్కడ ఏదైనా అంగడిలో తినేందుకు ఏదో ఒకటి కొనుక్కురా, వెళ్ళు' అన్నారాయన. పక్కనేవున్న మరో స్వామి 'ఇంత రాత్రివేళ ఎవరైనా పిల్లవాడిని బయటకు పంపుతారా? నేనైతే నా శిష్యులను పంపను' అన్నారు.

'ఊరుకో, వీణ్ని స్వామిగా చేయాలనుకుంటున్నాను. చేతకాని దద్దమ్మగా కాదు. వీడు వెళ్ళాల్సిందే. వీడికి మంచి శిక్షణ ఇవ్వాలి' అన్నారు గురుదేవులు. తర్వాత ఆయన రామావైపు తిరిగి, 'వెళ్లు బాబూ! ఈ లాంతరు తీసుకో. ఇందు చాలినంత నూనె వుంది. జేబులో అగ్గిపెట్టెలుంచుకో. చేతిలో కర్ర వుంచుకో. బూట్లు తొడుక్కో. మూడునాలుగు రోజులకు సరిపడే గ్రాసం కొనుక్కురా' అన్నారు.

'చిత్తం' అని రామా వెళ్ళిపోయారు. దారిలో రాత్రివేళ పులులు, పాములు, నిలువెత్తు గడ్డిపొదలు భయం గొల్పుతున్నా రామా పని చేసుకుని వచ్చారు.

'ఎలా వున్నావు?' అడిగారు గురుదేవులు. దారిలో జరిగింది చెప్పారు రామా.

'సరే పద, భోజనం తయారు చేద్దాం' అన్నారు గురుదేవులు.

## 2.4 విద్యార్థి - శిష్యుడు

విద్యార్థికి, శిష్యునికి తేడా వుంది. విద్యార్థులు ఎందరైనా ఉండవచ్చు. కానీ శిష్యులు కొద్దిమందే వుంటారు. గురుదేవుల దగ్గరికి ఎంతోమంది శిష్యరికం చేయాలనే కోరికతో వస్తారు. శ్రద్ధగా సేవిస్తారు. ఒక రోజు ఆయన అందరినీ పిలిచారు. అప్పుడు ఇరవైమంది వున్నారక్కడ. 'పదండి' అన్నారు. అందరూ తుంగభద్రా నదీతీరానికి వెళ్ళారు. అప్పుడు తుంగభద్ర మంచి పోటు మీద వుంది. 'ఈ నదిని దాటగలిగినవాడే నా శిష్యుడు' అన్నారు గురుదేవులు.

'స్వామీ! మీకు నేను చేయగలనని తెలుసు. కానీ నేను వెనక్కివెళ్ళి ఒక పని పూర్తి చేయాలి' అన్నాడొకడు. 'అయ్యో! నాకు ఈతరాదు' అన్నాడు మరొకడు. అతను అలా చెబుతూ వుండగానే రామా నదిలోకి దూకేశారు. అందులో మొసళ్ళున్నాయి. కొన్ని దుంగలు తేలుతున్నట్లు నటిస్తాయి. అయినా రామా చలించలేదు. ఏకాగ్రదృష్టితో ఆ సవాలును ఎదుర్కొన్నారు. అది ఆయనకు స్ఫూర్తినిచ్చే సంఘటన అయింది. తన బలం తెలుసుకునే పరీక్ష అయింది. అలసినప్పుడు పైకి తేలుతూ, మొత్తంమీద నదిని దాటారాయన. అప్పుడు గురుదేవులు - 'వీడు నా శిష్యుడినని చెప్పుకోలేదు. అయినా దూకేశాడు' అని మెచ్చుకున్నారు.

'గురుదేవులు చెంతనుండగా భయం ఎందుకుండాలి? ఆత్మజ్ఞానానికి విశ్వాసం, దృఢ నిశ్చయం ఎంతో అవసరం. సంకల్పశక్తితో సాధించలేనిది లేదు. గొప్ప పనులు చేసిన మహానుభావులందరి వెనుక వున్నది ఇటువంటి శక్తే. నేను చేయగలను, నాకాశక్తి వుంది, చేయాలి అనుకోవాలి. ఈ విధంగా స్థిరమైతే లక్ష్యసాధన సులభం' అంటారు స్వామీ రామా.

## 2.5 గురుదేవులకు కానుక

స్వామీ రామాకు పదిహేనేళ్ళ వయస్సు ఉన్నప్పుడు గురుదేవులు రెండవ దశ దీక్షను ఇచ్చారు. గురు దక్షిణ ఇచ్చేందుకు రామా దగ్గర ఏమీలేదు. 'డబ్బున్నవాళ్ళు బుట్టలకొద్దీ పళ్ళు, పూలు, ఎంతో డబ్బు ఇస్తారు. నేనేం ఇవ్వగలను?' అనుకుని – 'గురుదేవా! మీకు నేనివ్వగల అత్యుత్తమమైన కానుక ఏది?' అని అడిగారు.

'ఎండు కట్టెలమోపు' అన్నారు గురుదేవులు క్లుప్తంగా.

నిజంగా అటువంటిది ఏ శిష్యుడైనా తీసుకునివస్తే గురువు తంతాడు అని అనిపించినా రామా ఆయన కోరినట్లే ఇచ్చారు.

'దీనిని నాకు త్రికరణశుద్ధిగా ఇవ్వు' అన్నారు గురుదేవులు.

'ఎంతో తెలివైనవాడు, చదువుకున్నవాడు. ఈయన కేమైందీవేళ?' అనుకున్నారు రామా, అప్పుడు గురుదేవులు ఇలా అన్నారు:

'ఎప్పుడైనా నాకు ఇవ్వదగిన అత్యుత్తమైన కానుక ఇదే. ఎవరైనా నాకు బంగారం, వెండి, భూమి, ఇల్లు మొదలైనవి ఇవ్వాలనుకుంటారు. కానీ, అవి నా దృష్టిలో విలువలేనివి.'

'ఈ కానుక ఆత్మజ్ఞానపథంలో నడిచేందుకు సిద్ధంగా వున్నందుకు గుర్తు. నా గతాన్ని, దురాలోచనలను జ్ఞానాగ్నితో భస్మం చేయండి గురుదేవా! అని అర్థం. ఈ కర్రలను కాల్చి నీ గత కర్మలు నీ భవిష్యత్తును వేధించకుండా చేస్తాను. నీకు కొత్త జీవితాన్నిస్తాను. ఇక్కడే వుండి దివ్యపథాన చరించు'.

'చాలామంది గతం గురించి ఆలోచిస్తారు. వర్తమానాన్ని తలచుకోరు. అదే వారి బాధలకు కారణం' అంటారు స్వామీ రామా.

## 2.6 ఒంటరితనం ఎక్కడుంది?

తనలోపల ఏమున్నదో ఎరిగిన వాడికి ఒంటరితనం అనేది వుండదు. అది లేకుండా బాహ్యపరిస్థితులపై ఆధారపడితే ఒంటరితనం తప్పదు. మనలోనే అంతా ఉన్నదని తెలుసుకున్నవాడు ఒంటరితనం వుండదు.

అప్పుడు స్వామీ రామాకు 16 సంవత్సరాలు. ఒకరోజు ఆయన గుహ బయట వున్నారు. గుహవైపు చాలామంది రావడం గమనించారు. వచ్చినవారిలో ఒక రాజుగారున్నారు. ఆయన 'బ్రహ్మచారీ! మీ గురువును చూడాలి' అన్నారు.

'మీరు చూడ్డానికి వీలుకాదు' అన్నారు రామా.

'ఆయనెవరో మీకు తెలుసా?' కోపంగా అడిగాడు రాజుగారి కార్యదర్శి (సెక్రటరీ).

'ఎవరైతే నాకేం? నేను ఈ గుహకు రక్షకుణ్ణి. వెళ్ళండి'. అంతే తీవ్రంగా అన్నారు రామా.

వాళ్ళు వెళ్లి కాసేటికి మళ్లీ పదే పదే వచ్చారు. గురుదేవుల ఏకాంతానికి భంగం వాటిల్లకూడదని రామా తాపత్రయం. గురుదేవులకు కూడా ఎవరు పడితే వారు రావడం ఇష్టంలేదు. 'ఎందుకని? ఈ ధనవంతులు అంతదూరం నుంచి వస్తారు

కదా! చూడను అనడం సబబేనా?' అని అడిగారు రామా. అప్పుడు గురుదేవులు అన్నారు కదా-

'నాలోని మిత్రుడున్నంతవరకు నాకు వేరే ఏం కావాలి? ఈ వచ్చే వాళ్ళంతా నిజమైన ఆసక్తితో రారు. వారికి లౌకికంగా ఏదో కావాలి. ఒకడికి సంతానం, ఇంకోడికి మంచి ఉద్యోగం కావాలి. ఆధ్యాత్మికమైన ఆహారం కావాలి అని కోరేవారు లేరు. అటువంటివాళ్ళను నేను చూడ్డం ఎందుకు?' అన్నారు గురుదేవులు. షిర్డీసాయి యోగీశ్వరుని జీవితంలోనూ ఇటువంటి సంఘటన జరిగింది. 1810లో ఒకనాడు సాయినాధుని చూడాలని అప్పటి రెవిన్యూ కమీషనర్ కర్టిస్, అతని భార్య, జిల్లా కలెక్టర్ మాక్నెల్ షిరిడీ చావడి చేరారు. కమీషనర్ ఒక భక్తునితో తమ రాక గురించి చెప్పి సాయిని త్వరగా సిద్ధం కమ్మని ఆదేశించాడు. ఆ విధంగా చేయలేమని, సాయికోసం ఎవరైనా వేచివుండాలే కానీ మరో విధంగా జరగదనీ ఆ భక్తుడు చెప్పాడు. అరగంట తర్వాత బాబా భిక్షకు బయలుదేరుతుండగా శ్రీమతి కర్టిస్ ఆయనతో 'మహరాజ్! మీతో మాట్లాడాలి' అన్నది. 'నేను భిక్షకు వెళ్ళాలి. ఓ అరగంట ఉండు' అని వెళ్ళిపోయిన సాయినాధులు పది నిమిషాలలోనే తిరిగివచ్చారు. తమ కోసమే ఆయన త్వరగా వచ్చారని తలచి శ్రీమతి కర్టిస్ మళ్ళీ నమస్కరించింది. సాయినాధులు 'ఒక గంట ఆగు' అని చెప్పి మళ్ళీ భిక్షకు వెళ్ళారు. దానితో అహం దెబ్బతిని ఆ దొరలు వెళ్ళిపోయారు. వారి రాకకుముందే సాయినాధులు కోపంగా 'నన్నొక దుష్టుడు చూడ్డానికి వస్తున్నాడు. సహజమైన మానవ అవయవాలున్న నన్ను చూసేదేమిటి?' అన్నారు. అధికారుల మెప్పుకోసం పాకులాడడం సాధు సత్పురుషులకు నిషిద్ధమని ఆయన తెల్పారు. అదే సమయంలో నిజమైన ప్రేమను గుర్తించి ఆదరించేవారాయన.

ఆఖరికి ఆ రాజుగారికి తన హోదా అంటే రామాకు లెక్కలేదని తెలిసింది. అప్పుడు వినయంగా 'దయచేసి గురుదేవులను చూడనిస్తారా?' అని అడిగాడు. రామా ఆయనను గుహలోనికి తీసుకెళ్ళారు. గురుదేవుల దగ్గర ఆయన విదేశీ స్టైల్‌లో 'అయ్యో! మీరు ఒంటరిగా వున్నట్లున్నారే'? అన్నారు.

'నీవు వచ్చావుగా! అంచేత ఒంటరితనం అనిపిస్తోంది. నీవు రాకముందు నాలోని నేస్తం తోడుగా వున్నారు' అన్నాడు గురుదేవులు.

ఆత్మను మించిన బంధువు, నేస్తం వేరేవరూ లేరు. అందుకే అతణ్ణి తెలుసుకోవాలి. ధ్యానం ద్వారానే ఇది సాధ్యం. ఈ సత్యం తెలుసుకున్న రాజావారు తాను కూడా ధ్యానం చేయడం మొదలుపెట్టారు. ఎవరైనా తాము సృష్టించుకున్న ఒంటరితనం అనే దైన్యం నుండి తప్పించుకోవచ్చు అని ఆయన గ్రహించారు.

## 2.7 మాయ అనే ముసుగు

'గురుదేవా! అవిద్య, అజ్ఞానం, మాయ అన్నీ ఒకటే అంటారు కదా! అయినా నాకు మాయంటే ఏమిటో అర్థంకాలేదు' అన్నారు రామా గురుదేవులతో.

'రేపు ఉదయం చూద్దాం' అన్నారు గురుదేవులు.

అంతే. రామాకు నిద్రరాలేదు. ఎప్పుడు తెల్లవారుతుందా, ఎప్పుడు మాయను చూద్దామా అని వుండిందాయనకు. ఎట్టకేలకు తెల్లవారింది. కాలకృత్యాలు తీర్చుకుని

ధ్యానంలో కూర్చుంద్దామంటే మనసు నిలవడం లేదు. గుహకు తిరిగివస్తుండగా గురుదేవులు పరుగుపరుగునవెళ్ళి, ఒక చెట్టును గట్టిగా కావలించుకున్నారు. ఆయన అంత వేగంగా పరుగెత్తడం రామా ఎప్పుడు చూడలేదు.

'ఏమోయ్! నా శిష్యుడివి కదా? సాయం చేయరాదూ? నన్ను విడిపించు'. పిలిచారు గురుదేవులు.

'మీరెందరికో సాయంచేశారు. మీకు సాయం కావాలా? ఏమైంది మీకు?' అన్నారు రామా. ఆ చెట్టును చూస్తే అది తననూ పట్టుకుంటుందేమో, తన గతి ఏమిటో అని ఆయన భయపడ్డారు.

'రా! సాయం చేయి. నా కాలు పట్టుకుని గట్టిగా లాగు.'

రామా శక్తి కొద్దీ ప్రయత్నించారు. లాభం లేకపోయింది. ఆఖరికి రామాకు అనుమానం వచ్చింది. 'అసలు ఇది ఎలా సాధ్యం? మిమ్మల్ని పట్టుకునే శక్తి ఈ చెట్టుకు ఎక్కడిది? ఏమిటిదంతా' అని అడిగారు.

'ఇదే మాయ అంటే' – గురుదేవులు నవ్వుతూ అన్నారు.

'అవిద్య అనేది వ్యక్తిగతమైన అజ్ఞానం. మాయ అనేది విశ్వమంతా నిండినది. మాయ అంటే 'అదికాదు' అని అర్థం. లేకున్నా ఉన్నట్లు అనిపించేది' అని అర్థం. ఇది ఎండమావి వంటిది.

తంత్ర విద్యలో మాయ అనేది విశ్వశక్తికి, కుండలినికి సంకేతం. కుండలిని అనేది మనుష్యుల్లో దాగివుండే బలం. పరమాత్మునివైపు దృష్టిని సారించినప్పుడు అది మేలుకుంటుంది. అప్పుడు మనిషి చైతన్యం అత్యున్నత స్థాయిని చేరుతుంది. ఈ శక్తి లేనివారే అజ్ఞానంతో బాధపడుతారు.

మనం మనస్సు, శక్తి, అన్ని వనరులు మాయపై కేంద్రీకరిస్తే అది కనిపిస్తుంది. అయితే పాపాలు, అవిద్య ఉండకూడదు. ఆధ్యాత్మికులు కూడా తమ అభివృద్ధిలో అంతరాయానికి ప్రపంచమే కారణం అని నిందిస్తారు. అడ్డంకులు సృష్టించుకోవడంలో ఈ బలహీనత కనిపిస్తుంది. విశ్వాసం, శ్రద్ధ, సత్యసంధత లేకపోవడం వల్ల మన గురించి మనం తెలుసుకోవడం లేదు. మన బలహీనతలు ఎత్తి చూపుకుంటున్నాం. ప్రాపంచిక విషయాలు అడ్డంకులని భావిస్తున్నాం' అన్నారు గురుదేవులు.

ఎటువంటి బంధాలూ లేకుండా ఉండేందుకు ప్రయత్నించమని ఆయన రామాను కోరారు. బంధాలు ఎక్కువ కావడంవల్ల పరిపూర్ణ సత్యం తెలుసుకోలేని బలహీనులం అవుతాము. కోరిక పెంచుకున్నా అది అజ్ఞానంలో ముంచేస్తుంది. బంధాలు తగ్గేకొద్దీ మన లోపలి శక్తి పెరుగుతుంది. అప్పుడు లక్ష్యసాధన సులభతరం అవుతుంది. వైరాగ్యం, అభ్యాసం అనేవి రెండు పక్షి రెక్కల వంటివి. మాయ అనేది ఆ రెక్కలను పట్టి వుంచే బంధం కాకూడదు. ప్రేమయే బంధం అని కొందరు అనుకుంటారు. బంధం స్వార్థాన్ని పెంచుతుంది. మన ఆనందంపైనే దృష్టి వుంటుంది. ప్రేమను దుర్వినియోగం చేస్తాం. యోగులు బంధాలు తగ్గించుకోమని కోరినప్పుడు వారి ఉద్దేశం 'ఏమి పట్టించుకోవద్ద'ని కాదు. నిస్వార్థంగా ప్రేమించమని అర్థం. దీనిని ఎవరైనా అభ్యసించవచ్చును.

హిమాలయాలలో పావన గంగ తీరంలో గురుదేవులు అందించిన ఈ సందేశం వల్ల మాయంటే ఏమిటో స్వామీ రామాకు బోధపడింది. విశ్వమాయకూ, వ్యక్తిగతమైన మాయకూ వున్న తేడా గురించి తెలిసింది.

# 2.8 చేదు నిజం - తీయని ఫలితాలు

ఒకసారి స్వామీ రామా గురుదేవులతో వెళ్తున్నారు. దారిలో ఒక స్టేషన్ మాస్టర్ కనిపించి 'నాకేమైనా ఉపదేశించండి. దానిని విశ్వాసంతో పాటిస్తాను' అన్నాడు.

'అతనికేమైనా ఇవ్వు' అన్నారు గురుదేవులు రామాతో.

'ఒక బుద్ధిహీనుడు మరో బుద్ధిహీనుడికి దారి చూపడమా! మీరే చెబితే బావుంటుందా స్వామీ' అన్నారు రామా.

'సరే బాబూ! నేటి నుండి అబద్ధం చెప్పకు. మూడు నెలలపాటు ఈ నియమం పాటించు' అన్నారు గురుదేవులు స్టేష మాస్టర్‌ను ఉద్దేశించి.

అక్కడి రైల్వే ఉద్యోగులలో చాలామంది లంచగొండులు, అవినీతిపరులు. అంచేత ఇక లంచం తీసుకోకూడదని, అబద్ధం చెప్పకూడదని గట్టిగా నిర్ణయించుకున్నాడాయన. అదే వారంలో హెడ్ ఆఫీసునుంచి ఒక సూపర్‌వైజర్ వచ్చారు, ఒక విచారణ జరిగింది. స్టేషన్‌మాస్టర్ అందరి లంచాల గురించి ఉన్నది ఉన్నట్లు చెప్పాడు. ఇందువల్ల అందరికీ ఇబ్బందిగా వుండింది. నిజాలు చెప్పడం మొదలు పెట్టిన తర్వాత ఆయన భార్యాపిల్లలు ఆయనను వదలి వెళ్ళిపోయారు.

ఒక నెల గడిచేసరికి ఆయన జీవితం పేకమేడలాగా కూలిపోయింది.

ఒక రోజు నర్మదా తీరంలో వెళ్తూండగా రామాతో గురుదేవులు నవ్వుతూ అన్నారు – 'ఏమైందో చూశావా? ఆ రోజు నేను అబద్ధం చెప్పకు అన్న వ్యక్తి ఈనాడు జైల్లో వున్నాడు'.

'అయితే ఎందుకు నవ్వుతున్నారు?' అడిగారు రామా కాస్త కోపంగా.

'నేను నవ్వుతున్నది అతని గురించి కాదు. బుద్ధిలేని ఈ లోకాన్ని చూసి' – చెప్పారు గురుదేవులు క్లుప్తంగా.

పన్నెండుమంది చేరి స్టేషన్‌మాస్టరే అబద్ధాలకోరని, లంచగొండి అనీ ఆరోపించి జైల్లో పెట్టించారు.

కోర్టులో విచారణ జరిగింది.

'నీ తరపున వాదించే వారెవరూ లేరా?' అన్నారు జడ్జిగారు.

'నాకెవరూ వద్దు' అన్నాడు స్టేషన్‌మాస్టర్.

'కానీ నీకెవరైనా సాయం చేస్తే బావుంటుందేమో అనిపిస్తోంది' అన్నారు జడ్జిగారు.

'వద్దు. నేను నిజం చెప్పేయాలనుకుంటున్నాను. మీరు నన్ను ఎన్నేళ్ళు జైల్లో పెట్టినాసరే, అబద్ధం చెప్పను. నేనూ లంచాలలో వాటాలు తీసుకున్నవాడినే. అయితే ఒక రోజు ఒకయోగి 'ఏది ఏమైనా అబద్ధం చెప్పకు' అని ఉపదేశించారు. దాన్ని పాటించడంతో నా పెళ్ళాం బిడ్డలు నన్ను వదిలి వెళ్ళిపోయారు. డబ్బులేదు. స్నేహితులూ వదిలి వెళ్ళిపోయారు. ఉద్యోగమూ పోయింది. ఇదంతా ఒక నెలలో జరిగింది. ఇంకా ఏం జరిగినా ఇంకో రెండు నెలలు నిజం గురించి పరీక్షించాలి.

అయ్యా! నన్ను జైల్లో పెట్టండి. నాకేం పర్వాలేదు' అన్నాడా స్టేషన్‌మాస్టర్.

కాసేపు విరామం ప్రకటించి జడ్జిగారు ఆయనను తన గదిలోకి రమ్మన్నారు. 'ఇంతకు నీకు ఇది చెప్పిన యోగి ఎవరు?' అని అడిగారు. స్టేషన్‌మాస్టర్ జరిగింది చెప్పారు. నిజానికి ఆ జడ్జిగారు కూడా గురుదేవుల శిష్యులే. ఆయన స్టేషన్ మాస్టర్‌ను విడుదల చేశారు. 'నీవు సరైన దారిలోనే వెళ్తున్నావు వదలకు. నాకూ అదే చేయాలని వుంది' అన్నారాయన.

మూడు నెలల తర్వాత స్టేషన్ మాస్టర్‌కు ఒక టెలిగ్రామ్ వచ్చింది. 'మీ నాన్నగారి నుండి ప్రభుత్వం గతంలో చాలా భూమిని తీసుకుంది. ఇప్పుడు అందుకు పది లక్షల రూపాయలు పరిహారం చెల్లించాలనుకుంటూ వుంది' అనేది ఆ టెలిగ్రామ్ సారాంశం. అసలు ఆ వ్యవహారమేమిటో ఆయనకు తెలియదు. మూడు నెలల సత్యవ్రతం ఫలితంగా ఎంతో గొప్ప బహుమతి లభించింది అనుకున్నాడు. ఆ డబ్బును భార్యాబిడ్డలకు పంపించాడు. 'మాతో వచ్చి వుండండి' అన్నారు వాళ్ళు. 'లేదు ఇప్పటిదాకా మూడు నెలలపాటు అబద్ధం చెప్పకుంటే ఏం జరుగుతుందో చూశాను. ఇక జీవితాంతం అలావుంటే ఏం జరుగుతుందో చూడాలనుంది' అన్నాడాయన.

ఈ ఉదంతం చెబుతూ – 'సత్యమే జీవితానికి అంతిమ లక్ష్యం. దాన్ని త్రికరణశుద్ధిగా పాటిస్తే లక్ష్యం చేరుకోవచ్చు. అంతరాత్మకు విరుద్ధంగా పనులు చేయకుండా వున్నప్పుడు అబద్ధం చెప్పకుండా వున్నప్పుడు సత్యాన్ని చేరుకోవచ్చు. అంతరాత్మను మించిన సహాయకుడు లేడు' అన్నారు స్వామీ రామా.

## 2.9 దేవుడు మనలో వున్నాడు

ఒక రోజు స్వామీ రామా 'మీరు నన్ను మోసం చేస్తున్నారు' అని గురుదేవులను విందించారు. మనలో మనకు చాలినంత నమ్మకం లేనప్పుడు, అహం బలంగా వున్నప్పుడు ఇతరులను విందిస్తాం.

'ఏమిటి విషయం?' అడిగారు గురుదేవులు.

'నేనింకా కుర్రవాణ్ణే అనుకుంటున్నారు మీరు. నానుంచి చాలా దాస్తున్నారు'.

'ఏం దాస్తున్నాను చెప్పు?'

'నాకు దేవుణ్ణి చూపించడం లేదు. బహుశ మీరు దేవుని గురించి చెప్పగలరే కానీ చూపలేరేమో? మీకా శక్తి లేదని ఒప్పుకోండి'.

'అలాగా! రేపుదయం నీకు దేవుణ్ణి చూపుతాను.'

'నిజంగానా?'

'నిజంగానే. నీవు సిద్ధంగా వున్నావా?'

మామూలుగా రాత్రి నిద్రకు ముందు ధ్యానం చేయడం రామా అలవాటు. అయితే ఆ రాత్రి ఆయనకు నిద్రపట్టలేదు. ఉదయం దేవుణ్ణి చూడబోతూ వుండగా ఇప్పుడు ధ్యానం ఎందుకు? అనిపించిందాయనకు.

తెల్లవారింది. గురువుగారి దగ్గరి కెళ్ళారు. స్నానం కూడా చేయకుండా పైపైన సర్దుకుని వెళ్ళారు. గురుదేవులు దేవుణ్ణి చూపుతున్నప్పుడు స్నానం కోసం సమయం వృధా చేయడం ఆయనకు ఇష్టం లేదు.

'నమస్కారం గురుదేవా?'

'కూర్చో'.

ఇప్పుడు గురుదేవులు దేవుణ్ణి చూపించబోతున్నారు సాధారణంగా వినయం కాస్త తక్కువ అయినా రామా ఆ రోజు అతి వినయంగా వున్నారు. ఎన్నోమార్లు సాష్టాంగ నమస్కారం చేశారు.

'ఏమిటీ తమాషా? ఎందుకంత భావోద్రేకం?' అడిగారు గురుదేవులు.

'మరచి పోయారా? దేవుణ్ణి చూపుతానని ప్రమాణం చేశారు కదా!' అన్నారు రామా.

'సరే. ఎటువంటి దేవుణ్ణి చూడాలనుకుంటున్నావు?'

'ఎన్ని రకాల దేవుళ్ళున్నారేమిటి?'

'అసలు దేవుడంటే నీ ఉద్దేశం ఏమిటి? నీ నిర్వచనం ఏమిటి? నీవు అనుకున్నట్లు చూపుతాను. మనస్సులో దేవుని గురించి నిశ్చితమైన అభిప్రాయం లేకుండానే దేవుణ్ణి చూడాలని ప్రతివాడూ ఉబలాటపడుతాడు. అన్వేషించే ముందు లక్ష్యం సరిగా ఉండకపోతే ఏమని అన్వేషిస్తావు? నీవు చూసింది దేవుడినే అన్నా నీకు తృప్తి వుండదు. దేవుడు నీలోనే ఉన్నాడన్నా అంతే. అప్పటికీ నీకు తృప్తిగా వుండదు. నేను దేవుణ్ణి చూసినా 'అదికాదు దేవుడంటే' అంటావు. అప్పుడు నేనేం చేయాలి? అంచేత, దేవుడి గురించి నీ ఆలోచనలు చెప్పు. అటువంటి దేవుణ్ణి నీకు చూపుతాను'.

'ఒక్క నిమిషం నన్ను ఆలోచించుకోనివ్వండి'.

'నీ ఆలోచన పరిధిలో లేడు దేవుడు. ధ్యానానికి వెళ్ళు. సిద్ధమైన తర్వాత నాకు చెప్పు. అప్పుడు చూపుతాను. అబద్ధం కాదు. తప్పక నీకు దేవుణ్ణి చూపుతాను. అయినా, అది నా విధి కాదూ?'

తర్వాత రామా ఆలోచనలు పరిపరివిధాలుగా పోయాయి. మానవ రూపం దాటిపోవడంలేదు. మొక్కలు, జంతువులు, మనుషులు వగైరాల గురించి ఆలోచించారు. తెలివి, అందం, బలం, శక్తి వున్న రూపాన్ని ఊహించుకుని దేవుడంటే ఇలా వుండాలని అనుకున్నారు. అప్పుడు అర్థమైంది, తన కోరిక ఎంత తెలివి తక్కువదో! స్పష్టమైన ఆలోచన లేకుండా ఏం చూడగలం? చివరకు గురువుల దగ్గరకు వెళ్ళి 'గురుదేవా! నాకు దుఃఖాలు పోగొట్టి ఆనందం ఇచ్చే దేవుణ్ణి చూపండి' అని కోరారు.

'ఆ సమతా స్థితిని, ప్రశాంతతను నీకు నీవు అలవర్చుకోవాల్సిందే' చెప్పారు గురుదేవులు.

ఈ విషయం చెబుతూ స్వామీ రామా ఇలా అంటారు.

'స్పష్టమైన ఆలోచనలు లేకుండా దేవుడిని చూడాలనుకోవడం చీకట్లో వెతుకులాడినట్లే. మనిషి బుద్ధికి పరిమితులున్నాయి. దానికి లోబడి అది రకరకాల ఆలోచనలు చేస్తుంది. దేవుడంటే ఏమిటో వర్ణించడం ఎవరికీ తెలియదు. దేవుడంటే సత్యం, శివం, సుందరం. సృష్టికర్త అని పలురకాలుగా తోచినట్లు చెప్పవచ్చు. కానీ, ఇవేవీ దైవ సందర్శన కోరికను పూర్తిగా తీర్చలేవు. అయితే మరెలా? దేవుడు సజీవమైన రూపంతో వున్నాడనుకునేవారికి అలాగే కనిపిస్తాడు. కానీ, విజ్ఞానికి మామూలు



గ్రంథాలయం A.C. No. 379

కళ్ళతో దేవుని చూడలేము. అంతరాత్మను, అందులో వున్న ఆత్మస్వరూపాలను అర్థం చేసుకున్నప్పుడు దేవుడంటే తెలుస్తుంది.

అందువల్ల నా గురువు నాకు దేవుడిని చూపించడంలేదు, నాకు కావలసినవి ఇవ్వడంలేదు అనుకునే శిష్యుడు పొరపాటు చేస్తున్నట్లే. అది గురువు విధి కాదు. మనను మనం మార్చుకోవాలి. దేవుడు మనలోనే వున్నాడు. తరచి చూడాలి. అంతే ఒకరు మరొకరికి చూపడం కష్టం. ఎవరికి వారు ప్రయత్నించాల్సిందే. అజ్ఞానంతో దేవునికి ఒక రూపం ఊహించుకుని అలాగే బాహ్య ప్రపంచంలో చూడాలని అనుకుంటే కుదరదు. దేవుడే సత్యం అనుకుని అన్నిటా ఆచరిస్తే అజ్ఞానం నశించి ఆత్మజ్ఞానం వికసిస్తుంది.

## 2.10 క్రమశిక్షణ తప్పనిసరి

స్వామీ రామాకు ఒక మిత్రుడున్నాడు. అతని పేరు సన్ తిన్ బాబా. (సన్ తిన్ అంటే పసివాడు లేక బాలుడు అని అర్థం) ఆయన రామ్ ఘర్ అడవులలో వుండేవాడు. ఆరవ ఏటనుంచీ ఆధ్యాత్మిక అభ్యాసాలు సాధన చేస్తున్నవాడు రామా, సన్ తిన్ ఇద్దరూ తుంటరులే. చిన్నతనంలో ఒక్కోసారి వారు దగ్గరున్న పల్లెకు వెళ్ళి, ఏదో ఒక ఇంట్లో దూరి దొరికింది తిని అడివికి తిరిగి వచ్చేవారు పల్లెలోని వారికి అదంతా అద్భుతంగా వుండేది. కొందరు వీరిని దైవాంశాలుగా అనుకున్నారు. మరికొందరు వీరిని దెయ్యాలుగా భావించారు.

నైనిటాల్ లోని డబ్బున్న ఆసాముల ఆపిల్ తోటలు ఆ ప్రాంతంలో వుండేవి ఆ తోటల దగ్గరున్న పిల్లకాలువ దగ్గర కొంతకాలం ఉండేందుకు వారిద్దరూ వెళ్ళారు అప్పుడు సాయంకాలం చలి మంట కోసం కట్టెలు పోగుచేశారు. అటవీ సంరక్షణ అధికారుల బారినుండి తప్పుకునేందుకు వారు ఆపిల్ తోటలో మంట వేసేవారు అక్కడ ఒక పిసినారి యజమాని వున్నాడు. ఇతరులు కిందపడిన ఆపిల్ పండ్లను ఎవరైనా ఏరుకుని తిన్నా ఏమనేవారు కారు. ఈ పిసినారి మాత్రం తోటమాలితో చెప్పి తరమ గొట్టేవాడు. ఒకసారి వీరిద్దరినీ ఆ తోటమాలి కనిపెట్టి దొంగల కారని, అడవిలో వుండే యోగులని తెలుసుకున్నాడు.

ఇది జరిగిన మూడు నెలలకు వారు ఆశ్రమానికి వెళ్ళారు. గురుదేవుల 'ఇటువంటి చిల్లరపనులు చేసి నాకు సమస్యలు సృష్టిస్తున్నావు' అని మందలించారు 'నేనేమి చేయలేదు' – బుకాయించారు రామా. దాన్ని గురుదేవులు పట్టించుకోలేదు 'తల్లి పిల్లవాడిని కాపాడినట్లు నేను నిన్ను కాపాడవలసి వస్తోంది. ఎప్పటికి ఎదుగుతావు నీవు? ఇంకొకరి సంపదను దురాక్రమణ చేయడం ఎందుకు?' అన్నారు.

'అన్నీ దేవుడివేకదా! దేవుని సేవలో వున్నవారు వాటిని వాడుకోవచ్చు మొండిగా అన్నారు రామా.

ఇది పురాణాలను సొంత లాభానికి వక్రీకరించడమే. ఈ ఆలోచన సరిదిద్దుకో విశ్వమంతా నిండి వున్న అసలైన సత్యాన్ని చూడు. ప్రాపంచిక విషయాల నుం పొందే ఆనందానికి అంటుకు పోవద్దు. వాటిని ఆధ్యాత్మిక పురోగతికి మార్గం మాత్రమే చూడు.

'ఇంకొకరి ఆస్తిని, ఆడవారిని పొందాలనుకోకు' అనే ఉపనిషత్ వాక్యాలు నీ

గుర్తుండవా? ఇంకోసారి ఇటువంటి నేరాలు చేసి గృహస్తులను ఇబ్బంది పెడితే నీతో నేను అస్సలు మాట్లాడను అన్నారు గురుదేవులు.

గురుదేవుల మౌనం రామాకు అనుభవంలో వున్నదే! మామూలు మౌనంలో ప్రేమ వుంటుంది. కోపం వల్ల వచ్చిన మౌనంలో అది లోపిస్తుంది. అప్పుడు రామా వయస్సు పదహారు సంవత్సరాలు. విపరీతమైన శక్తి వుండేది. అందువల్ల ఎప్పుడూ ఏదో ఒక అల్లరిచేసి గురువులను ఇబ్బంది పెట్టేవాడు. 'ఇది నీ తప్పుకాదురా నాయనా! నా ఖర్మ! నేను చేసిన పనిని నేనే అనుభవిస్తున్నాను' అనేవారాయన. పశ్చాత్తాపం రామాకు కేవలం తాత్కాలికమే. ఒక్కోసారి రామా కావాలని పొరబాట్లు చేసినా గురుదేవులు ప్రేమతో వాటిని భరించారు.

ఈ ఉదంతం గుర్తు చేసుకుంటూ, స్వామీ రామా–

'మనిషి ఎదిగే కొద్దీ జీవితంలో నిజమైన తత్వం బోధపడుతుంది. అప్పుడు తనకి తన ఆలోచనలు, మాటలు, పనులు తెలుస్తాయి. ఆధ్యాత్మిక జీవనంలో ఏమరుపాటు ఎప్పుడూ ఉండకూడదు. అప్రమత్తంగా వుండాలి. క్రమశిక్షణను కఠినంగా నెత్తిన రుద్దడం వల్ల ప్రయోజనం వుండదు. అది ఆత్మవికాసానికి అవసరం అని శిష్యులే గ్రహించాలి. లేకుంటే, ఏం చేయాలో, ఏం చేయకూడదో తెలుస్తుంది కానీ, ఎలా వుండాలో తెలియదు' అంటారు.

## 2.11 శాపం కూడా దీవెన వంటిదే!

స్వామి రామా అనుభవంలో అహం పెరిగినప్పుడల్లా పతనమే జరిగింది. 'అహాన్ని పెంచి పోషించినా, స్వార్థంతో ప్రవర్తించినా నీవు నెగ్గవు. ఇదే నీకు నేనిచ్చే శాపం' అన్నారు గురుదేవులు. స్వామి రామాకు ఆశ్చర్యం వేసింది – 'ఏమంటున్నారాయన?'

'ఇదే నీకు నేనిచ్చే వరం కూడా. నీలో స్వార్థం, అహం నశించి ప్రేమ నిండినప్పుడు నీ వెనుక గొప్ప శక్తి వుంటుంది. మంచిని సాధించడంలో అపజయం వుండదు'. మళ్ళీ అన్నారాయన.

'స్వార్థపరునికి తన గురించిన ఆలోచనలే, తన గురించిన మాటలే ముఖ్యం. స్వార్థంవల్ల అతను ఇబ్బంది పడుతాడు. ఈ అహాన్ని, స్వార్థాన్ని విడనాడి పైనున్న పరమాత్ముని శరణు కోరడమే ఆత్మజ్ఞానానికి దగ్గరి దారి. సత్సంగంలో వుండడం, మనలో వున్నదాన్ని గురించి ఆలోచించడం చేస్తే మాయ, భ్రమ నశిస్తాయి. స్వార్థం పోతే అహం కూడా స్వచ్ఛంగా మారుతుంది. అహం పెరిగితే మన చైతన్యం పెరగదు. అహంవల్ల గిరి గీసుకుని బతికేవారు తమ బాధలను తామే సృష్టించుకుంటున్నారు. నలుగురితో కలిసి బతికేవారు నిర్భయంగా, హాయిగా వుంటారు. జీవితంలో ప్రతి క్షణం ఆనందంగా గడుపుతారు. స్వార్థం లేనివారు, వినయవంతులు, ప్రేమించే గుణం వున్నవారు మానవాళికి మహోపకారులు అవుతారు' అని స్వామి రామా గ్రహించారు.

★ ★ ★

# అధ్యాయం మూడు

# ప్రత్యక్ష అనుభవం

జ్ఞాన సముపార్జనలో ప్రత్యక్ష అనుభవ మార్గం అతి గొప్పది. మిగిలిన వన్నీ చిన్న చిన్న ముక్కలను ఏరుకునే మార్గాలే. శుద్ధత, ఏకాగ్రత, మనస్సుపై అదుపు ఆత్మజ్ఞానానికి ముఖ్యమైనవి. ఇవి లేని మనస్సు భ్రమలకులోనై, ప్రత్యక్ష అనుభవానికి అడ్డంకులు పెడుతుంది. ఆత్మజ్ఞానం అన్ని బాధలనూ తొలగిస్తుంది.

## 3.1 ప్రత్యక్ష జ్ఞానమే మార్గం - గత్యంతరం లేదు

ఒక రోజు ఎందుకనో గురువుగారికి కోపం వచ్చింది. 'నీకసలు బుద్ధుందా?' అన్నారు. ఆయన దగ్గర ఆటలాడడం రామాకు అలవాటే కదా! 'ఉంది' అన్నారు.

'ఏం నేర్చుకున్నావు నీవు? నీకెవరు చెప్పారు? దాన్ని వివరించు. ముందు అమ్మ, తర్వాత నాన్న, అక్కచెలెళ్ళు, అన్నదమ్ములు మన గురువులు. ఆపైన సహచరులు, గురువులు, పుస్తకాలు మొదలైన ఎవరి ప్రమేయమూ లేకుండా సొంతగా ఒక్క ముక్కైనా నేర్చుకున్నావా? ఇంతవరకూ నీవు నేర్చుకున్న దంతా ఇతరులనుంచి నేర్చుకున్నదే. వారు మరొకరి నుంచి నేర్చుకున్నారు. అయినా నేనూ పండితుణ్నే అంటావు. సొంతంగా ఏమీ నేర్చుకోని నిన్ను చూస్తే నాకు జాలేస్తుంది. ప్రపంచంలో సొంతంగా నేర్చుకునేవి ఏవీ లేవనే నిర్ణయానికి వచ్చినట్లున్నావే? ఇతరుల భావాలే నీ భావాలు. అంతేనా?' అన్నారు గురుదేవులు.

'ఒక్క నిమిషం నన్ను ఆలోచించుకోనివ్వండి.' రామాకు తల తిరిగి పోయింది. ఇంత కాలం సొంతంగా ఏమీ నేర్చుకోలేదా తాను! అందుకే ఆ జ్ఞానం అంతగా తృప్తి నివ్వలేదన్నమాట! ఒక గ్రంథాలయం మొత్తాన్ని చదివినా తృప్తి వుండదు - ఆలోచించారు రామా. 'గురుదేవా! మరైతే నాకు ఆత్మజ్ఞానం కలిగేది ఎలా?' అని అడిగారు.

'నీవు నేర్చుకున్న దానిని ప్రయోగ పూర్వకంగా తెలుసుకో. ప్రత్యక్ష జ్ఞానం సంపాదించు. అప్పుడే జ్ఞానం పరిపక్వమయ్యేది. లేకుంటే ఎంత నేర్చుకున్నా దండగే. పరోక్ష జ్ఞానం సమాచారాన్ని తెలియజేసే మాట నిజమే. అయితే దానివల్ల తృప్తి వుండదు. చరిత్రలో మేధావులందరూ సత్యాన్ని స్వయంగా తెలుసుకునేందుకు ఎంతో కష్టపడ్డారు. ఇతరుల అభిప్రాయాలతో మాత్రమే వారు తృప్తి చెందలేదు. ఛాందసవాదుల శిక్షలకు కూడా వారు బెదరలేదు' అన్నారు గురుదేవులు.

అప్పటినుండి రామా గురుదేవుల సలహాను శ్రద్ధగా పాటించేందుకు ప్రయత్నించారు. జ్ఞానానికి పరాకాష్ఠ ప్రత్యక్ష అనుభవమే అని తెలుసుకున్నారాయన. ఇతరుల

దృక్కోణంలో చూస్తే లాభం వుండదు. మన అభిప్రాయాలకు మరొకరు అవుననే సర్టిఫికేట్ ఇవ్వడం దేనికి? ప్రత్యక్ష జ్ఞానం సంపాదించాక పొరుగువారిని, గురువులను అడగాల్సిన అవసరం వుండదు. ఆధ్యాత్మిక సత్యానికి బహిరంగ సాక్ష్యం అవసరం. సందేహం వున్నంత కాలం' మనం తెలుసుకోవలసింది ఇంకా వుంది అని అర్థం. అంతా తేటతెల్లం అయ్యేవరకు ప్రత్యక్ష అనుభవ పంథాయే మంచిది. అసలైన విజ్ఞానానికి ప్రత్యక్ష అనుభవమే సరైన దారి అని రామా గ్రహించారు.

## 3.2 బాధలను పోగొట్టే నిజమైన జ్ఞానం ప్రత్యక్ష జ్ఞానమే

ఎవరికాళ్ళపై వాళ్ళు నిలబడాలి. ఇది మన లోపలి నుండి మనం ప్రత్యక్ష జ్ఞానం పొందినప్పుడు వీలౌతుంది. గురువు, సహాయకులు అవసరమే. అది వేరే విషయం. ఇతరులనుండి నేర్చుకోవద్దనీ కాదు. పుస్తకాలు చదవవద్దనీ కాదు. అయితే అక్షరజ్ఞానం లేనివారైనా కొన్ని సత్యాలు చెప్పగలరు. సమస్యలకు పరిష్కారం చూపుతారు.

ఒకసారి స్వామీ రామా బ్రహ్మసూత్రాల గురించి చెప్తున్నారు. కొన్ని సూత్రాలు ఆయనకు స్వయంగా అర్థం కాకున్నా ఇతరులకు చెప్తున్నారు. విన్నవారూ తృప్తిపడ్డట్లే వున్నారు. స్వామీ రామాకే తృప్తిగా లేదు. అందువల్ల ఈ శాస్త్రాలు, పురాణాలు చదవని ఒక స్వామి దగ్గరకు ఒక సాయంకాలం వెళ్ళారు. ఆయనకు సంతకం చేయడం కూడా రాదు. అయినా ఆయనకు సాటిలేని, అపారమైన జ్ఞానం వుంది. 'ప్రత్యక్ష అనుభవం లేకుండా ఈ సూత్రాలను నీవెన్నటికీ అర్థం చేసుకోవు' అన్నారాయన. దీనికి వివరణగా ఆయన ఒక కథ చెప్పారు:

'ఒక గురువు దగ్గర ఒక శిష్యుడున్నాడు. వాడికి ఆవు గురించి, ఆవు పాల గురించి ఏమీ తెలియదు. అయితే పాలు మంచి పోషకాహారం అని విన్నాడు. అంచేత ఆవును చూసి పాలు పితికి పాలు తాగాలనుకున్నాడు. గురువు గారి దగ్గరకు వెళ్ళి 'ఆవుల గురించి మీకేమైనా తెలుసా?' అన్నాడు.

'ఆను నాలుగుకాళ్ళ జంతువు. పెంపుడు జంతువు. గ్రామాలలో వుంటుంది. దాని పాలు తెల్లగా, రుచిగా వుంటాయి. ఆరోగ్యానికి మంచివి అంటూ పూర్తి వివరాలు చెప్పారు గురువుగారు. శిష్యుడు విన్నాడు. తర్వాత ఆవుకోసం వెతకడం మొదలు పెట్టాడు. దారిలో ఒక చోట ఆవు విగ్రహం కనిపించింది. పక్కనే సున్నం గిన్నె వుంది. తెల్లగా వుంది కాబట్టి అవి పాలే అయివుంటాయని తాగేశాడు. అంతే. ఆరోగ్యం దెబ్బతినింది. వైద్యుని దగ్గర చికిత్స తీసుకుని మళ్ళీ గురువుగారి దగ్గరకు వెళ్ళాడు.

'మీరు గురువులు కారు' అన్నాడు కోపంగా.

'ఏమిటి విషయం?' గురువుగారు అడిగాడు.

ఆవు వర్ణన సరిగా లేదు. అంటూ జరిగింది చెప్పాడు.

'నీవు స్వయంగా పాలు పితికావా?' అడిగాడు గురువు గారు.

'లేదు' అన్నాడు శిష్యుడు.

'అందుకే దెబ్బతిన్నావు' అన్నారు గురువు గారు ఊరటగా.

ఈనాడు ఎందరో మేధావుల బాధలకు మూలం ప్రత్యక్ష జ్ఞానం లోపించడమే. శ్రుత పాండిత్యంతో జీవించడమే.

ఈ విధంగా ఆ యోగి చెప్పగలిగాడంటే కారణం అది ఆయన స్వయంగా అనుభవించి తెలుసుకున్న విజ్ఞానం. అహోన్ని స్వచ్ఛంగా చేసే విజ్ఞానం. స్వయంగా అనుభవించి తెలుసుకున్న గురువుల దగ్గర నేరుగా నేర్చుకున్న విద్య శిష్యుడికి బాగా అబ్బుతుంది.

## 3.3 సంతోషమే అసలైన మంత్రం

మంత్రం అనేది మామూలు మనుషుల భాషనుండి వచ్చింది కాదు. నిశ్చలమైన, తీవ్రమైన ధ్యానంలో మహర్షులు కనిపెట్టిన కొన్ని పదాలు, అక్షరాలు, శబ్దాలు కలిసి ఏర్పడినవే మంత్రాలు. అవి అంతశ్చేతన నుండి వచ్చిన నాదాలు. సాధకుని పైపైకి తీసుకువెళ్ళి ఆఖరికి పరిపూర్ణమైన నిశ్శబ్దంలోకి పంపుతాయి. మంత్రాల గురించి ఎరుక పెరిగేకొద్దీ కొత్త అర్థాలు స్ఫురిస్తాయి. చైతన్యంలో ఉన్న స్థితుల గురించి తెలుస్తుంది. మనిషికున్నట్లే మంత్రానికి కూడా కొన్ని కవచాలున్నాయి. ఉదాహరణకు, ఓంకార మంత్రం తీసుకుందాం. ఇందులోని అ,ఉ,మ అనే మూడు అక్షరాలు మెలకువ, కలలు కనడం, నిద్రపోవడం అనే మూడు దశలకు సంకేతాలు. ఇవే సూక్ష్మ, స్థూల, కారణ దేహాలకు కూడా చిహ్నాలు. వీటిని దాటిన నాలుగవ దశ (తురీయస్థితి)లో మంత్రానికి రూపం లేదు. నాదం లేదు. అది వర్ణనాతీతం – లయయోగం (స్వేదనం) గురించి తెలిసినవారికి ఈ నాలుగో దశ సిద్ధిస్తుంది. ప్రార్థనారూపాలలో అత్యంత శక్తి వంతమైనది, పొందికైనది, ప్రముఖమైనది మంత్రమే. చక్కగా గుర్తుంచుకుంటే అది దారి చూపుతుంది.

స్వామి రామా ఎన్నో మంత్రాలను సేకరించారు. ఒకదానికన్నా మరొకటి గొప్పది అనుకునేవారు. అప్పటికి ఆయన మనఃస్థితి అంత పరిపక్వంగా వుండేది కాదు. ఆ రోజులలో ఉత్తర కాశీ, హరిశిల ప్రాంతాల మధ్య హిమాలయాలలో ఒక స్వామి ఉండేవారు. ఆయన దగ్గరకు వెళ్ళి 'నాకో మంత్రం కావాలి' అని అడిగారు రామా. 'కొంతకాలం ఆగు' అన్నాడాయన. పాశ్చాత్యులెవరైనా డబ్బు ఖర్చుపెట్టగలిగితే మంత్రాలు చెప్పే గురువులు చాలా మంది వున్నారక్కడ. అంచేత వారిలాగా రామా 'నాకు చాలా తొందరగా కావాలి' అన్నారు. 'అయితే వచ్చే సంవత్సరం రా' అన్నారు స్వామి.

'ఇప్పటినుండి వేచివుంటే ఎన్నాళ్ళు ఆగాలి?'

'నేను ఆగమన్నంతవరకు.'

మూడు రోజులు ఆగిన తర్వాత నాలుగవ రోజున, 'నీకు మంత్రం చెప్తాను అయితే దానిని నీవు జీవితాంతం గుర్తుంచుకోవాలి' అన్నారు స్వామి.

'సరేనండీ!' వినయంగా అన్నారు రామా.

'పద. గంగానది దగ్గరకు వెళ్దాం', పిలిచారు స్వామి.

ఎందరో ఋషులు గంగాతీరంలోనే ఉపదేశాలు పొందారు. ఆధ్యాత్మిక సాధనలు చేశారు. 'ఈ మంత్రం మరిచిపోను నేను అని ప్రమాణం చేస్తున్నాను' అని రామా పదే పదే అన్నారు. అయినా స్వామి చాలాసేపు అలస్యం చేశారు. చివరకు – 'ఎక్కడున్నా హాయిగా వుండు ఇదే మంత్రం. ఆఖరికి జైలులోవున్నా సంతోషంగా వుండాలి. ఇది మన చేతుల్లోనే వుంది. దీనికి మానవ ప్రయత్నం చాలు నీ సంతోషానికి నీవే సృష్టికర్తవు. ఇదే నా మంత్రం' అన్నారాయన.

ఎంతో చెప్తారనుకుంటే ఇంతేనా? అనుకున్నా, ఇది గొప్ప మంత్రమే అనిపించింది. స్వామీ రామాకు. ఈ మంత్రాన్ని ఆయన అనుభవించారు.

'హాయిగా వుండు. సంతోషం సృష్టించుకోవడం నీ చేతుల్లోనే వుంది' అనే మంత్రం అందుకే ఆదరణీయం. ఆచరణీయం.

## 3.4 తుమ్మెదలకు మంత్రం

కొందరు ఋషులు మాత్రమే చెప్పే ప్రత్యేక మంత్రం అష్ట మంత్రం రుషీకేశ్ సమీపంలో ఒక నదీ తీరంలో కుటీరంలో ఒక స్వామి ఉండేవాడు. ఆయనను చూడాలంటే కాసేపు తాళ్ళ వంతెనపై నడిచి గంగను దాటాలి. ఆ కాలంలో రుషీకేశ్‌లో ఎక్కువ మంది ఉండేవారు కారు. క్రూర మృగాలు కూడా ఎక్కువగానే తిరుగుతూ వుండేవి.

గురువుదేవుల ఆదేశం ప్రకారం స్వామీ రామా ఆ స్వామి దగ్గరకు వెళ్ళారు. ఉదయం ఆయనతో పాటు రామా కూడా గంగాస్నానం చేసేవారు. కొన్ని మొక్కల కొమ్మలు తుంచి వాటితో పళ్ళు తోముకునేవారు. ఇందుకు స్వామి శిష్యులు సాయం చేసేవారు.

ఒక రోజు స్వామి స్వయంగా చెట్టెక్కారు. ఆయన వయస్సు 70 సంవత్సరాలపైనే. అయినా చాలా సులభంగా చెట్టెక్కారాయన. అక్కడో తేనె పట్టుంది. రామా ఆయన్ను హెచ్చరించారు. తేనెపట్టు కదిలితే తేనెటీగలు ఆయన్ను కుడ్తాయి. అందులోనూ అవి చాలా పెద్దగా వున్నాయి. అయితే స్వామి లాఘవంగా కొమ్మ తుంచి కిందికి దిగారు. ఆ తర్వాత రామాతో 'నీవూ పైకివెళ్ళి ఓ కొమ్మ తెచ్చుకో' అన్నారాయన.

'నాకు అక్కర్లేదు కానీ మీరు ఏ మంత్రం పఠించారో చెప్పండి' – అడిగారు రామా. ఆ రోజుల్లో ఆయనకు మంత్రాలపై వ్యామోహం ఎక్కువ. మంత్రాలతో తాను ఏమైనా చేయగలనని ప్రజలకు చూపించాలని ఆయన కోరిక.

'నీవు చెట్టెక్కితే మంత్రం చెబుతాను' అన్నారు స్వామి.

రామా చెట్టెక్కారు. 'వాటికి దగ్గరగా వెళ్ళి, నేను నీ పక్కనే వుంటాను, కీడు చేయను, నీవూ నాకు కీడు చేయకు అని నెమ్మదిగా చెప్పు' అన్నారా స్వామి.

'అదేమీ మంత్రం కాదే!'

'నేను చెప్పినట్లు చేయి. వాటితో మాట్లాడు. వాటి దగ్గరగా నీ పెదవులుంచి నెమ్మదిగా పలుకు.'

'వాటికి హిందీ తెలుసా స్వామీ?'

'వాటికి మనసు భాష తెలుసు. అంచేత అన్ని భాషలూ తెలిసినట్లే నువ్వు మాట్లాడు.'

స్వామీ రామాకు అంత నమ్మకం లేకున్నా ఆయన చెప్పినట్లే చేశారు. 'తేనెటీగలు ఏమీ చేయలేదు. స్వామీజీ! వాటినెవరైనా మచ్చిక చేశారా?' ఆశ్చర్యంగా అడిగారు రామా.

'లేదు. కానీ ఈ మంత్రం ఎవరికీ చెప్పబోకు. అది నీకు మాత్రమే పనిచేస్తుంది గుర్తుంచుకో' అని హెచ్చరించారాయన.

తర్వాత స్వామీ రామా సంచారం చేసే సమయంలో తన గొప్ప చెప్పుకోవాలని ప్రయత్నించారు. ఒకసారి పంజాబ్‌లోని భివానీలో ఉండగా ఆయన దగ్గరకు ఒక కంసాలి వచ్చి 'నాకో మంత్రం ఉపదేశించండి' అని కోరాడు. స్వామీజీ హెచ్చరికను లెక్కచేయకుండా రామా తేనెటీగ మంత్రం చెప్పాడు. అది అతనికి పనిచేయలేదు. తేనెటీగలు అతన్ని వందలాదిగా కుట్టిపెట్టాయి. అతను చెట్టుపైనుండి కిందపడి ఆస్పత్రి పాలైనాడు. మూడు రోజులపాటు స్పృహ లేకుండా వున్నాడు. 'అయ్యో! అనవసరంగా వీడిని చంపినట్లున్నానే' అని రామా బాధపడ్డారు. మూడవ రోజున మంత్రం చెప్పిన స్వామి ఆస్పత్రి దగ్గర కనిపించి 'ఎంతపని చేశావు?' నీ మహిమ చెప్పుకోవాలని ఒకణ్ణి దాదాపు చంపినంత పనిచేశావు. ఇది నీకు చివరి గుణపాఠం అతను రేపు ఉదయానికల్లా కోలుకుంటాడు. అయితే నీకు నేనిచ్చిన మంత్రాన్ని వెనక్కి తీసుకుంటున్నాను' అన్నారు. అప్పటినుంచి స్వామీ రామా జాగ్రత్త పడ్డారు. 'ఒక్కోసారి గొప్పవాళ్ళ మాటలే మంత్రాల్లా పనిచేస్తాయి. అంచేత ఎవరైనా గొప్పవారు మనతో మాట్లాడితే వారి మాటలే మంత్రాలుగా భావించి ఆచరించాలి' అంటారు స్వామీ రామా.

## 3.5 మంత్రం అంటే మజా కాదు

అధ్యాత్మికమైన క్రమశిక్షణ లేకుంటే మంత్రం పని చేయదు. పైగా అది చిత్తభ్రమలకు గురి చేస్తుంది. బుద్ధి సుశిక్షితం కాకుంటే చిత్తభ్రమలు పెరుగుతాయి. బుద్ధి స్వచ్ఛంగా అంతర్ముఖమైనప్పుడే మంత్రం సాయపడుతుంది. మంత్రాన్ని అర్థం చేసుకోకుండా సరైన భావం రేకెత్తించలేము. అది లేకుండా మంత్రాన్ని యాంత్రికంగా మననం చేయడం వల్ల ఏ లాభమూ ఉండదు.

ఒకసారి గురుదేవులు స్వామీ రామాకు ఒక తాళ పత్రం ఇచ్చారు. దీనితో ప్రయోగాలు చేయకు అని హెచ్చరించారు. అక్కడ ఆశ్రమంలో అటువంటి రాత ప్రతులు కొన్ని వుండేవి. అందులో పరిణతి చెందిన యోగులు మాత్రమే ఆచరించదగ్గ అంశాలు కొన్ని వున్నాయి. వాటిని ప్రయోగశాస్త్రాలు అన్నారు.

అప్పుడు స్వామీ రామా వయస్సు పద్దెనిమి సంవత్సరాలు. 'నేనూ చాలా పురోగతి సాధించినవాడినే కదా! ఎవరూ వాడకుంటే ఇవి ఉండేదెందుకని? వీటితో ప్రయోగాలు చేయాల్సిందే. ఏమైనా వికటిస్తే గురుదేవులు ఉండనే ఉన్నారు. ఆయన శక్తిమంతులు' అనుకున్నారు. ఒక రోజు గంగాతీరంలో చిన్న కుటీరం దగ్గరకి గురుశిష్యులు వచ్చారు. గురుదేవులు కుటీరంలోనికి వెళ్ళగానే రామా మంత్రం చదివేందుకు ప్రయత్నించారు. తాళపత్రాన్ని కట్టి వుంచిన తాటిని అతి కష్టం మీద విప్పి చదివారు. చదివిన తర్వాత 'దీని నెందుకు ప్రయత్నించకూడదు?' అనుకున్నారు. అందులో మంత్రాన్ని వెయ్యిన్నొకమార్లు ఉచ్చరించాలి అని రాసింది. రామా తొమ్మిదివందల సార్లు ఉచ్చరించారు. ఏ ప్రభావం కనిపించలేదు. తొమ్మిదివందల నలభైసార్లు అయ్యేసరికి ఒక పెద్ద స్త్రీ రూపం ఆయన ముందు నిలిచింది. ఆమె కొన్ని కట్టెలు సేకరించి పొయ్యి వెలిగించింది. దానిపై ఒక పాత్ర నుంచి నీళ్ళు

కాచింది. ఇది మంత్ర ప్రభావమేనా అనిపించిందాయనకు. తొమ్మిదివందల దెబ్బైసార్లు అయ్యేసరికి మరో వ్యక్తి అటువైపునుంచి వస్తున్నాడు. అయినా నాకెందుకులే అనుకుని రామా వెయ్యిసార్లు మంత్ర ఉచ్ఛారణ కొనసాగించారు. ఇంతలో ఆ దిగంబర మహాకాయుడు 'నా కోసం ఏం వండావు?' అని అడిగాడు. 'ఏదైనా తెచ్చివ్వు, వండుతాను' అన్నాడతను. అది వినగానే జపమాల కింద పడింది. రామాకు మూర్ఛ వచ్చింది. ఇంతలో గురువుగారు వచ్చి చెంపదెబ్బకొట్టి 'లే' అన్నారు. 'ఆ రాక్షసుడు నన్ను చంపేస్తాడు బాబోయ్' అని మళ్ళీ మూర్ఛపోయారు. ఇలా మూడు నాలుగుసార్లు జరిగాక గురుదేవులు రామాను ఒక తన్ను తన్నారు.

'లే' ఎందుకిలా చేశావు? ఈ మంత్రాలు అభ్యాసం అవీ వద్దన్నాను కదా – మూర్ఖుడా!' అన్నారు గురుదేవులు కోపంగా.

అప్పుడు మంత్రం విలువ తెలిసిందాయనకు. అంతకుముందు గురుదేవులు చెప్పిన మంత్రం మాత్రమే పాటించారు. అది అయనను ఎన్నోసార్లు ఆదుకుంది. 'క్రమశిక్షణ లేకుండా మంత్రాన్ని వాడితే అది మాయలు చేస్తుంది. మనస్సు అంతర్ముఖమైనప్పుడు మంత్రం సాయపడుతుంది. ఊరికే అర్థం తెలియకుండా మంత్రాన్ని ఎన్నిసార్లు వల్లించినా లాభం వుండదు' – అంటారు స్వామీ రామా.

## 3.6 ధ్యానంలో తక్షణ ఫలితాలు ఉండవు

ఒకసారి స్వామీ రామా సరయూనదీ తీరంలో వున్నారు. తనలోపలి భావాలను, ప్రవర్తనను పరిశీలించేందుకు ఆయన కొన్నాళ్లు మౌనం పాటించారు. ఆయనను గమనించిన అక్కడి ప్రజలే ఆయనకు రోజూ తినేందుకు ఏదో ఒకటి తెచ్చి ఇచ్చేవారు. అది వేసవికాలం. ఆయనకు నిలువ నీడలేదు. హఠాత్తుగా ఒక రోజు ఉరుములతో కూడిన వాన వచ్చింది. దగ్గరున్న గుడిలోకి వెళ్ళారు. అప్పటికే చీకటి పడింది. కాసేపటికి గుడి కాపలాదారులు ముగ్గురు కర్రలతో వచ్చారు. రామాను దొంగగా అనుకొన్నారు. ఆయన మౌనంగా ఉండడంతో వాయించేశారు. ఆయనకు స్పృహ తప్పింది. ఈలోగా లాంతరుతో పూజారి వచ్చాడు. రామాను చూడగానే ఆయన దిగ్భ్రాంతి చెందాడు. రామాకు స్పృహ రాగానే అందరూ ఆయనను క్షమాపణ కోరారు. అప్పటినుంచి రామా మళ్ళీ ఊళ్ళు తిరగలేదు.

మనోవాక్కాయ కర్మల గురించిన ఎరుక ఆత్మశిక్షణలో అత్యున్నతమైనది. ఒక్కోసారి సంకల్పంతో రామా తన ఆలోచనలను పరిశీలించేవారు. ధ్యానంలో నిశ్చలత్వం వచ్చినా ఒక్కోసారి హఠాత్తుగా ఆలోచన వచ్చేది. 'నేను ఆలోచనలను జయించాను. నా మనస్సు నా ఆధీనంలో వుంది' అని రామా అనుకున్నప్పుడల్లా ఈ విధంగా జరిగేది. ఒక్కోసారి నిరాశగా అనిపించినా ఎవరో ఒకరు ఆయనకు సాయపడి దారిచూపేవారు.

'సాధకుడు ధ్యానం చేసేటప్పుడు జాగ్రత్తగా వుండాలి. మొదటే ఏదో ఆశించకూడదు. ధ్యానానికి తక్షణ మార్గం, సద్యోమార్గం అంటూ ఏమీలేదు. అలాగే ధ్యానంలో తక్షణ ఫలితాలు ఉండవు' అంటారు స్వామీ రామా.

# 3.7 తాంత్రిక శక్తిని దుర్వినియోగం చేయకూడదు

స్వామీ రామా సహపాఠి ఒకతనికి పద్దెనిమిది సంవత్సరాల వయస్సులో పెళ్లి జరిగింది. పెళ్లి మంటపంలో హోమం ముందు ఏడడుగులు నడిచేవేళ, నాలుగు అడుగులు పూర్తికాగానే అతను పరుగెత్తాడు. అక్కడున్నవారికి అతని ప్రవర్తన అర్థం కాలేదు. అతణ్ణి పట్టుకోవాలని కొందరు వెళ్ళారు. కానీ లాభం లేకపోయింది. అయన అలా నడుస్తూ గంగాతీరం చేరి గురువుకోసం అన్వేషణ సాగించాడు. ఆరేళ్ల అనుభవం తర్వాత కూడా గురువు దొరకలేదు. చివరికి హిమాలయాలలో శ్రీనగర్ సమీపంలో స్వామీ రామా గురుదేవులను కలిశాడు. గురుదేవులు కొత్త శిష్యుణ్ణి మనసారా కౌగలించుకున్నారు. వారు ఒకరినొకరు ఎన్నో ఏళ్లనుంచి ఎరిగివున్నారా అనిపించింది రామాకు. మూడు నెలల తర్వాత అతను రామాతో గంగోత్రిలోని గుహలో ఉండసాగాడు.

ఒకరోజు అతనికి బెంగాల్‌లోని మేదనిపూర్‌లో వున్న తన ఇల్లు గుర్తుకు వచ్చింది. అటువైపు రామా ఎప్పుడైనా వెళ్లడం తటస్థించినప్పుడు తాను సన్యాసం తీసుకొని, హిమాలయాలలో వున్నట్లు తనవారితో చెప్పమన్నాడు. అలాగే స్వామీ రామా వెళ్ళి అతని భార్యతో మరో పెళ్ళి చేసుకోమని సలహా ఇచ్చారు. ఆ సలహా విని 'మీరు పూజించేది దేవుణ్ణి కాదు, దెయ్యాన్ని' అందామె కోపంగా.

స్వామీ రామా పల్లె చివరనున్న తన కుటీరానికి వెళ్ళారు. అక్కడ తాంత్రికులు, కాళీమాతను కొలిచేవారు వున్నారు. ఆ తాంత్రిక శక్తులు నిజమైనవని ఎవరైనా చూపగలరా అని రామా అన్వేషించారు. అప్పుడు సహపాఠి బంధువొకడు ఒక మౌల్వీని చూపించాడు.

ఆ మౌల్వీ మర్నాడు ఊరి చివరనున్న చెరువు దగ్గరికి తీసుకెళ్లాడు. అక్కడ ఒక కోతిపిల్ల మెడకు తాడుకట్టి, తాడు రెండోకొనను అరటి చెట్టుకు కట్టాడు. 'కూర్చో. దానిని జాగ్రత్తగా గమనించు' అని రామాతో అని, కాసేపు ఏదో గొణిగాడు. కాసేపటికి కోతి నిర్జీవమైంది. 'అది చనిపోయింది చూడు' అన్నాడా మౌల్వీ.

'ఇది క్షుద్రశక్తి. ప్రాణం తీసే శక్తి. మంచిది కాదు' అనుకున్నాడు రామా. 'అది చనిపోయింది నిర్ధారించుకో' అన్నాడు మౌల్వీ. 'ఈ కోతిపిల్లను కాసేపు నీళ్ళలో వుంచనా?' అడిగారు రామా. సరే నన్నాడు మౌల్వీ. నిజమే. అది చనిపోయినట్లే. అయితే కాసేపటికి మళ్ళీ దానిలో జీవం తెప్పించాడు మౌల్వీ. దానినిచూసి రామా వణికిపోయారు. 'ఇప్పుడు తాడు ఒక చివర అరటి చెట్టుకు, ఇంకో చివర నీ నడుముకు కట్టుకో. ఇంకో తమాషా చూపిస్తాను' అన్నాడు మౌల్వీ.

అంతే. దెబ్బకు మౌల్వీని వదిలేసి రామా శరవేగంతో పారిపోయారు. అక్కడివారికి జరిగిందేమిటో అర్థం కాలేదు. రామా చెప్పినా వాళ్ళు నమ్మలేదు. ఆ మౌల్వీ చాలా మంచివాడని వారి నమ్మకం. 'ఇదంతా వదిలేసి నా దారిలో నేను నడిస్తేనే మంచిదేమో' అనుకున్నారు రామా.

అక్కడినుంచి కలకత్తా వెళ్ళి, నాటి ప్రధాన న్యాయమూర్తి ఆర్.పి. ముఖర్జీని కలిశారు రామా. తాను చూసింది చెప్పారు. అటువంటివి జరుగుతాయి అన్నాడాయన.

తర్వాత కొందరు యోగులను కలిసి, ఆ అద్భుతాలు ఎలా చేస్తారని అడిగారు. 'మాకు తెలియదు. అయితే బెంగాల్ అటువంటి విద్యలకు ప్రసిద్ధి' అన్నారు వారు. తర్వాత రామా గురుదేవులకు జరిగింది చెప్పారు. ఆయన నవ్వి, 'నీకు ఇవన్నీ తెలియాలి. అయితే నీవు వేటినీ నేర్చుకోనక్కర్లేదు. నీ గురువు నీకు చెప్పినవి తప్పు' అన్నారు.

ఇటువంటి తంత్రాలు నిజమైనవి కావు. మనోశక్తిని ఎన్నో విధాలుగా వాడుకోవచ్చు. జీవితలక్ష్యం గురించిన ఆలోచనలు లేని మనోశక్తి ఇతరులకు కీడు చేసేందుకే పనికొస్తుంది. ఆఖరుకు అది ఆ వ్యక్తినే సర్వనాశనం చేస్తుంది. తాంత్రికులు ఎందరో కనిపించవచ్చు. అయితే, వారిలో అసలైన తాంత్రికులు నూటికి ఒక్కరు వుంటారు. తక్కిన వారు ఇంద్రజాలం తెలిసినవారు మాత్రమే.

## 3.8 మాయలమారి యోగులు

యోగులకు సిద్ధులు లభించినా వారు వాటిని అంతగా లక్ష్యపెట్టరు. కొందరు నకిలీయోగులు తమ ఇంద్రజాలాన్నే మహిమలుగా ప్రచారం చేసి డబ్బు సంపాదించాలనే లక్ష్యంతోనే వుంటారు. అటువంటి వారితో తమ అనుభవాల గురించి రామా ఓ కథ చెప్పారు.

యౌవనంలో రామాకు మహిమలంటే ఆసక్తి ఎక్కువ. ఒకసారి మేకుల పడకపై పడుకున్న ఒక వ్యక్తిని చూసి 'నాకూ అలాగే చేయాలని వుంది, నేర్పుతావా?' అని అడిగారు.

'తప్పకుండా. అయితే నీవు నాకోసం భిక్షాటన చేయాలి. డబ్బు తేవాలి. నీ దగ్గరున్న డబ్బు ఇస్తానంటే నీకు నేర్పుతా' అన్నాడా దొంగసాధువు. 'వాడికేం తెలుసు? నేను చెప్తానురా' అనే నకిలీయోగులెందరినో స్వామి రామా చూశారు. అందులో ఒకాయన పెద్ద ఉక్కు సూదిని తన భుజంగుండా గుచ్చి 'చూడు. రక్తం కారలేదు. నీకు ఈ విద్య నేర్పుతాను. దీనితో నీవు బాగా డబ్బు సంపాదించుకోవచ్చు. అయితే నీవు నా శిష్యుడివై, నీ సంపాదనలో నాకు వాటా ఇవ్వాలి' అన్నాడు.

తర్వాత రామా మరొకతన్ని చూశారు. అతను ముస్లిమ్. హాజ్‌యాత్ర చేసినవాడు. అతనిచుట్టూ ఎప్పుడూ ఒక గుంపు ఉండేది. అతను గొప్పయోగి అయివుండవచ్చు అనుకుని అతణ్ని కలిశారు. అతను ఒంటరిగా వున్నప్పుడు రామాతో 'నీకు తెలిసిన ఒక గొప్ప హోటల్ పేరు చెప్పు' అన్నాడు. 'లండన్ లోని సవాయ్ హోటల్' – జవాబు చెప్పారు రామా.

'నాకు వంద రూపాయలు ఇవ్వు. అక్కడినుండి నీకు బ్రహ్మాండమైన భోజనం తెప్పిస్తాను.' రామా ఇచ్చారు. తక్షణం భోజనం ముందుకు వచ్చింది.

తర్వాత డెబ్బైరూపాయలు ఇచ్చి, జర్మనీలోని హోంబర్గ్‌నుండి ఆహారం కోరుకున్నారు రామా. తక్షణం బిల్‌తోపాటు ఆహారం వచ్చింది.

'ఇక నా గురుదేవులెందుకు? ఇతనితో ఉంటే నా అవసరాలు గడిచిపోతాయి. అప్పుడు మరే బాదరబందీ లేకుండా నేను ధ్యానం చేసుకోవచ్చు' అనుకున్నారు రామా. ఇంతలో 'నీకు ఎటువంటి చేతి గడియారం కావాలి?' అన్నాడు ఆ సాధువు. 'నాకు మంచి వాచీ వుంది' – చెప్పారు రామా. 'అయినా సరే నీకు

మరింత మేలైన వాచీ ఇస్తాను' అంటూ ఒక వాచీ తెప్పించాడాయన. దానిని చూడగానే అది స్విట్జర్లాండ్ గడియారం అనీ, దాన్ని అతను సృష్టించలేదనీ, ఏదో గారడీ చేశాడనీ, ఒకచోటినుండి మరోచోటికి తెచ్చాడేమోననీ అనిపించింది రామాకు.

రెండు వారాల తర్వాత రామా మళ్ళీ అతని దగ్గరకు వెళ్ళి, తైలమర్దనం చేసి, అన్నం వండడంలో సాయపడ్డాడు. దానితో ఆయన సంతోషించి రామాకు అటువంటి ట్రిక్ నేర్పించాడు. ఒకరోజు రామా సహచరుడు వచ్చి చెంపదెబ్బ కొట్టి 'ఏం చేస్తున్నావు?' అన్నారు. గురుదేవులు 'నీవు చాలా దొంగతనాలు చేశావు. నీవు కోరినవి షాపుల నుండి వస్తున్నాయి' అన్నారు. దానితో రామా ఇకపై అటువంటివి చేయకూడదనుకున్నారు.

తర్వాత ఒకసారి రామా ఢిల్లీలో కుట్టుమిషన్లు అమ్మే ఒక సేల్స్‌మన్‌తో పైన పేర్కొన్న హాజీ గారి శక్తుల గురించి చెప్పారు. 'ఢిల్లీలోని నా సింగర్ కంపెనీ కుట్టు మిషన్‌ను స్టోరునుంచి తీసుకు రాగలిగితే ఆయన మహాత్ముడని నమ్ముతాను. జీవితాంతం ఆయనతోనే ఉంటాను' అన్నాడతను. ఇద్దరూ వెళ్ళి హాజీని అడిగారు. 'అలాగే' అన్నారాయన. మిషన్ వచ్చింది. తర్వాత సేల్స్‌మన్ భయపడ్డాడు. దాన్ని వెనక్కి పంపమని కోరాడు. అది వెళ్లలేదు. 'నా శక్తులు పోయాయి బాబోయ్!' అని హాజీ గోలపెట్టాడు. సేల్స్‌మన్ కుట్టుమిషన్‌ను తీసుకుని ఢిల్లీ వెళ్లాడు. ఈలోగా అతనిపై దొంగతనం నేరం మోపారు. అతనేం చెప్పినా ఎవరూ వినలేదు.

ఇటువంటివన్నీ క్షుద్ర విద్యలనీ, చవకబారు తమాషాలనీ రామా గ్రహించారు. ఈ క్షుద్ర విద్యలకు సాధకులు దూరంగా ఉండాలని యోగసూత్రాలు చెబుతున్నాయి. 'సిద్ధులకోసం ప్రాకులాడనివారికే అప్రయత్నంగా సిద్ధులు లభిస్తాయి. సిద్ధుల దుర్వినియోగం యోగులకు పతన కారణం' అంటారు స్వామి రామా.

## 3.9 నిప్పులుమిసే స్వామి

ఒకసారి స్వామీ రామా నోటిలో నుంచి నిప్పులు కురిపించే స్వామిని చూశారు. నోట్లో భాస్వరం వంటి రసాయనాలేమీ లేవని తెలుసుకునేందుకు నోరు కడుక్కొని మంటలు తెప్పించమని కోరారు. ఆయన అలాగే చేశాడు. రామాకు ఆశ్చర్యం వేసింది. 'ఈయన గురుదేవులకన్నా మేలుగా ఉన్నాడే!' అనుకున్నారు. అప్పుడు ఆ స్వామి 'నీవు నీ గురువు దగ్గర వృథాగా పడివున్నావు. నాతోరా, నిప్పులు కురిపించే మార్గం చెబుతాను' అన్నాడు. 'సరే' అన్నారు రామా. ఆ తర్వాత గురుదేవుల దగ్గరకు వెళ్లి, 'మీకన్నా గొప్ప గురువును చూశాను. అయనకు శిష్యుణ్ణి కాబోతున్నాను' అన్నారు. 'మంచిది. నీ సంతోషమే నాకు కావలసింది. ఇంతకీ ఆయన ఏం చేస్తాడు?' గురుదేవులు అడిగారు.

'నోటి నుంచి నిప్పులు కురిపిస్తాడు. చాలా శక్తి వున్నవాడు' – చెప్పారు రామా.

'అతణ్ని ఒకసారి నాకు చూపించు' అని కోరారు గురుదేవులు. మర్నాడు ఇద్దరూ బయలుదేరారు అక్కడికి 23 మైళ్ల దూరంలో వున్న ఆ స్వామిని కలిసేటప్పటికి రెండురోజులు గడిచాయి. అక్కడికి చేరగానే ఆ స్వామి గురుదేవులకు నమస్కరించాడు.

'ఈయన మీకు తెలుసా?' ఆశ్చర్యంగా అడిగారు రామా.

'ఆహాం! కొన్నాళ్ళక్రితం మన ఆశ్రమంనుంచి వెళ్ళిపోయాడు. ఇన్నాళ్లకు మళ్లీ కలిశాం' అని, 'ఇప్పుడేం చేస్తున్నావు నాయనా?' అని అడిగారతణ్ణి.

'నోటినుంచి నిప్పులు కురిపిస్తున్నాను స్వామీ!' అన్నాడతను.

'ఇది నేర్చుకునేందుకు ఎన్నాళ్ళు పట్టిందో కనుక్కో అతణ్ణి' అన్నారు గురుదేవులు రామాతో.

'ఇరవై సంవత్సరాల సాధన ఫలితమిది' – గర్వంగా అన్నాడతను.

'చూశావా? ఒక అగ్గిపుల్ల ఒక్కక్షణంలో చేసేపనికి ఇతను ఇరవైఏళ్లు వృధా చేశాడు. అలాగే చేయాలని నీకూ ఉంటే నిన్ను మించిన బుద్ధిహీనుడు మరొకడు ఉండడు. ఇది తెలివికాదు. నిజమైన యోగులను చూడాలనే కోరిక నీకు బలంగా ఉంటే వారిని చూపుతాను. కలువు. అనుభవాలు సంపాదించు' అన్నారు గురుదేవులు.

తర్వాత అటువంటివి సాధనాపథంలో సంకేతాలు అనీ, వాటికీ ఆధ్యాత్మికతకూ సంబంధం లేదనీ రామాకు తెలిసింది. నిజానికి అవి సాధకుని మార్గంలో ఆటంకాలు. ఎందరో స్వాములు వాటితో ఎంతోకాలం వృథా చేశారు. సిద్ధులు కావాలనుకుంటే వస్తాయి. అయితే, అటువంటి సిద్ధులపట్ల ఆసక్తి చూపేవారు ఆత్మజ్ఞానం పొందలేరు అని రామా గ్రహించారు.

## 3.10 అద్భుతయోగి నిమ్‌కరోలీ బాబా

స్వార్థం లేకపోవడం ఆధ్యాత్మికతకు సంకేతం. అటువంటి నిస్వార్థ వ్యక్తులలో నైనిటాల్‌కు చెందిన నిమ్‌కరోలీ బాబా ఒకరు. ఎవరైనా చూడ్డానికి వెళ్లినా 'సరే! చూశావుగా? నేనూ చూశాను, వెళ్ళు' అనేవారాయన. ఒకసారి స్వామీ రామా ఆయనతో కూర్చున్నారు. అప్పుడో డబ్బున్న ఆసామీ ఒకాయన నోట్లకట్టను ఆయన ముందుంచి 'మీ కోసమే తెచ్చాను బాబా!' అన్నాడు. బాబా ఆ నోట్లు నేలపై పరిచి దానిపై కూర్చున్నారు! 'ఇది మెత్తని పరుపుగా పనికిరాదు. చలి కాచుకుందామా అంటే నిప్పుకూడా లేదు. దీనితో నేనేం చేసుకునేది?' అన్నారాయన.

'బాబా! ఇది డబ్బు' అన్నాడా ధనికుడు ఆశ్చర్యంగా.

'అలాగా? వెళ్ళి ఈ డబ్బుతో పళ్లు కొనుక్కురా.'

'బాబా! ఇక్కడ దుకాణాలే లేవే?'

'మరి, ఇది డబ్బు ఎలా అవుతుంది? నాకు పళ్ళు కొనుక్కునేందుకుకూడా పనికిరాకుంటే ఇది నాకెందుకు? సర్లే నానుంచి నీకేం కావాలి?'

'నాకు తలనొప్పి.'

'అది నీకై నీవు తెచ్చిపెట్టుకున్నది. నేనేం చేయను?'

'బాబా! మీ సాయం కావాలి.'

'సరే. ఇప్పటినుండి నీకు తలనొప్పి వుండదు. అయితే నీవు ఇతరులకు తలనొప్పిగా మారుతావు – నీ డబ్బువల్ల.'

'తర్వాత అతను అందరికీ నిజంగానే తలనొప్పిగా మారాడు. డబ్బు అందరికీ అవసరమే. అయితే, అవసరానికి మించిన డబ్బు ఉండకూడదు' అంటారు రామా.

నిమ్‌కరోలీ బాబా రామా నామం పలికేవాడు. ఒకసారి ఆయన శిష్యుడొకటు పాషాణం (ఆర్సెనిక్) అనే విషపూరితమైన రసాయన ధాతువును తెచ్చుకున్నాడు. 'నీ దగ్గరున్నదేమిటి?' అడిగాడు బాబా. 'ఇది పాషాణం. మీకు ఆహారం తెస్తానుండండి' అని వెళ్లాడు శిష్యుడు. బాబా వెంటనే ఆ చూర్ణం తిని నీళ్ళు తాగేశాడు. బాబా కథ ముగిసిందనుకున్నాడు శిష్యుడు. అయితే, ఆయన కేమీ కాలేదు. నిమ్‌కరోలీబాబా వంటి మహానుభావులుంటారు వారు నిజమైన యోగులు అని స్వామీ రామా అభిప్రాయం.

## 3.11 అస్సాం మాతాజీ

అస్సాంలోని కామాఖ్య దేవాలయం దగ్గర తొంభైయారు సంవత్సరాల అవ్వ ఒకామె వుండేది. ఆమె గొప్పయోగిని. అందరూ ఆమెను 'మాతాజీ' అని గౌరవంగా పిలిచేవారు. ఆమెను చూసేందుకు ఒకసారి అతికష్టంమీద కలకత్తా నుండి అక్కడికి వెళ్లారు స్వామీ రామా. చీకట్లో తడబడుతూ, పడుతూ లేస్తూ వెళ్తున్నారాయన. ఆ రోజుల్లో అక్కడ మూడు నాలుగు చెక్క ఇండ్లు ఉండేవి. గుడి పూజారిని కలిసి మాతాజీ కోసం అడిగారు స్వామీ రామా. ఆయన రామాను అదే భవనంలో రెండో అంతస్తులో ఉండమని సూచించి, ఆమె ఎక్కడుందో చెప్పారు. అక్కడ రామా రెణ్నెల్లపాటు వున్నారు. ఆ గదిలో ఎన్నో కన్నాలు. పాములు, ఎలుకలు వచ్చేవి. అయినా రామా నిస్పృహోయులు. మొదట ఇబ్బందిగా అనిపించినా, తర్వాత ఆయన అక్కడ ఆనందంగా గడిపారు.

అప్పటికి ఇరవై ఏళ్ళుగా మాతాజీ పగటిపూట కనిపించడం మానేశారు. ఆమె అర్థరాత్రి పన్నెండుకు, ఉదయం మూడు గంటలకు గుడికి వెళ్లేవారు. ఆ విధంగా ఆమె రాకపోకలు నాలుగురోజులపాటు గమనించి, అయిదవరోజున ఆయన ఆమెకోసం వెళ్లారు. అక్కడ గుళ్లో మంత్రాలు వినిపిస్తున్నాయి. రామా రావడం చూసి ఆమె 'రావద్దు. వస్తే చస్తావు నేను అమ్మవారిని – వెళ్లిపో' అని అరిచారు. రామాకు భయం వేసింది. అయినా, కొంత ధైర్యం తెచ్చుకుని ఆమెను చూశారు. ఆమె దాదాపు నగ్నంగా వున్నారు. కళ్ళు చింతనిప్పుల్లాగా మెరిసిపోతున్నాయి. 'వెళ్తావా లేదా? నేనేం చేసేదీ నీవెందుకు చూడాలి?' అన్నారామె. రామా ఆమెకు నమస్కరించారు. అయినా ఆమె ఆయనను బెత్తంతో కొట్టారు.

మర్నాడు ఆమె రామాను తన గదికి పిలిపించారు. రామాను ముద్దుపేరుతో పిలిచింది. ఆ పేరు గురుదేవులకు తప్ప తెలియదు. రామాకు ఆశ్చర్యమైంది. ఆమె రామాను కౌగిలించుకుని తన ఒడిలో కూర్చోబెట్టుకుంది. రామాకు ఏదో స్వర్గంలో వున్నట్లుంది. ఆమె రామా తలపై తట్టి, 'నీ మార్గంలో ఎన్ని అడ్డంకులున్నా అవన్నీ తొలగిపోతాయి. నిన్ను ఆశీర్వదిస్తున్నాను' అన్నారు. 'అమ్మా! కొన్నాళ్ళు నీతో వుంటాను' – వినయంగా అన్నారు రామా. ఆమె సరేనన్నారు.

'అమ్మా! నీవేం చేస్తున్నావు?' అడిగారు రామా. అప్పుడు మాతాజీ – 'శక్తిపూజ. ఎవరూ ఉండడం నాకిష్టం వుండదు. అందుకే ఈ సమయంలో వస్తూ వుంటాను' అన్నారు. ఆమె ప్రతి సాయంకాలం అర్ధగంట తనతో గడిపేందుకు స్వామీ రామాను అనుమతించారు. గురుదేవుల సన్నిధి కలిగించిన అనుభూతులన్నీ

మాతాజీ సన్నిధి కూడా ఇచ్చింది. ఆమెనుకూడా ఒక గురువుగా స్వీకరించారు రామా. ఎన్నో అడగాలని వుంది అయితే, మౌనంగా ఉండమన్నారు మాతాజీ. ఆ మౌనంలోనే ఆయనకు అన్ని జవాబులూ దొరికాయి. భావప్రకటనకు, బోధనకు మౌనాన్ని మించిన గొప్ప మార్గం లేదు. బాగా పరిణతి చెందిన గురువులు మౌనం ద్వారానే బోధిస్తారు అని రామాకు అర్థమైంది.

మాతాజీకి వాక్సుద్ధి వుంది. వాక్సిద్ధి కూడా వుంది. ఆమె చాలా క్లుప్తంగా – 'వెళ్లు. జరుగుతుంది. ఆశీస్సులు. అమ్మను పూజించు' వగైరా పదాలతో చెప్పేవారు. మాతాజీ రాత్రి పూట ధ్యానంలో గడిపేవారు. ఆమెకు నిద్రలేదు. ముందు నమ్మకపోయినా రామాకు నిజం తెలిసింది. 'అమ్మా! మర్దనా చేయనా – నీకు నిద్రపడుతుందేమో?' అన్నారు రామా. 'బాబూ! అది నాలాటి వారికి కాదు. అయినా, ధ్యానంలో ఆనందంగా వున్నాకదా! పందుల నిద్ర నాకెందుకు?' అన్నారామె. 'అదేమిటి?' అడిగారు రామా ఆశ్చర్యంగా. 'పందులు శక్తికి మించి గుర్రుపెడుతూ పడుంటాయి. అవి అలా ఏ విధంగా పడి వుంటాయో నాకు అర్థంకాదు' అన్నారామె.

తర్వాత నిద్ర గురించి, మనిషి జాగృతి (మెలకువ) నుండి స్వప్నదశకు, గాఢనిద్రకు ఎలా వెళ్తాడో చెప్పారు. ఆ విషయాలే 'మండూక్య ఉపనిషత్'లో వున్నాయి. మనస్సుకు మెలకువ, నిద్ర, కలలు అని మూడు దశలున్నాయి. వీటిని మించిన నాలుగవదశ తురీయదశ. మాతాజీ చెప్పిందంతా వివరంగా రాసుకున్నారు రామా. ఆమె మాటలు నెమ్మదిగా, మృదువుగా వుండేవి. చెప్పింది మళ్ళీ మళ్ళీ చెప్పడం కానీ, తప్పులు దొర్లడంకానీ లేదు. మాండూక్య ఉపనిషత్ గురించి ఆమె చెప్పిన తర్వాతనే స్వామీ రామాకు తురీయస్థితి అనుభవానికి వచ్చింది!

రెండున్నర నెలల తర్వాత అమ్మను వదిలివెళ్లే సమయం వచ్చింది. 'నా ఈ దేహంపై అమ్మ అనే ఘుఘకారం పెంచుకోవద్దు. నేను విశ్వమాతను. ఎక్కడ కావాలంటే అక్కడ వుంటాను. నీ చైతన్యం పెంచుకో. ఈ భౌతికశరీరాన్ని దాటి నన్ను చూసేందుకు ప్రయత్నించు. భయపడకు. నేను నీతో వుంటాను' అన్నారు మాతాజీ. అశ్రునయనాలతో ఆమెకు వీడుకోలు చెప్పి స్వామీ రామా హిమాలయాలకు తిరిగి వెళ్లారు. గురుదేవులు కూడా ఆమెను గురించి ఎంతో గొప్పగా చెప్పారు. నూటొక్క సంవత్సరాల దివ్యజీవితం తర్వాత ఆమె శరీరత్యాగం చేశారు.

## 3.12 వయసెరుగని యోగి - దేవరహో బాబా

దేవరహో బాబా ఉత్తరప్రదేశ్‌లోని తూర్పు ప్రాంతంలో వుండేవారు. ప్రతివేసవిలో ఆయన హిమాలయాలలోని ఒక తీర్థానికి వచ్చి కొన్ని నెలలపాటు గడిపేవారు. ఆయన చాలా వయోవృద్ధుడంటారు. ఆయన వయసెంతో స్వామీ రామాకు కూడా సరిగ్గా తెలియదు. అయితే, మన దేశానికి తొలి అధ్యక్షుడైన డా॥ బాబూ రాజేంద్రప్రసాద్ చూసి చెప్పిన ప్రకారం అప్పటికే ఆయన వయసు 150 సంవత్సరాలపైనే వుండాలి. చిన్ననాటి రాజేంద్రప్రసాద్ తండ్రిగారితో వెళ్లి ఆయన్ను చూసేటప్పటికే ఎనభై ఏళ్ల పైన వుండేది. ఈ మాట చెప్పినప్పుడు రాజేంద్ర ప్రసాద్ వయస్సు డెబ్బైసంవత్సరాలు అది విన్న తర్వాత స్వామీ రామాకు ఆయనను చూడాలనిపించింది.

ఒకసారి రిషీకేశ్‌లో బాబా ఆగినప్పుడు రామా ఆయనను తరచుగా కలిశారు. ఆయన తన కుటీరంలో వున్నారు. మంచి ఆరోగ్యంతో వున్నారు. చూడ్డానికి డెబ్బై ఏళ్ళ వ్యక్తిలా వున్నారు. ఆయన తన శరీరాన్ని తాకనిచ్చే వారుకారు. దివ్య ప్రేమను బోధించేవారు. ఉత్తర భారతంలో ఆయన కోసం ఎంతోమంది తహతహలాడేవారు. ఆయన శిష్యబృందంకూడా పెద్దదే. ఆయన ఆశీస్సులకు పోలీసుశాఖవారుకూడా ఎక్కువగా వెళ్లేవారు. 1974లో ఒకసారి అమెరికాకు చెందిన స్వామీ రామా శిష్యులు ఆయనను చూశారు. ఆయన దీర్ఘాయువు రహస్యం తెలుసుకోవాలని రామా ఎంతగానో ప్రయత్నించారు. ఆయన యోగం నేర్చినవారు. పళ్లు, కాయగూరలు తినేవారు. యోగంలో కొన్ని సౌకర్యాలున్నాయి. ఎవరికి కావలసినవి వారు చేసుకోవచ్చు.

స్వామీ రామాతో ఆయన – 'సంతోషమే అన్నిటికన్నా గొప్ప సంపద. క్రమశిక్షణ, సమయ పాలన అవసరం. ప్రాణాయామం కూడా ముఖ్యమే' అన్నారు. ఆయన ప్రేమకు సంకేతం అంటారు స్వామీ రామా.

★ ★ ★

అధ్యాయం నాలుగు

# వినయం నేర్చుకోవాలి

'వినయం నేర్చుకోవడం అనేది ఆత్మజ్ఞాన మార్గంలో ఒక మెట్టు. వినయంగా వుంటే మనకు వచ్చేది ఎక్కువ. పోయేది అంటూ ఏమీ వుండదు. ప్రార్థన, చింతన మన ఆత్మశక్తిని బలపరచి వినయాన్ని పెంచుతాయి.'

## 4.1 అహంకారానికి తావులేదు

ఒకసారి హిమాలయాలలో తుంగనాథ్ అనే ప్రాంతంలో గురుదేవులున్నారు. ఆయన కోసం వెళ్తూన్న స్వామీ రామా దారిలో కర్ణప్రయాగ అనే చోట నివసిస్తున్న ప్రభాతస్వామిని కలిశారు. ప్రభాతస్వామి కాస్త పైన దుప్పటి కప్పుకుని కూర్చున్నారు. కొందరు గ్రామస్తులు ఆయన ముందున్నారు. అప్పటికి స్వామీ రామాకు తానూ ఒక స్వామినని, తనకో ప్రత్యేక స్థానం ఇవ్వాలని వుండేది. ప్రభాతస్వామి పలకరించి 'కూర్చో' అన్నారు. 'దుప్పటి కాస్త తీస్తే నేనూ మీ పక్కన కూర్చుంటాను' అన్నారు రామా. ప్రభాతస్వామి 'యోగ వాశిష్ఠం' నుండి రామాంజనేయ సంభాషణను వివరించారు. 'నిజానికి మనం ఒక్కటే అయినా మనుషులుగా నీవు నా సేవకుడివి, నేను నీ యజమానిని. ఈనాటి మనిషి ఏమీ పొందకుండా గురువు కావాలనుకుంటాడు' అంటూ ఆయన రామాకు ఒక పాఠం చెప్పారు.

"ఒకసారి ఒకతను తన గురువు దగ్గరికి వెళ్లాడు. అప్పుడాయన ఎత్తైన వేదికమీద కూర్చుని ఏదో చెప్తున్నారు. వెళ్లిన వ్యక్తి సమాజంలో ఉన్నత పదవిలో వున్నాడు. అంచేత తనకు ప్రత్యేకమైన మర్యాదలు జరగాలని ఆయన ఆశ.

'గురువుగారూ! నేనూ వేదికపై కూర్చోవచ్చా?' అడిగారాయన.

'నీకు గురు శిష్యుల విధులు తెలియాలి' అన్నారు గురువుగారు.

'తమరే చెప్పండి'

'శిష్యుడు గురువును అన్ని విధాలా సేవించాలి. శుభ్రం చేయడం, అన్నం పెట్టడం, పాత్రలు కడగడం, తాను స్వచ్ఛంగా వుండి గురువును సేవించడం వగైరాలు చేయాలి.'

'అయితే, గురువు గారేం చేయాలి?'

'గురువు చిన్నా చితకా పనులు చేయడు. బోధించడమే ఆయన పని.'

'శిష్యుడు చేసే పనులేవీ చేయకుండా నేను గురువును కాలేనా?'

'లేదు. అలా జరిగితే నీవూ ఏడుస్తావు. ఇతరులూ బాధపడ్తారు. ఆధ్యాత్మిక పథంలో అహంకారానికి తావులేదు అనేది నీకు మొదటి పాఠం.' "

ఈ కథ ద్వారా ప్రభాతస్వామి అహంకారం వల్ల వచ్చే నష్టాల గురించి చెప్పారు. అహం వల్ల వ్యక్తి అందరికీ దూరం అవుతాడు. గురువుతో, అంతరాత్మతో మాట్లాడలేడు. గురువుగారి ఆదేశాలు పాటించలేడు. అందువల్ల అహంకారం నాశనమైతే కానీ లాభం లేదు. లేదంటే ఎంత విజ్ఞానమైనా దండగే.

## 4.2 స్వామీ రామా గర్వభంగం

సాధారణంగా స్వాములు వర్షాకాలంలో నాలుగునెలలు ఎక్కడికీ వెళ్లక ఒకేచోట వుంటారు. దీనినే చాతుర్మాస్యం అంటారు. ప్రజలు వారి దగ్గరకు వచ్చి పురాణాలు, శాస్త్రాలు మొదలైనవి వింటారు. స్వామీ రామా కూడా శిక్షణలోనే వున్న ఆకాలంలోనే అలా ఉపదేశించేవారు. అక్కడ శిష్యులు ఆయనకు ఉన్నాతాసనం అమర్చేవారు. ఇందువల్ల ఆయనకు అహం పెరిగింది. ఒకసారి ఒకాయన వచ్చాడు. ఆయనను రామా ఇబ్బంది పెట్టేవారు. రామా ప్రసంగించేటప్పుడు ఆయన మౌనంగా వుండేవాడు. నిజానికి ఆయన మహాజ్ఞాని. అయితే ఆయనను రామా అవిధంగా గుర్తించలేదు. రెండు నెలలపాటు ఆయన రామా దుడుకుతనాన్ని భరించాడు.

ఒకరోజు ఉదయం గంగాతీరంలో పళ్ళు తోముకుంటూ 'వెళ్లి నీళ్లు తీసుకురాపో' అన్నారు రామా ఆయనతో. 'నీవు పళ్ళు తోముకుంటూనే వుండు' అని ఆయన వెళ్లిపోయాడు. తర్వాత ఏం జరిగిందో రామాకు తెలీదు. రెండు రోజుల తర్వాత ఆయన అక్కడ పడివుండగా కొందరు చూశారు. ఆయన మొహం వాచిపోయింది. బ్రష్ను పారేసినా ఆయన వేలు నోటిలోనే పళ్ళు తోముతూనే వుంది. రామాకు తెలియకుండానే అలా చేస్తున్నారు. అప్పుడు రామా గురుదేవులు వచ్చి 'లే' అన్నారు. రామా కళ్ళు తెరిచినా ముఖం పైకి ఎత్తలేక పోయారు. చిగుళ్ళు వాచిపోయాయి. దవడలు కదలడంలేదు.

'ఆ స్వామి గొప్ప ఋషి. దేవుడు పంపగా వచ్చినవాడు. నీకు వినయం లేకుండా దేవదూతలతో ఎలా ప్రవర్తించాలో తెలియకుండా అమర్యాదగా ప్రవర్తించావు. ఇప్పటికైనా నీవు గుణపాఠం నేర్చుకున్నావనుకుంటాను. ఇటువంటి తప్పు మరోసారి చేయకు' అని గురుదేవులు మందలించారు. తర్వాత 'లే, ఆకాశం వైపుచూసి, నడక సాగించు' అన్నారు. 'పైకి చూస్తూ వెళ్తే నేను కిందపడ్డం ఖాయం' అన్నారు రామా. 'తలవంచు. పతనంకాకుండా చూసుకోవచ్చు. కఠినమైన ఈ జీవయాత్రలో వినయం తప్పనిసరి. అహంకారం, గర్వం ఈ బాటలో ఆటంకాలు, వినయం లేకుంటే నీకు జ్ఞానం అబ్బదు. నీ ఎదుగుదల సవ్యంగా వుండదు' – చెప్పారు గురుదేవులు. అందువల్ల, ఆధ్యాత్మిక పథంలో వినయం, అత్యవసరం. వినయహీనతవల్ల విషయాన్ని గ్రహించడం నశిస్తుంది. విచక్షణ పదునెక్కకుంటే బుద్ధి స్పష్టంగా వుండదు. గర్వభంగం జరిగి సత్యం తెలిశాక స్వామి రామా గ్రహించిన వాస్తవమిది.

'మబ్బు ముసిరిన బుద్ధి ఆత్మజ్ఞాన పథానికి పనికిరాదు. త్యాగం వుండాలి. కర్మ వుండాలి. రెండింటి సమన్వయంలోనే జీవన కిరీటం వుంది. త్యజించవలసింది కర్మను కాదు – కర్మఫలాన్ని. చైతన్య సాగరంలో అహాన్ని అణిచేయాలి. గుండెలోపలి గదులలో ఎక్కడో దానిని కొట్టుమిట్టాడనివ్వకూడదు. అహానికి రూపాలు అసంఖ్యాకమైనవి. దానికి దారులు ఎన్నో. ప్రేమతో చేసేపని శాశ్వతాన్ని, నిరంతరమైన ఆనందాన్ని చూపుతుంది' అంటారు స్వామీ రామా.

# 4.3 'లోపలి గుణాలు పెంచుకో'

ఒకసారి స్వామి రామా శ్రీనగర్‌లో వున్నారు. ఒక తత్త్వశాస్త్ర ఆచార్యులను (ప్రొఫెసర్‌గారిని) ఆయన కలిశారు. 'నీకేమైనా సందేహాలుంటే చెప్పు, సంతోషంగా తీరుస్తాను' అన్నారు ప్రొఫెసర్‌గారు.

'ఆర్యా! ఉపనిషత్తులలో పూర్తి వైరుధ్యం వున్నట్లుంది. ఒకచోట బ్రహ్మ మొక్కటే. రెండవది లేదు అంటారు. ఇంకోచోట అంతా బ్రహ్మమే అంటారు. మూడవచోట ఈ లోకమంతా మిథ్య అనీ, బ్రహ్మమే సత్యమనీ అంటారు. నాలుగోచోట ఇన్ని వైవిధ్యాలవెనుక వున్నది ఒకే పరిపూర్ణ సత్యం అంటారు. ఏమిటిదంతా?' అడిగారు రామా. అప్పుడాయన 'ఒక స్వామి ప్రశ్నలకు ఏవిధంగా జవాబు చెప్పాలో నాకు తెలియడంలేదు. మీరేమో శంకరాచార్య పరంపరలోనివారు. నాకన్నా వీటి జవాబులు మీకే తెలిసివుంటుంది' అన్నారు.

ఈ విధంగా ఎంత మంచి పండితులను కలిసినా రామాకు తృప్తి కలుగలేదు. ఉపనిషత్తులను పలు రకాలుగా వ్యాఖ్యానించినవారెవరూ ఆ వైరుధ్యాలను వివరించలేదు. తర్వాత హిమాలయాల లోపల 200 కి.మీ. దూరంలో వున్న ఉత్తర కాశీకి వెళ్లారు స్వామీ రామా. అక్కడవున్న విష్ణు మహారాజ్ అనే దిగంబర స్వామిని కలిశారు. 'నాకు ఉపనిషత్తుల గురించి కొంచెం చెప్పండి' అని కోరారు. అప్పుడు ఆ స్వామి 'ముందు తలవంచు, నమస్కరించు, పెరిగిపోయిన అహంతో ఉపనిషత్తుల గురించి అడుగుతావా? ఈ గూఢమైన సత్యాలను ఎలా కనిపెట్టగలమనుకుంటున్నావు?' అన్నారు. అయితే, స్వామీ రామాకు ఎవరిముందూ తలవంచడం ఇష్టంలేదు. అంచేత అక్కడినుంచి వెళ్లపోయారు. తర్వాత ఉపనిషత్తుల గురించి ఎవరిని అడిగినా 'విష్ణు మహారాజ్ దగ్గరికి వెళ్ళు. ఇంకెవరూ చెప్పలేరు' అనే సమాధానమే వచ్చింది. ఇక తప్పనిసరై మళ్ళీ ఆయన్నే చూద్దామనుకున్నారు. గంగాతీరంలో విష్ణు మహారాజ్ గుహ దగ్గరికి రోజూ వెళ్ళడం, ఆయన జవాబు చెప్తారేమో చూద్దాం అనుకోవడం జరిగింది. అయితే మళ్ళీ గుహను సమీపించగానే ఏదో భయంవల్ల మనసు మార్చుకుని తిరిగి వెళ్లేవారు.

ఒకరోజు విష్ణు మహారాజ్ స్వామి రామాను దగ్గరగా చూసి పిలిచారు. 'రా. కూర్చో. ఆకలిగా వుందా? నాతో తింటావా?' అన్నారు. అప్పుడాయన హాయిగా, చాలా ప్రశాంతంగా వున్నారు. రామాకు తినేందుకు, తాగేందుకు ఇచ్చి, 'ఇక వెళ్ళు. ఈ రోజు నీతో గడిపేందుకు ఇంతకన్నా సమయం లేదు నాకు' అన్నారు.

'నేను కొన్ని ప్రశ్నలతో వచ్చాను. ఆహారం, పానీయం ఇంకెక్కడైనా దొరుకుతాయి. నాకు అధ్యాత్మికమైన ఆహారం కావాలి' – చెప్పారు రామా.

'నీవు ఇంకా సిద్ధంగా లేవు. నన్ను పరీక్షించాలని నీ మనసులో వుంది. నీ ప్రశ్నలకు నేను జవాబు చెప్పగలనా, లేదా అని తెలుసుకోవాలని నీకుంది. నేర్చుకోవాలనిలేదు. అవిధంగా కాకుండా సిద్ధంగా వున్నప్పుడు నా దగ్గరకురా, నీకు చెప్తాను' – కచ్చితంగా చెప్పారాయన.

మర్నాడు రామా ఎంతో వినయంగా వెళ్ళి 'ఆచార్యా! రాత్రంతా నన్ను నేను సిద్ధం చేసుకున్నాను. ఇప్పుడు తయారుగా వున్నాను' అన్నారు. అప్పుడాయన

చెప్పారు. రామా సందేహాలన్నీ తీరిపోయాయి. ఆ ప్రశ్నలకు ఒక క్రమపద్ధతిలో జవాబు చెబుతూ, 'ఉపనిషత్తులలో వైరుధ్యాలు లేవు. ఇవి మహర్షులు తీవ్రమైన చింతనలో, ధ్యానంలో పొందిన ప్రత్యక్ష జ్ఞాన ఫలాలు' అన్నారు. ఇంకా ఆయన ఇలా వివరించారు:

'అభ్యాసం మొదలు పెట్టేటప్పుడు శిష్యుడు – కనిపించే ఈ లోకం మార్పేందుకు వీలువున్నదనీ, సత్యం ఎప్పటికీ మారదనీ తెలుసుకుంటాడు. తర్వాత మార్పులతో నిండివున్న నామరూపాలతో వున్న ప్రపంచం మిథ్య అని తెలుసుకుంటాడు.

'రెండవ దశలో సత్యం తెలుస్తుంది. ఒకే సత్యం వుందనీ, అది సర్వ వ్యాప్తమనీ, నిజానికి మిథ్య అనేది లేదనీ గ్రహిస్తాడు. ఆ దశలో అతను వాస్తవం అనేది నిర్దిష్టమైన అనంతమైన రెండు లోకాలలోనూ ఒకటి అని తెలుసుకుంటాడు.

'అయితే ఇంకా ఉన్నత దశలో సాధకుడు పరిపూర్ణ సత్యం ఒక్కటే అనీ, రెండవది లేదనీ, మిథ్యగా కనిపించేది దాని లీలయేననీ తెలుసుకుంటాడు.

'ఇదంతా పైకి వైరుధ్యంగా ఎందుకు కనిపిస్తోంది? ఉపనిషత్తులను సమర్థుడైన గురువు దగ్గర నేర్చుకోకపోవడంవల్లనే. సమర్థులైన గురువులు శిష్యులకు వివిధ స్థాయిలలో వచ్చే అనుభవాల గురించి తెలియజేస్తారు. ఇవి చైతన్యానికి వివిధ స్థాయిలు. వీటిలో వైరుధ్యం ఏమీలేదు. ఉపనిషత్ బోధనలను సామాన్యుడుకానీ, పండితుడుకానీ తెలుసుకోలేరు. అంతర్వాణి ద్వారా వచ్చే జ్ఞానం వల్లనే వాటిని ఎవరైనా అర్థం చేసుకునే వీలుంటుంది.'

నిజానికి స్వామీ రామా తాను నేర్చుకున్నదాన్ని పటిష్టం చేసుకోవాలనే ఈ ప్రయత్నం చేశారు. ప్రశ్నలు వేసేవారికి వినయం లేకుంటే యోగులు, ఋషులు జవాబు చెప్పరు. వినయమే వాటికి జవాబులు చెబుతుంది. మహనీయుడు విష్ణు మహరాజ్ వివాదాలు వద్దనీ, అంతర్వాణిని ఉపయోగించి ధ్యానంలో అటువంటి సున్నితమైన ప్రశ్నలకు సమాధానం పొందమని తనకు బోధించినట్లు స్వామీ రామా తెలుసుకున్నారు.

## 4.4 నేర్చుకున్న జ్ఞానాన్ని నిత్యజీవితంలో వాడాలి

యౌవనంలో ఉన్నప్పుడు రామాకు తానిక నేర్చుకోవలసింది ఏమీ లేదనీ, ఇంకేమీ చదవడం, నేర్చుకోవడం అనవసరమనీ, తాను పరిపూర్ణుడైనాననీ అనిపించింది. తనంతటి పండితుడు ఈ దేశంలోనే లేడనుకున్నా రాయన. అప్పటికే ఆయన ఎంతోమందికి పాఠాలు చెబుతూ ఉండడమే ఇందుకు కారణం. ఈ మాటలను ఒకసారి గురుదేవులకు చెబితే – 'నీ కెవరైనా మందు పెట్టారా? ఏమిటీ మాటలు?' అని మందలించారు. 'లేదండీ! నిజంగానే నాకు అలా అనిపిస్తోంది' అన్నారు రామా. 'నీవింకా పసివాడివి. కాలేజీకి వెళ్లడమే తెలుసు నీకు. నీవు నాలుగు విషయాలపైనా అధికారం సంపాదించలేదు. ఆ పనిచేయి. అప్పుడే నీవెంతో కొంత నేర్చుకున్నట్లు. దేవుని కలవాలనీ, తెలుసుకోవాలనీ నేర్చుకో. అయితే, దీనిని స్వార్థానికి వాడుకోకు. కోపం, దురాశ, బంధనం వదిలేయి. క్రమం తప్పక ధ్యానం చేయి. అప్పుడే నీవు పరిపూర్ణుడివి అవుతావు' అని ఉపదేశించారు గురుదేవులు. తర్వాత ఆయన కొందరు ఋషులను కలవమని రామాకు చెప్పారు.

'వాళ్లతో వున్నప్పుడు వినయంగా వుండు. మొండిగా వున్నా, పోట్లాడినా వారి విజ్ఞానం నీకు రాదు. వాళ్లు కళ్ళుమూసి ధ్యానంలో కూర్చుంటారు. అంతే!' రామా సంగతి తెలుసుకనుక అవిధంగా గురుదేవులు రామాను హెచ్చరించారు.

గురుదేవులు కలవమని సూచించిన వారంతా ఆయన మిత్రులే. స్వామీ రామాను చిన్నప్పటినుండీ చూసినవారే. అప్పుడు రామా తుంటరి. వాళ్ళను పీడించేవారు. తన ఉనికిని వారికి తెలియజేసేందుకు ఏవో వస్తువులు వారిపైకి విసిరేవారు. అందువల్ల గురుదేవులను వారెవరైనా కలిసినప్పుడు 'వాడింకా మీతోనే వున్నాడా?' అని అడిగేవారు.

ముందుగా రామా ఒకాయన దగ్గరకు వెళ్లారు. ఆయన మౌని. ప్రాపంచిక విషయాలను వదిలేశారు. చుట్టుపక్కల ఏం జరిగినా ఆయన చూడరు. పట్టించుకోరు. దగ్గరలో వున్న గ్రామస్థులు కూడా అదే చెప్పారు. 'ఆయన ఎవరితోనూ పలకరు. ఎవరినీ చూడరు. ఏమీ తినరు. మూడు నెలలుగా లేవకుండా అలాగే వున్నారు. అటువంటి వ్యక్తిని మేమింతవరకు చూడలేదు' అన్నారు.

దీనినే అజగరవృత్తి అంటారు. కొండచిలువ చాలాకాలం మత్తుగా పడివున్నట్లే కొందరు యోగులు అలాగే తీవ్రమైన ధ్యానంలో వుంటారు. రామా వెళ్లిన సమయంలో ఆయన ఒక మర్రిచెట్టు క్రింద వున్న గుట్టమీద నవ్వుతూ, కళ్లుమూసుకుని, ఈ ప్రపంచనేత తానే అనేట్లు పడుకుని వున్నారు. ఒంటిమీద ఏమీ లేదు. ఏ ఋతువులోనైనా ఆయన పరిస్థితి అంతే. ఏనుగు చర్మంలా వుంది. ఏమీ లేకున్నా ఆయన ఎంతో తృప్తిగా వున్నట్లున్నారు.

అయనను చూడగానే 'ఈయనకు కొంచెం సభ్యత వుంటే బావుండేది' అనుకున్నారు స్వామీ రామా. 'అయినా, గురుదేవులు ఊరికే సమయం వృధా చేయరు. నేను సేవచేస్తున్నది అయన శరీరమే కదా' అని ఆలోచిస్తూ ఆయన పాదం తాకారు. ఆయనకు బాహ్యస్మర్శలేదు. మరో లోకంలో వున్నట్లున్నారు. 'స్వామీ! క్షేమమా?' అని మూడు, నాలుగు సార్లు అడిగినా లాభంలేదు. జవాబు రాలేదు. అప్పుడు రామా ఆయన పాదాలకు మర్దనా చేశారు. మామూలుగా గురుదేవులు అలసివున్నప్పుడు శిష్యులు అవిధంగా చేయడం అలవాటే. అలాగే అయన కూడా తన సేవకు సంతోషిస్తారనుకున్నారు రామా. అయినా, ఆ స్వామి రామాను గట్టిగా ఒక్క తన్ను తన్నారు. దెబ్బకు దొర్లుకుంటూ గుట్ట కిందికి వెళ్లారు రామా. చెట్లు, రాళ్ళు గీచుకుని బాధగా వుండింది. 'ఎందుకు ఇలా చేశారీయన! నేను ఎంతో గౌరవంతో వచ్చాను. పాదాలు మర్దన చేశాను, ఈయన నన్ను తంతారా? ఈయన ఋషికాదు. ఈయనకో గుణపాఠం చెప్పాలి. బహుశా అందుకే నన్ను గురువులు పంపారేమో?' అనుకున్నారు రామా. ప్రతీకారం తీర్చుకుందామని మళ్ళీ ఆయన దగ్గరకు వెళ్లగానే ఆయన కూర్చుని, నవ్వుతూ, 'ఎలా వున్నావు నాయనా!' అని అడిగారు.

'ఎలా వున్నానా? అంత గట్టిగా తన్ని కిందికి తోసింది కాక, ఇంకా ఎలా వున్నావని అడుగుతున్నారా?' అన్నారు రామా కోపంగా.

అప్పుడాయన 'నీ గురువులు నిన్ను నాలుగు విషయాలపై అధిపత్యం సంపాదించమన్నారు. నీవేమో ఒక దానిని నాశనం చేశావు. నేను నీ కోపాన్ని పరీక్షిద్దామని నిన్ను తన్నాను. నీవు అది గ్రహించలేదు. ఇంకా నీవు ఎదగలేదు. నిస్వార్థపరులైన నీ గురువుల ఆధ్యాత్మిక బోధనలను నీవు పాటించడం లేదు. ఇక నాదగ్గర ఏం

నేర్చుకుంటావు? నీవింకా నా బోధనలు వినేందుకు తయారుగా లేవు. వెళ్ళు' అన్నారు. ఆ తర్వాత 'అసలు ఋషుల పాదాలు ఎందుకు తాకుతామో తెలుసా?' అంటూ ఒక అందమైన పర్షియన్ సూక్తిని చెప్పారాయన. దాని భావం ఇలా వుంది: 'ఋషి అనేవాడు తనకున్నదానిలో అత్యుత్తమమైన దానిని భగవంతుని పాద పద్మాల చెంత సమర్పిస్తాడు. ఎవరైనా నీ ముఖం చూసే నిన్ను గుర్తిస్తారు కదా! అయితే ఋషి ముఖం ఇక్కడుండదు. అది దేవుడితో వుంటుంది. ఇక్కడ వుండేవి అతని పాదాలే. అందుకే ఆయన పాదాలకు నమస్కరిస్తాం.'

'అందుకే ఎవరి పాదాన్నైనా ముట్టుకునేటప్పుడు ఆ వినయం నీలో వుండాలి. ఇక నీవిక్కడ వుండేందుకు వీల్లేదు. నీవు వెళ్ళాల్సిందే' అన్నారాయన.

'కొన్నాళ్ళక్రితం నా అంత పరిపూర్ణుడు లేడనుకున్నాను. కానీ, అది నిజంకాదని ఈనాడు తెలిసింది. స్వామీ! నిజంగా అహాన్ని జయించాకనే మీ దగ్గరకు మళ్ళీ వస్తాను' అని ఏడుస్తూ చెప్పి తిరిగివచ్చారు రామా.

ఎక్కడనుంచి వచ్చినా జీవితంలో మనం తినే తన్నులు, దెబ్బలు మనకు గుణపాఠం నేర్పుతాయి. వాటినుంచి మనం పాఠం నేర్చుకుంటే అవి మారువేషంలో వున్న వరాలు అవుతాయి. 'తెలివైనవాడికి చెడు అనేది వుండదు. అతనికి జీవితంలో ఏ కష్టం వచ్చినా, అది అతని ఎదుగుదలకు పనికొచ్చే సోపానమే – అతను దాన్ని వాడుకోవడం తెలుసుకుంటే' అన్నాడు బుద్ధభగవానుడు.

* * *

ఆ తర్వాత స్వామీ రామా మరోస్వామి దగ్గరకు వెళ్లారు. ఆయన ఏం చేసినా కోపం తెచ్చుకోకూడదనుకున్నారు. ఆయనకు అందమైన పొలం వుంది. 'దీన్ని నీకిచ్చేస్తాను, నీకు కావాలా?' అన్నారాయన. 'అవశ్యం' అన్నారు రామా.

'మీ గురుదేవులు దేనిపైనా వ్యామోహం వద్దన్నారు. పొలం కావాలా అనగానే దాన్ని సొంతం చేసుకుందామనుకుంటున్నావు నీవు' అన్నారాయన నవ్వుతూ.

స్వామీ రామాకు చిన్నతనం అనిపించింది. తన మనస్సు కోపంవైపు, వ్యామోహంవైపు మళ్ళుతోంది కానీ, ఉన్నతమైన విషయాల వైపు వెళ్ళడంలేదని బాధ కలిగింది.

* * *

ఆపైన మరో స్వామి దగ్గరకు వెళ్ళవలసి వచ్చింది. స్వామీ రామా వస్తారని ఆయనకు ముందే తెలుసు. ఆ ప్రాంతంలో స్వాములు చేతులు కడుక్కునేందుకు నీటి బుగ్గ ఒకటి వుంది. అక్కడ ఆ స్వామి కొన్ని బంగారు నాణేలను వుంచారు. వాటిని చూసిన స్వామీ రామాకు 'తీసుకుందామా!' అనిపించి, వాటిని వెంటనే తన కాషాయవస్త్రం లోపల దాచేశారు. తర్వాత 'కానీ, ఇవి నావి కావుకదా? నాకెందుకివి? ఇది మంచిదికాదు' అనిపించి అలాగే యథాస్థానంలో వుంచేశారు.

స్వామి దగ్గరకు వెళ్లగానే ఆయన కోప్పడ్డారు. రామా నమస్కరించారు. 'ఆ నాణేలు ఎందుకు కోరుకున్నావు? ఇంకా బంగారంమీద కోరిక పోలేదా? వెళ్లు నీకు తగిన స్థలం కాదిది' అన్నారా స్వామి. 'నేను వాటిని అక్కడే వదిలేశాను కదా?' దాదాపు ఏడ్చేనంత పనైంది రామాకు. 'వదిలేసింది తర్వాత కదా! అసలు ముందు దానిపట్ల ఆకర్షితుడవై ఎందుకు కోరుకున్నావు? అదీ సమస్య' అన్నారా స్వామి.

* * *

ఋషులు ప్రసాదించిన ఈ అనుభవాలనుండి ప్రత్యక్ష జ్ఞానానికి, పుస్తక జ్ఞానానికి మధ్యవున్న తేడా తెలిసింది స్వామీ రామాకు. తనలోని బలహీనత కూడా తెలిసింది. ఆఖరుకు గురుదేవులను చూశారు.

'ఏం నేర్చుకున్నావు?' అడిగారు గురుదేవులు.

'నాకు పాండిత్యంవున్నా, దాని కనుగుణంగా ప్రవర్తించడం లేదని తెలిసింది' – చెప్పారు రామా.

'మేధావులందరి సమస్య ఇది. వారి జ్ఞానంపట్ల వారికెంతో గర్వం. ఇప్పుడు నీకు అభ్యాసం గురించి చెప్తాను. తర్వాత నీకే తెలుస్తుంది' అన్నారు గురుదేవులు.

ఈ అనుభవం గురించి చెప్తూ స్వామీ రామా –

'మనిషికి చాలినంత విజ్ఞానం లభిస్తుంది. అయితే, దానిని నిత్యజీవితంలోకి తీసుకురావాలి. అది జరగకపోతే – కేవలం తెలుసుకోవడమే మిగులుతుంది. మనందరికీ ఏం చేయాలో, ఎందుకు చేయాలో తెలుసు. ఎలా వుండాలో తెలియదు. నిజమైన జ్ఞానం తెలుసుకోవడంలో లేదు – అనుభవించడంలో వుంది' అంటారు.

## 4.5 అభ్యాసం కూసువిద్య

ఒకసారి స్వామీ రామా చావు పుట్టుకల గురించి చెబుతున్నారు. అప్పుడే ఒక స్వామి వచ్చి శ్రోతల పక్కన కూర్చున్నాడు. ఆయనెవరో కొత్తవాడని, తెలియనివాడని ఆయన్ను రామా అంతగా పట్టించుకోలేదు. అందరూ శ్రద్ధగా రామా చెప్పిందంతా రాసుకుంటున్నారు. ఆయనేమో నవ్వుతూ వున్నాడు. ఇక ఉండబట్టలేక ఆయనను 'వింటున్నావా?' అని అడిగారు రామా.

'నీవు కేవలం చెబుతున్నావు. నేను చేసి చూపగలను. ఒక చీమను పట్రా' అన్నాడాయన. పెద్ద చీమను తెచ్చారు. దాన్ని మూడు ముక్కలు చేసి వేరు చేశాడాయన. కాసేపు అలాగే చలనం లేకుండా కూర్చున్నాడు. కొంతసేపు గడిచాక చీమ బతికింది. అది కనికట్టు కాదని రామాకు తెలుసు. అందుకే ఆయనకు చిన్నతనం అనిపించింది. 'ఈ విద్యను మీరెక్కడ నేర్చుకున్నారు?' అని అడిగారు.

'నీ గురువే నాకు నేర్పాడు' అన్నాడాయన.

కోపంగా గురుదేవుల దగ్గరికి వెళ్లిన రామాతో గురుదేవులు – 'ఏమిటి మళ్ళీ కోపమా? ఇంకా కోపోద్రేకాలకు బానిసగా వున్నావా? తగ్గించుకో' అన్నారు.

'వేరే వాళ్ళకు చెప్పేవి నాకెందుకు నేర్పించరు?' కోపంగా అడిగారు రామా.

'నీకెన్నో చెప్పాను. ఆచరించావా? ఆచరించకపోతే అది నా తప్పా? ఇవన్నీ అభ్యాసం చేస్తేనే వస్తాయి. ఆచరించకుండా ఊరికే తెలుసుకుంటే ఏం లాభం? పియానో గురించి చదివి ఊరుకుంటే స్వరాలు ఎలా సృష్టించగలవు? అభ్యాసం లేని జ్ఞానం వృథా. ఊరికే తెలుసుకోవడం కూడా వృథా. అభ్యసిస్తే ప్రత్యక్ష అనుభవం దొరుకుతుంది' అన్నారు గురుదేవులు.

## 4.6 పూలలోయస్వామి - గుడారీ బాబా

హిమాలయాల పరిసర ప్రాంతాలలోని జీవరాసుల గురించి, మొక్కల గురించి, పుష్పాల గురించి సమగ్రమైన సమాచారం అందుబాటులో లేకున్నా, ఉన్నంతలో స్వామీ

రామా వాటి గురించి తెలుసుకున్నారు. ఒక బ్రిటిష్ రచయిత హిమాలయాలలోని పూలలోయ గురించి రాశారు. దానిని చదివిన తర్వాత ఆ లోయను చూడాలనే కోరిక రామాను దహించసాగింది. హిమాలయాలలో ఎన్నో రకాల పుష్పాలున్నాయి.

పూలలోయ పరిసరాల గురించి తెలిసిన స్వామి ఒకాయన ఉన్నారు. ఆయన రామాకు బాగా తెలుసు. ఎనభై సంవత్సరాల వయసులో అసాధారణంగా, ఆరోగ్యంగా, బలిష్ఠంగా వుండేవారాయన. ఆయన ఎప్పుడూ 40-50 కిలోల బరువున్న బొంతను మోసుకుంటూ వెళ్లేవాడు. దారిలో కనిపించిన గుడ్డపీలికలన్నిటినీ దానికి అతుకు వేసేవాడు. అందులో వెయ్యి గుడ్డపీలికలుంటాయేమో? దానిని ఆయన గుడారి అనేవాడు. గుడారి అంటే అతుకుల బొంత అని అర్థం. ఆయన గుడారిని మోసుకుని వెళ్తుంటాడు. కాబట్టి ఆయనను అంతా గుడారీ బాబా అనేవారు. స్వామీ రామా ఆయనను పూలలోయ చూపించమని కోరారు. 'నిజంగా చూడాలని నీకుంటే, నాతోపాటు ఈ బొంతను నీవు మోసుకు రావాలి' అన్నాడాయన.

ఆ బరువు మోయలేనిదిగా వుంది. రామా అవస్థను చూసి ఆయన, 'వయసులో వున్నావు. ఆరోగ్యంగా కనిపిస్తావు. అంతమాత్రం మోయలేవా?' అని బొంతను తేలిగ్గా పైకెత్తి, 'చూడు, ఎంత తేలికగా వుందో' అంటూ మళ్ళీ రామా భుజంపై వేసేవాడు. గుడారీ బాబాకు స్వామీ రామా గురుదేవులు పరిచితులే. అందుకే రామా తనతో రావడానికి ఒప్పుకున్నాడు.

'పూల లోయలో ఎవరికైనా జ్ఞాపకశక్తి నశిస్తుంది – ముఖ్యంకా పూలు వికసించే కాలంలో. నీవంటి మొండి పిల్లలను అక్కడికి ఒకసారి తీసుకువెళ్తే అంతా సర్దుకుంటుంది. మేధావులమని వాదించేవారిని తీసుకువెళ్తే వారి సత్తా ఎంతో అక్కడ తెలుస్తుంది' అన్నాడాయన. 'కానీ, నేను మీతో వస్తున్నాను కదా?' అన్నారు రామా.

'నిజమే కానీ, నీవు ఎప్పుడూ వాదిస్తూ వుంటావు. శ్రద్ధగా వినవు. నీ తెలివితేటల గురించి నీకు గర్వం. నాకు చదవడం, రాయడం తెలియవు. నాకన్నా నీవు బాగా చదువుకున్నావు. నీకు చదువుంది. నాకు మనసుపై అదుపుంది.'

'నాకూ ఉంది.'

'చూద్దాం'

'స్వామీ! ముందు ఈ బొంతను తీసుకోండి. దీన్ని మోయడం కష్టంగా వుంది.'

'అయ్యో! ఈ కాలం పిల్లలు. ఊఁ – ఇటివ్వు దానిని'

'ఈయన నిజంగా పిచ్చివాడే' అనుకున్నారు రామా. అదేవిధంగా అనుకున్నాడు మర్నాడు కలిసిన జపాన్ సన్యాసి. 'రామా! ఈ మనిషి అంత బరువెందుకు మోస్తున్నాడో చెప్పగలవా?' అని అడిగాడాయన. తమ అనుభవాలు పరస్పరం చెప్పుకుంటే మంచిదనిపించింది రామాకు. ఆ సన్యాసికి కూడా పూల లోయలో మతిమరపు ప్రమాదం గురించి ఎవరో చెప్పారు. అక్కడికి వెళ్లినవారు అంతా మరచిపోయి, నవ్వుతూ వుంటారట. అంచేత ఒంటరిగా వెళ్లేందుకు భయంవేసి గుడారీ బాబాతో వెళ్తే మంచిదని వచ్చాడాయన.

మర్నాడు ఉదయం ఆ సన్యాసికి విపరీతమైన జ్వరం, వణికిపోతున్నాడు. 103-104 డిగ్రీల జ్వరం. వాడి విపరీతంగా కొట్టుకుంటోంది. 'నేను పిచ్చివాణ్నని ఈ అబ్బాయితో వీవన్నావు. నా బొంతకున్న జీవశక్తి చూస్తావా? నాకు నమస్కరించు. వినయం

చూపు' అంటూ బాబా అతనికి గొంగళి కప్పాడు.

'అయ్యబాబోయ్! దీని బరువుకు నేను అణిగిపోతాను. నేనేమో చిన్నవాణ్ణి' అన్నాడు సన్యాసి. 'ఊరుకోవోయ్!' అన్నాడు బాబా. కొన్ని నిముషాల తర్వాత సన్యాసి పైనుండి బొంతను తీసేశాడు. ఆ బొంత వణుకుతున్నట్లుంది. 'ఏమైంది నీ జ్వరం?' నవ్వుతూ అడిగాడు గూడారీ బాబా. 'పోయింది' అన్నాడు సన్యాసి. 'ఈ బొంత దయగలది. జాలిపడి నీ జ్వరాన్ని తీసుకుంది' అంటూ రామావైపు తిరిగి, 'రామా! అతనికి ఎప్పటికీ జ్వరం రాకుండా బావుండాలని నీవూ కోరుతున్నావా?' అని అడిగాడు. 'అవునండీ!' అన్నారు రామా.

'కానీ, అతను నన్ను పిచ్చివాడంటున్నాడే! అతనీ సాయానికి అనర్హుడేమో అనిపిస్తుంది నాకు'– సందేహంగా అన్నాడు బాబా.

'ఋషులు దయామయులు. ఇతరులనెప్పుడూ క్షమిస్తారు' – లౌక్యంగా చెప్పారు రామా.

"సరే. నేను సాయం చేస్తాను" అన్నాడు బాబా.

తర్వాత 15 రోజుల ప్రయాణంలో అతనికి జ్వరం రాలేదు.

బదరీనాథ్‌కు బయట పదిహేను కిలోమీటర్ల దూరంలో పూల లోయ వైపు వెళ్లేందుకు అడ్డదారి ఒకటి వుంది. అక్కడ ఒక చిన్న సిక్కు గురు ద్వారం వుంది. అక్కడ వారు భోంచేశారు. ఆ గురుద్వారం వారికి బాబా బాగా పరిచయం. అక్కడే విశ్రాంతి తీసుకుని మర్నాడు హేమకుండలవైపు పూల లోయకు బయలుదేరారు.

పూల లోయలో పూలు పూర్తిగా వికసించి వున్నాయి. ముందు ఇంద్రియాలన్నిటికీ సుఖంగా వుంది. క్రమంగా రామాకు జ్ఞాపకశక్తి జారిపోతున్నట్లనిపించింది. అయిదారు గంటలు గడిచాక 'ఓయ్! మీ పేర్లు చెప్తారా?' చిలిపిగా అడిగాడు గుడారీ బాబా. రామాకు, జపాన్ సన్యాసికి ఏం జరుగుతుందో అర్థం కావడంలేదు. అయోమయంగా వుంది. అంతా మరిచిపోయారు. ఇద్దరూ పిచ్చిపిచ్చిగా ప్రవర్తిస్తున్నారు. ఏవేవో అర్థం పర్థం లేకుండా మాట్లాడుతున్నారు. ఈ విధంగా ఒక వారం ఇలా ఆనందంగా గడిపారు. 'మీ చదువు, శరీర బలం దండగ' అని బాబా ఎగతాళి చేశాడు.

పూల లోయ నుండి బయటపడ్డాక బాబా అన్నాడు –

'పూల పరిమళమే మీ ఆనందానికి కారణం. మీరు ధ్యానం చేయలేదు. గంజాయి మొదలైన మత్తుపదార్థాలు చేసే పని ఇదే. అయినా, వాటిని సేవించిన వారు ధ్యానంలో వున్నామనుకుంటారు. నన్ను చూడండి. నాకేమీ కాలేదు. అహ్హహ్హా! మీరు కాలేజీ చదువులు చదివారు. ఇతరుల అభిప్రాయాలపైనే బతికారు. ఈనాడు మీకు ప్రత్యక్ష జ్ఞానం పొంది, అనుకరణతో దాన్ని పోల్చుకునే మంచి అవకాశం వచ్చింది. సమాచారం పోగుచేసిన విజ్ఞానం వల్ల అంత ఉపయోగం లేదు. ప్రత్యక్ష జ్ఞానానికే విలువ అని తెలుసుకున్నా బుద్ధిని అదుపు చేయలేదు. ఈనాటి పిల్లలకు చెప్పే చదువులు పైపై చదువులు. క్రమశిక్షణ లేకుండా మనోనిగ్రహం సాధ్యంకాదు. మనోనిగ్రహం లేకుంటే ప్రత్యక్ష అనుభవం అసాధ్యం.'

ఆ తర్వాత జపాన్ సన్యాసి బుద్ధగయకు వెళ్లాడు. స్వామీ రామా ఆ బాబాతోనే మరో పదిహేను రోజులు గడిపారు. అక్కడ ఆయన స్వేచ్ఛా జీవి. 'ప్రత్యక్షజ్ఞానం పొందాలంటే అటువంటి నిపుణులైన సాధువుల సత్సాంగత్యం అవసరం' అంటారు స్వామీ రామా.

అధ్యాయం అయిదు

# భయాన్ని జయించడం

"భయమే మనకు గొప్ప శత్రువు. అది మనలోని దెయ్యం. స్వేచ్ఛకు వేసే నిచ్చెనలో మొట్టమొదటి మెట్టు భయం లేకుండా వుండడమే!"

## 5.1 దెయ్యం మన మనస్సులోనే వుంది

ఒక సాయంత్రం స్వామీ రామా, ఆయన సహపాఠి యాభై కిలోమీటర్ల నడక తర్వాత విశ్రాంతి కోసం కేదార్‌నాథ్‌నుంచి రెండుమైళ్ళ తర్వాత ఒకచోట ఆగారు. రామాకు అలసట ఎక్కువై నిద్ర ముంచుకు వచ్చింది. అయితే, అది కలత నిద్ర. చలి. పైగా, దుప్పటి కూడా లేదు. అంచేత మెడచుట్టూ చేతులు వేసుకుని కూర్చున్నారు రామా. సాధారణంగా ఆయనకు కలలు రావు. ఎప్పుడో అరుదుగా మూడు నాలుగుసార్లు వచ్చిన కలలు నిజమైనాయి. ఆ రోజు కలలో ఆయనకు ఊపిరాడలేదు. ఆయన శ్వాసక్రియ లయ తప్పడం గమనించిన సహపాఠి ఆయనను లేపి 'ఏమైంది?' అని అడిగాడు. 'ఎవరో నా గొంతు పిసికినట్లు అనిపించింది' అన్నారాయన. అప్పుడు అతను – 'ఎవరోకాదు – అవి నీ చేతులే' అన్నాడు సహపాఠి.

దెయ్యం అనేది మనలోని భాగమే. మన అజ్ఞానం వల్ల పుట్టినదే. మనిషి మనస్సు ఒక అద్భుతం. ఒక ఇంద్రజాలికుని వంటిది. అనుకుంటే దైవత్వమూ వస్తుంది, దెయ్యం రూపమూ వస్తుంది. అది మిత్రుడుగానూ ఉండగలదు, శత్రువుగానూ ఉండగలదు. స్వర్గం సృష్టించగలదు, నరకాన్ని చూప గలదు. మనసులో దాగివున్న దోరణులను వెలికితీసి, వాటిని ఎదుర్కొని, విజయం సాధిస్తేనే ఆత్మజ్ఞానపథంలో కొనసాగడం వీలౌతుంది.

కల అనేది ఒక సహజమైన మనోస్థితి. నిద్రకు, మెలకువకు మధ్య స్థితి. ఇంద్రియాలు వాటి సంకేతాలను గ్రహించడం మానినప్పుడు మనసు అచేతన నుండి జ్ఞాపకాలను వెలికి తీస్తుంది. లోపల దాగిన కోరికలు బయటపడుతాయి. ఇవే కలలుగా మారుతాయి. వీటిని విశ్లేషించి మనలో దాగివున్న వ్యక్తిత్వాన్ని వెలికి తీయవచ్చు. దీనిద్వారా కొన్ని జబ్బులను కూడా నయం చేయవచ్చు. ధ్యానం సహాయంతో మనం వీటిని ఉద్దేశపూర్వకంగా గుర్తుకు తెచ్చుకుని, పరిశీలించి, విశ్లేషించి, శాశ్వతంగా వదిలివేయవచ్చు.

కలలు పలురకాలు. మనకు వచ్చే కలలు అందంగానూ వుంటాయి. బాధలు కలిగించేవీ వుంటాయి. ఇవి కాకుండా మనం విశ్లేషించవలసినవి మరో రెండు

రకాలున్నాయి. ఒకటి రాబోయే సంఘటనలను చెప్పే కలలు. రెండవది పీడ కలలు. నిరాశానిస్పృహల మూలంగా పీడ కలలు వస్తాయి. బాగా అలసిపోయినా, జీర్ణశక్తి సరిగా లేకున్నా ఈ కలలు వస్తాయి. పగటిపూట ఎవ్వడూ 'దెయ్యాన్ని చూశాను' అనడు. ఇందుకు రామా సహపాఠి ఒక ఉదాహరణ చెప్పాడు.

'చీకట్లో తాడును చూసి పాము అనుకోవచ్చు. ఎండమావిని దూరంనుంచి చూసి నీళ్ళు అనుకోవచ్చు. సరైన వెలుతురు లేకపోవడమే ఈ భ్రమలకు కారణం. నిజానికి దెయ్యం వుందా? సర్వవ్యాపకమైన, సర్వశక్తివంతమైన శక్తి ఒక్కటే వుంటే దెయ్యం ఎలా వుంటుంది? మతం జబ్బుతో బాధపడేవారు దేవుని మరచిపోయి దెయ్యం ఉనికిని నమ్ముతారు. తప్పుడు ఆలోచనలు చేసే మనసే మనిషిలోని దెయ్యం. తప్పుడు ఆలోచనలు మానేస్తే అదే దైవత్వాన్ని చూపుతుంది. మనసే స్వర్గనరకాల సృష్టికర్త. దెయ్యం భయం అనేది ఒక జబ్బు. దీనిని మనసు నుంచి పోగొట్టాలి.'

## 5.2 స్వామీ రామా దెయ్యంగా మారిన వైనం

ఒకసారి నైనిటాల్ అడవులలో స్వామీ రామా సంచరిస్తున్నారు. అప్పుడు ఒక్కోసారి ఆరువేల అడుగుల ఎత్తున వున్న ఒక నగరానికి దిగివచ్చేవా రాయన. అక్కడి ప్రజలు ఆశీర్వాదం కోసం వెంటబడేవారు. వారినుండి దూరంగా వుండేందుకు అక్కడ బ్రిటిష్‌వారి శ్మశానం భేషుగ్గా వుందనుకున్నా రాయన. కంబళితో నేసిన తెల్లని బట్టలు ధరించి అక్కడ రాత్రిళ్ళు ధ్యానం చేసేవారాయన.

ఒకరోజు ఆ ప్రాంతంలో గస్తీ తిరుగుతున్న ఇద్దరు పోలీసులు అక్కడికి వచ్చి టార్చిలైట్‌ను ఫోకస్ చేశారు. అక్కడెవరో రౌడీలున్నారని వారి అనుమానం. స్వామీ రామా మొత్తం కంబళి కట్టుకుని ధ్యానం చేస్తున్నారు. పోలీసులు ఆయనను చూసి దెయ్యం అనుకుని పోలీస్‌స్టేషన్‌కు ఫోన్ చేశారు. పుకారు ఊరంతా షికారు చేసింది. అంతా భయంతో వణికిపోయారు. మరోసారి పోలీసులు కూడా వచ్చి లైట్‌ను ఫోకస్ చేశారు. ధ్యానంలో రామాకు ఏమీ తెలియలేదు. అంచేత ఆయన కదల్లేదు. దానితో రామా దెయ్యమే అనుకున్నారు. తుపాకులు తీశారు.

'ఆగండి. ముందు దాన్ని రెచ్చగొట్టుదాం! నిజానికి అది దెయ్యం కాదేమో అనిపిస్తోంది నాకు.' అందరూ దగ్గరి కొచ్చారు. ఒక బులెట్ గాలిలో పేలింది. దానితో రామాకు ధ్యానభంగమై మెలకువ వచ్చింది. 'ఎందుకు నాకు ధ్యానభంగం చేస్తున్నారు? మీకేం కావాలి?' అన్నారు. అక్కడున్న బ్రిటిష్ పోలీస్ సూపరెంటెండెంట్ పేరు ఫ్ర్యూస్. ఆయనకు రామా పరిచితులే. ఆయన రామాకు క్షమాపణ చెప్పుకున్నారు. ఆనాటినుండి ఆయన రోజూ స్వామీ రామాను కలిసేవాడు. రాత్రిపూట స్వామీ రామాకు టీ పంపమని పోలీసులకు ఆజ్ఞాపించాడు. రామాను ధ్యానం నేర్పమని కోరాడాయన. ఒకరోజు భయం గురించి చెప్పమన్నాడు. 'చావు భయమే మనిషిలో పాతుకుపోయిన గొప్ప భయం' అన్నారు రామా.

'భయం మనిషిని ఎప్పుడూ ఏదోవిధంగా వెంటాడుతూనే వుంటుంది. సమతూకం పోయినప్పుడు ఆలోచనలు కూడా వాటి దారి అవి చూసుకుంటాయి. ఇది

ఎక్కువైతే భయం బాగా పెరుగుతుంది. భయమే మనిషికి గొప్ప శత్రువు' అని చెప్పారాయన.

ప్యూస్‌కు దెయ్యాలంటే భయం. 'మీరెప్పుడైనా దెయ్యాన్ని చూశారా?' అని అడిగారాయన. రామా అన్నారుగదా -

'నేను దెయ్యాలకు రాజునే చూశాను. అది వేరెవరోకాదు - మనిషే! మనసులోని విషయాలతో ఐక్యం అయినంతకాలం అతను దెయ్యమే. తన నిజ స్వభావం ఎరిగిననాడు అతనికి అన్ని భయాలూ పోతాయి.'

క్రమంగా రామాకోసం చాలామంది వచ్చేవారు. తర్వాత ప్యూస్ ఏవో కారణాలవల్ల ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి, ఆస్ట్రేలియా వెళ్లి పోయారు. స్వామీ రామాకూడా అల్మోరా పర్వతాలకు వెళ్లారు. భయం ఒత్తిడితో బతికి లాభం లేదని, ప్రతి దశలో భయపడితే లాభం వుండదని ఆయనకు అనిపించింది. 'మనం భయాన్ని ఎదుర్కొనకుండా పెంచి పోషిస్తున్నాం. ఆధ్యాత్మికపథంలో భయం, బద్ధకం పెద్ద శత్రువులు' అంటారాయన.

## 5.3 పాముల భయం

చిన్నతనంలో స్వామీ రామాకు భయం అంటే అంతగా తెలియదు. ఉరకలువేస్తూ ఉప్పొంగే గంగానదినికూడా అవలీలగా దాటి అవలికి వెళ్లేవారాయన. పులులంటే ఆయనకు లెక్కలేదు. అయితే, పాములంటే మాత్రం ఆయనకు చచ్చేంత భయం. అయితే, ఆ విషయం సహచరులకు, గురుదేవులకు కూడా తెలియకుండా ఆయన జాగ్రత్తపడ్డాడు.

ఒకసారి, 1939వ సంవత్సరం సెప్టెంబర్ నెలలో, గురుదేవులతోపాటు స్వామీ రామా రిషీకేశ్‌కు వెళ్లారు. వీరభద్రకు వెళ్లాల్సి వుండింది. దారిలో ఒక చోట ఆగారు. తర్వాతికాలంలో స్వామీ రామాకు అక్కడో ఆశ్రమం వెలిసింది. అక్కడ తెల్లవారి గంగాస్నానం తర్వాత ధ్యానానికి కూర్చున్నారు. అప్పటికే ఎటువంటి అంతరాయం లేకుండా రెండు, మూడు గంటలపాటు ధ్యానంలో కూర్చునే శక్తి వచ్చిందాయనకు. ఏడున్నర గంటల ప్రాంతంలో ఆయన కళ్ళు తెరిచారు. ఎదురుగా పడగ విప్పిన నాగుపాము ఉంది. అది రామా ముందు నిశ్చలంగా వుంది. రామాకు భయంవేసి మళ్ళీ కళ్ళు మూసుకున్నారు. ఏం చేయాలో తోచలేదు. కొంతసేపు తర్వాత మళ్లీ కళ్లు తెరిచినా పాము అలాగే వుంది. ఏం చేయాలో అర్థంకాక, వెనక్కి తిరిగి చూడకుండా అదేపోతగా పరుగెత్తారాయన. కొన్ని గజాల దూరం అలా పరుగెత్తి ఆగి, తిరిగి చూశారు. ఆ పాము నెమ్మదిగా పొదలవైపు వెళ్లిపోతూ వుంది. తర్వాత గురుదేవులతో ఈ విషయం చెప్పినప్పుడు, ధ్యానుల దగ్గర ఏ ప్రాణి అయినా అలాగే ప్రవర్తిస్తుందని అన్నారాయన.

పలురకాల శిక్షణలు పొందినా, మరోసారి మరో భయంకరమైన అనుభవం ఎదురైందాయనకు. ఒకసారి గురుదేవులు భారతీయ సంస్కృతికి పుట్టినిల్లుగా పేరుపొందిన దక్షిణ భారతానికి వెళ్ళమని రామాను ఆదేశించారు. రామా వెళ్లారు. వాన, చలి వున్న సమయంలో ఒక గుడిలో తలదాచుకోవాలనుకున్నారు. అక్కడున్న

వారు, 'నీవు స్వామివైతే తలదాచుకోవలసిన అవసరం ఏముంది?' అన్నారు. అయితే, వారిలో ఒకామె మాత్రం, 'నాతో రా నాయనా! నీకు బస చూపిస్తాను' అంది.

ఆరడుగుల పొడవు ఆరడుగుల వెడల్పు వున్న గుడిసెలో వుండమనిందామె. అక్కడ వెలుతురు లేదు. తలుపు సందునుంచి కొద్దిగా వెలుతురు వస్తుంది. కూర్చునేందుకు జింకచర్మం, శాలువా, ఒక కాషాయవస్త్రం వున్నాయి. కొన్ని నిమిషాల తర్వాత ఒక నాగుపాము ఆయన ముందు పాకుతూ కనిపించింది. మరొకటి ఆయన పక్కన వుంది. జాగ్రత్తగా చూస్తే – ఇంకేముంది? గదినిండా పాములే. పాముల గుడికి వచ్చానా అని రామా అనుమానపడ్డారు. పరిస్థితి ప్రమాదకరంగా వుంది. 'నన్ను ఆమె పరీక్షించాలని అనుకుందేమో? పారిపోతే మరే స్వామికీ ఆమె ఆతిథ్యం ఇవ్వదేమో?' అనుకున్నారాయన. 'ఏమైనా సరే. ప్రాణంపోయినా ఫర్వాలేదు. ఇక్కడే వుండాలి. కనీసం సన్యాసి నియమాలు పాటించినట్లు ఉంటుంది కదా!' అని నిర్ణయించుకున్నారు.

'పైగా, ఆమె ఏమాత్రం ఆత్మజ్ఞానం పొందినట్లు లేదు. అయినా ఆమె ఈ గుడిసెకు వచ్చింది. మరి నాకెందుకు అపకారం జరుగుతుంది?' అనిపించిందాయనకు. అప్పుడు గురువుగారి మాటలు గుర్తుకు వచ్చాయి. 'నిశ్చలంగా కూర్చుంటే పాములు నన్నేం చేస్తాయి? వాటికి కావలసింది నా దగ్గరేముంది కనుక?' అనుకుని రాత్రంతా తదేకంగా చూస్తూ గడిపేశారు. పోయింది ధ్యానం మాత్రమే. ఆ రాత్రి ఆయన ధ్యానం పాముల గురించే.

ఈ రెండు అనుభవాలు జరిగినా, పాముల భయం మాత్రం పోలేదు. యువస్వామిగా ఎంతోమంది నమస్కారాలు అందుకుంటున్నా పాముల భయం ఆయన్ను వదిలి వెళ్లలేదు. నిర్భయత్వాన్ని బోధించే బ్రహ్మ సూత్రాలను వ్యాఖ్యానించినా ఆయన లోపలి భయం అలాగే వుంది. వదిలించుకోవాలనుకునే కొద్దీ ఆ భయం మరింత పెరిగింది. ధ్యానంలోకూడా తరచూ కళ్ళుతెరిచి పాములున్నాయేమో చూసేవారాయన. ఎక్కడికెళ్లినా అదేపని. ఆఖరికి 'ఈ ప్రక్రియలో నేను మరణించినా సరే, భయాన్ని పోగొట్టుకోవాలి, లేకుంటే ఎదుగుదల వుండదు. మనల్ని నమ్ముకుని, ప్రేమించి, గౌరవించేవారికి దారిచూపడం ఎలా? ఈ భయం లోపల వుంచుకుని ఇతరులకు దారి చూపాలనుకోవడం వంచన' అనిపించిందాయనకు.

గురుదేవులను పలకరించారు. 'నాకు తెలుసు నీకేం కావాలో! నీకు పాములంటే భయం' అన్నారాయన. 'మరి, ఆ భయం పోగొట్టుకోమని ఎందుకు చెప్పరు?' అని అడిగారు రామా. 'నేను ఎందుకు చెప్పాలి? నీవే నన్ను అడగాలి. ఇంతకాలం ఈ విషయం ఎందుకు దాచావు?' అన్నారు గురుదేవులు.

తర్వాత గురుదేవులు రామాను అడవికి తీసుకెళ్లారు. 'రేపు ఉషోదయంనుండి మౌనం పాటిద్దాం. ఉదయం మూడున్నరకు లేచి పార్థివపూజకు కావలసిన ఆకులు, పూలు తీసుకురా' అని ఆదేశించారు.

మర్నాటి ఉదయం రామాకు పెద్ద ఆకుల గుట్ట కనిపించింది. చీకట్లో దానిని తడుముతూ వుంటే పాముందేమో అనిపించింది. అది తన చేతిలోనే వుంది. ఇక పారిపోయే ప్రశ్నలేదు. ఏం చేయాలో అర్థం కాలేదు. భయంతో స్పృహతప్పేలా వుందాయనకు. చేతులు వణుకుతున్నాయి. గురుదేవులు అక్కడున్నారు. 'దాన్ని

వా దగ్గరకు తీసుకురా' అన్నారాయన. రామా భయంతో వణికిపోతున్నారు. 'అది నిన్ను కాటు వేయదులే' – అభయం ఇచ్చారు గురుదేవులు. రామాకు లోపలి భయం మాత్రం పోలేదు. 'నీ చేతిలోనే నీ చావుంది' అని మనసు చెబుతూంది. గురుదేవులపై వున్న నమ్మకంకన్నా భయం బలంగా వుంది. 'పామునెందుకు ప్రేమించవు?' అడిగారు గురుదేవులు. 'ప్రేమించడమా?' భయంతో అరిచారు రామా – 'భయంతో వణుకుతూంటే ఎవరైనా ఎలా ప్రేమించగలరు?'

ఇది లోకంలో ఎక్కడైనా జరిగేదే. మనకు ఎవరిపైన అయినా భయం వుంటే మనం వారిని ప్రేమించలేము. మనకు తెలియకుండానే ఎప్పుడూ వారికి భయపడుతూనే వుంటాము. భయం లోలోపల పెరుగుతూనే వుంటుంది.

'చూడు. ఈ పాము చాలా అందంగా వుంది. ఎక్కడపడితే అక్కడ వుంటుంది. అయినా, ఎంత శుభ్రంగా వుందో చూడు. నీవు అలా వుండగలవా? రోజూ స్నానం చేయాల్సిందే. ప్రపంచంలో అన్ని ప్రాణులలోకి పాము చాలా శుభ్రంగా వుంటుంది' అన్నారు గురుదేవులు. 'నిజమే. అయితే, అది ప్రమాదకరమైనది కదా' అడిగారు రామా.

'మనిషే అశుభ్రంగా వుంటాడు. పాముకన్నా విషంతో నిండివుంటాడు. (తలనుండు విషము ఫణికిని..... అనే మన సుమతీ శతకపద్యం గుర్తుకు రావడంలేదూ?) వాడు ఇతరులను గాయపరచగలడు. చంపగలడు. ప్రతిరోజూ కోపం రూపంతో, చెడు రూపంతో సాటివారిపై విషం కక్కుతూ వుంటాడు. పాము అలా ఎన్నటికీ చేయదు. అది కేవలం ఆత్మరక్షణకే కాటు వేస్తుంది. నిద్రలో నీ వేలు నీ కంటిని పొడుస్తుందా? నీ పళ్ళు నాలుకను కొరుకుతాయా? శరీరంలో అన్ని అవయవాల మధ్య అవగాహన ఉంటుంది కదా! అటువంటి అవగాహననే మనం అన్ని ప్రాణులపై వుంచుకున్న నాడు మనకు ఏ ప్రాణిని చూసినా భయం వుండదు' అన్నారు గురుదేవులు.

ఆయన మాట్లాడుతున్నంతసేపూ పాము రామా చేతిలోనే వుంది. క్రమంగా రామాకు భయం తగ్గిపోయింది. 'నేను పాములను చంపకపోతే అవి నన్నెందుకు చంపుతాయి? కారణం లేకుండా పాములు ఎవరినీ కరవవు. మరి నేనెవరిని? అది నన్నెందుకు చంపుతుంది?' అనుకున్నారాయన. క్రమంగా ఆయన మామూలు స్థితికి చేరుకున్నారు. అప్పటినుంచీ ఆయనకు పాములంటే భయం పోయింది.

జంతువులకు ఇంద్రియజ్ఞానం ఎక్కువ. అవి ప్రేమను, ద్వేషాన్ని తెలుసుకుంటాయి. ఎవరైనా వాటికీ కీడు తలపెట్టకపోతే అవి ఏ మాత్రం హాని చేయవు. ఊరుకుంటే ప్రేమగా వుంటాయి. అడవి జంతువులు కూడా మనుషులతో కలసివుండాలని అనుకుంటాయి. హిమాలయాలలో స్వామీ రామాకు ఈ ధోరణి కనిపించింది. అక్కడి జంతువులు రాత్రిళ్లు పల్లెల దగ్గరకు వచ్చి ఉదయాన్నే అడవికి తిరిగివెళ్ళేవి. అవి మనుషులకు దగ్గరగా రావాలని చూస్తాయి. అయితే, మనిషి క్రూరత్వానికి అవి భయపడతాయి. మనిషి తన స్వార్థం, ద్వేషం, వ్యామోహం వగైరాలతో నిజ ప్రకృతిని పోగొట్టుకుని జంతువులను భయపట్టాడు. అందుకే అవి ఆత్మరక్షణ కోసం పోరాడుతాయి. జంతువులతో మనం సవ్యంగా ప్రవర్తిస్తే, అవి మనజోలికి రావు వాల్మీకి మహర్షి, బుద్ధ భగవానుడు, సెయింట్ ఫ్రాన్సిస్ మొదలైన మహనీయులు

జంతువులను ఎంతగానో ప్రేమించారు. వారిని ఆదర్శంగా తీసుకోవాలనుకున్నారు రామా.

భయంవల్ల అభద్రతాభావం వస్తుంది. అందువల్ల మనసులో సమతూకం దెబ్బతింటుంది. ఇది ఒకరి ప్రవర్తనపై ప్రభావం చూపుతుంది. ఒక భయం మనిషి జీవితాన్ని ఎంతో ప్రభావితం చేస్తుంది. పిచ్చాసుపత్రికి పంపినా పంపుతుంది. భయాన్ని పరిశీలిస్తే అది కేవలం ఏదో ఊహపైనే ఆధారపడి వుంటుంది. అయితే, ఈ ఊహ కూడా ఒక రకమైన నిజాన్ని సృష్టిస్తుంది. భయంవల్ల ప్రమాదం కూడా ఏర్పడుతుంది. అప్పుడు మనుషులు తాము సృష్టించుకున్న ప్రమాదం నుంచి తమను తామే రక్షించుకోవాల్సి వుంటుంది. ఈ విధంగా ప్రమాదం వల్ల భయం రావడంలేదు. భయంవల్లనే ప్రమాదం ఏర్పడుతుంది. అన్ని భయాలు, గందరగోళాలు ఒక నిజమైన అనుభవాన్ని ఎదుర్కొనేందుకు అవసరం. తర్వాత వాటిని సులభంగా పోగొట్టుకోవచ్చు.

యోగ సూత్రాలలో మొదటి పది నియమాలు సమాధి కోసం పాటించవలసినవి. అందులో మొదటిది అహింస. స్వార్థం, అహం వున్నప్పుడు మనిషిలో సున్నితత్వం, ఇంద్రియజ్ఞానం పోతాయి. ఇంద్రియజ్ఞానం గొప్ప శక్తి. దీనిని చక్కగా వాడుకుంటే అహింసా మార్గంలో వెళ్ళవచ్చు.

స్వామీ రామా అడవులలో, పర్వతాలలో తిరుగుతున్నప్పుడు ఎప్పుడుగానీ సాధువులు, ఋషులు జంతువుల వాత పడడం చూడలేదు. వీరు సహజ ప్రమాదాల నుండి ఆత్మరక్షణ కోసం ప్రయత్నించరు. ఆత్మ బలంవల్ల నిర్భయత్వం వస్తుంది. భయం లేనివాడు తన చైతన్యాన్ని దాటి, విశ్వచైతన్యంలో ఒకడౌతాడు. ఎవరు ఎవరిని చంపగలరు? ఆత్మ శాశ్వతం, శరీరం అశాశ్వతం – ఈ భావన హిమాలయ ఋషులలో ఎక్కువ. అందుకే వారు హాయిగా వుంటారు.

## 5.4 పులిగుహలో స్వామీ రామా

ఒకసారి స్వామీ రామా నేపాల్ పర్వతాలలో తారాయ్ భవార్‌లో ఒంటరిగా వెళ్తున్నారు. వారు నేపాల్ రాజధాని ఖాట్మండూ వెళ్ళాల్సి వుంది. రోజుకు దాదాపు 30 – 40 కి.మీ. నడిచేవారు. సూర్యాస్తమయం వేళకు మంట వేసుకుని, ధ్యానం చేసి, తర్వాత విశ్రాంతి తీసుకునేవారు. తర్వాత మళ్ళీ ఉదయం నాలుగు గంటలకు లేచి పదిగంటల వరకూ నడిచేవారు. మధ్యాహ్న వేళకు నీళ్ళున్నచోట చెట్టు కింద కాసేపు కూర్చుని, మళ్ళీ మధ్యాహ్నం మూడున్నర నుంచి రాత్రి ఏడు వరకు నడిచేవారు. చెప్పులు ఉండేవికావు. ఒక కంబళి, పులితోలు, ఒక నీటి చెంబు మాత్రమే తీసుకువెళ్ళేవారు.

ఒక సాయంకాలం ఆరు గంటలకు ఆయన బాగా అలసిపోయి ఏదైనా గుహలో విశ్రాంతి తీసుకోవాలనుకున్నారు. దగ్గరగా కనిపించిన గుహలో తడిగా వుంటే కంబళి పరచుకొని పడుకున్నారు. కళ్ళు మూశారో లేదో మూడు పులి పిల్లలు ఆయన దగ్గరకు వచ్చి, చిన్నగా అల్లరి చేయడం మొదలుపెట్టాయి. అవి రామాను తమ తల్లిగా అనుకున్నాయి. వాటికి ఆకలిగా వుంది. వాటి వయసు బహుశా

12-15 రోజులు ఉంటాయేమో! కొన్ని నిమిషాలు వాటిని నిమురుతూ అలా వుండిపోయారాయన. లేచి కూర్చుని చూస్తే – ఇంకేముంది? గుహ ద్వారం దగ్గర తల్లి పులి నిలబడి వుంది. అది తన మీద పడుతుందేమో అని భయపడ్డారాయన. తర్వాత 'ఈ పిల్లలకు హాని చేసే ఉద్దేశం నాకు లేదు. ఆ పులి గుహ ద్వారాన్ని వదిలిపెడితే నేను బయటకు వెళ్ళిపోతాను' అని గట్టిగా అనుకున్నారు.

వెంటనే ఆ పులి ద్వారాన్ని వదిలి వెళ్ళింది. అప్పుడు రామా గుహ బయటకు వెళ్ళిపోయారు. ఆయన కొంచెం దూరం వెళ్ళగానే ఆ పులి తన పిల్లల దగ్గరకు వెళ్ళింది.

'ఇటువంటి అనుభవాలవల్ల ఎవరికైనా భయం పోతుంది. జంతువులకు, మనుషులకు మధ్యనున్న ఐక్యత కూడా అర్ధమౌతుంది. ప్రమాదం, భయం అనే భావాలు వచ్చినప్పుడే జంతువులు తిరగబడ్తాయి. మనిషిని మరో మనిషి ఆపదలో వదిలి వెళ్తాడేమో కానీ జంతువులు మాత్రం ఆ విధంగా చేయవు. అన్ని ప్రాణులలోనూ ఆత్మరక్షణార్థం ఎక్కువే. అయితే, మనిషికన్నా జంతువులు అంకిత భావంతో ప్రేమిస్తాయి. అది షరతులు లేని ప్రేమ. మనుషుల బంధాలన్నీ షరతులతో కూడినవి. మనం మనలోని తత్త్వాన్ని మరిచి, మన చుట్టూ గోడలు కట్టుకుంటాం. తర్వాత చుట్టూవున్న వారితో సంబంధాలు పోగొట్టుకుంటాం. ఇతరులతో వున్న సంబంధం గురించి సూక్ష్మంగా ఆలోచిస్తే ఆత్మజ్ఞానం పెద్ద ప్రయత్నం లేకుండానే లభిస్తుంది' అంటారు స్వామి రామా.

★ ★ ★

అధ్యాయం ఆరు

# సన్న్యాసమార్గం

"అసిధారావ్రతం వంటిది సన్న్యాసమార్గం. అది అందరిదీ కాదు. అదృష్టవంతులైన కొద్దిమందికే లభిస్తుంది. వైరాగ్యం, ఆత్మజ్ఞానం అనేవి ఈ మార్గంలో ముఖ్యమైనవి."

## 6.1 శరీరమంతా కన్నే అయిన హరిఓమ్‌స్వామి

స్వామీ రామా రెండేళ్ళపాటు శ్రీనగర్‌లో ఒక స్వామికి పరిచర్యలు చేశారు. ఆయన పేరు హరిఓమ్‌స్వామి. ఎన్ని సపర్యలు చేసినా ఆయన కన్నెత్తి కూడా చూడలేదు. దానితో రామాకు విసుగు పుట్టింది. 'నావల్ల కాదు గురుదేవా! ఒక రాయినో, కొయ్యనో చూసేందుకు వెళ్ళినట్లుంది' అన్నారాయన విసుగ్గా, గురుదేవులతో.

'అలా అనకు. నీకు తెలియదు నిజానికి ఆయన నిన్ను చూస్తున్నారు' అన్నారు గురుదేవులు.

'కళ్ళు మూసుకుని కూర్చుంటే చూడడం ఎలాగండీ?' అసహనంగా అడిగారు రామా.

ఆ రోజు హరిఓమ్ పలకరించారు. 'ఏమిటీ? నేను కొయ్యనా? రాయినా? నేను పరమానందంగా ఉన్నాననీ, కళ్ళు తెరవాల్సిన అవసరం నాకు లేదనీ తెలియదా? సౌందర్య వైభవాలు పొంగుతున్న పరమాత్మునితో ఉండగా నేను కళ్లెందుకు తెరవాలి? అందుకే నేను కళ్ళు మూసుకుంటాను మనోనేత్రాన్ని తెరచి, ఆ శాశ్వత సౌందర్యాన్ని చూడు. ఈ ఇంద్రియాల శక్తి పరిమితం. పరిమిత వస్తువుల పరిమిత సౌందర్యాన్నే ఇవి చూస్తాయి' అన్నారాయన నవ్వుతూ. ఆ మాటలు స్వామీ రామాకు ఎంతో ప్రేరణ నిచ్చాయి. తర్వాత ఎప్పుడు కలిసినా ఆయన కళ్ళు కొద్దిగా విచ్చుకునేవి. అందులో పరమానందం కనిపించేది. ఆయన 'యా నిశా సర్వభూతాని తస్యాం జాగర్తి సంయమీ' అనే గీతా వాక్యాన్ని పేర్కొన్నారు. 'అందరికీ రాత్రి అయిన వేళ యోగికి పగటి వేళ' అని దాని అర్థం. 'రాత్రిపూట చాలా మంచి సమయం. దాని విలువను, మౌనాన్ని ఏవిధంగా వాడుకోవాలో చాలా మందికి తెలియదు. రాత్రిళ్లు మేలుకునే వారు మూడు రకాలవారు – యోగి, భోగి, రోగి. వీరిలో యోగి ధ్యానంలో ఆనందంగా వుంటాడు. భోగి ఇంద్రియ సుఖాలు అనుభవిస్తూ ఉంటాడు. రోగి బాధలు అనుభవిస్తూ ఉంటాడు. ముగ్గురూ మేలుకునేవారే అయినా ఎక్కువ ప్రయోజనం పొందే వ్యక్తి యోగి మాత్రమే. భోగి క్షణికానందాన్ని పెంచుకోవాలని ప్రయత్నిస్తాడు. అయినా ఫలితం ఉండదు. యోగికి ఆనందం క్రమంగా పెరుగుతుంది. మనసులో తృప్తి లేకుండా, మనకు తెలియకుండా కళ్ళుమూసుకోవడం మామూలు నిద్ర అవుతుంది. తెలిసి కళ్ళు మూసుకోవడం ధ్యానంలో ఒక భాగం. యోగి కళ్ళు

మూసుకుని ఇంద్రియాలను ఉపసంహరించుకుంటాడు. అతనికి బాధ, సంతోషం అనే వ్యతిరేక భావాలుండవు. అతనికి కళ్ళు మూసుకోవడం అంటే లోపలి కన్ను తెరచుకోవడమే. మామూలు మనుషులు రెండు చిన్న కళ్ళతో చూస్తారు. కానీ, నాకు శరీరమంతా కన్ను అయిందని నీకు తెలుసా?' అన్నారు హరిఓమ్‌స్వామి.

## 6.2 వేశ్య తల్లిగా మారినవేళ

'ఈ ప్రపంచమే ఒక పాఠశాల. నేర్చుకునేందుకు నా ఒక్కడిపైనే ఆధారపడవద్దు. ప్రతి వస్తువునుండి పాఠం నేర్చుకోవాలి నీవు' అనేవారు గురుదేవులు రామాతో. ఒకసారి ఆయన 'రామా! డార్జిలింగ్ వెళ్ళు. ఊరవతల కాలువగట్టున ఒక స్మశానం వుంది. ఏమైనాసరే, అక్కడ నలభై ఒక్క రోజులు నేను చెప్పిందోయే సాధన చేయి. నీ మనస్సు నిన్ను ఎంత ప్రలోభపెట్టినా సాధన మానకు. ఆ స్థలం వదలకు' అన్నారు. 'సరేనండీ! అన్నారు రామా.'

అటువంటిచోట ఉండాలంటే చాలామందికి భయంగా వుంటుంది. రకరకాల తమాషా అయిన భావాలుంటాయి. అయినా, రామాకు భయం వేయలేదు. స్మశానంలో పూరి గుడిసెలో వండుకుని తింటూ కొంతకాలం బతికారాయన. ఆ రోజుల్లో రామా యూనివర్సిటీలో చదువుకునేవారు. అంచేత వేసవి సెలవుల్లో ఈ సాధన చేస్తే మంచిది అనుకున్నారాయన. గురువు చెప్పినట్లు ముప్పైతొమ్మిది రోజులపాటు సాధన చేసినా ఏమీ ఫలితం కనిపించలేదాయనకు. అప్పుడాయన మనసులో ఇలా అనిపించింది:

'ఎంత బుద్ధి తక్కువపని చేస్తున్నావు నీవు? లోకంతో సంబంధం లేకుండా ఎవరూలేనిచోట సమయం వృధా చేసుకుంటున్నావే? యవ్వనాన్ని పాడు చేసుకుంటున్నావే?' గురువుగారేమో 'గుర్తుంచుకో. నలభైఒకటవ రోజున నీకు అభివృద్ధి కనిపిస్తుంది. అంతలోపున వదిలేయకు. నీ మనసు పెట్టే ప్రలోభాలకు లొంగకు' అన్నారు. అప్పుడు 'అలాగే' అని ప్రమాణం చేశారు స్వామి రామా.

అయితే ముప్పైతొమ్మిదవ రోజున మనసు ఇలా హెచ్చరించడంతో, 'ఇన్నాళ్ళు జరగనిది ఒక రెండు రోజుల్లో ఏం తేడా వస్తుంది? స్నేహితులకు రాద్దామనుకుని ఏమీ రాయలేదు. చచ్చినవాళ్ళమధ్య బతకడం – ఇదేం బోధన? గురుదేవులు ఎందుకు చెప్పారు దీనిని? ఒకవేళ ఆయన మంచి గురువులు కారేమో?' అనిపించి, 'ఇక చాలు, వదిలేద్దాం' అనుకున్నారాయన.

వెంటనే ఒక బకెట్ నీళ్లు తీసుకుని మంటపై పోసి, గుడిసెను నేలమట్టం చేశారు. శాలువా కప్పుకుని ఆ చలిరాత్రివేళ నగరంలోకి వెళ్ళారు. అప్పుడు పెద్ద వీధిలో సంగీతవాద్యాల ధ్వని వినిపించింది. ఎవరో ఒకామె పాడుతూ, నాట్యం చేస్తోంది. 'రాత్రి చాలా వుంది. జీవనభాండంలో తైలం కొద్దిగా ఉంది' అనే భావం మరీ మరీ పాడుతూ వుంది. తబలా శబ్దం 'ధిక్! ధిక్! ఛీ పాడు! ఏం చేశావో చూడు' అన్నట్లుంది.

వెంటనే రామాకు 'ఈ చివరి రెండు రోజులూ ఎందుకు పూర్తి చేయలేకపోయాను? నీ అభ్యాసం ఇంకా పూర్తి కాలేదు. మొక్క పెరగకుండానే ఫలం కోరుకుంటావా అని గురుదేవులు అనరా?' అనిపించింది. వెంటనే వెనక్కు వెళ్ళి మిగిలిన రెండు

రోజుల సాధన పూర్తి చేశారు. గురుదేవులు చెప్పినట్లే తక్షణమే ఫలితం కనిపించింది.

తనకు సకాలంలో కర్తవ్యం గుర్తు చేసిన ఆ మహిళ ఇంటికి వెళ్ళారాయన. ఆమె చాలా అందగత్తె. ఒక వేశ్య. స్వామి తన ముంగిట నిలువగానే 'రావద్దు నీవు రాదగ్గ స్థలం కాదిది' అందామె చాటునుండి. అయినా, రామా వినలేదు. అప్పుడామె లోపలినుండి బలిష్టంగా వున్నా ఒక సేవకుని పిలిచింది. అతను 'స్వామీ! నీవు రాకూడదు. అక్కడే ఆగు' అన్నాడు. అప్పుడు స్వామీ రామా 'లేదు. నే నామెను చూడాల్సిందే. ఆమె నాకు తల్లివంటిది. నాకెంతో మేలు చేసింది. తన పాట ద్వారా ఆమె నన్ను హెచ్చరించకపోతే ఈపాటికి నేను నా సాధన పూర్తి చేసేవాణ్నే కాదు. జీవితమంతా నన్ను నేను నిందించుకోవలసిన పరిస్థితి వుండేది' అన్నారు. ఆమె ఆ మాటలు వినగానే తలుపు తెరిచింది. 'అవునమ్మా! నీవు నా తల్లివి' అన్నారాయన. వారిద్దరూ కాసేపు మాట్లాడుకున్నారు. జరిగినదంతా చెప్పారాయన. గురుదేవులు ఆమెకు కూడా పరిచితులే. 'ఇప్పటినుంచి నీకు మాత్రమేకాక అందరికీ తల్లినౌతాను. ఇప్పుడే నాకు జ్ఞానోదయమైంది' అన్నదామె.

మర్నాడు ఆమె వారణాసి వెళ్ళింది. అక్కడ గంగానదిపై ఒక పడవలో ఉండసాగింది. సాయంకాలాలు నదీతీరంలో భజన చేసేది. తన పడవపై 'నేను సాధువునని పొరబడకండి. ఒకప్పుడు నేను వేశ్యను. దయచేసి నా పాదాలు తాకకండి' అని రాయించింది. ఎవరినీ ఆమె తలెత్తి చూసేది కాదు. ఎవరైనా మాట్లాడాలని వచ్చినా 'నాతో కూర్చో, దైవస్మరణ చేయి' అనేది. ఎవరైనా 'ఎలా వున్నావు?' అని అడిగితే రామ నామం తలచేది. 'ఏమైనా కావాల? ఏమైనా తెచ్చివ్వాలా?' అన్నా ఆమె జవాబు అదే – రామ నామమే.

ఒక రోజు అయిదు వేలమంది సమక్షంలో ఆమె 'నేను రేపు ఉదయం వెళ్ళిపోతున్నా. ఈ శరీరాన్ని నీళ్ళలో పారేయండి. చేపలు వాడుకుంటాయి' అని చెప్పి మౌనంగా వుండింది. మర్నాడు ఉదయం, చెప్పినట్లుగానే ఆమె శరీర త్యాగం చేసింది.

ఆ తల్లి గురించి చెబుతూ –

'మనకు జ్ఞానోదయం అయిన వేళ మన వ్యక్తిత్వం పూర్తిగా మారిపోతుంది. గతాన్ని వదిలేస్తాం. ప్రపంచంలోని మహాయోగులెందరో ముందు పరమ దుర్మార్గులుగా ఉన్నవారే. రామాయణ కావ్యసుధారసాన్ని అందించిన మహాకవి వాల్మీకి ఇందుకో ఉదాహరణ. అదేవిధంగా సెయింట్ పాల్‌గా మన్ననలందుకునే సౌలు ముందు దుర్మార్గుడే. డమాస్కస్ వెళ్తూండగా అతనికి జ్ఞానోదయం అయింది. మనిషి పూర్తిగా మారిపోయాడు. అందువల్ల మనల్ని మనం తక్కువ చేసుకోకూడదు. మనం ఎంత చెడిపోయినా, ఎంత అల్పంగా వున్నా మన వ్యక్తిత్వం మార్చుకునే అవకాశం వుంది. నిజమైన అన్వేషికి సత్యం తెలుస్తుంది. అన్ని భవబంధాలనుండి స్వేచ్ఛ లభిస్తుంది. ఒక క్షణంలో ఆత్మజ్ఞానం కలుగుతుంది' అంటారు స్వామీ రామా.

## 6.3 స్వామిగా మారిన హంతకుడు - నాగబాబా

హిమాలయాలలో గంగోత్రి, జమునోత్రి, కేదారనాథ్, బదరీనాథ్ అనేవి నాలుగు పుణ్యక్షేత్రాలు. జూన్ నుండి సెప్టెంబర్ వరకు నగరాల నుండి, మైదానాల

దగ్గరున్న పల్లెల నుండి ఎంతోమంది ప్రజలు ఒకటి రెండు నెలలు గడిపేవారు. ఈ సంప్రదాయం నేటికీ వుంది.

ఒకసారి ఇద్దరు మిత్రులతోపాటు రామా యాత్రకు వెళ్తున్నారు. అప్పుడు అయన ఒక స్వామిని కలిశారు. ఆ స్వామి వయస్సు యాభై సంవత్సరాలపైనే. అయనది ఉత్తరప్రదేశ్‌లోని బాండా జిల్లా. వినయశీలి. సౌమ్యుడు. ప్రశాంతంగా వుంటాడు. అయనతో కలిసి రామా అడవులలో అడ్డదారుల్లో వెళ్ళిపోయారు. సాయంత్రం వారు ఒక గుహలో వుండి బంగాళాదుంపలు వేయించుకుని తిన్నారు. కొత్తగా వచ్చిన స్వామి దగ్గరేమీ లేదు. అయన రామా బృందంతో ఉన్నది పంచుకుని తిన్నాడు. 'ఇదంతా బ్రహ్మం. ఇచ్చినవాడూ బ్రహ్మమే. తీసుకున్నవాడూ బ్రహ్మమే' అనే ప్రార్థన చదివి తినేవారు. ఇందువల్ల దైవచింతన క్రమం తప్పక వుంటుందనిపించింది. ఆ సాధువు ఈ కింద పేర్కొన్న కథను చెప్పాడు:

'అతనికి పద్దెనిమిది సంవత్సరాల వయస్సులో అతని తండ్రికి, పొరుగున వున్న భూస్వామికి మధ్య భూమి తగాదా వచ్చింది. తండ్రిని గ్రామస్తులు అసూయతో చంపేశారు. అహం గర్భంలో పెరిగే దుష్టలక్షణమే అసూయ. దానిని స్వార్థం, వ్యామోహం పెంచి పోషిస్తాయి. తండ్రి చనిపోయినప్పుడు అతను స్కూలులో వున్నాడు. ఇంటికి రాగానే, అతడు తండ్రి మరణానికి కారకులైన అయిదుగురినీ చంపీ, ప్రతీకారం తీర్చుకున్నాడు. తర్వాత హిమాలయాలకు వెళ్ళి యోగులను సేవించాడు. సత్సంగం ద్వారా తన దోషాన్ని పోగొట్టుకోవాలని ప్రయత్నించాడు. తర్వాత నిరాడంబరంగా సాధన సాగించాడు. అందరికీ తన తప్పు చెప్పుకున్నాడు. ఆధ్యాత్మిక సాధనలో ముప్పై అరు సంవత్సరాలు గడిపాడు. అప్పుడప్పుడు పోలీసులకు లొంగిపోదామా అనుకునేవాడు. అప్పటికి అతనికి 'నాగబాబా' అనే పేరు వచ్చింది. ఒంటిమీద ఏమీ వుండేది కాదు. ప్రజలలో తానో హంతకుడినని, క్రమంగా సాధువుగా మారానని చెప్పుకునేవాడు. ఇటువంటి మార్పు సాధ్యమేనని హిందువులు, సూఫీలు, క్రైస్తవులు, బౌద్ధులు, తదితరుల మత గ్రంథాలు చెబుతున్నాయి.'

అఖరుకు అతను, పోలీసులకు లొంగిపోతేనే మేలు అని విని, మర్నాడు తన ఊరికెళ్ళి పోలీసు స్టేషనులో లొంగిపోయాడు. జడ్జిగారు ఛార్జిషీట్ అడిగాడు. ముప్పైఅరు సంవత్సరాలనాటి కథను పోలీసులు చెప్పారు. అయితే, దానికి సంబంధించిన రికార్డు కానీ, ఫైలు కానీ లేదు. అతను తర్వాత ఎలా గడుపుతున్నాడో తెలుసుకున్న జడ్జిగారు అతణ్ని వదిలేశారు. తర్వాత అతను మళ్ళీ హిమాలయాలకు చేరుకున్నాడు.

నాగబాబా గురించి చెబుతూ స్వామీ రామా ఇలా అంటున్నారు –

"నేరస్తులు నేరం చేసేటప్పుడు వారి మనస్సు సమతూకంలో వుండదని క్రిమినాలజిస్టులు (నేర విజ్ఞాన నిపుణులు) అంటారు. అయితే, చట్టం తన పని చేయాల్సివున్నా నేరస్తులను సంస్కరించి, విద్యావంతులను చేయాల్సిన అవసరం కూడా ఎంతైనా వుంది. వారు మానసిక అనారోగ్యంవల్ల నేరం చేస్తున్నారా? లేక మనమే వారిని నేరానికి పురిగొల్పుతున్నామా? అనే అంశాలను జాగ్రత్తగా పరీక్షించాలి. నేరం చేసిన వారికి ఆధ్యాత్మిక అభ్యాసాలను పరిచయంచేస్తే వారికి ఇతరుల ఉనికి, హక్కుల గురించి తెలుస్తుంది. నేరం అనేది ఒక వ్యాధి వంటిది. దాని నివారణ మనం ఆలోచించాలి. మనం ఎంత స్వేచ్ఛగా వున్నామో ఆలోచించాక

నా హృదయం ప్రపంచ దేశాలలో జైళ్ళలో వున్నవారి గురించి తపిస్తుంది. ఎంత విషాదమిది? నా అభిప్రాయంలో వీరికి సాయం చేసేందుకు వీలుగా సంస్కరణకు, ఆత్మవికాసానికి అనువైన వాతావరణం ఏర్పరచాలి. మానవాళి ఇంకా అంత నాగరికం కాలేదు. అందరికీ ఉచిత విద్య, వైద్యం, సమానత్వం, న్యాయం కల్పించే దేశమేదీ లేదు. ఈ అవసరాలు అందరికీ తీర్చి నాగరికతను పై మెట్టుకు తీసుకెళ్ళాలి. ఈ వాతావరణం కల్పించే సమాజాన్ని మనం ఇంకా నిర్మించవలసి వుంది."

## 6.4 స్వయం నిర్ణయం ఉండాలి - ఒంటరిగా సాగిపోవాలి

స్వామీ రామాకు గురుదేవులు ఎంతో ఇచ్చారు. ఆయన అందుకు ప్రతిగా గురుదేవులకు ఏమీ ఇవ్వలేదు. ఎంతోమంది భక్తులు గురుదేవులకు కానుకగా ఇచ్చిన డబ్బును, రామా అందరికీ ఇచ్చి, తానూ జల్సాగా ఖర్చు పెట్టేవారు. ఒకరోజు ఆయన గురుదేవులతో 'నాకు బొంబాయి వెళ్లాలని వుంది' అన్నారు. 'కావలసినంత డబ్బు తీసుకుని వెళ్ళు' అన్నారు గురుదేవులు. రామా తిరిగివచ్చేటప్పుడు అయిదు వేల రూపాయలు ఖర్చుపెట్టి, మూడు గ్రామఫోన్‌లతో సహా ఎన్నో వస్తువులు కొనుక్కొని వచ్చారు. వాటిని చూసిన గురుదేవులు, 'అద్భుతంగా వున్నాయి, బాబూ! ఇప్పుడు ఆ మూడింటిని ఒకేసారి పలికించు' అన్నారు. ఆ విధంగా చేస్తే రామాకు ఏమీ అర్థంకాలేదు. తర్వాత ఆయన ఆ సంఘటన నుంచి నేర్చుకున్న విషయాలు ఎన్నో వున్నాయి.

వ్యామోహం, దురాశ ఎవ్వరికీ తృప్తి నివ్వలేవు. అన్నీ పోగుచేసుకోవాలని కోరిక పెరిగితే బాధల సుడిగుండంలో పడిపోతారు. అటువంటి అజ్ఞానం గుడికి వెళ్ళినా, చర్చిలో పూజలు చేసినా, ఉపన్యాసాలు విన్నా, పూజల తతంగం చేసినా పోదు. శతాబ్దాల తరబడి మనుషులు ఏవేవో కోరుతూనే వున్నారు అవి నెరవేరుతూనే వున్నాయి. అయినా, పరిస్థితి దయనీయంగానే వుంది. అంతిమ సత్యాన్ని పొందేందుకు వీటన్నిటినీ వదలించుకోవాలి.

అవసరానికి మించి ఏమీ ఉంచుకోకూడదు. వాటివల్ల ఎవరికైనా అడ్డంకులే. అందువల్ల డబ్బు, సమయం వృధా అవుతాయి. అవసరాలను అర్థం చేసుకోకుండా కోరికలను, వాంఛలను తీర్చుకోవడంవల్ల ఆత్మజ్ఞానం నుండి దూరంగా వెళ్తాం. బాధకు కోరిక తల్లివంటిది. ప్రాపంచిక లాభాలకోసం వున్న కోరికలను ఆత్మజాగృతికోసం మళ్ళిస్తే ఆ కోరికే మంచి సాధనం అవుతుంది. ఈ దశలో కోరిక ఒక ఆటంకం కావడానికి బదులు ఆత్మజ్ఞానానికి ఎంతో మేలు చేస్తుంది.

ఒక చిన్న పోలిక చూద్దాం: కొవ్వొత్తి వెలిగేటప్పుడు చల్లని గాలి త్వరగా మంటను ఆర్పుతుంది. జాగ్రత్తగా కాపాడితే ఆ మంటే అడవిని కాల్చివేస్తుంది. అప్పుడు అదే చల్లనిగాలి మంటను వ్యాపింపజేస్తుంది; అదేవిధంగా సాధకుడు క్రమశిక్షణరూపంలో లోపలవున్న కోరికల మంటను కాపాడుకుంటే అది మరింతగా పెరుగుతుంది. ముందు అడ్డంకి అనిపించినా, తర్వాత మార్గంగా మారుతుంది. నిజానికి అవి అడ్డంకులే కావు. మనం సృష్టించుకున్న పెద్ద అడ్డంకి వ్యామోహమే. దానిని తొలగించుకుంటే ఏ ఆటంకమూ ఉండదు.

ఈ అద్దాలు తొలగించుకునేందుకు నాలుగు మార్గాలున్నాయి. వస్తువే లేకుంటే మనసుకు దానిపై వ్యామోహం చూపే అవకాశమే వుండదు. అంచేత వస్తువును వదిలేయడం ఒక దారి. మామూలు ప్రజలకు అది చాలా కష్టం. వస్తువునే మార్గంగా వాడుకోవడం రెండవ పద్ధతి. ఇందులో ధోరణులు మార్చుకోవలసి వుంటుంది. ఆ విధంగా చేయగలిగినా వ్యక్తి చెడుగా వున్న పరిస్థితులను కూడా తనకు అనుకూలంగా మార్చుకోగలడు. తన పనులు నేర్పుగా, నిస్వార్థంగా ఎలా చేయాలో నేర్చుకునే విజయవంతమైన మార్గం మూడవ పద్ధతి. ఇందులో కర్మఫలాలు అందరి మేలుకు ఉపయోగించడం జరుగుతుంది. అటువంటి వ్యక్తి వ్యామోహాలు వదిలి జీవిత సాగరాన్ని అవలీలగా దాటేస్తాడు. ఇక నాలుగవ మార్గం ఆత్మ శరణాగతి. తనకున్నవి భగవంతునికి అర్పించి, వ్యామోహాల నుండి స్వేచ్ఛగా జీవించడం అంటే ఇదే. ఇది చూసేందుకు సులభంగా కనిపించినా, కొంచెం కష్టమైనదే.

గురుదేవులు ఎప్పుడూ రామా తప్పులు సరిదిద్దలేదు. పైగా, మనిషికి వున్న బలహీనతలవల్ల బుద్ధి, మనసు ఎలా మారుతాయో రామానే స్వయంగా తెలుసుకునేలా చేశారు. 'అది చేయి, అది చేయకు' అని ఆయన ఎన్నడూ ఆదేశించలేదు. దారి చూపారంతే. 'స్వయం నిర్ణయం ఉండాలి. ఒంటరిగా సాగిపోవాలి' అనే పాఠం రామా నేర్చుకున్నాడు.

## 6.5 అన్నీ అనుభవించి పరిత్యజించాలి

స్వామీ రామా యువకుడుగా వున్నప్పుడు ఖరీదైన సూటూ, బూటూ ధరించేవారు. బట్టలుకొని, టైలర్‌కిచ్చి దగ్గరుండి కుట్టించేవారు. సూటు, టై, కర్చీఫ్ (చేతిగుడ్డ) అంతా మ్యాచింగ్ వేసుకునేవారు. దానితో గురుదేవులను చూసేందుకు వచ్చేవారు బుగ్గలు నొక్కుకునేవారు. ఇలా అయిదేళ్లు గడిచాయి. అయినా, గురుదేవులు ఏమీ పట్టించుకోలేదు. రామా తన ఎదుగుదలకు అవసరమైన పాఠం నేర్చుకుంటున్నారు. ఒక రోజు గురుదేవులు తన ముందు నిలబడిన రామాతో 'నీ టేస్టు (అభిరుచి) ఏమీ బాగాలేదు' అన్నారు. బిత్తరపోయిన రామా, 'కానీ, గురుదేవా! నాకున్న వాటిలో ఇది మంచి డ్రెస్సు' అన్నారు.

ఇంకో రోజు మామూలు జుబ్బా, పైజామాలో వెళ్ళారు. 'ఇప్పుడు అందంగా వున్నావు నీవు' అన్నారు గురుదేవులు. 'ఈ లోకంలోని వాటిని అనుభవించు. వాటి విలువ తెలుసుకో. విశ్లేషించు. తర్వాత వాటిని వదిలేయి' అన్నారాయన.

నిరాడంబర జీవనం, ఉదాత్త భావనం రసాత్మకమైన భావాన్ని కలిగిస్తాయి. అయితే, ఇందుకు చాలా కాలం పడుతుంది. ఖరీదైన బట్టలు మన వికారాన్ని దాచలేవు. స్టయిలుగా వున్న బట్టలకు మనల్ని అందంగా చూపే నేర్పులేదు. బాహ్య సౌందర్య ప్రదర్శనకు బదులు అంతః సౌందర్యం ప్రదర్శించడం నేర్చుకోవాలి. అంతఃసౌందర్య ప్రకాశాన్ని అందరూ చూస్తారు.

పరిత్యాగం అనేది నిప్పుల బాట. ప్రాపంచిక విషయాలను అనుభవించి, వాటిని దహించిన వారికే అది సాధ్యం. ఒక్కోసారి కొందరు ఉన్నట్లుండి ప్రాపంచిక లాభనష్టాలపట్ల అసంతృప్తితో ఈ ప్రపంచాన్నే వదిలేయాలని అనుకుంటారు. బయట ఆనందంవున్నా లోపలి గందరగోళం దానిని అనుభవించనివ్వదు. నిరాశలు, దురాశ,

కాంక్ష, ద్వేషం, ప్రేమ, కోపం, ఈర్ష్య మొదలైనవాటిని ఆధ్యాత్మిక క్రమశిక్షణ లేకుండా త్యజించడం వీలుకాదు. నిరాశతో, అసంతృప్తితో కొట్టుమిట్టాడేవారికి త్యాగ మార్గం తగదు. గుహలో కూర్చుని ప్రాపంచిక విషయాల గురించి ఆలోచిస్తూ వుండడం ఘోరం.

స్వామీ రామా నిరాశతో కూడిన బాల్యంకాక, మామూలు బాల్యమే గడపాలని గురుదేవుల కోరిక. ఒక సమయంలో రామా మంచి కార్లు కొని, అమ్ముతూ కులాసాగా గడిపారు. రాజకుమారుడికన్నా ఘనంగా జీవించారు. మిత్రులు, బంధువులు, ఆఖరుకు పోలీసులు కూడా ఇతను ఇంత దర్జాగా బతికేందుకు డబ్బు ఎక్కడినుండి వస్తోందో అని విస్తుపోయేవారు. అసలు రహస్యం ఏమిటంటే – గురుదేవులు స్వామీ రామా ఎంతడిగితే అంత ఇచ్చేవారు. గురుదేవులకు డబ్బు ఖర్చు పెట్టడమూ తెలీదు, దాచుకోవడమూ తెలీదు.

ప్రాపంచిక విషయాల విలువ తెలిశాక రామా నెమ్మది పొందారు. అందువల్ల మనస్సు ప్రశాంతంగా వుండి, సవ్యంగా ధ్యానం చేసుకోగలిగారు. గుప్తంగా దాగివున్న కాంక్ష ప్రమాదకరమైనది. ఎందుకంటే, అది మామూలు జీవితంలో కన్నా ధ్యానంలోనే ఎక్కువగా విజృంభిస్తుంది. ప్రాపంచిక విషయాలపై కాంక్ష ఆత్మజ్ఞానానికి అడ్డుగోడ కడుతుంది.

ఒకనాడు స్వామీ రామాతో గురుదేవులు – 'గంగాతీరం వెళ్దాం పద. నీకు ఇంకో పాఠం చెప్పాలి' అన్నారు. వారి సంభాషణ ఈ విధంగా జరిగింది –

రామా : ఏమిటి గురుదేవా ఆ పాఠం?

గురు : నీవు హిమాలయాలలో ఎందుకున్నావు?

రామా : ఆధ్యాత్మికతను అభ్యసించేందుకు

గురు : ఎందుకది?

రామా : ఆత్మజ్ఞానానికి, పరిపూర్ణతకు

గురు : మరైతే ప్రాపంచిక విషయాలను ఎందుకు కోరుతావు? అసలు ప్రపంచంతో పనేమిటి నీకు? సన్యాసిగా గుహలో ఉంటూ కూడా ప్రాపంచిక విషయాల గురించి ఆలోచిస్తున్నావంటే, నీకు తీర్చుకోవలసిన కోర్కెలు గుప్తంగా ఉన్నాయనే కదా! క్రమశిక్షణ ద్వారా తప్ప దానిని మరే విధంగానూ పోగొట్టుకోలేము. స్వీయ క్రమశిక్షణ ద్వారా ప్రత్యక్ష అనుభవం లభిస్తుంది. దానిద్వారా ఎరుక విస్తరిస్తుంది. జీవిత ప్రయోజనం విస్తరణే.

ఈ విషయం చెబుతూ – 'నిజమే. ప్రపంచంలో ఆకర్షణలు, ప్రలోభాలు చాలా శక్తివంతమైనవే. అయితే, ఆత్మజ్ఞానంపట్ల తీవ్రమైన కోరిక ఉంటే ఇవేమీ చేయలేవు' అంటారు స్వామి రామా.

## 6.6 త్యాగపథం - కర్మపథం

గురుదేవులు స్వామీ రామాను సర్వసంగ పరిత్యాగివి కమ్మని ఎప్పుడూ కోరలేదు. 'అన్నీ అనుభవించు నీకు కావలసినవి నిర్ణయించుకో. నా నుంచి ఏమైనా నేర్చుకో. అయితే, స్వతంత్రంగా ఎదుగు. నా సాయం కావాలన్నప్పుడల్లా నేనిక్కడే ఉంటాను'

అన్నారు. రామా ఎప్పుడు ప్రశ్నించాలనుకున్నా 'అలసిపోయావా? నీ అంతట నీవు జవాబు తెలుసుకోలేవా? పదే పదే ప్రశ్నలతోటి నా దగ్గరకెందుకు వస్తావు? ప్రశ్నలను విశ్లేషించే పద్ధతి నీకు చెప్తాను. ఊరికే జవాబులు చెప్పను' అనేవారు.

ప్రాపంచిక విషయాలతో రామాను ప్రలోభపెట్టే ప్రయత్నాలు ఆయన చాలావే చేశారు. 'ప్రపంచంలోకి వెళ్ళు. పెద్ద ప్రభుత్వ ఉద్యోగివికా. నాతోనే ఉండిపోయి, నేనే కావాలనుకుంటే మంచిది కాదు. నువ్వు ప్రపంచంలో స్థిరపడ్డమే నాకిష్టం. నీకు కావలసినంత డబ్బిస్తాను' అన్నారు. 'నాకు కావలసింది అదికాదు' అన్నారు రామా నిశ్చయంగా. 'నిశ్చయంగా అంతేనా?' అంటూ పర్వతాలపైకి తీసుకువెళ్ళి, 'నీకు నగలంటే ఇష్టం కదూ?' అని అడిగారు గురుదేవులు. నిజమే. రామాకు అందమైన వస్తువులంటే వ్యామోహం వుంది. రామాలో దాగిన కోరిక ఆయనకు తెలుసు. 'చూడిక్కడ! దీన్ని చూడు' అన్నారు. ఆశ్చర్యం! రామా ముందు నగల గుట్ట నిలిచి వుంది. రామా నమ్మలేక కళ్ళార్పి మరీ మరీ చూశారు. 'అది భ్రమ కాదు. నిజమే. వెళ్ళు. నీకు కావలసినవి తీసుకో. అవి అసలైన నగలే. నాది పోమీ. అవి నీకే. తీసుకో. నీవు ఇప్పుడు దేశంలోనే అందరికన్న ధనవంతుడివి. ఇక వెళ్ళు. నేను పర్వతాలలో చాలా దూరం వెళ్ళాలి' అన్నారు గురుదేవులు.

రామా కళ్ళ వెంబడి కన్నీరు ధారగా కురిసింది. 'నన్ను విసిరివేయాలనుకుంటున్నారా? మీకు బదులుగా నేను నగలు కోరుకోవాలా? వద్దు. మీతోనే ఉంటాను నేను' అన్నారాయన. 'సరే, నాతోనే ఉండాలంటే అక్కడ చూడు. పైకెగసిన మంట చూశావా?' అడిగారాయన. ఆశ్చర్యం! అక్కడ గోడల్లాగా పెద్ద మంటలున్నాయి. 'ఈ మంటల ద్వారా నీవు వెళ్తే నన్ను అనుసరించినట్లే. దేన్ని ఎన్నుకుంటావు? నీవే నిర్ణయించుకో. ప్రపంచంపై నీ కోరిక ఎంత వుంది? ఆ జ్యోతి మీద ఎంత వుంది?' అన్నారాయన.

'నాకు ప్రలోభాలు వద్దు. అగ్ని కావాలి. మళ్ళీ పుట్టాలి నేను. వేరే మార్గం లేదు' అన్నారు రామా. ఈ విధంగా ఆయన వైరాగ్యపథాన్ని ఎన్నుకున్నారు.

'వైరాగ్యపథం అసిధారా వ్రతం వంటిది. కత్తి మొనమీద నడవడం ఎంత కష్టమంటే ఏ దశలోనైనా కిందపడే ప్రమాదం వుంది. అన్ని అడ్డంకులలోను స్వార్థం నిండివున్న కోరిక చెడ్డది. భయంలేనివారికి, ప్రాపంచిక వ్యామోహాలపై ఆకర్షణలు లేనివారికి మాత్రమే వైరాగ్యపథం అనుకూలమైనది. ఆత్మజ్ఞానంపట్ల ఏకాగ్రదృష్టి ఉన్నవారిదే గెలుపు. ఈ దారిని ఎన్నుకునేవారు అరుదు. ఇది అందరిదీ కాదు. అయితే. ఈ మార్గంలో జీవితాన్ని గడిపేవారు ధన్యులు. కర్మపథం కూడా అంతే సహాయకారి. అయితే, ఈ లోకంలోనే ఉంటూ చేసే పనులు నిస్వార్థంగా, నేర్పుగా, ఈ లోకానికి అతీతంగా ఉండే విధంగా ఉండాలి. రెండింటి లక్ష్యం సమానమే' అంటారు స్వామీ రామా.

## 6.7 స్వామిగా రామా తొలిరోజులు

రామా స్వామిగా ఆశ్రమ స్వీకారం జరిపిననాడు గురుదేవులు 'స్వామి భిక్షాటన చేయవలసి వుంటుంది తెలుసా?' అన్నారు. 'అయ్యో!' అన్నారు రామా. అప్పుడు గురుదేవులు 'నీలోని అహంవల్ల నీవు వేరు, ఇతరులు వేరు అనుకుంటున్నావు. ఈ

అహాన్ని స్వచ్ఛంగా తయారుచేయాలి. వినయం లేకుంటే అది జరగదు. పేదవారింటి భిక్షకు పంపుతాను. అప్పుడే నీవెవరో నీకు తెలుస్తుంది' – చెప్పారు గురుదేవులు. 'చిత్తం' అన్నారు రామా. తర్వాత జరిగిన విషయం స్వామీ రామా మరెన్నడూ మరిచిపోలేదు.

అప్పట్లో రామా ఆరోగ్యంగా, పట్టు వస్త్రాలు ధరిస్తూ ఉండేవారు. భిక్షగాడు పట్టువస్త్రాలు ధరించడం ఎవరైనా సహించగలరా? రామా ఎవరినీ లక్ష్యపెట్టేవారు కాదు. దానిని చూసి ఆయనకు గర్వం అని ఎవరైనా అనుకోవచ్చు. ఒకరోజు ఉదయం ఒకామె ఆవుపాలు తీస్తుండగా వెళ్ళారాయన. అక్కడ నిలబడి 'నారాయణహరి' అని తన రాకను తెలిపారు. ఆమె కంగారుపడి లేవడంలో కుండ పగిలింది. 'భగవాన్!' అనుకున్నారు రామా. ఆమె కోపంగా అరిచింది – 'అంత బలంగా, ఆరోగ్యంగా వున్నావు. నీవు అడుక్కుంటావా? నీవు దేశానికి భారం. నీ సొంతానికీ బరువు చేటే. ఈ భిక్షాటనం ఎవరు నేర్పారు నీకు? పట్టుబట్టలు కొనుక్కునేందుకు డబ్బులున్నా అడుక్కుతినాలా?'

రామాకు చిన్నతనం అనిపించి, 'దయచేసి తిట్టకండి' అన్నారు.

ఆమెకోపం తగ్గలేదు. 'ఈ కుండ నాకు మా అత్తగారు ఇచ్చింది. నీవు పరాన్నభుక్కువు. నాకు దూరంగా వెళ్ళిపో' అందామె. అలాగే అభిమానంకొద్దీ ఏదో అంటూనే వుందావిడ.

రామా గురుదేవుల దగ్గరకు వెళ్ళారు. సాధారణంగా 'భోం చేశావా?' అని అడగడం గురుదేవులకు పరిపాటి. అలాగే ఆయన అడిగితే చెప్పవచ్చు అనుకుంటున్నారు. కానీ, రోజంతా ఆయనేమీ అడగలేదు. 'ఈ వేళ అన్నం తిన్నావా? అని నన్ను మీకు అడగనేలేదు?' అన్నారా సాయంకాలం రామా నిష్ఠూరంగా.

'ఎందుకు అడగాలి? ఇప్పుడు నీవు స్వామివి కదా!'

'అంటే?'

'స్వామి తనకుతానే యజమాని. ఆకలిదప్పులకు యజమాని.'

'అంటే. స్వామి వ్యవహారం వుంటే నన్ను మీరు పట్టించుకోరనేనా అర్థం?'

'ఇప్పుడు నీవు స్వామివే. నేనూ స్వామినే. మనిద్దరిమధ్య తేడా ఏముంది? నీవు స్వామివి కావాలనుకున్నావు నీ సంగతి నీవే చూసుకోవాలి. నేనేం నీ ఊతకర్రనా?'

రామాకు విచారంగా వుంది. ఉక్రోషంగా వుంది. ఇకపై తన సంగతి తనే చూసుకోవాలని నిర్ణయించుకున్నారు. 'ఇకపై నేను భిక్షాటన చేయను. ఏమైనా జరగనివ్వండి. నేను బతకాలని దేవుడు అనుకుంటే నేను బతుకుతాను. ధ్యానం చేస్తాను. చచ్చినా భిక్షాటనకు వెళ్ళను' అన్నారాయన గురుదేవులతో. 'నీ ప్రమాణానికి కట్టుబడి వుంటానంటే నీ ఇష్టం. నేనేమీ చెప్పేది లేదు. నీవూ స్వామివే' అన్నారు గురుదేవులు సమాధానంగా.

ఈ మాటలు విని గంగాతీరానికి వెళ్ళి కూర్చున్నారు. ప్రజలు ఆయన్ని చూసి ఆయన ఆలనాపాలనా ఎవరైనా చూస్తున్నారేమో అనుకున్నారు. చాలా మంది పూలు తెచ్చి ఆయన ముందుంచి నమస్కరించి వెళ్ళారు. కానీ, ఎవరూ పండ్లుకానీ, తినేందుకు మరేమైనాకానీ ఇచ్చిన పాపాన పోలేదు. పదమూడు రోజులపాటు ఇలా జరిగింది. రామాకు బలహీనంగా వుంది. 'ఎందుకిలా స్వామిని కావాలనే వెర్రి ఆలోచన

వచ్చింది నాకు?' అనుకున్నారు. ఏడుపు వస్తోంది. అమ్మవారిని తలచుకున్నాడు. 'నేను ఈ మార్గంలో నడవాలనుకున్నాను. తినేందుకు రొట్టెముక్క కూడా గతి లేకపోయింది.' హఠాత్తుగా నీళ్ళలోనుండి ఒక చేయి వచ్చింది. అందులో ఆహారం నిండిన పాత్ర వుంది. అది రామావైపు వచ్చింది. 'ఇది నీకే' అని వినిపించింది. రామా దాన్ని తీసుకుని తిన్నారు. ఎంత తిన్నా ఆ పాత్ర నిండుగా వుంది. తర్వాత అది ఆయనతో మూడు సంవత్సరాలు ఉండింది. దానితో ఎంతోమందికి అన్నం పెట్టారు కోరినవన్నీ ఇచ్చే ఆ పాత్రకోసమే వేలాదిమంది వచ్చేవారు. వారెంత పాలు దానిలో పోసినా అది పొర్లేదికాదు. వారికి రామా బోధనలకన్నా ఆ పాత్రపట్లనే ఆసక్తి పెరిగింది. రామాకూడా దానికి బానిసైనారు. అదంతా చూసి 'దానిని గంగలో పారెయ్' అన్నారు గురుదేవులు. రామా ఆయన సలహాను పాటించారు.

'మనం దారిలో వున్నప్పుడు దేవుడు ఎన్నో ఆకర్షణలను సృష్టిస్తాడు. వాటన్నిటిని తిరస్కరిస్తేనే మనం లక్ష్యం చేరుకునేది. బాబు ఏడ్చినప్పుడు అమ్మ మిఠాయి పెడ్తుంది. అప్పటికీ మానకపోతే బొమ్మలు మొదలైనవి ఇస్తుంది. అదీ దాటిపోతే రెండు దెబ్బలు వేస్తుంది. ఆత్మజ్ఞానపథంలోనూ ఇలాగే జరుగుతుంది. భిక్షాటన సన్యాసికి తప్పనిసరి. ఇతరులకది సిగ్గుచేటుపని. దేవుని దయను నమ్ముకున్నవారికి అన్న వస్త్రాలకు లోటుండదు. వాటికోసం విచారం వుందంటే పూర్తిగా నమ్మకం లేదన్నమాట! ఆఖరి శ్వాస విడిచేవరకూ దేవుడే తన ఆస్తి అనీ, అతనిపై తప్ప మరెవరిపైన అయినా ఆధారపడ్డం ఘోరమైన విషయం అనీ, అనుకున్నారు రామా. దేవుడు తనముందు నడుస్తూ కావలసినవి ఇస్తున్నాడని ఆయన విశ్వాసం.'

## 6.8 ఆత్మజ్ఞానానికి కాషాయం అవసరమా?

స్వామీ రామాకు ఇరవైఒక్క సంవత్సరాల వయస్సున్నప్పుడు రుషికేశ్ నుండి ఎనిమిది కిలోమీటర్ల దూరంలోవున్న గంగాతీరంలోని కుటీరంలో వున్నారు. ఒంటరిగా వున్నందువల్ల అంతా ఆయనను గొప్ప ఋషి అనుకున్నారు. 'మనం ఒంటరిగా వుండి, వింతగా కనిపిస్తూ, ఎప్పుడూ ఏమీ చదవకున్నా పుస్తకాల కట్ట మన పక్కన వుంచుకుని, ఎవరూ పట్టనట్లు కనిపిస్తే చాలు - మనం ప్రజల దృష్టిలో గొప్ప స్వాములం అయిపోతాము' అంటారు స్వామీ రామా.

రోజంతా ఆయనకోసం ప్రజలు వచ్చేవారు. నిత్య అభ్యాసానికి కూడా వ్యవధి వుండేదికాదు. జనం కానుకలు ఇవ్వడంతోనే రోజులు గడిచేది. మొదట్లో రామాకు బాగానే వుండింది. తర్వాత క్రమంగా దానిపట్ల మోజు పోయింది. 'ఏమిటంతా? సమయం వృథా కావడమే కదా?' అనిపించింది.

క్రమంగా ప్రజలు రాకూడదని కోపగించడం మొదలుపెట్టారు. 'స్వామికి కోపం రావడం ఏమిటి? మనల్ని రానివ్వకుండా వుండేందుకు ఈ ఎత్తు' అనుకుని మరింతమంది వచ్చేవారు. అది రామాకు మరింత చిరాకు కలిగించింది. వాళ్ళను తిట్టసాగారు. అయినా, వారు 'మీ తిట్లు మాకు దీవెనలులెండి స్వామీ' అన్నారు. అక్కడినుంచి పారిపోదామా అనుకున్నారాయన. ఇంతలో 'నా కోపాన్ని నేను జయించలేదు' అనిపించింది.

ఇలా చాలామంది సన్యాసులకు జరిగింది. వారికి అంతరాయం సహజం. స్వామి

ప్రజలను ఆకర్షించే ప్రయత్నాలు చేయకూడదు. అభ్యాసానికి అంతరాయం కలిగేలా వుండకూడదు. స్వామి జీవితం కఠోరమైనది. మామూలు ప్రజల దృష్టిలో వారు అసాధారణ వ్యక్తులు. మనదేశంలో స్వామి అంటే సర్వశక్తిమంతుడు, జబ్బులు నయంచేసే వైద్యుడు, బోధకుడు. ఒక్కోసారి ఈ స్థితి పగవాడికి కూడా వద్దు అనిపించే పరిస్థితి ఏర్పడుతుంది.

ప్రజల దృష్టిలో స్వామి సాధకుడుగా వుండలేదు. కాషాయం కడితే చాలు. అతను అన్నీ చేయగలడని నమ్ముతారు. ఇందువల్లనే వారిలో స్వాముల నుంచి ఎదురుచూడడం, అనుకున్నవి జరగకుంటే నిరాశ చెందడం ఎక్కువ. 'నేనింకా సాధకుడినే. నేర్చుకుంటున్నాను. దయచేసి నన్ను ఒంటరిగా ఉండనివ్వండి' అన్నా ఎవ్వరూ వినేవారు కాదు. పైగా, ఆ మాటలు తమకు తోచినట్లు అన్వయించుకుని పదేపదే వచ్చేవారు. అడవులలో ఎక్కడో మారుమూలవున్నా ఈ తిప్పలు తప్పలేదు.

'ఆత్మజ్ఞానానికి కాషాయ బట్టలు తప్పనిసరేమీ కాదు. అసలు కావలసింది మనస్సును, మాటను, పనిని క్రమశిక్షణవైపు నడిపించే సాధన. స్వామిగా వుంటే అద్భుతంగా వుంటుంది. కానీ, నిజమైన స్వామిగా వుండడం ఎంతో కష్టం' అంటారు స్వామీ రామా.

## 6.9 రాళ్ళగుట్ట స్వామి - కంకరియా బాబా

ఆత్మజ్ఞాన సాధకులకు ప్రజల వల్ల కలిగే ఇబ్బందులు ఎక్కువే. పైగా, మన దేశంలో స్వామి అంటే ఎవరేం అడిగినా చెప్పాలి. అష్టకష్టాలకూ పరిష్కారమార్గం చెప్పాలి. వయమైనవారు గోరంతలు కొండంతలు చేయడంతో ఆ స్వామికి తిప్పలు తప్పవు. అభ్యాసానికి సమయం లేక కేవలం స్వామిగా ఉండిపోవలసి వస్తుంది. అటువంటి సమస్యలు రాకుండా వుండాలంటే వారు మారువేషంలో సాధన చేసుకోకతప్పదు. నిజ జీవితంలో గొప్ప యోగులు ప్రజల బారినుండి తప్పించుకునేందుకు పిచ్చివారిలాగా ప్రవర్తిస్తారు. అటువంటివారిలో కంకరియా బాబా ఒకరు.

ఒక స్వామి దగ్గరికి ప్రజలువచ్చి తిండి, డబ్బు సమర్పించి వెళ్లేవారు. ఆయనకు అది ఇష్టంలేదు. అందుకని 'నన్ను ఇష్టపడేవారు నా కోసం ఒక కంకరరాయి మాత్రం తెస్తే చాలు' అని రాయించి పెట్టారాయన. 'ఓహో! స్వామివారికి రాళ్ళంటే ఇష్టం కాబోలు' అని అందరూ రోడ్డు పక్కల పడివుండే రాళ్ళు తీసుకురావడం మొదలుపెట్టారు. క్రమంగా రాళ్ళగుట్ట ఎంతో ఎత్తుగా అయింది. దానిపైన ఆ స్వామి కూర్చునేవాడు. క్రమంగా ఆయన పేరు రాళ్ళ బాబా లేక కంకరియా బాబా అయింది. దీనితో ఆయనకు, ప్రజలకు కాస్త దూరంగా వుండేందుకు వీలైంది.

తర్వాత ఆయన ఎవరికీ అర్థంకాని భాషను మాట్లాడేవారు. ఎవరువచ్చినా 'డూడూడూడూడూ' అనేవారు. రామాతో కూడా అలాగే అన్నారాయన. ఆయన వంటరిగా వున్నప్పుడు రాత్రిపూట ఆయనను ఎందుకిలా చేస్తున్నారని అడిగారు రామా. 'ప్రజలు నాకు ధ్యానభంగం కలిగించకుండా వుండేందుకు ఈ కొత్త భాష మొదలుపెట్టాను. దీనితో నాతో ఎవరూ మాట్లాడలేరు కదా?' అన్నారాయన.

స్వామీ రామాకు ప్రజలనుంచి అంతరాయం లేకుండా ఉండేమార్గం బోధిం

చారాయన. 'ఒకే మనిషి అహానికి ఎన్నో రూపాలున్నాయి. అందుకే ఎన్నో వ్యక్తిత్వాలున్నాయి. కొన్నిటిని మనం కనిపెట్టి విశ్లేషించగలం. అయితే, మనకు చాలావరకు తెలియకుండాపోతాయి. దేవుడి రూపంలో మనం మన అహాన్ని పూజిస్తున్నాం' అని ముగించారు కంకరియా బాబా. 'అహంలో కింద, పైన అనే భాగాలున్నాయి. కింది అహానికి లోపలున్న వాస్తవం తెలిస్తే, అది పై స్థాయికి వెళ్తుంది. పై అహం సాయపడేది. కింది అహం బాధ కలిగించేది' అంటారు స్వామీ రామా.

## 6.10 ఆకర్షణలకు లొంగితే అధోగతే!

ఆత్మజ్ఞాన పథంలో వచ్చే ఆకర్షణల గురించి చెప్పేందుకు స్వామీ రామాకు ఒక స్వామి ఈ కథ చెప్పారు.

ఒకతను సన్యాసం తీసుకోవాలనుకుని స్వామిగా మారాడు. ఆయన గురువు ఆయనతో 'బంగారం, ఆడవాళ్ళు, పేరు ప్రతిష్ఠలను మాత్రం దగ్గరకు రానివ్వకు' అని హెచ్చరించాడు. ఒకరోజు ఆ స్వామి నదిని దాటుతున్నాడు. నదిగట్టు కొంత కోసుకుపోతున్నట్లు చూశాడు. అదే సమయంలో బంగారు నాణేలున్న జాడీలు కనిపించాయి. 'నేను లోకాన్ని వదిలేశాను. అంచేత నాకివి అనవసరం. అయినా, దీనితో ఒక గుడి కట్టిస్తే మంచిది కదా!' అనుకున్నాడు. కొందరు కూలీల దగ్గరకువెళ్ళి తనకు దొరికిన నిధి చూపించి గుడి కట్టమని అడిగాడు.. వారికి దురాశపుట్టి స్వామికి 'అంత డబ్బు ఎందుకు? వీడిని ఈ నదిలో తోసేసి నిధిని మనం పంచుకుందాం' అనుకుని, స్వామిని నీళ్ళలోకి తోశారు. ఆ స్వామి దాదాపు మునిగిపోయాడు. అయితే, దేవుడి దయవల్ల ఎలాగో బయట పడ్డాడు. 'ఇక ఏమైనా డబ్బు మాత్రం వద్దు' అనుకున్నాడు. అడవిలోకి వెళ్ళాడు. ఎవరు వచ్చినా 'ఆగండి. డబ్బుంటే మాత్రం దూరంగా పెట్టి రండి' అనేవాడు. ఒకామె వచ్చింది. 'దగ్గరకు రాకు' అన్నాడు.

'స్వామీ! రోజూ మీకు కొంచెం ఆహారం వుంచి వెళ్తాను' అందామె. అయితే క్రమంగా ఆమె అతనికి దగ్గరవుతూ వచ్చింది. స్వామికి ఆమెపై నమ్మకం ఏర్పడింది. 'ఆమె నన్ను చూసుకోవాలనుకుంటూ వుంది. నేను తనకు ఆత్మజ్ఞానం బోధించాలనే కోరిక వున్నట్లుంది' అనుకున్నాడాయన.

ఒకరోజు ఆమె ఒక పిల్లిని తెచ్చింది. అయితే, అది స్వామి ఆహారాన్ని ముట్టేదికాదు. 'దానికి పాలకోసం ఒక ఆవును తెస్తేసరి' అందామె స్వామితో. 'దాన్నెవరు చూసుకుంటారు?' – స్వామి అడిగాడు. 'నేనే' – చెప్పిందామె. స్వామి సరేనన్నాడు అంతే. స్వామిని ఆమె బాగా చూసుకోవడం మొదలైంది. వారు కలిసి బతకసాగారు. ఒక బిడ్డకూడా పుట్టింది. ఒక రోజు బిడ్డను చూసుకుంటున్నాడు స్వామి. 'ఏమిటయ్యా నీకు ఈ గతి?' అన్నాడు ఆ దారే వెళ్తున్న మరో స్వామి అప్పుడు స్వామికి జరిగిందంతా గుర్తుకువచ్చి ఏడవడం మొదలు పెట్టాడు. తాను లౌకిక బంధాలలో ఎంత కూరుకుపోయాడో అర్థమైంది. అంతా వదిలిపెట్టి అడవిలోకి వెళ్ళిపోయాడు. సాధనలు చేశాడు. కొన్నేళ్ళకు కొన్ని సిద్ధులు పొందాడు.

ఒకరోజు ఒకతను దగ్గరున్న పల్లెనుండి వచ్చాడు. 'నమస్కారం స్వామీ! తమరు

మహాత్ములు, కరుణామయులు. నేను పేదవాణ్ణి. పిల్లలు తిండిలేకుండా అలమటిస్తున్నారు. సాయం చేయండి' అన్నాడు. 'సరే, నా గడ్డం వెంట్రుక ఒకటి తీసుకో. నీ ఇంటిగూట్లో వుంచుకో. రేపు నీ గూడు డబ్బుతో నిండి పోతుంది. అయితే, దాని గురించి ఎవరికీ చెప్పకూడదు' అని హెచ్చరించాడా స్వామి. 'చిత్తం' అన్నాడతను.

అయితే, ఇంటికెళ్ళగానే ఆ రహస్యం భార్యకు మాత్రం చెప్పాడు. క్రమంగా అది అందరికీ తెలిసిపోయింది. వందలాది భక్తులు వెళ్ళి స్వామి గడ్డం మొత్తం ఊడబీకేశారు. ముఖమంతా రక్తంతో ఎర్రగా మారింది. మళ్ళీ సాధన కొత్తగా మొదలు పెట్టవలసిన ఖర్మ పట్టిందాయనకు. అయితేనేం? గొప్పపాఠం నేర్చుకున్నాడాయన. కాంతాకనకాలు, కీర్తి ప్రతిష్ఠలు ఎంత అనర్థం తెస్తాయో స్వయంగా అనుభవించాడు.

ఈ కథను చెప్పిన స్వామి 'నీవు మరవరాని పాఠమిది. ఈ మార్గంలో నిన్ను కలిసే స్వాములందరికీ ఈ కథను చెప్పు' అన్నారు స్వామీ రామాతో.

## 6.11 పెళ్ళి కావాలి

స్వామీ రామా ఉత్తరప్రదేశ్‌లో వున్నప్పుడు సాయంకాలం పూట, ప్రజలు ఆయన దర్శనంకోసం వచ్చేవారు. వారికి స్వామీ రామా ఉపనిషత్తుల గురించి చెప్పేవారు. ఒక రోజు ఒకామె వచ్చింది. ఆమె ఇంగ్లీషు ఎమ్.ఏ. చదువుతున్నది. గతజన్మలో తానాయన భార్యననీ, ఈ జన్మలో కూడా భార్యనౌతాననీ కూర్చుంది. తర్వాత రామా ఆమె తల్లితో మాట్లాడారు. ఆమె కూడా సమర్థించింది. దానితో రామాకు కూడా కొంచెం వ్యామోహం ఏర్పడింది. 'కలిసి జీవిద్దామా?' అనిపించింది. ఆ అమ్మాయి అన్నదమ్ములు, బంధువులు అందరూ మంచి ప్రభుత్వ ఉద్యోగాలలో వున్నవారు. వారంతా కూడా ఆమెను పెళ్ళి చేసుకోమన్నారు. ఒక సంవత్సరం పాటు చెడ్డకాలంలాగా వుండింది. రామాకు అగమ్యగోచరంగా వుంది. ఆధ్యాత్మిక పథంలో విద్యార్థికి ఎటువంటి అంతరాయం కలుగవచ్చో ఆయనకు అప్పటికే తెలుసు. గురుకృప, దైవానుగ్రహం మాత్రమే ఈ అడ్డంకులను తొలగిస్తాయని ఆయన అనుకున్నారు.

ఆఖరుకు గురువులకు విషయం చెప్పి, నిర్ణయం ఆయనకే వదిలేశారు. ఆయన రామాను ఎప్పుడూ అదుపులో వుంచలేదు. అవసరమైతే సలహాలు మాత్రం ఇచ్చేవారు. ఎప్పుడైనా కొద్దిగా ఎదిరించినా ఆఖరుకు ఆయన చెప్పినట్లే రామా చేసేవారు. 'నీకో సమస్య ఇచ్చాను. నీవు పూర్తిచేయలేదు. ఏమీ ఆలోచించకుండా ప్రాపంచిక విషయాలు, ఆధ్యాత్మిక సాధనలు పరీక్షించి ఆధ్యాత్మిక పథంవైపు వెళ్ళాలనుకున్న తర్వాత ఇప్పుడు మళ్ళీ ఆకర్షణలకు లొంగుతున్నావే? ఇలా అయితే ఎన్ని జన్మలెత్తినా దారికి రాలేవు' అన్నారు. అయితే, రామాకే నిర్ణయాధికారం వదిలేశారాయన. రామా కూడా చివరికి ఆధ్యాత్మిక పథంలోనే కొనసాగాలనుకున్నారు.

ప్రపంచంలో సన్యాసం, కర్మమార్గం అనేవి రెండు ముఖ్యమైన మార్గాలు. ఒకదానితో మరొకటి పోల్చకూడదు. వేటికవే గొప్పవి. కర్మ మార్గాన్ని రామా విరసించేవారు. అయితే, అందులో జీవనాధారం దొరికినా, సమయం ఎక్కువ పడుతుంది. సన్న్యాసపథంలో సాధనకు చాలా సమయం వుంటుంది. అయితే,

తిండి, బట్ట మొదలైనవి పరిమితం. వీటికోసం గృహస్థుపై ఆధారపడాలి. ఏ మార్గం పాటించినా విశ్వాసం, శ్రద్ధ, సత్యం, నమ్మకం ముఖ్యం.

ఈ సంఘటన రామాకు సిగ్గుచేటు అనిపించింది. మామూలు ప్రజల దృష్టిలో స్వాములు, యోగులు మానవాతీతులు. ప్రాపంచిక వ్యామోహం లేనివారు. అందువల్ల చాలామంది కపటయోగులైనారు. కపటం అనేది పెద్ద అడ్డంకి. పాశ్చాత్య మనోవైజ్ఞానికులు బ్రహ్మచర్యం ఒక మనోవైకల్యం అంటారు. బ్రహ్మచారులు తమలోపలి వ్యక్తిత్వాలను మలచుకోకుంటే వికారంగా ప్రవర్తిస్తారు. అల్పమైన కోరికలను కూడా అదుపులో వుంచుకోలేనివారు సన్యాసమార్గానికి తగరు.

ఆహార నిద్రాభయ మైధునాలు బలవత్తరమైన కోరికలు. మనిషి జీవితంపై వీటి ముద్ర, ప్రభావం ఎక్కువ. వీటిని తప్పుకోలేరు. తమకు అనుగుణమైన పద్ధతిలో ఆధ్యాత్మిక సాధన చేయవచ్చు. వీరికోసం తంత్రమార్గం వుంది. తమ కోరికలనే ఆధ్యాత్మిక అనుభవాలకు అనువుగా మలచుకోవచ్చు.

సన్యాసులు తమ శిష్యులకు క్రమశిక్షణ కోసం కొన్ని కఠోర నియమాలు పెడుతుంటారు. అవి గందరగోళం సృష్టిస్తాయి. అందువల్ల శిష్యులు కపటులుగా, విశ్వాసహీనులుగా తయారౌతారు. నిజానికి అటువంటి క్రమశిక్షణ అనవసరం. లోపల, బయట సంఘర్షణలు అనేవి ఆధ్యాత్మిక పథంలో ఒక వ్యక్తి సాగడం లేదనేందుకు సంకేతాలు - అంటారు స్వామీ రామా.

## 6.12 శంకరాచార్యులుగా స్వామీ రామా

ఈ పెళ్ళిగోల ముగిసిన తర్వాత స్వామీ రామా మళ్ళీ తన మార్గంలో కొనసాగారు. అయినా, ఆయనలో అపరాధభావన కొద్దిగా వుండింది. అందువల్ల గురుదేవులు ఆయనను నర్మదాతీరం వెళ్ళి, అక్కడ కీకారణ్యంలో ఓంకారేశ్వర్ దగ్గర ఖేరీఘాట్‌లో సాధన చేయమన్నారు. అక్కడి నదిలో మొసళ్ళు ఎక్కువ. ఉదయం, సాయంకాలం ఎన్నో మొసళ్ళు ఒడ్డుకు వచ్చేవి. నదీతీరంలో ఆరునెలలపాటు ఏ ఆటంకమూ లేకుండా వున్నారాయన. ఆయన దగ్గర ఒక నీళ్ళకుండ, ఒక గొంగళి, రెండు కాషాయాలు మాత్రమే వుండేవి. అక్కడికి ఆరు మైళ్ళలో వున్న పల్లె నుంచి ఆయనకు పాలు, రొట్టె రోజుకు ఒకసారి వచ్చేవి. ఆ ఆరునెలల కాలం ఆయన జీవితంలో గొప్పకాలం.

ఒక రోజు ఒక వేటగాళ్ళ బృందం రామా మొసళ్ళ మధ్య ధ్యానంలో వుండగా ఫోటో తీశారు. పత్రికలో ఫోటోలు, రామా గురించి కథలు వచ్చాయి. ఆ కాలంలో కరవీరపీఠం శంకరాచార్యులు వారసుని కోసం వెతుకుతున్నారు. ఆయన రామాను పరిశీలించేందుకు కొందరు పండితులను పంపించారు. వారు చెప్పినది విని తృప్తిచెంది, శంకరాచార్య పీఠానికి రమ్మని రామాను పిలిచారు.

నాటి శంకరాచార్యుల పూర్వనామం డా॥ కుర్త్‌కోటి. ఆయన మేధావి. సుప్రసిద్ధుడైన సంస్కృత పండితుడు. గీతారహస్య గ్రంథకర్త, ప్రముఖ జాతీయ నాయకుడు అయిన బాలగంగాధర తిలక్‌కు సన్నిహితుడు. గురుదేవుల అనుమతితో రామా శంకరాచార్యులైనారు. పద్దెనిమిది రోజులపాటు తీవ్రమైన సంస్కారాలు

జరిగాయి. ఎంతోమంది అభినందనలు పంపారు. స్వామీ రామాకు అదో వింత అనుభవం. ఆరునెలలు ఏకాంతవాసానికీ, ఆ జీవితానికీ ఎంతో తేడా. అప్పటికి రామా వయస్సు ముప్పైలోపే అయినా, బాధ్యత మాత్రం గొప్పది.

డా|| కుర్తకోటికి సంఘ సంస్కరణ అభిలాష ఎక్కువ. ఎంతో మందితో తాను నడిపిన ఉత్తరాయణం ఫైల్ అంతా ఆయన రామాకు ఇచ్చారు. రామా దానిని కొనసాగించారు. దానితో ఆయనకు తీరిక లేకుండా పోయింది. ఉన్న కాస్త సమయం ప్రజలను చూసేందుకు సరిపోయేది. స్వేచ్ఛ తగ్గిపోయింది. ధ్యానానికి సమయం లేకుండా పోయింది. ఇదేమీ బాగా లేదనుకున్నారాయన. 'ఇది నీకు తగినది కాదు, వదిలేయ్' అని అంతరాత్మ హెచ్చరించింది. అంచేత రెండేళ్ల తర్వాత చేతిలో పైసా కూడా లేకుండా అక్కడి నుంచి పారిపోయారాయన. ఆ ఆడంబరం, వైభోగం వదిలి, కట్టుబట్టలతో హిమాలయాలకు వెళ్లాలి. రైల్లో వెళ్ళేందుకు టికెట్ కూడా లేదు. బట్టలు చూద్దామా అంటే శంకరాచార్య దుస్తులు. ఎక్కడైనా దొంగిలించాడా అని ప్రజలు అనుమానంగా చూసేవారు. టికెట్ కలెక్టర్ ఆయనను రైలు దింపేశాడు. 'న్యాయస్థానానికి పంపనందుకు కృతజ్ఞుణ్ని' అని దిగేశారు రామా.

శంకరాచార్యుల అభిమానులకు ఇది నచ్చలేదు. ఆయన బాధ్యతల నుండి పారిపోయారని అనుకున్నారు. కానీ, రామాకు మాత్రం హాయిగా అనిపించింది. మళ్ళీ అక్కడికి వెళ్ళ లేదు. గురుదేవులతో చెప్తే ఆయన ఇలా అన్నారు: 'చూశావా! ప్రాపంచిక ఆకర్షణలు స్వామిని ఎలా లొంగదీసుకోవాలనుకుంటాయో? ఇక నీకేం ప్రమాదంలేదు. ఏ ఆకర్షణలూ నిన్ను ఏమీచేయవు. గొప్ప పదవులు చూశావు. సంస్థలు చూశావు. సన్యాసంలోకి వచ్చావు ప్రజలు ఆధ్యాత్మిక నాయకుల నుండి ఎంతో ఆశిస్తారు. నీకు చేతనైంది చేయి. వారిని ఉద్ధరించు. వారికి ఆత్మజ్ఞానం కలిగించు. అయితే, నీ మార్గాన్ని మాత్రం ఎన్నుడూ వదిలిపెట్టకు.'

## 6.13 నేనూ స్వామిని అవుతాను-పులినిచూసి నక్కవాత

ఒకతను గడ్డికోసుకుని అమ్ముకునేవాడు. అతను స్వామీ రామాను చూశాడు. 'ఈ స్వామి పనే హాయి. ఏమీ చేయడు. అయినా, జీవితాన్ని హాయిగా అనుభవిస్తున్నాడు. ఎక్కడకెళ్ళినా ఇతనికి తివాచీలు పరుస్తారు. పూలు చల్లుతారు. కుటీరాలు నిర్మిస్తారు. అవసరాలు గమనిస్తారు. నేనూ స్వామిగా వుంటే మంచిదేమో!' అనుకునేవాడు. ఆఖరుకు ఒక రోజు తన భార్యతో విషయం చెప్పాడు 'నేను ఆరునెలలపాటు ఒక ప్రయోగం చేయదలచుకున్నాను. స్వామిలాగా నటించాలనుకున్నాను' అన్నాడు. 'ఇల్లుగడిచేదెలాగ? నాకు డబ్బు కావాలి' అన్నది భార్య. 'ప్రజలు తెచ్చి ఇచ్చే డబ్బంతా నీకు ఇచ్చేస్తాకదా!' అన్నాడతను. కొంత డబ్బు దాచుకుని, దానితో బట్టలూ అవీ కొనుక్కుని స్వామి వేషం కట్టాడు. మూడు రోజులు అతన్ని ఎవరూ పట్టించుకున్న పాపాన పోలేదు. కనీసం ఆకలిగా వుందా అని కూడా అడగలేదు. తినకపోయినా రామాకు పళ్ళు, ఫలహారాలు పెట్టేవారు. తనను పట్టించుకోకపోవడం ఒకవైపు అతనికి అవమానంగా అనిపించింది. ఎవరేమి ఇచ్చినా రామా దాన్ని ఇంకొకరికి ప్రేమపూర్వకంగా ఇచ్చేసేవారు. వారం గడిచాక అతను చాలా చిక్కిపోయాడు. ఒక పైసా ఆదాయం రాలేదు. రాత్రిపూట అతను రహస్యంగా భార్యను కలిసేవాడు.

'ఎంత తెలివిలేనివాడివి? ముందు చాలా డబ్బు సంపాదించేవాడివి. ఇప్పుడు పైసా సంపాదన కూడా లేదు. కనీసం ఆ స్వామివారి దగ్గరకు వెళ్ళి, ఆయన విజయరహస్యమైనా కనుక్కోకూడదా' అన్నది భార్య.

స్వామి వేషంలో ఆయన స్వామీ రామా దగ్గరకు వెళ్ళాడు. 'రండి స్వామీ!' అన్నారాయన. 'మహాశయా! తమతో రహస్యంగా మాట్లాడాలి' అన్నాడతను స్వామీ రామా తన చుట్టూవున్న వారిని పంపించేశారు. 'మీ విజయ రహస్యం తెలుసుకోవాలని వుంది నాకు' అన్నాడతను. 'నాకే అసలు తెలియదే! నీవెలా అనుకుంటున్నావు?' అడిగారు రామా 'మీకేమో అడగకున్నా డబ్బు వస్తోంది. ఈ కుటీరం మీదే ఎంతో మంది వచ్చి మీతో కూర్చుంటారు. ఎందుకని?' అన్నాడతను. 'చూడు, నేను వాటిని కోరుకున్నప్పుడు అవి రాలేదు. వద్దనుకున్నాక వస్తున్నాయి' చెప్పారు రామా.

ఈ ఉదంతం చెబుతూ 'అదృష్టం వేశ్యవంటిది. నీవు కావాలనుకుంటే పారిపోతుంది. నీకు ఆసక్తి లేకుంటే వెంటబడుతుంది' అనే స్వామీ వివేకానంద సుభాషితాన్ని పేర్కొన్నారు స్వామీ రామా.

## 6.14 ప్రాపంచిక మోహాలు - స్వీయ క్రమశిక్షణ

ఒకప్పుడు ఒక విద్యావంతుడు స్వామి కావాలనుకున్నాడు. చాలా మంది స్వాముల మాటతీరు, ప్రవర్తన వగైరాలను గమనించాడు. ఎటువంటి క్రమశిక్షణ, సంప్రదాయం లేకుండా స్వామి వేషం కట్టాడు. అచ్చం స్వామిలాగానే ప్రవర్తించాడు.

ఒక రోజు అతను స్వామీ రామా దగ్గరికి వచ్చాడు. అప్పుడాయన హిమాలయాలలోని ఉత్తరకాశీ ఆశ్రమంలో వున్నారు. 'మీతోపాటు ఉంటాను' అన్నాడతను. రామాతో మాట్లాడేటప్పుడంతా ఆయన వాచీమీదే అతని దృష్టి వుండేది. అది ఒమేగా క్రోనోమీటర్ అనే ఖరీదైన చేతిగడియారం. రామాకు ఎవరో కానుకగా ఇచ్చారు. అతను ఏం మాట్లాడినా సంభాషణను వాచీ వైపు మరల్చేవాడు. 'చాలా బావుంది టైమ్ కచ్చితంగా చూపుతుందేమోకదా?' అనేవాడు.

మూడు రోజుల తర్వాత స్వామీ రామా అతనితో 'బాబూ! నేను కొంతకాలం గంగోత్రి వైపు వెళ్ళొస్తాను. అంతవరకు నా వాచీని చూస్తూండు' అన్నారు. తానల కదలగానే అతను వాచీతో పారిపోతాడని ఆయనకు తెలుసు. నిజానికి ఆయన గంగోత్రి వెళ్ళదలచుకోలేదు. ఏం జరుగుతుందో చూద్దాం అనుకున్నారు. కాసేపు తర్వాత తిరిగి వచ్చి చూస్తే ఏముంది? అనుకున్నట్లే అతనూ లేడు. చేతి గడియారమూ మాయం. అంతా దాని గురించి అడిగేవారు. దాన్ని వాడుతూనే వున్నారన్నారాయన

అనుకోకుండా ఆరు నెలల తర్వాత హరిద్వార్ స్టేషన్‌లో అతను కనబడ్డాడు రామాను చూసి కంగారుపడ్డాడు. తర్వాత 'అయ్యా! నేను ఘోరమే చేశాన అన్నాడు. 'నీవు నాకేమీ చేయలేదు. తప్పుచేశాననిపిస్తే మాత్రం మరోసారి ఆ పని చేయకు' అన్నారాయన. 'ఇంతకీ వాచీ ఏమైంది?' అడిగారాయన. 'డబ్బు అవసరమై అమ్మేశాను' అన్నాడతను. కొన్నాళ్ళకు ఆ గడియారం మళ్ళీ రామాను చేరింది. అతని దగ్గర వాచీ కొన్నవాడు రామా శిష్యుడే. దాన్ని గుర్తుపట్టి తె

ఇచ్చాడు. మరోసారి అతన్ని పిలిచి 'నీకు పనికొస్తే తీసుకో' అన్నారు రామా. ముందు అతనికేమీ అర్థం కాలేదు. తర్వాత తెలిసింది. ప్రాపంచిక విషయాలపట్ల తనకున్న ఆలోచనకన్నా భిన్నంగా కూడా ఉండవచ్చునని. ఈ సంఘటనతో అతను పూర్తిగా మారిపోయాడు.

చాలా మంది కోరికలు, అలవాట్లు, సంఘర్షణలు వగైరాలను తమంతట తామే ఎదుర్కొనలేరు, పోగొట్టుకోలేరు. ఇతరులను తమను తెలుసుకోనివ్వరు. ఎవ్వరితోనో, ఎక్కడో ఒకచోట మన రహస్యం చెప్పుకోవాలి. చిరాకు కలిగించే వాటిని అణిచివేయకూడదు. వీటివల్ల మన పురోగతి దెబ్బతింటుంది. ధ్యాన సమయంలో ఇటువంటి ఇబ్బందికరమైన ఆలోచనలు, కోరికలు కనిపిస్తాయి. వాటిని గమనించి, వదిలించుకోవాలి. ఈ విధంగా మనం కోలుకుని, సమతుల్య జీవనం గడిపేందుకు ధ్యానం శక్తివంతమైన సాధనం.

ఇల్లు వాకిలి వదలి వచ్చిన వారిలో ఆ సంస్కారాలు కొంతవరకు అలాగే వుంటాయి. వాటిని వదలించుకునేందుకు చాలా కాలం పడుతుంది. ఆధ్యాత్మిక బీజం పడడం, సృజనాత్మక భావనలను మనస్సు స్థిరంగా జీర్ణం చేసుకోవడం వగైరాల ద్వారా దానిని సాధించగలం. ఇందుకు ఎవరికి వారు క్రమశిక్షణను పాటించాలి.

ఈనాడు గురువులు చాలామంది క్రమశిక్షణ లేకుండా ధ్యానం, ఆధ్యాత్మికత నేర్పుతామంటున్నారు. వారు బోధించే పద్ధతులు మంచివే అయినా, సరిగ్గా దున్నని నేలలో విత్తనాలు చల్లినట్లు వుంటుంది. ఆధ్యాత్మిక పథంలో స్వీయక్రమశిక్షణకు ఎంతో ప్రాముఖ్యం వుంది లోపలి, బయటి జీవితాల మధ్య వారధి వుండాలి. క్రమశిక్షణే ఈ వారధికి పునాది. ప్రజలు కేవలం పద్ధతులపైనే మోజు చూపకూడదు. స్వీయ క్రమశిక్షణ నేర్చుకోవాలి.

## 6.15 కొందరు సన్యాసులకన్నా గృహస్థులే మేలు

ఒకసారి స్వామీ రామా గంగోత్రి వైపు వెళ్తూ, దారిలో ఉత్తరకాశి దగ్గర నెల రోజులు వున్నారు. అక్కడ తేకలా వైపు రెండు మూడు మైళ్ళు రోజూ ఉదయం నడిచేవారు. తేకలాకు, ఆయన ఆశ్రమానికి మధ్య ఒక కుటీరంలో ఇద్దరు నగ్న సాధువులు వుండేవారు. ఇద్దరూ అరవై సంవత్సరాలపై బడినవారే. విధురులే. వేర్వేరు గదులలో వుండేవారు. అంతా ఖాళీగా వుండేది ఆ కుటీరం. అంత చలిలో దిగంబరంగా వుండడమే వారి ఘనతకు కారణం. పాండిత్యం శూన్యం. వారిద్దరి గురించి రామా విని వున్నారు. వారిలో కోపం, అహం, అసూయ తగ్గలేదు. ఒకరంటే ఒకరికి పడేదికాదు.

ఒక రోజు రామా తేకలావైపు నడుస్తున్నారు. నగ్న సాధువులు తమ చాపలు ఎండలో ఆరబెట్టుకుంటున్నారు. ఘోరంగా కుస్తీపట్లు పడుతున్నారు. 'ఏమిటిదంతా?' అడిగారు రామా. 'వాడు నా చాపమీద ఎందుకు కాలుపెట్టాలి? తన గురించి తాను ఆలోచించుకుంటే చాలుకదా! తనే ప్రపంచంలోకెల్లా గొప్ప సన్యాసినని బోడిగొప్పలూ వాడూను!' అన్నాడు ఒకతను.

వారిని చూసి రామాకు బాధనిపించింది. అసలు సన్యాస మార్గం అంటే

ఏమిటి అని విశ్లేషించవలసి వచ్చింది. 'ఇల్లు, ఇల్లాలు, పిల్లలు, డబ్బు - అన్నిటినీ వదలేయగలిగినా, పేరు ప్రతిష్ఠలను వదలేయడం కానీ, అహాన్ని వదలి పరిశుద్ధులు కావడం కానీ, అంత సులభం కా'దనిపించిందాయనకు. 'కేవల సన్యాసం అశాంతిని, నిరాశను ఇస్తుంది. జీవితపరమార్థం తెలుసుకోకుండా సన్యసిస్తే తోటి సన్యాసులకు కూడా ఇబ్బందే. ఈ సన్యాసులను ఉదాహరణకు తీసుకునే ప్రజలకూ ఇబ్బందే. నిజానికి సన్యాసులంతా గొప్ప ఉదాహరణలుగా నిలవలేరు. వారికన్నా ఎంతోమంది గృహస్థులు గొప్పవారు. మనలోపలి పరిస్థితి బాహ్యజీవనంకన్నా గొప్పది' అంటారు స్వామీ రామా.

## 6.16 స్వామిగా ఉండడం అంత సులభం కాదు

స్వాములు కోరినవన్నీ అమరుతాయి అని అనుకుంటారందరూ. నిజానికి అలా అమరవు. స్వాములపై ప్రజల కఠోర నియమావళి పనిచేస్తుంది. స్వామి మానవాతీతుడని ప్రజలు అనుకుంటారు. 'మీరు ఫలానా వేళలో, ఫలానా స్థలంలో మాట్లాడాలి... మీరు చూడాలి. ఈ వ్యక్తికి జబ్బు నయం చేయాలి...' అని పలురకాలుగా వస్తూవుంటారు. తమ అంచనాలకు తగ్గట్లు లేకుంటే 'ఎవడీ స్వామి? దొంగస్వామి!' అనుకుంటారు. స్వామికి తిండి, నిద్ర అనవసరం. స్వామి సన్యాసి కాబట్టి ఆకలిదప్పులుండకూడదు. చలివేసినా దుప్పటి కప్పుకోకూడదు. అన్నీ వదులుకుని జీవించాలి అని వీరి అభిప్రాయం. అంచేత స్వామిగా ఉండడం అంత సులభం కాదు.

మన దేశంలో స్వాములు ఎక్కడకు వెళ్ళినా ప్రజలు మేళతాళాలతో స్వాగతం చెబుతారు. ఒక్కోసారి రామా ముప్పై కిలోమీటర్లు పైగా నడిచి సాయంకాలానికల్లా అలసిపోయేవారు. కాసేపు ఆగి విశ్రాంతి తీసుకుని మళ్ళీ ధ్యానంకోసం తెల్లవారుజామునే లేవాలి. అటువంటి వేళలో కూడా కొందరు వచ్చేవారు. మీకోసం భజనలు చేస్తాం అనేవారు. వారికి భజన కావాలి. రామాకేమో నిద్ర కావాలి. అంచేత వారు భజన చేస్తున్నప్పుడు రామా నిద్రపోయేవారు. వాళ్ళు భజనపారవశ్యంతో కళ్ళు మూసుకుంటే ఈయన నిద్రవల్ల కళ్ళు మూసుకునేవారు.

నిద్రలో నడవడం అనేది ఉంది. అలాగే స్వామీ రామా అవసరమైన వాటి విషయంలో నిద్రపోతూ ఆధ్యాత్మిక పథంలో కొనసాగేవారు. 'సంకల్పం ముఖ్యం. పరిస్థితులను, ప్రపంచాన్ని, సమాజాన్ని మార్చడం వీలుకాదు. అయినా, ధైర్యం, సంకల్పం వుంటే వాటిని ఎదుర్కొని జీవితాన్ని విజయవంతంగా గడపవచ్చు' అంటారాయన.

## 6.17 జీవితమే ఒక ధ్యానం

ఒకప్పుడు ఒక స్వామి తన భక్తుని దగ్గర ఉండేవాడు అయన క్రమశిక్షణకు మరో పేరు అనీ, గొప్ప ఆధ్యాత్మికవేత్త అనీ ఆ భక్తుని కుటుంబ సభ్యులు ఆదరించేవారు. అయన ఎప్పుడూ సూర్యోదయానికి ముందే లేచి స్నానం చేసి ధ్యానంలో కూర్చునేవాడు. అయితే, ఒకరోజు చీకటి వుండగానే 'అన్నం పెట్టు' అని

అరిచాడు. 'స్వామీ! ఇది మీకు స్నానం చేసే వేళ' అన్నారెవరో. 'అదంతా నాకు వద్దు. నాకు ఆకలి. అన్నం కావాలి' మొండిగా అన్నాడు స్వామి. శిష్యుడు పెట్టింది తిని స్నానం చేశాడు. తర్వాత మలవిసర్జనకు వెళ్ళాడు. మళ్ళీ నిద్రపోయాడు. ఈ విధంగా మొత్తం తారుమారు చేశాడు ఆయనకు పిచ్చేమైనా పట్టిందేమో అనుకున్నారు ఇంటిలోనివారు.

ఆ భక్తుని భార్యకు ఆయనపట్ల జాలివేసింది. మన గురువు అద్భుతమైన వ్యక్తి. ఆయనకు సాయం చేద్దాం అనుకుని, డాక్టర్లను పిలిచింది. 'ఆయనకు మందుల విషయం చెప్పి చిరాకు పెట్టకండి. మీ నుంచి నేర్చుకోవాలని వచ్చాము అని మర్యాదగా చెప్పండి' అంది. వారూ అలాగే చేశారు. ఒకాయన 'గురుదేవా! ఎలా వున్నారు?' అన్నాడు. స్వామి జవాబు చెప్పలేదు. ఆయన కోమాలో వున్నారనుకున్నారు. కళ్ళవైపు చూస్తే అవి నిశ్చలంగా వున్నాయి. మూడో డాక్టర్ స్టెతస్కోపుతో చూసి 'గుండె కొట్టుకోవడం ఆగేలా వుంది' అన్నాడు. 'తండ్రివంటి స్వామి అలా అవుతున్నాడే' అని ఆమె ఏడవడం మొదలుపెట్టింది. అప్పుడు స్వామీ రామాకు పిలుపు వెళ్ళింది. రామా వెళ్ళగానే ఆయన లేచి కూర్చున్నాడు. 'ఏమిటిది స్వామీ!' అన్నారు రామా. 'ఏమీలేదే! ఎందుకలా అడుగుతున్నావు?' అడిగాడు స్వామి 'అంతా కంగారుపడుతున్నారు' – చెప్పారు రామా. నేను రెండింటికోసం ధ్యానం చేసేవాణ్ణి. ఈనాడు నా తలిదండ్రులు మరణించారు. నాకు విచారంగా వుంది. అందుకే ధ్యానం చేయడం లేదు. అన్నాడు స్వామి.

'మీరు స్వాములు కదా! మీకు తలిదండ్రులతో నిమిత్తం ఏమిటి?' అడిగారు రామా.

'లేదు లేదు. వారు నీకూ వున్నారు. వారు చనిపోయినప్పుడే నీకూ అర్థమవుతుంది. వ్యామోహం నా తల్లి. కోపం నా తండ్రి. వారిద్దరూ పోయారు. ఇప్పుడిక ఏమీ చేయనక్కర్లేదు' అన్నాడు స్వామి.

కథను ఉదహరిస్తూ – 'వ్యామోహం, కోపం, గర్వం వదిలేస్తే ధ్యానం మన స్వభావంగా మారిపోతుంది. అప్పుడు ధ్యానం కోసం భంగిమలో కూర్చోనక్కర్లేదు. మన జీవితమే ఒక ధ్యానంగా మారిపోతుంది' అంటారు స్వామీ రామా.

★ ★ ★

అధ్యాయం ఏడు

# పలుమార్గాలలో అనుభవాలు

'పలు మార్గాల గురించి తెలుసుకుంటే మనకంటూ ఒక అభిప్రాయం ఏర్పడుతుంది. ఎక్కువ తెలిసే కొద్దీ మరింత ఎక్కువ నేర్చుకోవాలని అనుకుంటాం. విచక్షణకు పదును పెడితే, ఏ అనుమానాలు లేకుండా మన మార్గంలో సాగిపోవచ్చు'.

## 7.1 ఏ మార్గమైనా మంచిదే - ఆనందమయీ మా

నైనిటాల్‌లోని లారియాకాంటా అడవులలో నన్‌తిన్ బాబాతో వున్నప్పుడు స్వామీ రామా వయసు పదహారేళ్ళు. అప్పట్లో ఆనందమయీ మా అనే యోగిని తన భర్తతో తీర్థయాత్రలు చేస్తూ ఉండింది. వారితో ఒక భక్తబృందం కూడా వుంది. ఆలుమగలిద్దరూ సాంసారిక జీవనానికి దూరంగా జీవించేవారు. అప్పటికే ఆమెకు మంచి ఆధ్యాత్మిక వేత్త అనే పేరుంది. ఆమె రామాను చూసేందుకు వచ్చింది. తిరుగు ప్రయాణంలో మళ్ళీ వచ్చింది. ఆమెది ప్రేమనిండిన భక్తిమార్గం.

భక్తిమార్గంలో శరణాగతి ముఖ్యం. ప్రేమ, సంగీతం దానికి ముఖ్యమైనవి. వినయం, మర్యాద, స్వచ్ఛత, నిరాడంబరత, విశ్వసనీయత ఇందులో కనిపించే ముఖ్యలక్షణాలు. ఇందులో అంతా దైవ సమర్పణం. దేవుని కీర్తించినప్పుడు ఆనందాశ్రువులు రావడం ఇందులో చాలా సహజం. దైవసాన్నిధ్యమే మోక్షం. అయితే, ఇది అందరూ అనుకున్నంత సులభం కాదు. భక్తియోగం మూఢనమ్మకాలను పాటించేవారి మార్గం కాదు.

జ్ఞానయోగంలో ఋషుల బోధనలను సమర్థుడైన గురువుద్వారా నేర్చుకోవడం జరుగుతుంది. వాటిని గురించి ధ్యానిస్తూ స్వేచ్ఛను పొందుతారు. ఇది అసిధారావ్రతం వంటిది. క్రమశిక్షణ లోపిస్తే ఇందులో అహంభావం పెరుగుతుంది. మహనీయుల నిరంతర సాంగత్యం, వ్యామోహాలు, బంధనాలు లేని ధ్యానం ఇందులో ముఖ్యం.

కర్మయోగం నిస్వార్థ సేవను నమ్మేవారి మార్గం. కర్మయోగులు పనిచేస్తూ ఫలితాన్ని అందరి మనసుల్లో వుండే దైవానికి సమర్పిస్తారు. నైపుణ్యంతో నిష్కామ కర్మ చేసేవారికి కర్మఫలం, కర్మబంధనం అంటవు. కర్మయోగం కూడా మోక్షానికి ఎంతగానో ఉపయోగపడుతుంది. బంధనాలు ఏర్పరచని సవ్యమైన కర్మలద్వారా, ఉన్నతమైన జ్ఞానం పొందడం ద్వారా జనన మరణాల నుంచి మోక్షం లభిస్తుంది.

శరీర ధర్మాలను, నాడీ మండలం శక్తి కేంద్రాలు వగైరాలను క్షుణ్ణంగా నేర్చుకునేవారు అనుసరించే యోగమే కుండలినీయోగం. ఇందుకు ప్రత్యేకమైన క్రమశిక్షణ కావాలి. మనిషి వెన్నుపాములో నిద్రాణమైవున్న కుండలినీ జాగరణం

జరిగి, సుషుమ్న ద్వారా సహస్రారాన్ని చేరుతుంది. అక్కడ శివ, శక్తి సమైక్యం జరుగుతుంది.

రాజయోగం అనేది ఒక క్రమబద్ధమైన మార్గం. ఇది అష్టాంగమార్గం ద్వారా సమాధికి తీసుకువెళ్తుంది. ఇది సమగ్రమైన మార్గం. ఇందులో పైన చెప్పినవన్నీ కలుస్తాయి. ఇది సాంఖ్య వేదాంతంపై ఆధారపడింది.

శ్రీవిద్య అన్నిటిలోకి గొప్పది. ఇందులో సూక్ష్మ, స్థూలాల గురించి బాగా తెలుసుకోవచ్చు. ఇందులో గాఢమైన తత్త్వం వుంది. దానిని గ్రహించి అభ్యసించాలి. ఇది ఆచరించదగ్గ విద్యే అయినా, కేవలం పుస్తకాలుచూసి నేర్చుకుంటే రాదు. కాలహరణమే కాక ప్రమాదకరం కూడా. సమర్థుడైన గురువుండాలి. తంత్రం మొదలైనవి బాగా తెలుసుకోవాలి....

స్వామీ రామా, నన్ థిన్ బాబా, ఆనందమయీమా శిష్యుల భజనకు హాజరైనారు. వారంతా బెంగాలీలోనూ, హిందీలోనూ పాడుతున్నారు. అది వారిద్దరికీ సంతోషం కలిగించినా, వారిధ్యాస ధ్యానం మీదే వుంది. వారి మార్గం రాజయోగం, జ్ఞానయోగం. అంతమాత్రాన వారు ఇతర మార్గాలను ద్వేషించేవారని అర్థంకాదు. అయితే, ఆనందమయీమా శిష్యులలో ఒకడు రామాకు భక్తి యోగమే మంచిది అని నచ్చచెప్పేందుకు ప్రయత్నం చేశాడు. భక్తియోగానికి మారిపో అని అతను రామాను వేధించాడు. 'ఎందుకు మీరు గానం చేయరు?' అన్నాడతను.

అప్పుడు రామా అతనితో, 'బండిని లాగే గుర్రానికి సంతోషం వుండదు. బండిలో కూర్చున్నవాడికి మాత్రం ఆనందంగా వుంటుంది. కర్మల నాచరించే వాడికన్నా చూసేవారికే ఆనందం. అలాగే భజన చేయడం కన్నా వినడమే బావుటుంది. మీకన్నా మేమే బాగా ఆనందిస్తున్నాం. మేము భక్తిమార్గాన్ని అవలంబించడం లేదని మీరెలా అనుకుంటున్నారు?' అన్నారు. అజ్ఞాని అయిన ఆ శిష్యుడు తన మార్గమే సరైనదని మొండిగా వాదించాడు. ఆనందమయీమా జోక్యం చేసుకుంది. 'వారితో వాదించవద్దు. తమ లోపలి విలువలను తెలుసుకుని అందుకు అనువైన మార్గం పాటించాలి. భక్తిమార్గం అంటే మూఢ భక్తి కాదు. అది హృదయానికి సంబంధించినది. ఎన్నో జీవిత సమస్యలను తొలగించే తర్కాన్ని, మేధస్సును అది కాదంటున్నట్లు కాదు. ఇతర మార్గాలలో భక్తి కూడా ఒక భాగమే. భక్తి లేకుంటే జ్ఞానయోగికి ఆత్మజ్ఞానం కలుగదు. భక్తి సులభమనీ, సరళమైనదనీ చాలామంది ఆ మార్గానే పోవాలనుకుంటారు. కానీ అది నిజంకాదు. భక్తిమార్గం అంటే భగవంతుని ఉనికిని అంగీకరించడం. ఏడ్చి, వణికి, భావోద్రేకానికి గురై, తమాషాగా ప్రవర్తించేవారు భక్తియోగానుసారులు కాదు. మనస్సు ప్రశాంతంగా ఉంచడం నేర్చుకోవాలి. అప్పుడే అన్ని మార్గాలనూ అర్థం చేసుకోగలం. వాదన అనేది నేర్చుకోవడంలో ఒక దశ. ఉండడం అనే స్థితి కాదు' అన్నదామె.

ఆమె ఉపన్యాసం రామా చెవుల్లో చాలాకాలం మారుమోగింది. ఆయన ఆమెను 'మీ మార్గమే గొప్ప అనీ, మీరు చేసేదే సరైనదనీ మీరు భావిస్తున్నారా? ఇతరులు కాలాన్ని వృధా చేసుకుంటున్నారని మీ ఉద్దేశ్యమా? ' అని అడిగారు.

'నాకు తగినదిది. అయితే, మీ మార్గాలు మార్చుకోనక్కర్లేదు. సరైన మార్గదర్శకత్వం లేనివారు గందరగోళంలో మార్గాలు మార్చుకుంటారు. అటువంటి

మనసు ఏ పథావికీ పరిపోదు. సత్యశోధకులు సామర్థ్యాన్ని, మార్గనిర్దేశాన్ని అన్వేషించాలి. ఇందుకు గురువులో నిస్వార్థగుణం, విశ్వసనీయత, సత్యసంధత, మనోనిగ్రహం, ఆత్మసంయమనం, క్రమశిక్షణ మొదలైన లక్షణాల కోసం చూడాలి. తమ సామర్థ్యం తెలుసుకోకుండా ఏదో ఒక మార్గం పాటించే శిష్యులు కూడా తప్పు చేస్తారు. వారు ఏం చూడాలనుకుంటున్నారో దానినే చూస్తారు. ఇందువల్ల వారు ఏమీ నేర్చుకోలేరు. తాము వెళ్తున్న బాటనే అంటిపెట్టుకుని వుంటారు. వారు మూఢాభిమానులై, అహంభావులై, ప్రజలతో పోట్లాటలు కూడా పెట్టుకుంటారు. ఆత్మన్యూనత పెరిగి, గిరి గీసుకున్న ఏ సాధకునికైనా ఇది తప్పదు. ఇందువల్ల అతనికి జ్ఞానద్వారాలు మూసుకునిపోయి, అతను అహం బావిగా, స్వార్థపరునిగా, ఎవ్వరితోనూ పలుకలేని మూఢునిగా మారిపోతాడు.'

పురాణాలు నేర్చుకోవడం మంచిదే. అది మేలు చేసేదే. అయితే, సత్సంగం లేకుంటే ఆ నేర్వడంకూడా అహాన్ని పెంచుతుంది. సత్సంగం వున్న పండితుడు వినయశీలిగా మర్యాదస్తుడుగా వుంటాడు. చక్కగా మాట్లాడుతాడు.

ప్రారంభదశలో సాధకులు తరచుగా గొప్పలు చెప్పుకుంటూ తమ ఆడంబరాన్ని, తమ మార్గ ఔన్నత్యాన్ని చాటుకుంటారు. అయితే, ఆ దారిలో వెళ్ళినవారికి అన్ని దారులు లక్ష్యాన్ని చేర్చగలవని అర్థమవుతుంది. ఏ మార్గంలో వెళ్ళినా మనసు పొందే మార్పులు గమనించాలి. వాటిలో ఐక్యం కాకూడదు' అన్నదామె. ద్రాక్షమధువు నిండిన గిన్నెల్లాగా వున్న తన భర్త కళ్ళవైపు తదేకంగా చూస్తుండగా రామా ఆమె దగ్గర సెలవు తీసుకున్నారు. ఆమె మాటల వల్ల తన నియమాలు, మాటలు మరింతగా బలపడ్డాయని ఆయన అనుకున్నారు.

## 7.2 భగవంతుని ప్రేమించిన సూఫీయోగిని - బీబీజీ

మన దేశంలో అన్ని మతాలవారూ కలిసిమెలసి ఎన్నో శతాబ్దాలు జీవించారు. మన దేశంలోకి ఏది వచ్చినా కలిసిపోవలసిందే. మన చరిత్ర, నాగరికత చెప్పిన సత్యమిది. మన ఉపఖండ ప్రజలు శాంతి కాముకులు. అయినా, తర్వాతి కాలాలలో మనను పాలించిన ప్రభువులు మనల్ని విభజించి పాలించేందుకు ఎన్నో విభేదాలు సృష్టించారు.

ప్రపంచంలోని సూఫీలంతా మనదేశం వచ్చి, మనదేశపు సూఫీయోగులకు శ్రద్ధాంజలి ఘటిస్తారు. ఈనాటికీ ఇండియా సూఫీతత్త్వానికి పుట్టినిల్లు. మహమ్మదీయులకు మాత్రమే పరిమితం కాదిది. ప్రేమతత్త్వం నిండిన సూఫీ మతం అందరూ పాటించేది. రామా ఎందరో సూఫీయోగులను సందర్శించారు. వారిలో ఆగ్రాలో వున్న ఒకామె ఆయనకు ఎంతగానో నచ్చింది.

ఆమె పూర్తి నగ్నంగా వుండేది. ఒక దర్గాలో ఆమె వుండేది. ఆమె వయస్సు 93 సంవత్సరాలు. రాత్రిపూట నిద్రపోయేది కాదు. ఆమె రామాను బేటీ (బాబూ) అని పిలిచేది. ఆగ్రాలో వున్నప్పుడు రామా ఆమెను రోజూ రాత్రి పన్నెండు–ఒంటిగంట మధ్య కలిసేవారు. ప్రజలు దీనిని అపార్థం చేసుకున్నారు. ఎంతోమంది అధికారులు కూడా ఆమెకోసం వచ్చేవారు. ఆమె భక్తులలో ప్రముఖుడు కల్నల్ జె.యస్.ఖైరా.

హిందువులు, ఇతరులు కూడా ఆమెను గౌరవించినా చాలామందికి ఆమె పద్ధతులు అర్థం కాలేదు. అయినా, ఆమె అందరినీ ఒకేవిధంగా ఆదరించేది. ఆమెకు ప్రాపంచిక విషయాలపై ఆసక్తిలేదు. 'ఈ ప్రజలకు మామూలు కుండలను ధాన్యం, నాణేలతో నింపడం తెలుసు. కానీ, హృదయభాండాన్ని ఎలా నింపాలో తెలియదు' అంటుందామె.

ఒకరోజు రాత్రి 'నీకు దేవుణ్ణి చూడడం సులభం' అందామె. 'ఎలా?' అడిగారు రామా. 'ఈ లోకంతో నిమిత్తం లేకుండా ఆయనపైనే ధ్యాస వుంచు. ఆత్మసమర్పణ చేయి. ఇంకేమీ అక్కర్లేదు' – చెప్పిందామె. కాని 'బీబీజీ!? ఎలా?' అడిగారు రామా. తర్వాత ఆమె ఇలా అన్నది:

'ఒకసారి నేను నాకు ప్రియమైన దేవుణ్ణి చూడాలని వెళ్ళాను. 'నా ఆలయ ప్రవేశ ద్వారం వద్దనిలుచున్నది ఎవరు?' అడిగారాయన, 'మీ ప్రేయసి భగవాన్!' అన్నా నేను. 'రుజువేమిటి?' అడిగారాయన, 'ఇదిగో! నా అరచేతుల్లో హృదయం, కళ్ళలో కన్నీరు' – చెప్పాను నేను.

'సరే నేను దీన్ని స్వీకరిస్తాను. నేనూ నిన్ను ప్రేమిస్తున్నాను. నీవు నా దానివి వెళ్ళు, దర్గాలో వుండు' అన్నారాయన.

అప్పటి నుంచి నేను ఇక్కడే వున్నాను బాబూ! ఆయన కోసం రాత్రనక పగలనక వేచి వుంటాను. ఎప్పటికీ వేచి వుంటాను.'

ఆమె మాటలు విన్న స్వామీ రామాకు – 'సంసార విషవృక్షానికి తీయనైన పండ్లు రెండే. భగవంతుని ధ్యానించడం, సత్సాంగత్యం చేయడం' అనే సుభాషితం గుర్తుకు వచ్చింది. బీబీజీ కళ్ళనుంచి శక్తివంతమైన కాంతి కిరణాలు రావడం ఆయన కళ్ళారా చూశారు. ఆమె దివ్యానందం, ఆత్మ శరణాగతి, భగవంతుని పట్ల ఆమెకున్న అంతులేని ప్రేమ ఆయనను ముగ్ధుణ్ణి చేశాయి. 'గుండె అనే సముద్రంలోని ముత్తెపు చిప్పలో జ్ఞానమనే ముత్యం వుంది. లోపలికి ఈదుకుని వెళ్తే ఏదో ఒకరోజు అది దొరుకుతుంది' అందామె. ఒకరోజు నవ్వుతూనే ఆమె దేహత్యాగం చేసింది. ఆమెనుండి నక్షత్రం వంటి కాంతి వెలువడడం రామాతో పాటు పన్నెండుగురు చూశారు. ఆ కాంతి ఆమె హృదయం నుండి వచ్చింది. అది ఆకాశంవైపు మెరుపులా దూసుకుని వెళ్ళింది. బీబీజీ అంటే స్వామీ రామాకు ఎంతో ప్రేమ, గౌరవం. 'ఆమె నా హృదయంలో కలకాలం వుంటుంది' అంటారాయన.

## 7.3 ఆత్మజ్ఞాని ఉరియాబాబా

బృందావనంలో ఉరియాబాబా అనే యోగి ఉండేవారు. ఆయన ఆత్మజ్ఞాని. పండితుడు. గురుదేవుల ఆదేశం మేరకు స్వామీ రామా ఆయనను కలిశారు. బాబా భక్తుడొకాయన రామాకు ఇందుకు సాయం చేశారు. రామా వెళ్ళేసరికి అక్కడ చాలామంది బాబాకోసం ఎదురు చూస్తున్నారు. రామాను రమ్మని పిలిపించారాయన. ఉరియాబాబా పొట్టిగా ఉండేవారు. అప్పటికి ఆయనకు అరవైఐదు సంవత్సరాలు. ఉత్తర భారతంలో గొప్ప పండితుడుగా ఆయనకెంతో పేరుంది. రామాను ఆయన ఎంతో ఆదరించారు.

సాయంకాలాలు వారిద్దరూ రోజూ యమునాతీరంలో సంధ్య వార్చేవారు. ఒకరోజు రామా ఆయనను 'ఈ ప్రపంచంలో ఉండడం కన్నా లోకాన్ని త్యజించడం

మేలంటరా? ఏది సరైన మార్గం?' అని అడిగారు. ఆ రోజుల్లో ఆయన కర్మ సిద్ధాంతం చదువుతున్నారు. కర్మ అంటే కార్య – కారణాలని ఆయన అనుకున్నారు. వాటినుండి బయటపడ్డం కూడా కష్టమే అని ఆయన అభిప్రాయం.

ఉరియాబాబా దానికి సమాధానం చెబుతూ ఇలా అన్నారు:

'పరిత్యాగ మార్గం కఠినమైనది. అందరూ పాటించనక్కర్లేదు. అయినా, మనిషి చేతిలో ప్రాపంచికమైన వస్తువులేమున్నాయి కనక పరిత్యజించేందుకు? అంచేత ఏమీ పరిత్యజించనక్కర్లేదు. అన్నీ మనకే కావాలి అనే గుణాన్ని పరిత్యజిస్తే చాలు. మనం ఈలోకంలో వున్నా, బయటవున్నా పెద్ద తేడా లేదు. ప్రాపంచిక విషయాలపై వ్యామోహమే బాధలకు కారణం. వ్యామోహం లేని వారికి కర్మ విమోచనం సులభం. కర్మ మార్గంలో పనులను శ్రద్ధగా, నేర్పుగా చేయాలి. సన్యాసి లక్ష్యాన్ని వదిలి చాలాదూరం వెళ్తాడు. అయినా, అతనుకూడా ముఖ్యమైన విధులను నెరవేర్చాల్సిందే. గృహస్తులు తమ విధులను నెరవేర్చాలి. తన పనుల ఫలితాలను గ్రహిస్తూ స్వార్థం పెంచుకునేవారు తమకు తామే బాదరబందీలు సృష్టించుకుంటున్నారు. వాటినుండి బయటపడడం వారికి సాధ్యం కాలేదు. వ్యామోహాన్ని వదులుకోలేకపోతే మాత్రం బాధలు తప్పవు. గృహస్తులకూ అంతే.

ఎవరి పనులు వారు చేయడమే జీవిత పరమార్థం. కర్మమార్గం అయినా, కర్మపరిత్యాగ మార్గం అయినా ఆత్మ విమోచనానికి ఒకే విధంగా సాయపడే రెండు మార్గాలే – ఒకటి త్యాగపథం కాగా, మరొకటి విజయపథం.

కర్మసిద్ధాంతం అందరికీ వర్తిస్తుంది. మన గత సంస్కారాలు మనలో అచేతనంగా దాగి వుంటాయి. ఇవి ఎన్నో ఆలోచనలు పుట్టించి, మన మాటల ద్వారా, చేతల ద్వారా బయటపడుతూ వుంటాయి. సాధకుడు ఈ సంస్కారాల నుంచి బయటపడవచ్చు. జ్ఞానంతో కానీ, బంధన త్యాగంతో కానీ వీటిని దహించివేసినప్పుడే బంధన విముక్తి. కాల్చేసిన తాటికి బంధించే శక్తి లేనట్లే, వీటికీ ఏమీ ఉండదు. ఇవి ఎదగవు. వేయించిన కాఫీ గింజల వంటివే ఇవీను. వేయించిన కాఫీ గింజలు కాఫీపొడి చేసుకునేందుకు పనికొస్తాయి. మళ్ళీ మొక్కలు పెంచేందుకు విత్తనాలుగా వాడలేము. ఈ సంస్కారాలు రెండు రకాలు – ఆత్మజ్ఞాన పథంలో పనికొచ్చేవి, ఆ దారికి అడ్డుపడేవి.

దేనికీ బంధనాలు లేకుంటే గత సంస్కారాలు నశిస్తాయి. దీనిని నేర్చుకుంటే సన్యాసి పొందే ఫలాలు సంసారి కూడా పొందుతాడు. సన్యాసికి లోకం వెలుపల ఆత్మజ్ఞానం కలిగితే, సంసారికి లోకంలోనే కలుగుతుంది. బంధనాలు లేకుండా వుండడం అంటే ప్రేమలేకుండా ఉండడం కాదు. ప్రేమా, అదీ ఒకటే. అది స్వేచ్ఛ నిస్తుంది. బంధనం అడ్డం పెడుతుంది. దీని ద్వారా గృహస్తు నిస్వార్థంగా తన విధులు నెరవేర్చగలడు. జీవిత పరమార్థం తెలుసుకోగలడు. అతని కర్మలే అతనికి మార్గం చూపుతాయి. సన్యాసంలో సన్యాసికి జీవిత పరమార్థం తెలుస్తుంది. ఆత్మజ్ఞానం లభిస్తుంది. అది చేతనాపరిధిని పెంచుతుంది. మనిషి తన చేతనను విశ్వచేతనలో లీనం చేసినప్పుడు అతనికి కర్మ విమోచనం జరుగుతుంది.

అటువంటి మహాత్ముడు ఇంకొకరికి దారి చూపగలడు. అతను ఏలోకానవున్నా కర్మబంధన రుణాలవల్ల వచ్చే అనారోగ్యం మాయం చేయగలరు. ఏమీ అంటకుండా

వాటిని ఆయన చెయగలరు. నిజమైన గురువుకు తనపై తనకు అధికారం వుంటుంది. స్వేచ్ఛగా లోకాన విహరిస్తారు. కుమ్మరి కుండలు చేసిన తర్వాత కూడా చక్రం ఇంకాసేపు తిరుగుతుంది. అయితే, అప్పుడు అది కుండలు చేయజాలదు. అదే విధంగా మోక్షం పొందిన ఆత్మకు జీవితచక్రం తిరుగుతూ వున్న కర్మబంధం అంటదు. ఆ జీవి కర్మరహిత కర్మలు చేస్తాడు. శిష్యుడు ఆత్మజ్ఞాన పథంలో వెళ్ళేందుకు సిద్ధం కాగానే గురువు సాయం చేస్తాడు. ఒకరోజు ఆ శిష్యుడు కూడా స్వేచ్ఛను పొందుతాడు.'

గొప్పవారిని గురించి, వారికున్న బాధా నివారాణశక్తి గురించి చెప్పమని రామా ఆయనను కోరారు. అప్పుడాయన ఇలా చెప్పారు:

'బాధా నివారణలో మూడు స్థానాలున్నాయి – భౌతికం, మానసికం, ఆధ్యాత్మికం. మనిషిలో ఈ మూడు స్థానాలూ వున్నాయి. ఆధ్యాత్మిక శక్తి వున్న వాడు మూడు స్థాయిల్లోనూ చికిత్స చేయగలడు. అయితే, దానినే వృత్తిగా మలుచుకుంటే ప్రాపంచిక గొడవలలోనికి వెళ్ళక తప్పదు. అప్పుడతనికి ఆ శక్తి తగ్గిపోతుంది. స్వార్థం పెరిగిన క్షణాన అది మాయమవుతుంది. దుర్వినియోగం కారణంగా మూలశక్తి అయిన ఇచ్ఛాశక్తి పోతుంది. మహాత్ములంతా ఆ శక్తి భగవంతుడేనని, తాము కేవలం ఉపకరణాలమేననీ అంటారు.

ప్రతి మనిషిలోనూ ఈ శక్తి వుంది. ప్రతి గుండెలోనూ ఇది నిరంతరం ప్రవహిస్తుంది. సరైన విధంగా వాడితే దీనిని నివారణకు వాడవచ్చు. నిస్వార్థం, ప్రేమ, సంకల్పం, దైవభక్తి దీనిని పెంచుతాయి.'

ఆయనతో పదిహేను రోజులు గడిపిన తరువాత రామాకు జీవిత పరమార్థం గురించి, వ్యామోహం లేకపోవడం గురించి అవగాహన పెంచుకోవడంలో జీవించే కళ వుందని తెలిసింది.

## 7.4 మహాత్మా గాంధీ ఆశ్రమంలో...

1930 దశకం చివర, 1940 దశాబ్ది తొలిరోజులలో స్వామీ రామాకు వార్ధా ఆశ్రమంలో గాంధీ మహాత్మునితో గడిపే అవకాశం లభించింది. అక్కడ ఆయన ఎందరో మహానుభావులను దర్శించారు. గాంధీజీ ఒక కుష్టు రోగికి సేవలు చేయడం చూశారు. ఆ కుష్టురోగి ఒక సంస్కృత పండితుడు. నిరాశ, కోపం వగైరాలతో బాధపడుతున్నాడు. అతనిని గాంధీజీ ఎంతో ప్రేమతో, జాగ్రత్తగా చూసుకున్నారు. 'ఇది అందరం ఆదర్శంగా పాటించవలసిన ఉదాహరణ' అంటారు స్వామీ రామా. రోగులకు గాంధీజీ చేసిన సేవ అనయ మనస్సుపై చెరగని ముద్ర వేసింది.

గురుదేవులు ముఖ్యంగా గాంధీజీ నడకను గమనించమని రామాను కోరారు. అది ఇతర యోగుల నడకకు భిన్నంగా వున్నట్లు, ఆయన శరీరం నుండి విడిపోయారా అన్నట్లు అనిపించింది. గుర్రం బండిని లాగినట్లు ఆయన తన దేహాన్ని లాగుతున్నారా అనిపించింది. ఇతరులకోసమే ఎప్పుడూ ప్రార్థించే మనిషాయన. ఎవరినీ ద్వేషించలేదు. మతం, కులం, జాతి, లింగం, వర్గం – ఎటువంటి తేడా పాటించలేదు. కృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు ఆయనకు గురువులు.

అహింసా సిద్ధాంతపరంగా గాంధీ మార్గదర్శి, ప్రేమించడంలో మనిషి సామర్థ్యాన్ని మరింతంగా పెంచేందుకు ఆయన ప్రయోగం చేశారు. అటువంటి వ్యక్తికి జీవితంలో కష్టాల సుడిగుండాలు ఎదురైన సంతోషంగానే వుంటాడు. ఆయన తనను తాను ఎప్పుడూ కాపాడుకోలేదు. అహింసను, ప్రేమను శ్రద్ధగా కాపాడుకున్నారు. ఆయనలో రాత్రింబవళ్ళు వెలిగే ప్రేమజ్యోతిని ఏవీ ఆర్పలేక పోయాయి. పూర్తి స్వావలంబన, నిర్భయత్వం గాంధీ తత్వానికి పునాదులు. హింస ఆయనను ఎంతగానో కదిలించేది. అహింసామార్గంలో ఆయన ఒంటరిగా సాగిపోయారు. నిరసనగా ఒక మాట పలకడం, ద్వేషించడం ఆయనకు తెలియదు. ఆయనతో వున్నప్పుడు తాను గ్రహించిన విషయాలను స్వామీ రామా తన డైరీలో ఈ విధంగా రాసుకున్నారు:

1. అహింస అంటే పిరికితనం కాదు. అవి రెండూ ఒకటి కాలేవు. ఎందుకంటే, భయాన్ని పొగొట్టే పరిపూర్ణమైన ప్రేమ ప్రకటననే అహింస అంటారు. ఆయుధాలతో ధైర్యంగా వున్నాడంటే ఇంకా ఏమూలో కాస్త భయం వున్నట్లే. అహింస అనేది అతి గొప్పశక్తి, క్రియాత్మకమైన బలం శారీరక బలంవల్ల రాదు.
2. నిజమైన అహింసావాదికి అసంతృప్తిపై విశ్వాసం ఉండదు. అతను నిరంతరం సంతోషంతో, శాంతితో వుంటాడు. తన పాండిత్యం, విజ్ఞానం పట్ల గర్వంగా వుండే వ్యక్తికి అవి రావు. విశ్వాసం, ఏకాగ్రచిత్తం వున్నవారికే నిరంతర సంతోషం శాంతి లభిస్తాయి.
3. మేధావులు అద్భుతాలు చేయవచ్చు. కానీ అహింస అనేది హృదయానికి సంబంధించినది.
4. ద్వేషాన్ని ద్వేషంతో ఎదిరించలేము – ప్రేమతోనే జయించగలం. ఇది తిరుగులేని నియమం.
5. పైపై పూజలు భక్తికిందరావు. మనసు, మాట, చేత – మూడింటితో ఆత్మసమర్పణ చేసుకోవడమే భక్తి.
6. మతాలు, నాగరికతలు, సంస్కృతులు, మూఢాచారాలు, అవిశ్వాసం మొదలైనవి సృష్టించే అడ్డుగోడలంటే గాంధీజీకి నమ్మకం లేదు. అన్ని మతాల వారు అన్నదమ్ములని ఆయన అన్నారు. ఆ భావంతోనే ఆయన జీవించారు.
7. గాంధీజీ కర్మయోగాన్ని నమ్మారు. పనిచేయడమే మనవంతు ఫలితం గురించి ఆలోచించడం కాదు అనేదే కర్మయోగం. ఆయన జయాపజయాల గురించి బాధపడలేదు. చేతిలో వున్న పనిపై శ్రద్ధ చూపించారు. ఆందోళన, అలసట అనేవి ఆయనకు తెలియని పదాలు.
8. జీవితాన్ని ఆనందించాలంటే దేనిపట్లా స్వార్థపూరితమైన అనుబంధం వుండ కూడదు. పరిశుద్ధమైన లక్ష్యం, సరైన మార్గం, ఫలితంతో నిమిత్తం లేకుండా ఉండడం వల్ల వ్యామోహం లేకుండా వుండగలం. కర్మలను వదిలేసిన వాడు పతనమౌతాడు. ఫలితాన్ని త్యాగం చేసేవాడు ఎంతో ఎత్తుకు వెళ్తాడు. మోక్షాన్ని పొందుతాడు.
9. మనసు, బుద్ధి, ఇంద్రియాలు, భావోద్రేకాలు, ప్రేరణలు, వ్యక్తిత్వంలో అన్ని స్థాయిలు – వీటన్నిటినీ మళ్ళీ సమగ్రంగా మలచుకోవడం, పరిపూర్ణత పొందడమే యోగం.

10. మంత్రం జీవితానికి ఊతకర్ర. అది మనిషిని ప్రతి కష్టంనుండి తప్పిస్తుంది. ఒక్కోసారి మంత్రం పలికినప్పుడు ఒక్కో కొత్త అర్థం వినిపిస్తుంది. భగవంతుని చెంతకు మనలను చేరుస్తుంది. వ్యక్తిత్వంలోని దోషాలను గుణాలుగా మార్చుతుంది. అగాధాలలో చేతనలో వున్న అన్ని ఆలోచనలనూ సమగ్రంగా మార్చుతుంది.

స్వామీ రామా గాంధీజీ ఆశ్రమంలో మహాదేవదేశాయ్, మీరాబెన్, ప్రభావతి బెహన్ మొదలైన వారిని కలిశారు. గాంధీజీ పుత్రుడు రామదాసును అయన హిమాలయాలలోని కొశానికి తీసుకువెళ్ళారు.

## 7.5 రవీంద్రనాథ్ ఠాగూర్‌తో...

యౌవనంలో రామా గంగోత్రికి చెందిన దండిస్వామి శివానంద అనే సహశిష్యునితో ఎక్కువగా తిరిగారు. అయన రామా కన్నా ఇరవై ఏళ్ళు పెద్దవాడు. ఒకసారి ఇద్దరూ ముస్సోరికి వెళ్ళారు. దారిలో రాజ్‌పూర్ అనే చిన్న ఊరులో ఆగారు. అప్పుడు అక్కడే ఒక కుటీరంలో రవీంద్రనాథ్ ఠాగూర్ వున్నారు. శివానందకు అయనంటే అభిమానం, పరిచయం కూడా వుంది. తనతో రెండు నెలలపాటు వుండమని ఠాగూర్ వారిద్దరిని ఆహ్వానించారు. అయన రామాను ఎంతో అభిమానించారు. రామాను శాంతినికేతన్‌కు పంపమని శివానందుని కోరారు. రామాకు కూడా అక్కడికెళ్ళే కోరిక తీవ్రమైంది. 1940లో అయన శాంతినికేతన్ వెళ్ళారు. ఠాగూర్ పుత్రుడైన రథీంద్రనాథుడు అయనకు స్వాగతం పలికాడు. ఠాగూర్ అభిమాని అయిన శ్రీమాలిక్ గారి కుటీరం పక్కనే వున్న మరో కుటీరంలో రామాకు ఒక బస ఏర్పాటు చేశారు. అప్పట్లోనే శాంతినికేతన్ విశ్వవిఖ్యాతమైన సుందర ప్రాంతం. వందలాది విద్యార్థులున్నారు. వీరంతా ఠాగూర్‌ను 'గురుదేవులు' అనేవారు.

ఠాగూర్ గొప్పకవి. బహుముఖ ప్రజ్ఞాశాలి. అయనకు తన పనిపట్ల వున్న భక్తి శ్రద్ధలను రామా గమనించారు. రోజూ ఏదో ఒకటి రాయడమో, బొమ్మలు గీయడమో చేసేవారు. గురుదేవులు ఠాగూర్ మహాశయులు. అయనకు రాత్రినిద్ర తక్కువ. పగటిపూట విశ్రాంతి అసలు లేనేలేదు. వయస్సు అయన్ను ఏమీ చేయలేకపోయింది. అయన అలవాట్లలో మార్పేమీ రాలేదు. అయన రామాకు ఒక శ్రద్ధాళువైన సాధకుడుగా అనిపించాడు. సాధకుల లక్ష్యాలలో దేవునిలాగా ఉండడం ఒకటి. అయనకు మరో స్వామిని అనుకరించవలసిన అవసరం లేదు. అయన జీవితం సన్యాసి జీవితం కాదు. కర్తవ్యం పాటిస్తూ ప్రపంచంలో ఉండడమే. 'బంధవాలు విడగొట్టుకుని మోక్షం పొందడం నాకు కాదు' అనే అయన కవితా వాక్యం అయన తత్త్వాన్ని సూచిస్తుంది. అయన జీవితంలో కీలకమైనది త్యాగం కాదు – గెలుపు.

మనుషులలో మూడు రకాల గొప్పవారు కనిపిస్తారు. మొదటిరకం వారు పుట్టుకతో గొప్పవాడు. రెండవరకం వారు శ్రద్ధగా, నిస్వార్థంగా కృషిచేసి గొప్పవారు అయినవారు. ఇక మూడవరకం నిర్భాగ్యులకు గొప్పదనం అపాదించబడుతుంది. ఠాగూర్ మొదటి తరగితికి చెందిన ప్రతిభావంతుడు; వరప్రసాది అయిన కవి, మేధావి 'ప్రపంచంలో కదిలే వస్తువులన్నిటిలోనూ దేవుడున్నాడు. అయన ఇచ్చినవి అనందించు మరొకరి సొత్తును ఆశించకు' అనే ఉపనిషత్ సూక్తులను అయన

పాటించారు. స్వామీ రామా అయనను విశ్వజనీనుడుగా, పరిపూర్ణుడుగా భావిస్తారు. తెలుసుకునే మనిషిని, చేసే మనిషిని ఎరిగిన మానవత్వానికి అయన ప్రతీక అంటారు స్వామీ రామా, అయనను 'తూర్పు దేశాల ప్లేటో'గా గౌరవిస్తారు రామా.

ఠాగూర్ పాశ్చాత్యులు ప్రాచ్యులుగా కావాలని కోరలేదు. తూర్పుదేశాల వారితో చేతులు కలిపి, ప్రపంచానికి ఉమ్మడి సంపద అయిన ఉదాత్తమైన ఆశయాలను ప్రచారం చేయమని అయన వారిని కోరారు. జీవ నియమాలకు ఎదురొడ్డి నిలువ గలిగింది మనిషి మాత్రమే. అన్ని గొప్ప జాతుల వెనుక, మహత్కార్యాల వెనుక ఉదాత్తమైన ఆశయాలున్నాయి. సృజనాత్మకతకు ఆశయమే మూలం. జీవితం దుఃఖమయమే కావచ్చు. అయినా, ఆలోచనలను సృజనాత్మకం చేసుకోగలిగినవాడు ధన్యుడు. అన్ని వడపోతలలోకీ కాలం గొప్పది. అన్ని సంపదలలోకి ఆలోచనలు గొప్పవి. అదృష్టం అనేది ఆలోచనలను, సామర్థ్యాలను సరైన సమయంలో ప్రకటించేందుకు మనిషికి సాయపడే అరుదైన అవకాశం.

ఠాగూర్ తత్వం సత్యాన్ని మరుగుపరిచే అవరోధాలను ఎదుర్కొంది. అయన దృష్టిలో చావు అనేది యుగాలుగా భయానికి బాధలకు కారణమయింది. ఇందుకు కారణం ప్రజలు సత్యాన్ని శోధించకపోవడమే. చావు భయం వున్న వారు ఠాగూర్ సంగీతాన్ని వినాలి, నేర్చుకోవాలి. అది అనంతంలోకి, శాశ్వతంలోకి ఎలా వెళ్ళాలో దారి చూపుతుంది. ఆ సంగీతం విశ్వసంగీతం. ప్రతి ఒక్కడు సత్య జ్యోతిని పొందాలి. నిరాడంబరంగా, తెలివిగా అందరి మంచి కోసం బతకాలి. ఠాగూర్ కవితా స్వరాలు నేటికీ ఎందరినో అలరిస్తున్నాయి. ఆధ్యాత్మిక నీలాకాశంలో విశ్వం మొత్తాన్ని రూపొందించే ఏకాత్మవుంది. అది ప్రేమ అనే జీవశక్తిని వెలువరిస్తుంది. ప్రపంచం దేవుని మతాన్ని చెబుతుంది. ఠాగూర్ మనిషి మతం గురించి చెప్తారు. అది మానవాళి అనారోగ్యాన్ని రూపుమాపేది. భగవంతుని పట్ల ప్రేమ అనేది సహానుభూతి. ఠాగూర్ కవితలను రామా ఎంతగానో ఆనందించారు. అక్కడ నేర్చుకున్న వాటిని హిమాలయాలలో జీర్ణం చేసుకుని, భవిష్యత్తుకు మార్గదర్శకాలుగా మార్చుకున్నారాయన.

## 7.6 పంజాబీ మహరాజ్‌తో...

రామాకు ఇరవై సంవత్సరాల వయస్సున్నప్పుడు సిమ్లాలో పంజాబీ మహరాజ్ అనే స్వామిని కలిశారు. అయన పొడుగ్గా, ఆరోగ్యంగా, అందంగా వున్న పండితుడు. రామా చేతిలో గొడుగును చూసి 'ఎందుకా బరువుమోస్తావు? హాయిగా వుండరాదూ?' అన్నాడు. అలా నడుస్తూండగా వానొచ్చింది. రామా గొడుగు తెరిచాడు. 'ఏం చేస్తున్నావు?' పంజాబీ మహరాజ్ అడిగారు. 'వానకు తడవకుండా వుందామని' అన్నారు రామా. 'ఆ విధంగా చేయకు. ఈ వాన భూమికి, స్వర్గానికి మధ్యనున్న వారధి. దానినెందుకు పోగొట్టుకోవాలి? నాతో నడవాలనుకుంటే దాన్ని అవతల పారెయ్' అన్నారు మహరాజ్. 'అలా అయితే నేను తడిసిపోనూ? అన్నారు రామా. 'బట్టలు తడిసిపోతాయనే భయంవుంటే అసలు బట్టల్లేకుండానే హాయిగా వుండు. లేకపోతే వానలో తిరగకు' ఖచ్చితంగా చెప్పారాయన. అయన చెప్పినది రామాకు సూటిగా తగిలింది. ఆ గొడుగును దారిలోనే వదిలేశారు. అప్పటినుండి ఎప్పుడు వాన కురిసినా వానలో తడుస్తూ ఆనదించించేవారు రామా.

చలికాలంలో ఆ స్వామి పల్చని కాటన్ (ప్రత్తి) బట్ట ఒకటి ధరించేవాడు. అదే ఆయన ఆస్తి. ఆయన సున్నిత స్వభావి అయినా, శీతోష్ణాలకు అతీతుడైనాడు. ప్రాపంచిక విషయాలను ఇంద్రియాల ద్వారా తెలుసుకున్నప్పుడు బాధ, ఆనందం వస్తాయి. అది లేకుంటే లోపల బ్రహ్మాండంగా, బ్రహ్మానందంగా వుంటుంది.

పంజాబీ మహరాజ్ పండితుడు. ఇంగ్లీషు మాత్రమే మాట్లాడేవారు. ఆంగ్ల సాహిత్యం గురించి ఎక్కువ చెప్పేవారు. వారిద్దరూ స్వామీ – రామతీర్థ గురించి మాట్లాడుకునేవారు. ఆయన ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం నుండి ఎమ్.ఎస్.సి. డిగ్రీని, లాహోర్ విశ్వవిద్యాలయం నుండి డాక్టరేట్‌ను తీసుకున్నారు. వేదాంత ఉపన్యాసకులుగా పనిచేశారు. పరాయి పాలనను సహించేవారుకారు.

ఆకాలంలో కొందరు స్వాములకు ధ్యానం కన్నా దేశపరిస్థితి గురించిన ఆందోళనే ఎక్కువగా వుండింది. వారిని స్వామీ రామా 'రాజకీయ స్వాములు' అన్నారు. బాహ్యస్వాతంత్ర్యం ముందు; తర్వాతే అంతరంగ స్వాతంత్ర్యం అనేది వారి నినాదం.

పంజాబీ మహరాజ్ అటువంటి వ్యక్తి. దేశ పరిస్థితి చూసి నిరాశకార్ది స్వామి అయిన వ్యక్తి. మంచివారు. అయితే, తిరుగుబాటు ధోరణి వున్నవారు. సన్యాసి పాటించవలసిన సాధారణ నియమాలు పాటించలేదు. ఎంతసేపూ తెల్లవారిని దేశంనుండి వెళ్లగొట్టడమే ఆలోచన. అదే ఆయన పూజ. జీవిత లక్ష్యం. ఒక్కోసారి ఆయన్ను బ్రిటిష్‌వారు తమను అవమానించినందుకు రోజుకు రెండుసార్లు కూడా అరెస్టు చేశారు. బ్రిటిష్ అధికారులను వెళ్ళిపొమ్మన్నారాయన. 'ఇంగ్లీషు మాట్లాడుతారు. వ్యాకరణం తెలీదు. మీ భాషే మీకు రాదు. ఇటువంటివారిని, మంచి కుటుంబంనుంచి రానివారిని మీ ప్రభుత్వం మా దేశానికి పంపడం ఎంత శోచనీయం?' అనేవారాయన.

ఒకరోజు సిమ్లాలో వీరిద్దరు నడిచి వెళ్తూండగా ఒక బ్రిటిష్ అధికారి గుర్రం మీద వస్తూ వీరిని చూచి 'తప్పుకోండి' అని అరిచాడు. గుర్రాన్ని అదిలించడంతో గుర్రం పట్టుతప్పి కింద పడిపోయింది. 'నాకు ఈ రోడ్డుపై నడిచే హక్కుంది. ఇది నా దేశం. నీ పని నీవు చూసుకో. లే, గుర్రం ఎక్కు. వెళ్ళిపో. నేను నీ బానిసను కాను' అన్నారు మహరాజ్. మర్నాడు ఆయన్ను అరెస్ట్ చేసి, మళ్ళీ విడుదల చేశారు. ఆ రాష్ట్ర గవర్నర్ ఆయనకు పరిచయం ఉన్నవాడే. అతను జైలులో వుంటే మరీ కష్టం అనుకున్నాడా గవర్నర్.

ఆ కాలంలో స్వామి రామాకు కూడా బ్రిటిష్ పరిపాలకులంటే సరిపడేది కాదు. ఆ స్వామి 'రావోయ్! తుపాకీ తీసుకుని ఒక్కొక్కరినే కాల్చిపారేద్దాం' అన్నారు. పోరాటంలో పాల్గొనమని రామాను అడిగారాయన. 'అది పాపంకాదు. నీ ఇంటికెవరైనా వచ్చి నీ సంస్కృతిని దెబ్బతీస్తానంటే ఊరుకుంటావా?' అన్నారాయన. రామా అనుభవంలో ఇంత తీవ్రవాద స్వామి మరొకరు లేరు.

రామా గాంధీజీ సిద్ధాంతాలను అభిమానించారు. అయినా, రాజకీయాలలో ఆయన చురుగ్గా పాల్గొనలేదు. మహరాజ్‌ను కూడా రాజకీయాలు వదిలేయమని కోరారు. ఇలా నాలుగు నెలలు గడిచాయి. గురుదేవులు కూడా రాజకీయాలు వద్దన్నారు. 'నీవు ప్రపంచ పౌరుడివి. భారతదేశానికి మాత్రమే పరిమితం కాదు. నీ ఆతురత మానవాళి మొత్తం గురించి వుండాలి. ఆత్మబలం పెంచుకో. బుద్ధికి

పదునుపెట్టు. భావోద్రేకాలను అదుపులో వుంచుకో. తర్వాత పని చేయి. మూఢ భక్తి అనేది మన దేశంవంటి ఆధ్యాత్మిక దేశంపట్లనైనాసరే మంచిదికాదు. అది దైవభక్తునికి తగదు' అన్నారు. హింస కూడదని బోధించారాయన. భారతదేశానికి స్వాతంత్ర్యం ఎప్పుడు వస్తుందోనని కూడా అయన ఖచ్చితంగా చెప్పారు. తర్వాత ఎవరి దారిలో వారు వెళ్ళాలని తీర్మానించుకుని ఇద్దరూ విడిపోయారు. అదే సంవత్సరం కులూ లోయలో సిమ్లా స్వామి (పంజాబీ మహారాజ్)ని బ్రిటిష్‌వారు కాల్చి చంపారు.

సిమ్లాలో వుండగా స్వామీ రామాకు ఒక బ్రిటిష్ మిషనరీతో పరిచయం కలిగింది. అయన భారతీయ సంస్కృతి, తత్త్వం గురించి పుస్తకం రాస్తున్నాడు. తను రాసింది చదవమని రాతప్రతిని రామాకు ఇచ్చాడు. అందులో పచ్చి అబద్ధాలు రాసివుండడం చూసి రామా విస్తుపోయారు. ఆ మిషనరీ అఖరుకు రామాను మతం మార్చుకుని, బ్రిటిష్ అమ్మాయిని పెళ్ళి చేసుకోమని నిర్బంధించాడు. ఏం మార్చుకోవాలి? జీవిత విధానామా? అలవాట్లా? రామా క్రీస్తును, బైబిలును, క్రైస్తవాన్ని ఎంతగానో ప్రేమించారు. మిషనరీ పుణ్యమాని వాటిపై ద్వేషం పుట్టే ప్రమాదం ఏర్పడింది. తర్వాత అయన అటువంటి వారిని కలిసే ప్రయత్నం కూడా చేయలేదు. వారు మన మతాలను ఖండించి తప్పుడు ప్రచారం చేస్తున్నారని అయనకు అనిపించింది. సిమ్లా స్వామి అటువంటి వారి గురించి చెప్తూ 'వారు నిజంగా క్రీస్తు శిష్యులు కారు. వారికి బైబిలుకూడా తెలియదు' అన్నారు. వారు దాదాపు మూడు వందల సంవత్సరాలపాటు మన నాగరికతను నాశనం చేసే ప్రయత్నాలు ఎన్నో చేసినా విజయం సాధించలేకపోయారు. మన నాగరికతకు, సంస్కృతికి మహిళలు పునాది కావడం, నాలుగింట మూడు వంతులకుపైగా వున్న పల్లె ప్రజలపై బ్రిటిష్ వారి ప్రభావం లేకపోవడం ఇందుకు కారణాలు. అన్ని సంవత్సరాలున్నా వారు మన నాగరికతను మార్చలేకపోయారు. మన వేషభాషలలో మాత్రం కొద్దిగా మార్పు వచ్చిందంతే. బ్రిటిష్ మిషనరీ రాసిన పుస్తకాలవంటివి విరివిగా ప్రచురించారు. ఆ ఉద్యమానికి వ్యతిరేకంగా రాసిన మన మేధావులను అణిచివేశారు. ఈ సాహిత్యంవల్ల గందరగోళం ఏర్పడింది. వాన్ డ్యూసెన్, మాక్స్‌ముల్లర్, గేథే వంటి మేధావులు ఉపనిషత్తులు గురించి రాసినా ఎక్కువ మందికి మన సాహిత్యం పరిచయం కాలేదు. అనీబిసెంట్, సర్ జాన్ ఉడ్‌రోఫ్ వంటివారు మాత్రం, మన గురించి శ్రద్ధగా, మర్యాదగా రాశారు. అనుకున్నంతగా రాయలేకపోయినా ఉడ్‌రోఫ్ పాశ్చాత్యులకు తంత్రవిద్యను పరిచయం చేశాడు. పరిశీలించకుండా, అభ్యసించకుండా పుస్తకాలు రాసేవారంటే స్వామీ రామాకు జాలిగా అనిపించింది.

ఉద్దేశ్యపూర్వకంగా బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టిన తప్పుడు చరిత్ర పుణ్యమా అని మనవారికి నిజమైన చరిత్ర తెలియకుండా పోయింది. తమ సంప్రదాయంతో పరిచయం పోగొట్టుకోవడం అంటే తమ ఆత్మతో పరిచయం పోగొట్టుకోవడమే. విద్యా విధానాన్నే వారు పూర్తిగా మార్చేశారు. ఇంగ్లీషులో విద్య బోధించి బ్రిటిష్ మిషనరీల అనుయాయులుగా చేశారు. స్వేచ్ఛా భావాలకు, వాక్ స్వాతంత్ర్యానికి, పని స్వాతంత్ర్యానికి చోటు లేకుండా చేశారు. అటువంటి చదువు చదవని వారికి ఉద్యోగాలు లేవు. ఈ విధంగా రాజకీయం, పదవి మన జాతిని ఏవిధంగా చెడగొట్టి, నాగరికతను నాశనం చేశాయో రామాకు అర్థమైంది.

'మన దేశానికి ఒక దేశ భాష లేకపోవడం వల్లనే ఇంగ్లీషు రాజ్యమేలుతోంది. అప్పటి రాజులు తమలో తాము పోట్లాడుకున్నారే కానీ ఐక్యంగా వుండలేదు. ఈ విధంగా దేశం ఎన్నో కష్టాలు పడింది. ఈనాటి విద్యకూడా తగ్గట్టే వుంది. మన సంస్కృతిని బోధించడంలేదు. ఇందుకు తగిన పాఠశాలలు రావాలి. మంచిగా ఆలోచించే విధంగా వుండాలి. చైతన్యవంతంగా వుండాలి. ఋషుల వాక్యం అనుసరించాలి. అంతర్జాతీయ విద్యను నేర్వాలి' అంటారు స్వామీ రామా.

సిమ్లా స్వామి ద్వారా స్వామీ రామాకు మన దేశ పూర్వవైభవం గురించి తెలిసింది. మన దేశపు వాస్తవ చరిత్రను తయారు చేయాలని ఆయన కోరిక. ఎందరో రామాను, 'మనదేశ దారిద్ర్యానికి కారణం మన ఆధ్యాత్మికత కాదా?' అని అంటారు. 'ఆధ్యాత్మిక వేరు, ఆర్థిక పరిస్థితి వేరు. మన దేశ దారిద్ర్యానికి కారణం ఆధ్యాత్మికతను అభ్యసించక పోవడం. దేశ నాయకులు దీనిని గుర్తించడం లేదు. నిజానికి మనదేశం ఇన్ని ఆటుపోట్లు తట్టుకుని నిలబడి ఇంకా ఉందంటే మన విలువైన ఆధ్యాత్మికత, సాంస్కృతిక సంపదలే కారణం' అంటారాయన. 'సంస్కృతి, నాగరికత వేరువేరు. చక్కగా దుస్తులు వగైరా ధరించిన వ్యక్తికి సంస్కృతి వున్నట్లే. కానీ, అతడు నాగరికుడు కానక్కర్లేదు. నాగరికత ఒక దేశపు ఆలోచనలను, భావాలను, ఆదర్శాలను తెలుపుతుంది. సంస్కృతి ఒక పువ్వు అయితే, నాగరికత దాని పరిమళం. ఒక వ్యక్తి బీదవాడు కావచ్చు. అయినా, సంస్కారిగా ఉండవచ్చు. సంస్కృతి వున్నా నాగరికత లేకపోతే కష్టం. సంస్కృతి బయటకు కనిపించేది. నాగరికత లోపలిది. ఈనాడు రెండింటి సమగ్రరూపం అవసరం. మన నాగరికత విలువైనది. అయినా, ఆంగ్లేయ సంస్కృతివల్ల బాధపడుతూ వుంది' అని స్వామీ రామా అభిప్రాయం.

## 7.7 భగవాన్ రమణ మహర్షితో...

స్వామీ రామా నాసిక్‌లో వున్నప్పుడు ఆయనను కలిసేందుకు డాక్టర్ టి.యన్. దత్తా వచ్చారు. ఆయన ఉత్తరప్రదేశ్‌లోని గాజీపూర్‌కు చెందిన డాక్టర్ స్వామీ రామాను అరుణాచలం తీసుకువెళ్ళి రమణ మహర్షిని చూపించాలని ఆయన కోరిక. స్వామీ రామా ఆ కోరికను అంగీకరించారు. ఇద్దరూ 1949వ సంవత్సరం శీతాకాలంలో వెళ్ళారు. వారు రమణాశ్రమంలో కొద్దికాలమేవున్నా చాలా హాయిగా వున్నారు. అప్పుడు రమణులు మౌనం పాటించేవారు. ఆశ్రమంలో విదేశీ విద్యార్థులున్నారు. రమణుల శిష్యులైన శాస్త్రిగారు ఉపన్యసిస్తే రమణులు మౌనంగా కూర్చునేవారు.

రమణుల సన్నిధిలో స్వామీ రామాకు మరెక్కడా పొందని అనుభూతి కనిపించింది. ఆయన మౌనం అద్భుతంగా అందరికీ సమాధానాలు ఇచ్చేది. ఎవరికెటువంటి సందేహం వచ్చినా తీర్చేది. మహాత్ముల చెంత కలిగే అనుభవమే సంకల్ప సమాధి అంటారు. రమణులకు భౌతికంగా గురువులు లేరు. డాక్టర్ రాధాకృష్ణ పండితులు చెప్పినదాని ప్రకారం గడచిన వందేళ్ళలో ఈ నేలపై జన్మించిన వారిలో రమణులు అత్యున్నతులు. అతి పవిత్రులు. అటువంటి వారిని చూస్తేనే చాలు. ఆత్మ పరిశుద్ధమౌతుంది.

రమణుల దృష్టిలో 'నేనెవరిని' అని ఆలోచిస్తే చాలు – ఆత్మజ్ఞానం కలుగుతుంది.

ఈ చింతన తూర్పు పడమర దేశాల తత్త్వాలకు పునాది వంటిదే. అయినా, రమణులు దానిని పునరుద్ధరించారు. వేదాంతాన్ని అనుభవించి చూశారాయన. తన గురించి తెలుసుకుంటే అంతా తెలుసుకున్నట్లే అనే రమణుల ఆత్మవిచారణను అందరూ అంగీకరించారు.

అయిదురోజులు అక్కడ వుండి రామా నాసిక్‌కు తిరిగి వచ్చారు. వారిని కలిశాకనే రామా శంకారాచార్య పదవిని పరిత్యజించాలనే నిర్ణయానికి వచ్చారు. 'దానిని వదిలేయి. నీకు కావలసింది లభిస్తుంది' అని ఆయన ఎదలో ప్రతిధ్వనించింది. నాసిక్‌లో వుండలేక కొన్నాళ్ళకు స్వామీ రామా మళ్ళీ హిమాలయాలకు చేరారు.

'ఎవరూ ఇంకొకరివల్ల ఆత్మజ్ఞానం పొందలేరు. కానీ ఋషులు ప్రేరణను, మనోబలాన్ని ఇస్తారు. దానితో ఆత్మజ్ఞానం పొందడం సులభం అవుతుంది' అని స్వామీ రామా అభిప్రాయం. అటువంటి ప్రేరకులు లేకపోవడమే ఈనాటి దుస్థితికి మూలకారణం అంటారాయన.

## 7.8 అరవిందులతో...

నాసిక్‌లో వుండలేననిపించిన రామా అరవిందాశ్రమం వెళ్ళాలనుకున్నారు. అక్కడి శిష్యులు భక్తిశ్రద్ధలు కలవారు. తాము జీవిస్తున్న పద్ధతే శ్రేష్ఠమైనదని వారి గాఢమైన అభిప్రాయం. రామా అరవిందాశ్రమం చేరిననాటికి అరవింద భక్తులొకరు సంగీత కచేరీ చేశారు. శ్రీ మాత రామా కోసం బస ఏర్పాటు చేసి ఆ పాటను విన్నారు. మూడువారాలు అక్కడేవుండిన రామాకు రమణాశ్రమంలో పొందిన ఊరట రెండింతలైంది. అరవిందులు బాగా మాట్లాడేవారు. ఆయన వ్యక్తిత్వం ఎవరికైనా ప్రేరణ కల్పించేంత మహత్తమైనది. పూర్ణయోగం గురించి అరవిందులు చెప్పిన విషయాలు రామాకు ఎంతో నచ్చాయి.

అరవిందులది పూర్ణయోగం. సత్యాన్ని ప్రాథమికమైన ఏకత్వంగా అర్థం చేసుకునే మార్గమది. పూర్ణయోగంలో నీతి, మతం, తర్కం, అధిభౌతికం వగైరా హద్దులు ఉండవు. పరిపూర్ణ సత్యం అద్వైతం, తార్కికంగా వర్ణనాతీతం. ప్రత్యక్ష అనుభవానికి, స్వచ్ఛమైన ఆధ్యాత్మిక అంతర్ దృష్టి ద్వారా మాత్రమే అది దొరుకుతుంది. అద్వైతం చెప్పినవాటిని వేదాంతంలో నిర్గుణ బ్రహ్మం, బౌద్ధ తత్త్వంలో శూన్యత, చైనీయుల తత్వంలో టావో, తంత్రంలో తత్త్వాతీతం అనేవి చెప్పాయి.

తంత్రం ప్రకారం కుండలినీ జాగరణద్వారా ఆధ్యాత్మిక ఉన్నతి జరుగుతుంది. ఈ పురోగతిని పై స్థాయిలోకి పంపేటప్పుడు జీవితం అప్రయత్నంగా సాగిపోతుంది. అంతిమ లక్ష్యానికి అనుగుణంగా మారుతుంది. వైష్ణవమతం భక్తిని, పరిపూర్ణ శరణాగతిని అనుసరించమంటుంది. ఈ విషయంలో క్రైస్తవ యోగం, సూఫీతత్త్వా వైష్ణవాన్ని పోలివుంటాయి. వేదాంతం ధ్యానాన్ని, ఆత్మ విచారణను బోధిస్తుంది. ఆత్మతో అనుసంధానం ద్వారా లోపలి జ్యోతిని చూడవచ్చు.

మనిషిలో స్వభావం, పై స్వభావం, విశ్వంలో ఉన్న ప్రకృతి – అన్నీ అంతిమ సత్యం నుండే వస్తాయి. లోస్వభావం, ప్రపంచంలోని భౌతిక శక్తి. ఇది అచేతన బుద్ధిలో ప్రేరణను కలిగిస్తుంది. మనిషిలో ఉన్నత ప్రకృతి శుద్ధ చైతన్యంతోను, ఆధ్యాత్మిక లక్ష్యాలతోనూ వుంటుంది. శక్తిలేక దివ్యమాత అనుగ్రహం వుంటే అది

బయట పడుతుంది. పరిపూర్ణమైన సత్యాన్ని తెలుసుకోవాలంటే మనిషి ఈ శక్తిని గురించి పూర్తిగా ఎరిగి వుండాలి. ఇది పదార్థం. ఆత్మల ప్రశాంతమైన కలయికను తెలుపుతుంది. భౌతికంగా మనం స్థిరంగా వుంటేనే ఉన్నతమైన దానిని పొందగలం అంటారు అరవిందులు.

ఇందుకు ధ్యానం, కర్మ, సమగ్ర రూపంతో కావాలి. ధ్యానం ద్వారా అజ్ఞానం తొలగిపోతుంది. మనిషికి నిజమైన ఆత్మ దర్శనం అవుతుంది. నిస్వార్థమైన, ప్రేమతో నిండిన చర్యల ద్వారా ఒకదాని కొకటి సంబంధం కలుపుకుంటాయి. రెండవ పద్ధతిలో దివ్య చైతన్య శక్తి ఆరోహణ, అవరోహణ గురించిన జ్ఞానం ముఖ్యం. ఈ శక్తివంతమైన కదలికలు క్రమంగా ఆధ్యాత్మిక దృక్పథాన్ని విస్తరింపజేస్తాయి. ఉన్నతస్థాయి చైతన్యానికి పంపుతాయి. ఆ కాంతిని, శక్తిని భౌతికానికి తీసుకురావడం అవరోహణలో జరుగుతుంది.

ఈ విశ్వమంతా దివ్యనాటకం. మనిషి ఉన్నతమైన విధికి విశ్వతత్త్వం, పరిణామ కారణం తెలియాలి. అంచేత పూర్ణయోగంలో రెండింటికీ ప్రాముఖ్యంవుంది.

అరవిందుల దృష్టిలో అద్వైతం కొత్తరూపం పొందింది. నేటి మనిషికి సన్యాసం అక్కర్లేదనే భావన కనిపిస్తుంది. ధ్యానం నిష్కామ కర్మతో కలిసినా సాధకుడు కుండలినీ జాగరణ పొందుతాడు. శివభక్తుల సంగమం గురించి తెలుసుకుంటే మానవత ఉన్నతస్థాయి ఎరుకకు ఎదుగుతుంది. అరవిందుల తత్త్వం అందరి మెప్పును పొందినా రామా తాను అలవాటు పడిన పద్ధతిని వదలుకోదలచలేదు. అందుకే ఆయన తర్వాత నాసిక్ నుండి హిమాలయాలకు వెళ్ళిపోయారు.

## 7.9 ఆనంద తరంగం - బ్రహ్మానంద సరస్వతి

ఒకసారి రామా చిత్రకూటానికి వెళ్ళారు. చిత్రకూటం వింధ్య పర్వతాలలో వుంది. రామాయణంలో రాముని వనవాస కాలంలో దీని ప్రస్తావన వుంది. బైరాగి సాధువులలో కృష్ణ ప్రేమికులకు బృందావనం, రామభక్తులకు చిత్రకూటం ముఖ్యమైనది. వింధ్యా చలంలో శక్తి ఆరాధకులు ఉండేవారు. రేవా రాష్ట్రంలోని అడవులగుండా సతారా అడవులకు వెళ్ళారు రామా. అక్కడ ఒక రూపసి అయిన స్వామిని కలిశారు. ఆయన వేదాంత పండితుడు. గొప్ప సాధకుడు. ఆయన తర్వాత బదరీనాథ్ సమీపంలోని జ్యోతిర్మయపీఠం శంకరాచార్యులైన బ్రహ్మానంద సరస్వతి.

ఆయన కొన్ని మొలకెత్తిన విత్తనాలు, ఉప్పుకలిపి మాత్రమే తినేవారు. పర్వతకొలను దగ్గరున్న గుట్టపైన చిన్న గుహలో ఆయన నివాసం. గ్రామస్థులు చెప్పినట్లు వెళ్తే అక్కడెవరూ కన్పించలేరు. మర్నాడు వెళ్తే ఆయన కాలి అడుగులు కనిపించాయి. కానీ, లాభం లేదు. అయిదవ రోజున సూర్యోదయానికి ముందు అక్కడ స్నానం చేస్తుండగా చూశారు. 'నమో నారాయణ' అన్నారు. ఆయన మౌనంలో వున్నారు. రమ్మని సైగ చేశారు. రామా సంతోషంగా వెళ్ళారు. ఆనాడు మౌనం ఎనిమిదవరోజు రాత్రి ఆయన మౌనం వదిలేశారు. రామా తన రాక పరమార్థం గురించి వివరించారు.

మర్నాడు ఆయన శ్రీవిద్యను వివరించారు. శ్రీవిద్య-రాజయోగం, కుండలినీ యోగం, భక్తియోగం, అద్వైతం అన్నిటినీ కలుపుకున్నది. సౌందర్యలహరిని చదివిన

వారికి ఈ విషయం తెలుస్తుంది. ప్రయోగశాస్త్రం అనే గ్రంథం మైసూరు, బరోడా గ్రంథాలయాలలో వుంది. సరైన గురువు లేకుండా ఇది ఎవరికి అర్థంకాదు. శ్రీవిద్య, మధువిద్యలను అభ్యసించేవారు అతికొద్దిమంది. అంచేత రామాకు దానిపై ఆసక్తి ఏర్పడింది. ఆయన పురోగతికి ఈ విద్యలే కారణం. ఇందులో దేహమే దేవాలయం. ఆత్మయే దైవం. మనిషి అనేవాడు సూక్ష్మరూపంలో వున్న విశ్వం. మనిషిని అర్థం చేసుకుంటే విశ్వాన్ని, పరమాత్మను అర్థం చేసుకోవచ్చు. రామాకు ఎంతో మంది గురువులు పరిశీలించి చెప్పింది శ్రీవిద్యనే. ఇందులో కుండలినీ దివ్యమాతగా భావిస్తారు. యోగాభ్యాసాల ద్వారా కుండలినీ జాగరణ చేస్తారు. చక్రాల ద్వారా ఇది క్రమంగా జరుగుతుంది.

ఈ చక్రాలు శక్తిస్థానాలు, వెన్నుపాములో వుంటాయి. మూలాధారం, స్వాధిష్ఠానం, మణిపూరకం, అనాహతం, విశుద్ధం, ఆజ్ఞ, సహస్రారం అనేవి ఏడు ముఖ్య చక్రాలు. ఇవి వరుసగా పంచభూతాల తత్త్వంతో వుండేవి. అనాహతాన్ని బౌద్ధులు, క్రైస్తవులు, యూదులు కూడా అంగీకరిస్తారు. హిందువుల అనాహతం, యూదుల స్టార్ ఆఫ్ డేవిడ్ ఒక్కటే. అలాగే అదే క్రైస్తవంలోని పవిత్ర హృదయం, చక్రాల గురించి ఎంతో సాహిత్యం వుంది. అయితే, వీటిలో సర్ జాన్ ఉడ్‌రోఫ్ తప్ప మిగిలిన పాశ్చాత్యులు రాసినవి ఏవీ అంత గొప్పగా వుండవు.

స్వామీ బ్రహ్మానందం శ్రీవిద్యా రహస్యాన్ని ఎరిగిన అరుదైన సిద్ధులలో ఒకరు. ఉపనిషత్తులు, శంకరభాష్యం వగైరాలలో ఆయన పరిజ్ఞానం అత్యున్నతం. ఆయన మంచి ఉపన్యాసకులు. స్వామీ కరపత్రి అనే శిష్యుడు ఆయనను శంకరపీఠానికి ఆహ్వానించారు. ఆయన శంకరాచార్యులుగా మారిన తర్వాత ఆయనకు అనుచర బృందం ఎక్కువైంది. భక్తి, అద్వైతాలను ఆయన కలిపిన తీరు అద్భుతం అంటారు స్వామీ రామా. ఉన్న కొద్ది కాలంలో ఆయన భగవద్గీతపై మధుసూదనుని వ్యాఖ్యానం గురుంచి కూడా మాట్లాడారు.

స్వామీ బ్రహ్మానంద వద్ద కెంపులతో చేసిన శ్రీయంత్రం వుంది. ఆయన దానిని స్వామీ రామాకు చూపి, తానెలా పూజిస్తారో చెప్పారు. మహాయోగులు తమ అన్ని శక్తులను అంతిమ లక్ష్యం వైపు ఏవిధంగా కేంద్రీకరిస్తారో స్వామీ రామాకు అర్థమైంది. ప్రజలతో వుంటూ, ప్రాపంచిక వాసనలకు లొంగకుండా వున్న అతి తక్కువ మందిలో స్వామీ బ్రహ్మానంద ఒకరు అంటారు స్వామీ రామా.

## 7.10 తంత్రవిద్య - మలబార్ స్వామి

గురుదేవుల అనుమతిమేరకు స్వామీ రామా మలబార్ (కేరళ) ప్రాంతంలో వున్న ఒక గురువు దగ్గర తంత్రవిద్య నేర్చుకోవాలని వెళ్ళారు. ఆ గురవుల వయస్సు 102 సంవత్సరాలు. ప్రశాంతంగా ఆరోగ్యంగా, మేధావిగా వుండేవారాయన. గృహస్థు జీవితం గడుపుతూ ఎంతోమంది పెద్ద యోగులకు తంత్రవిద్య నేర్పుతున్నారు.

తంత్రవిద్య గురించి ఎంతో సమాచారం వున్నా అది సులభంగా అర్థమయ్యేది కాదు. తరచుగా అది దుర్వినియోగానికి గురౌతుంది. హిందువులు, బౌద్ధులు, జైనులు తంత్రాన్ని నేర్చారు. పాట్నాలోని కుడా భిక్ష లైబ్రరీ, బరోడా లైబ్రరీ, మద్రాస్ లైబ్రరీ

మొదలైన చోట్ల దీనికి సంబంధించిన గ్రంథాలెన్నో వున్నాయి. ఇవి సామాన్యులకు కొరుకుడు పడేవి కావు. పైగా, సమర్థులైన గురువులు కూడా అరుదు. సమర్థులైన గురువులు దొరికితే ఇదికూడా ఇతర మార్గాలతో సమానమైన ఫలితాలను ఇస్తుంది.

తంత్రవిద్యలో శివ, శక్తి అనేవి విశ్వంలో ప్రకృతి, పురుషుడు అనే స్త్రీ, పురుషుల తత్త్వాలు, తంత్రంలో కౌళ, మిశ్రమ, సమయ అని మూడు రకాలున్నాయి. ఇందులో కౌళ అనేది వామాచారం. ఇందులో శక్తిపూజ, బాహ్యక్రియలు, శృంగార కలాపాలు వగైరాలుంటాయి; కుండలిని గురించి ధ్యానం చేసి, మూలాధారంలో జాగరణ చేస్తారు. సాధారణ ప్రజలు దీనిని దుర్వినియోగం చేస్తారు. మిశ్రమ పద్ధతిలో బాహ్య, అంతర సాధనాలు కలిసివుంటాయి. ఇందులో అనాహత చక్రంలో ఆరాధన వుంటుంది. సమయతంత్రం సవ్యమైనది. ఇది శుద్ధమైన ఉన్నత యోగం. ఇందులో కామప్రసక్తి వుండదు. ధ్యానం ముఖ్యమే అయినా, అంత సాధారణమైన ధ్యానం కాదు. సహస్రారం గురించి ధ్యానం వుంటుంది. దీనిని అంతర్‌యోగం అంటారు. ఇందులో శ్రీచక్ర విద్య గురించి తెలుపుతారు. చక్రాలు, నాడులు, ప్రాణాలు వగారైల గురించిన పరిజ్ఞానం, తాత్త్విక చింతన వున్నవారినే శిష్యులుగా అంగీకరిస్తాను.

స్వామీ రామాకు మూడు మార్గాలతోనూ పరిచయం వున్నా, ఆయన సమయ మార్గాన్నే పాటించారు. ఆనందలహరి, సౌందర్యలహరి ఆయన ఇష్టపడే గ్రంధాలు. మలబార్ గురువుతో నెలరోరుజులుండి, వాటిని నేర్చుకుని మళ్ళీ హిమాలయాలకు వెళ్ళిపోయారు.

## 7.11 తూర్పు దేశాల వేదాంత మార్గాలు

విశ్వవిద్యాలయాలకు సంబంధించిన తత్త్వ ఆచార్యులలో మేటి అనిపించుకున్న వారిలో డా॥ రానడే ఒకరు. ఆయన అలహాబాద్ విశ్వవిద్యాలయానికి చెందినవారు. ఆయన అసాధారణులైన గురువు, గొప్ప యోగి. స్వామీ రామా ఆయనను తరచూ కలిసేవారు. చాలామంది శిష్యులు రానడేను 'గురుదేవా' అనేవారు.

తత్త్వశాస్త్రానికి మూలాధారణమైన ప్రశ్నలు –

1. నేనెవరిని? ఎక్కడినుంచి వచ్చాను? ఎందుకు వచ్చాను? బహుముఖమైన ఈ విశ్వంతో, సాటి మానవులతో నా సంబంధం ఏమిటి?
2. నా ఉనికి ప్రధాన స్వభావం ఏమిటి? విశ్వం స్వభావం ఏమిటి? విశ్వానికి కారణం ఏమిటి?
3. చైతన్య కేంద్రానికి, ప్రాపంచిక విషయాలకు సంబంధం ఏమిటి?
4. విశ్వంలోని వస్తువుల పేర్లు, రూపాల స్వభావాలు ఏమిటి? అవి మనిషి ప్రధాన స్వభావానికి లేక విశ్వ చైతన్యానికి ఎలా దోహదం చేస్తాయి?
5. ఈ సహజమైన శరీరంలో ఉన్నంతకాలం మన కర్మలకు మార్గ నిర్దేశం ఏమిటి? మరణం తర్వాత జననం వుందా?
6. సత్యం... అంటే ఏమిటి? సత్యం గురించి ప్రశ్నలకు హేతుబద్ధమైన సమాధానాలు పొందడం ఎలాగ?

ఈ సమస్యలను వేదాంతం, యోగం, సాంఖ్యం, వైశేషికం, మీమాంస, న్యాయం, బౌద్ధం అనే ఏడు భారతీయ తత్త్వవిభాగాలు చర్చిస్తాయి. పాశ్చాత్యులు పేర్కొన్న కాల నిర్ణయాన్నే స్వామీ రామా ఇక్కడ ఇస్తున్నారు. ఈ విభాగాలకు చెందిన పండితులు వాటిని వేలాది సంవత్సరాల నాటివని నమ్ముతారు.

1. వేదాంతం : నేను సచ్చిదానందాన్ని. ఇవి నా లక్షణాలు కావు. నా ఉనికికే మూలాలు. నేను ఎక్కడినుంచీ రాలేదు. ఎక్కడికి వెళ్ళబోయేదీ లేదు. ఎన్నో రూపాలతో, పేర్లతో వుంటాను. నా సహజ ప్రకృతి అన్ని గుణాలకు, పరిమితులకు అతీతం. నేను సముద్రంవంటి వాడిని. అన్ని ప్రాణులూ అలల వంటివి. ఒక్కొక్క ఆత్మ బ్రహ్మమే. ఓమ్ అనేది దానిపేరు. అది కేంద్రంగా విశ్వం వ్యాపించింది. అదే పరిపూర్ణమైనది. భావాతీతమైనది. అది గుణాతీతమైన వాస్తవం. అంతర్గతంగా వున్న శక్తిని కొలువగలిగిన సామర్థ్యం దానికున్నది. ఈ శక్తినే బ్రహ్మం అంటారు. దీనినే మాయ అనీ అంటారు. ఈ మాయ బహుముఖమైనట్లు కనిపిస్తుంది. తాను బ్రహ్మమని అనుకుని దానితో ఒకటిగా అనుకుంటాడు.

ఉపనిషత్తుల సందేశం ఇలా వుంది : 1 బహుముఖమైనది ఏదీ లేదు. చావునుండి చావువరకు తిరిగేవాడికి ఇక్కడున్నదంతా బహుముఖంగానే కనిపిస్తుంది. 2. నిశ్చలంగా వుండేవాడు బ్రహ్మంలో వుంటాడు. దానినుంచే విశ్వం పుడుతుంది. అందులోనే లీనమౌతుంది. 3. అంతా బ్రహ్మమే (సర్వం ఖల్విదం బ్రహ్మ). 4. బ్రహ్మం శుద్ధ జ్ఞానం (ప్రజ్ఞానం బ్రహ్మ). 5. ఈ ఆత్మ బ్రహ్మమే (అయమాత్మా బ్రహ్మ). 6. అదే నీవు (తత్ త్వమసి). 7 సోహం (నేనూ అతడే). 8. నేను బ్రహ్మన్నే (అహం బ్రహ్మాస్మి).

ఈ వేదాంతసారం వేలాది ఏళ్ళుగా వ్యాసుడు, గౌడపాదుడు, గోవింద పాదులు మొదలైన మహర్షుల మూలంగా వ్యాపించాయి. శంకరాచార్యులు వీటన్నింటిని ఒకదారికి తెచ్చి సమగ్ర రూపాన్నిచ్చారు. ఆయన తర్వాత ఎంతో మంది ఆచార్యులు ద్వైత, అద్వైత మార్గాలను ప్రతిపాదించారు.

2. యోగం : ఇందులో ఆత్మ ఒక సాధకుడు. విశ్వచైతన్యం దాని సాధన ఫలితంగా కనిపించే సత్యం. ఇది సకల మతతత్త్వ సారం. వాటి వ్యవహార, ప్రయోగాత్మకమైన రూపమిది. ఆత్మ శరీరశుద్ధిని, దృఢత్వాన్ని కూడా చూసుకోవాలి. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ధ్యానం వగైరాలతో సమాధి స్థితిని పొందవచ్చు. ఇందులో కైవల్యమే అంతిమ లక్ష్యం. వేలాది ఏళ్ళనుంచి ప్రచారంలో వున్న ఈ శాస్త్రాన్ని క్రీ.శ. 1వ శతాబ్దినాటి పతంజలి మహర్షి యోగసూత్రాలుగా రూపొందించారు.

3. సాంఖ్య పద్ధతి : ఇదికూడా యోగంవంటిదే. ప్రకృతి, పురుషుడు వేర్వేరుగా పరస్పరం ఆధారపడి సహజీవనం చేస్తారని ఇది చెబుతుంది. జీవుడు, ఈశ్వరుడు అని చైతన్యం రెండు విధాలు. ఇతర సాంఖ్య పద్ధతులలో దేవుని ఉనికితో నిమిత్తం లేదు. సత్వ, రజో, తమో గుణాలవల్లనే అంతా జరుగుతుంది. మానసికంగా, భౌతికంగా విశ్వం ఇరవైనాలుగు, ముప్పైఆరు, అరవైదశల గుండా నడుస్తుంది. భారతీయ తత్త్వానికి ఇది మూలం. దీనినుంచి భారతీయ గణితం, వైద్యం వగైరాలు ఏర్పడ్డాయి. అసురి, కపిలుడి, మొదలైన మహర్షులు ఈ శాస్త్ర నిపుణులు, క్రీ.శ. 3వ శతాబ్దినాటి ఈశ్వరకృష్ణుడు ఈ బోధనల సారాన్ని 'సాంఖ్యకారిక'గా రూపొందించాడు.

4. వైశేషికం : ఈ పద్ధతిలో శరీర విశ్వాల భౌతిక రసాయనశాస్త్రాల అధ్యయనం జరుగుతుంది. మూలకాలు, పరమాణువులు, వాటి పరస్పర చర్యలు మొదలైన అంశాలను ఇది వివరిస్తుంది. క్రీ.పూ. 300 నాటి కణాదుడు ఇందుకు ఆద్యుడు. మనిషికి ధర్మ ప్రవర్తన ముఖ్యం. దాని ద్వారానే అతను ఉత్తమ జన్మలు పొందుతాడు అనేది దీని ముఖ్యమైన సారం. పంచభూతాలు, దేశకాలాలు, బుద్ధి, ఆత్మ మొదలైనవాటి పరస్పర సంబంధాలను ఇది చర్చిస్తుంది. క్రీ.శ. 4వ శతాబ్దిలో ప్రశస్తపాదుడు దీనిని ప్రోత్సహించాడు.

5. మీమాంస : ఇది క్రీ.పూ. 400 నాటి జైమిని సృష్టి. ఇందులో వేదాలు అపౌరుషేయాలు. అంతర్గత విజ్ఞానానికి నిధులు. కర్మ ద్వారానే మోక్షం సాధ్యం అనేది ఇందులో ముఖ్యమైన ప్రతిపాదన. కర్మకాండలు, పూజలు, నైతిక ప్రవర్తన కర్మ సిద్ధాంతంగా వికసించాయి. వ్యాకరణవేత్తలను, తార్కికులను ఈ వ్యవస్థ సవాలు చేస్తుంది.

6 న్యాయం : గౌతముడు మొదలైన ఋషులు ప్రతిపాదించిన తార్కిక మార్గమిది. తత్త్వవిచారణకు సందేహం పునాదిగా అవసరమైన నియమావళిని ఇస్తుందిది. పదహారవ శతాబ్దంలో దీనికి మెరుగులు దిద్దారు. నేటి పాశ్చాత్యుల గణిత తర్కానికి, దీనికి పోలికలున్నాయి.

7 బౌద్ధం : సాంఖ్య తత్త్వానికి ఆద్యుడైన కపిలుని ప్రదేశమే కపిలవస్తు. అక్కడ దాదాపు రెండువేల అరు సంవత్సరాల క్రితం బుద్ధుడు జన్మించాడు. అధార కాలముడు అనే గురువు దగ్గర తత్త్వాని నేర్చుకున్న బుద్ధునికి తర్వాత జ్ఞానోదయమై తెలుసుకున్న సత్యాలు ఇలా ఉన్నాయి :

1. దుఃఖం అనేది వుంది. 2. ఆ దుఃఖానికి కారణం వుంది. 3. ఆ దుఃఖాన్ని పోగొట్టుకోవచ్చు. 4 దుఃఖనివారణకు మార్గాలున్నాయి.

ఈ సత్యాలను పతంజలి యోగ సూత్రంకూడా పేర్కొంటుంది. అయితే, బుద్ధుడు అనాత్త (అనాత్మ) అనే భావాన్ని ప్రవేశపెట్టాడు. నేతి (ఇదికాదు) అనేది ఋషులు పాటించిన పద్ధతి. బుద్ధునికి దేవుని ఉనికి గురించి అనవసరం. నిర్వాణం తర్వాత బుద్ధులు ఉంటారా అనేది కూడా అనవసరం. అటువంటి ప్రశ్నల గురించి ఆలోచించడం అనవసరం. ఆత్మజ్ఞాని అయిన గురువు శిష్యునికి ఎనిమిది నియమాలున్న అష్టాంగమార్గాన్ని బోధించాలి. తర్వాత అతను బోధి అవుతాడు. ఇది చైతన్యంలో పరాకాష్టవంటి దశ. బుద్ధుడు పాళీ భాషను ఉపయోగించాడు.

బుద్ధుని అనంతరం సన్యాసులు ఎవరిదారినవారు వెళ్ళారు. పెద్దల సిద్ధాంతం అనీ తెరవాదం. మనదేశంలో అదృశ్యమైన మహాయానం అనే రెండు బృందాలు ఏర్పడ్డాయి. రెండు పద్ధతులకు సంబంధించి ఎన్నో గ్రంథాలు వచ్చాయి. తెరవాదుల ప్రకారం భారతీయ తత్త్వశాస్త్ర నియమాలకు, బుద్ధుని బోధనలకు పూర్తిగా పోలికే లేదు. పాళీలో తాత్విక చింతన ఎక్కువ జరగకపోయినా వారు పాళీ భాషనే వాడుకున్నారు. బుద్ధుడే వారి గురువు. హిందువుల శైలిలోనే పూజలూ అవీ చేశారు. ఈ సిద్ధాంతం ప్రకారం బుద్ధుడు వారి రక్షకుడు కాదు. ఎవడికివాడు తన జ్యోతిని దర్శిస్తాడు. ఆత్మజ్ఞానం పొంది అనాత్మస్థితికి చెబుతాడు.

మహాయానం సంస్కృతాన్ని పాటించక తప్పలేదు. నాగార్జునుడు శూన్య వాదాన్ని

ప్రవేశపెట్టాడు. విశ్వచైతన్యాన్ని బోధించే ఆలయ విజ్ఞానం లేక విజ్ఞానవాదిమార్గం అయనది. ఇందువల్ల హిందువులు బుద్ధుని భగవంతుని తొమ్మిదవ అవతారంగా పేర్కొన్నారు. ఉపనిషత్తులోని శుక్లబ్రహ్మకు ధర్మకాయం, ఉపనిషత్తుల శబల బ్రహ్మ ఈశ్వరులకు సంభోగకాయం, అవతారం వంటి నిర్మాణకాయం అని మూడు రకాల కాయలు బుద్ధునికున్నాయి.

మహాయానం కుండలిని, చక్రాలను వగైరాలను ఉపయోగిస్తుంది. హిందువులు మాదిరిగానే సంకేత చిత్రాలను, కర్మకాండను వాడుకుంటుంది. బుద్ధుని మార్గం మజ్జిమ ప్రతిపాదం (మధ్యేమార్గం) బుద్ధుని బోధనలు ముఖ్యంగా సన్యాసులకు ఉద్దేశించినవి. అయితే, ఇతర ప్రపంచం బోధనాల మాదిరిగానే ఇవికూడా ప్రపంచంలో చాలామందికి జీవనమార్గమయ్యాయి. మధ్యేమార్గంలో తన్హా (కోరిక)ను పెంచే అజ్ఞానాన్ని (అజీవ) నిర్మూలించుకోవచ్చు. అప్పుడే బాధ, దుఃఖం, కష్టం పోతాయి.

ఈ ఏడు పద్ధతులూ వాస్తవాన్ని పలు కోణాలలో దర్శిస్తాయి. అందుకే మన పురాణాలూ, కావ్యాలూ వీటన్నిటినీ వాస్తవాలుగా, ప్రామాణికాలుగా గుర్తిస్తాయి.

## 7.12 సోమరసం

హిమాలయంలోని పండితులు, వైద్యులు సోమరసాన్ని వారి పూజలలో, క్రతువులలో వాడేవారు. దీని గురించి వున్న ఒక పుస్తకాన్ని రామా చదివారు. ఆ పుస్తక రచయితను కూడా కలిశారు. అయనద్వారా హిమాలయాలలో అప్పటికి సజీవంగా వున్న వైద్య భైరవదత్తును కలిశారు. దత్తుగారు సోమరసం గురించి బాగా తెలిసిన వ్యక్తి. ఆయన తర్వాత కొంతకాలానికి మరణించారు. అయినా, ఆయన ప్రారంభించిన పరిశోధనశాల ఈనాటికీ వుంది. ఆయన సోమరసం గురించి స్వామీ రామాకు వివరించారు. సోమరసం హిమాలయాలపై పదకొండువేల అడుగుల ఎత్తున పెరిగే తీగె. ఆ ఎత్తులో అది రెండు మూడు స్థలాలలో మాత్రమే పెరుగుతుంది. రామా ఆయనకు ఖర్చులకోసం వెయ్యి రూపాయలు ఇచ్చారు. ఆయన దాదాపు 400 గ్రాముల సోమ మూలికను తీసుకువచ్చారు. తర్వాత సోమరసం తయారుచేసి గంజాయి వగైరా వాడే సాధువులపై దానిని ప్రయోగించారు. వారిలో భయం పోయింది. వారు వర్ణించిన అనుభవాలు పుట్టగొడుగులు తిన్న ఆంగ్లేయులు కొందరు చెప్పినట్లుంది. ఆయుర్వేద గ్రంథాలలో పుట్టగొడుగుల గురించి వుంది. ఉమ్మెత్త వంటి మొక్కలరసం చిన్నడోసులో తీసుకున్నప్పుడు చిత్తభ్రమ కలుగుతుంది.

మన పెద్దలు సోమరసం గురించి, పాదరసం గురించి ఎంతో రాశారు. అయితే యోగంలో ఈ బాహ్యప్రేరణల అవసరం లేనేలేదు. కొందరు తక్కువ స్థాయి సాధువులు వీటిని తెలిసీ తెలియకుండా వాడేవారు. వీరు సాధారణంగా మాటా పలుకు లేకుండా కూర్చుని ఉండేవారు. హోమియోపతిలో ఆర్స్ – 10 ఎమ్. మందు ఒక డోసు ఇచ్చి భయం పోగొట్టవచ్చు. ఈజిప్షియన్‌లు, గ్రీకులు రోగులు మరణశయ్యపై ఉన్నప్పుడు బాధ తెలియకుండా హెమ్‌లాక్ విషాన్నిచ్చేవారు. అదే విధంగా సోమ అంతర్ముఖులను చేస్తుందని వాడేవారు. ఔషధివల్ల కొన్ని అనుభూతులను పొందవచ్చునని పతంజలి యోగ సూత్రాలు నాలుగవ అధ్యాయంలో

తొలిశ్లోకం చెబుతుంది. ఇంద్రియాల వల్ల వచ్చే అనుభూతులకన్నా ఇవి కొంచెం పై స్థాయివే. అయినా, అధ్యాత్మికతకు సంబంధించి వీటివల్ల అంతగా ప్రయోజనం వుండదు. సోమరసం సవ్యంగా ఒక ఆసనంలో కూర్చోలేనివారికి, ఏకాగ్రత చూపలేని వారికి పనికి వచ్చేది, బాహ్య ప్రేరణ బాధను తెలియనివ్వకుండా చేస్తుంది. దీనిని పరిమితంగా కొందరు మాత్రమే వాడేవారు.

వైద్య భైరవదత్తు ప్రకారం మంత్రంతో పాటు ఇటువంటివి వాడడం సామాన్యమైన అలవాటు. అయితే, అందరికీ ఇది ఉపయోగపడదు. నాడీమండలం దెబ్బతినే ప్రమాదం కూడా వుంది. చిత్తభ్రమలు పెరిగి పిచ్చివారుగా మారే ప్రమాదం కూడా వుంది. మాంద్యం కూడా రావచ్చు. సోమరసం వాడినప్పుడు ఆరోగ్యకరమైన ఆహారం, ప్రశాంతమైన వాతావరణం, మంత్రం, మార్గనిర్దేశం ముఖ్యం. అయితే, నిజమైన సోమరసమా కాదా అని రామా నిర్ధారణ చేసుకోలేదు. దానివల్ల ఆనందం కలిగేది నిజమే అయినా, పదేపదే వాడితే దీనికి బానిస కాక తప్పదని దత్తు అన్నాడు. "ఇది అద్భుతమైనది ఇంత వరకు నీకు ఇటువంటిది దొరికి వుండదు" అని రామాను బలవంత పెట్టాడాయన.

ఒక ఉదయంపూట ఆయన ఎనిమిది మూలికల మిశ్రమం అయిన అష్టవర్గాన్ని సోమరసంతో కలిపి ఇచ్చాడు. ఇద్దరూ తాగారు. కాస్తపుల్లగా–ఘాటుగా వుంది. తర్వాత కాసేపటికి అతను ఊగిపోతూ, వరుసగా బట్టలన్నీ విప్పేశాడు. రామాకు తల పగిలిపోతున్నట్లుంది. వీరిని చూసిన వ్యక్తి కంగారుపడ్డాడు. రామా 'గంగలోకి దూకి అడవిలోకి వెళ్లామా?' అని అడిగారు. అంతా గందరగోళంగా వుంది. దత్తు నాట్యం చేస్తూ 'నేనే శివుణ్ణి. పార్వతి ఎక్కడ? నేను ఆమెతో శృంగారం చేయాలి' అంటున్నాడు. ఇందువల్ల రామాకోసం వచ్చిన శిష్యులు ఇబ్బందిపడ్డారు. అయిదుగురు కలిసి అతన్ని పట్టుకున్నా అతను విదిలించుకున్నాడు. పక్క గదిలోంచి చూస్తున్న రామా తల భారంగా వుండి కదల్లేదు. ఇంకో స్వామి ఇచ్చిన గోరువెచ్చని నీరు తాగి వాంతి చేసుకున్నారు. దానితో కాస్త నెమ్మదిగా అనిపించింది. ఈ అనుభవం ఉత్తర కాశీలోని ఉజెలీ ఆశ్రమంలో జరిగింది.

చాలా కాలం పరిశీలన తర్వాత ఇటువంటి వాటివల్ల మేలుకన్నా కీడే ఎక్కువ అని రామా గ్రహించారు. 'మానసికంగా సిద్ధంలేని వారికి ఇటువంటివి ప్రమాదకరం. సిద్ధపడినవారికి ఇటువంటి మందులు అనవసరం' అంటారాయన.

★ ★ ★

అధ్యాయం ఎనిమిది

# అన్ని మతాలు చెప్పేది ఒక్కటే

'అన్ని మతాలు చెప్పేది ఒకే సత్యం. సత్యాన్ని అభ్యసించకుండా మతాన్ని (ధర్మాన్ని) పాటిస్తే గుడ్డివాడు గుడ్డివాడికి దారి చూపినట్లు ఉంటుంది. దేవునికి చెందినవారు అందరినీ ప్రేమిస్తారు. అన్నిటినీ ప్రేమిస్తారు. ప్రేమ విశ్వమతం. దయామయుడైన వ్యక్తి మతం హద్దులను దాటి వెళ్తాడు. అఖండమైన పరమ సత్యాన్ని గ్రహిస్తాడు.'

## 8.1 హిమాలయాలలో క్రైస్తవ యోగి - సాధు సుందర్‌సింగ్

స్వామీ రామా ఆశ్రమంలో ఒకప్పుడు క్రీస్తు గురించి బాగా ఎరిగిన ఋషి ఒకాయన ఉండేవాడు. ఆయన పేరు సాధు సుందర్‌సింగ్. మద్రాసు బీచిలో ఆయన ఉపన్యాసాలకు వేలమంది ఎగబడేవారు. ఎంతోమంది ఆయన మాటలు వినేందుకు యిరోపా నుంచి వచ్చేవారు. ఆయన అమృత్‌సర్‌లో జన్మించాడు. సిక్కు మతస్తుడు.

యువకుడుగా ఉన్నప్పుడు తరచుగా ఆయనకో కల వచ్చేది. అది కలేనా? మరేదైనానా? మేలుచేసేదా? కీడుచేసేదా? ఆయనకు అర్థమయ్యేది కాదు. ఎవర్నో ఆయన్ను చూసి హిమాలయాలకు వెళ్ళమని చెప్పినట్లు కనిపించేది. నిద్ర మానేద్దామనుకుంటే అలసటవల్ల కళ్ళు మూసుకునేవి. అదే దృశ్యం కనిపించేది. 'నేను చెప్పేది వినగలవా? నీ రక్షకుణ్ణి నేను. నీకు గత్యంతరం లేదు' అని వినిపించేది. అలా ఎవరు చెబుతున్నారో ఆయనకు తెలియలేదు. కొందరిని సలహా అడిగాడు. అది క్రీస్తు అనీ, కృష్ణుడనీ, బుద్ధుడనీ రకరకాలుగా చెప్పేవారు. అయితే, క్రీస్తు బొమ్మను చూసి 'నా కలలో మేలుకొలిసే గురువీయనే' అన్నాడాయన. ఆయన ఎవరికీ చెప్పకుండా హిమాలయాలకు వెళ్ళి అక్కడే చాలాకాలం వున్నాడు. స్వామీ రామా ఆశ్రమంలోనే ఆయన చాలా కాలం వున్నాడు.

రామాకు బైబిల్ పరిచయం చేసినవ్యక్తి ఆయనే. గీతను, బైబిల్‌ను పోల్చి చూడడం నేర్పిందీ ఆయనే. 'ఉదయ సందేశం కృష్ణునిది. మధ్యాహ్నం సందేశం బుద్ధునిది. సంధ్యా సందేశం క్రీస్తుది. ఏమీ తేడాలేదు. కరుణామయుడైన క్రీస్తు, ఆత్మజ్ఞాని అయిన బుద్ధుడు, పరిపూర్ణుడైన కృష్ణుడు తమ కాలానికి తగిన సందేశాలనే ఇచ్చారు. దేవుని అవసరం వచ్చినప్పుడల్లా ఆ పరిపూర్ణ హృదయులు పరమసత్యానికి ప్రతినిధులు, రకరకాలుగా అవతరిస్తూనే వుంటారు. మానవాళికి మేలు చేస్తూనే వుంటారు. విశ్వమతాలన్నిటినీ గౌరవించే సంప్రదాయం ఋషులది' అన్నాడాయన.

సాధు సుందర్‌సింగ్ ప్రేమమూర్తి. మహాజ్ఞాని. ఎరుక కలిగినవాడు రామా

ఆయనను ఒక గురువుగా గౌరవించారు. ఒకరోజు సుందర్‌సింగ్ బౌద్ధం, క్రైస్తవం మధ్య అందమైన పోలిక చెప్పాడు. 'హిందూ మతంనుంచి బౌద్ధం పుట్టినట్లే, యూదు మతం నుండి క్రైస్తవం పుట్టింది. ఈ రెండు గొప్ప మతాలు క్రమ పరిణామంలో శతాబ్దాల తరబడి మార్పులకు గురైనాయి. కొన్ని ముఖ్యమైన లక్షణాలు చూద్దాం---'

మనిషి హృదయంలోనూ, బుద్ధిలోనూ అధమస్థాయి నుండి వుండే శరీర వ్యామోహాన్ని అవి రెండూ త్యజించాయి. అదే దుర్మార్గానికి పుట్టిల్లు అని భావించాయి. పాపం, స్వార్థం అనేవి నిరాశావాదానికి దారితీస్తాయి. ఆ రెండు మతాలు బాధ గురించి, మానవాళిపై దయగురించి ఎక్కువగా చెప్తాయి. ఇతరుల సేవలోనూ, అందరిని తమలాగా ప్రేమించడంలోనూ మరణం వచ్చినా మేలే అనీ ప్రేమ సూత్రాన్ని అవి చాటుతాయి. నిస్వార్థమైన ప్రేమను అవి బోధిస్తాయి. క్రైస్తవం ప్రేమ మానవాళికి పరిమితం. బౌద్ధ ప్రేమ సకల ప్రాణులకూ విస్తరించింది. క్రైస్తవం జీవిత విశ్లేషణకు తత్త్వాన్ని సాయం తీసుకుంటుంది. నమ్మకంతో ఆగిపోతుంది. బౌద్ధం జీవితాన్ని హేతుబద్ధం చేసి నిర్వాణం దగ్గర ఆగుతుంది. బౌద్ధసన్యాసం శాంతిని, క్రైస్తవ సన్యాసం ఆనందాన్ని బోధిస్తాయి. వీటిని ప్రపంచం ఇవ్వజాలదు; తీసుకోనూ చేయజాలదు. నైతిక జీవనం, క్రమశిక్షణ, సత్ప్రవర్తన, మంచి అలవాట్లు వగైరాలను రెండూ బోధిస్తాయి. స్థూలంగా రెండింటిమధ్య అంతగా తేడాలు లేవు.

బౌద్ధుడికి త్రికరణశుద్ధి వుంటుంది. చరిత్ర ప్రకారం క్రీస్తు సహచరులు కూడా పరమాత్మకే అంకితం అయినవారు. రెండు మతాలూ వ్యక్తిగతమైన నైతిక పరిపూర్ణతను బోధించాయి. కోరిక దుఃఖకారణం అన్నది బౌద్ధం. అవకాశాన్ని వాడుకునే పాశ్చాత్యుల నైజం క్రైస్తవంలో వుంది. ప్రశాంతంగా ధ్యానముద్రలో వున్న ఋషి బౌద్ధానికి సంకేతం. పరమ విశిష్టమైన సంకేతం, విశిష్టమైన బాధాసహిష్ణుతకు సంకేతం అయిన శిలువపైవున్న క్రీస్తును క్రైస్తవం సంకేతంగా తీసుకుంది. బుద్ధుడు, క్రీస్తు ఒకేవిధంగా వుంటారు. అయినా, కొన్ని చిన్న తేడాలున్నాయి. ఏసు తీవ్రమైన సత్య ప్రేమికుడు, బుద్ధుడు శాంతమౌని. క్రైస్తవం ఆస్తికమతం, బౌద్ధం అచింతనలేని సందేహవాది (అగ్నాస్టిక్). తమ మతంలో రెండింటి విలువలన్నీ ఉన్నాయనుకునేవారు, వేటికవే విశిష్టమైనవని, మానవాళి నిర్మాణంలోనే ఎంతో సేవ చేశాయని మరచిపోతున్నారు.

వైష్ణవుల మాదిరిగానే క్రైస్తవులు కూడా ద్వైతులు. బౌద్ధులు వేదాలలో చెప్పినట్లు నిర్వాణప్రియులు. మోక్షానికి మారు పేరు నిర్వాణం. ఋషుల పథం అతి ప్రాచీనం. అందులో బౌద్ధం, క్రైస్తవం – అన్ని బోధనలూ వుంటాయి. హిందూ మతం అవతారాలను నమ్ముతుంది. అయితే, ఋషులపథం సర్వోన్నతమైనది. వైదిక మతానికి ఋషులే పునాది. అన్ని మతాల నైతిక విలువలు, తత్త్వం, మానవాళి సంబంధాలు మొదలైన అంశాలన్నీ హిందూమతంలోనూ వున్నాయి. ఉపనిషత్తులు ఋషుల సందేశాలకు నిధులు. వాటి బోధనలు కాలాతీతమైనవి. విశ్వజనీనమైనవి. అందరికోసం నిర్దేశించినవి. వేదాలను ఏ ఒక్కరో స్థాపించలేదు. ఉన్నతమైన ధ్యానంలో మహర్షులు కనుగొన్న పరిపూర్ణమైన సత్యాలన్నీ ఊటలుగా ఏర్పడినవే వేదాలు. అవి సార్వజనీనమైన జ్ఞానవాహినులు.

అయితే, వేదాలను ఎవరు అనుసరిస్తారు అన్నది ప్రశ్న. వేదాలలో పలు

మార్గాలున్నాయి. త్యాగమార్గం కుదరనివారు కర్మ బంధకారణం అని తెలుసుకోవాలి. అదేవిధంగా కర్మనియమాన్ని ఎవ్వరూ దాటలేరు. కారణం, ప్రభావం అనేవి కర్మకు జంట నియమాలు. అవి విడదీయలేనివి. గాఢమైన భక్తి. ప్రేమ లేకుండా కర్మ మోక్షకారణం కాదు. ఆత్మ జ్ఞానపథంలో కర్మ ఎన్నో అంతరాయాలు కల్పిస్తుంది. బంధాలను ఏర్పరచుతుంది. కర్మ సిద్ధాంతం, అవతార సిద్ధాంతం ఒక్కటే.

"ఋషులది ధ్యానమార్గం. చింతనాపథం. మానవాళి అవసరాలు తీర్చేది వారే. ఆధ్యాత్మిక జీవనం గడుపుతూ, తమ పనులు తాము నైపుణ్యంతో, నిస్వార్థంగా చేసుకుంటూ, ఇక్కడే, ఇప్పుడే, పరమసత్యాన్ని గ్రహించేందుకు కావలసిన కార్యరూపానికి సంబంధించిన పాఠాలు చెప్పేది వారి మార్గమే. క్రైస్తవం దైవ సామ్రాజ్యాన్ని, బౌద్ధం నిర్వాణాన్ని బోధించినట్లే, ఋషిపథం ఆత్మజ్ఞానాన్ని బోధిస్తుంది. ఆత్మజ్ఞానం ద్వారానే అవిభాజ్యమైన పరమసత్యాన్ని తెలుసుకునేందుకు వీలవుతుంది. క్రైస్తవం, బౌద్ధంలో వున్నట్లుగా ఇందులో ఆరాధనకు ఆదర్శంగా ఏ సంకేతమూ వుండదు. ఆత్మ నుంచి నిజమైన ఆత్మ, విశ్వాత్మలను తెలుసుకోవడం ఋషిపథం. అందులో ఎవరినీ విడిచేది లేదు. అది అందరినీ కలుపుకుంటుంది" అన్నాడాయన.

సాధు సుందర్‌సింగ్ క్రీస్తు చైతన్యంతోనే ఎప్పుడూ సంచరించేవాడు. ఆయన మాటల ప్రభావం అందరిపైన తీవ్రంగా వుండేది.

ఒకరోజున స్వామీ రామా 'మీరు దేవుని చూశారా?' అని అడిగారు. 'ఈ విధంగా అడిగి నీవు నన్ను అవమానిస్తున్నావు. నేనెప్పుడూ ఆయన్ను చూస్తున్నాను. ఒకసారి, రెండుసార్లు, మూడుసార్లు కాదు– ఆయనతో నేను ఉండేందుకు వీలు కానప్పుడు ఆయనే నాతో వుంటాడు' అన్నాడాయన. 'దయచేసి కొంచెం వివరించండి' అన్నారు రామా. 'నీవు స్పృహలో వున్నంతసేపు దేవుని తలచుకుంటూనే వుండు. నిద్రలో నీ చైతన్యం అణగారినప్పుడు ఆత్మ సమర్పణ చేసుకో. నిద్రపోయేముందు 'దేవా! నేను నీవాడిని. నీవు నావాడివి' అనేది నీ ఆఖరి ఆలోచన కావాలి. అప్పుడు దేవుడు రాత్రంతా నీతోనే వుంటాడు. ఇద్దరూ ఎప్పుడూ కలిసి వుండవచ్చు.' వివరించాడాయన.

ఒకరోజు హఠాత్తుగా ఆయన అదృశ్యుడైనాడు. ఎక్కడికి వెళ్ళాడో తెలియదు. ఆయన గురించి తెలుసుకోవాలని రామా ఎంత ప్రయత్నించినా ఫలితం లేకపోయింది. దైవచైతన్యంతో నిరంతరం వుండడం సాధ్యమేనని రామా ఆయన నుండి నేర్చుకున్నారు. "అటువంటి అజ్ఞాత ఋషులు ఎందరో వున్నారు. నిరంతరం క్రీస్తు చైతన్యంలో జీవించేవారు ధన్యులు" అంటారు స్వామీ రామా.

## 8.2 జెసూట్ సాధువుతో స్వామీ రామా

స్వామీ రామా శంకరాచార్యులుగా వున్నప్పుడు ఒక జెసూట్ సాధువును కలిశారు. జ్ఞానాగ్నిలో కోరికలు దహించినట్లు రుజువైనప్పుడు సాధువులకు కాషాయదీక్ష వస్త్రాలు ఇస్తారు. కొందరు పెద్ద సాధువులు అటువంటి ఆచారాలు పాటించరు. వారు తెల్లని వస్త్రాలు ధరించి, దుప్పట్లు కానీ, గోనెసంచీలు కానీ కప్పుకుంటారు. వారికి ఫలాని దుస్తులు ధరించాలనే నియమం వుండదు.

స్వాముల పరంపరలో పదిరకాల వారున్నారు. సాధు పరంపర పలురకాలు. స్వాములలోని పదిరకాలలో నాలుగు బ్రాహ్మణులకే పరిమితం. విద్య, ఆధ్యాత్మిక జ్ఞానం, ఆ వాతావరణం వారికి చిన్నతనం నుంచే అలవాటు ఉండడం ఇందుకు కారణం. శాస్త్రగ్రంథాలు చదివి, అందరికీ ఆ జ్ఞానాన్ని పంచడం వారి విధి. ఇతర ఆరు పద్ధతులూ అన్ని వర్గాలవారికి పనికివస్తాయి.

రామా చూసిన జెసూట్ సాధువు మెడలో శిలువను ధరించేవాడు. అతని వేషం స్వామీ రామాను ఎంతో ఆకర్షించింది. రామాకు తారసపడిన మూడవ క్రైస్తవ సాధువు అతనే. అతనికి సంస్కృతం, ఇంగ్లీషు, దక్షిణాది భాషలు వచ్చు. అచ్చం హిందూ స్వామిలాగానే జీవించేవాడు. అతనితో స్వామీ రామా చర్చించారు.

హిందూ క్రైస్తవులకు, పాశ్చాత్య క్రైస్తవులకు తేడా వుంది. హిందూ క్రైస్తవులు ఉపనిషత్తులకు స్వాములు భాష్యం చెప్పినట్లే బైబిల్‌ను వ్యాఖ్యానించేవారు. విదేశాలలో క్రైస్తవంలోని ఆచరణీయతను అంతగా అర్థంచేసుకోరు. క్రీస్తు హిమాలయాలలో జీవించాడని ఆయన నమ్మకం. ఈ విషయంలో స్వామీ రామాకు అంత పట్టింపులేదు. ఆయన వినయశీలి. క్రీస్తుతో నడవడం గురించి రామాతో మాట్లాడేవాడు. 'రెండువేల ఏళ్ళక్రితం జీవించిన వ్యక్తితో నడవడం ఎలా సాధ్యం?' అని అంటారు రామా.

'ఎంత అజ్ఞానం? క్రీస్తు అనేది పరిపూర్ణతా స్థితి, ఏకత్వస్థితి, సత్యస్థితి. సత్యం అనేది చిరంజీవి అయిన వాస్తవం. దానికి చావులేదు. నేను క్రీస్తు చైతన్యంతో జీవిస్తాను. ఆయన అడుగుజాడలు అనుసరిస్తాను' అన్నాడాయన.

'ఆ అడుగుజాడలేవీ?' అడిగారు రామా. ఆయన నవ్వుతూ అన్నారు కదా- 'ఎక్కడికి ఏ వైపు కదిలివెళ్ళినా, ఆయన నన్ను నిర్దేశిస్తున్నట్లే వుంటుంది. అవి అన్నివైపులా వున్నాయి. విశ్వాసం అనే కంటితో చూడాలంతే. నీకుందా?' క్రీస్తుపట్ల, క్రీస్తు చైతన్యంపట్ల ఆయనకున్న ప్రేమకు రామా ఎంతో సంతోషించి వీడ్కోలు పలికారు.

## 8.3 హిమాలయాలలో ఏసుక్రీస్తు

శంకరాచార్య పదవిని పరిత్యజించిన తర్వాత స్వామీ రామా కొంతకాలం గురుదేవులతో గడిపారు. అక్కడినుంచి అమరనాథ గుహకు వెళ్ళాలని ఆయన నిర్ణయం. అమరనాథ గుహలో మంచు చుక్కలు రాలి, గట్టిపడి శివలింగం అవుతాయి. అక్కడ యాత్రాకాలంలో పావురాల జంట వస్తుందిట. స్వామీ రామా యాత్రాకాలంలో ఓ కాశ్మీరీ పండితుడు మార్గ నిర్దేశకుడుగా పనిచేశాడు. అతను చెప్పిన దాని ప్రకారం క్రీస్తు కాశ్మీరంలో ధ్యానం నేర్చుకున్నాడు. ఒక టిబెటన్ తాళపత్ర గ్రంథంలో ఈ విషయం వుందని ఆయన పేర్కొన్నాడు. దీనినే ఒక రష్యన్ రచయిత- 'ది అన్‌నోన్ లైఫ్ ఆఫ్ జీసస్ క్రైస్ట్' (ఏసు ప్రభువు అజ్ఞాత జీవితం) అనే పేరుతో ఇంగ్లీషులో రాశాడు. హిమాలయాలలో ఆ ప్రాంతాలలోని ప్రజలు ఈ కథను నమ్ముతారు. క్రీస్తు ధ్యానం చేసినట్లు చెప్పుకునే గుట్ట ప్రాంతం అక్కడ వుంది. రామా గురుదేవులు ఇందుకు మూడు రుజువులు పేర్కొన్నారు. 1) క్రీస్తు దుస్తులు కాశ్మీరీ దుస్తుల మాదిరిగానే వుంటాయి. 2) ఆ తలకట్టు శైలి కాశ్మీరీయులదే. 3)

ఆయన చేసిన అద్భుతాలు యోగులందరూ చేసినవే. కాశ్మీర్‌లో ఆయన వున్నట్లు చెప్పకునే ప్రాంతాన్ని తఖ్త్–ఏ–తావుస్ (మహనీయుడున్నచోటు) అంటారు. తన పదమూడవ ఏట కాశ్మీర్‌కు వచ్చిన క్రీస్తు ముప్పయ్యవ సంవత్సరం వరకూ అక్కడే జీవించాడని ఆ కాశ్మీరీ పండితుడంటాడు. క్రీస్తు పట్ల ఆయనకున్న ప్రేమకు రామా ముగ్ధుడైనాడు.

అమర్‌నాథ్‌కు వెళ్ళే దారిలో గుల్మార్గ్ అడవులకు పదకొండు కిలోమీటర్‌ల దూరంలోని ఒక ఆశ్రమానికి ఆ పండితుడు తీసుకువెళ్ళాడు. అక్కడ ఒక కాశ్మీరీ శైవ పండితుడు ధ్యానంలోనే ఎక్కువ సమయం గడిపేవాడు. కాశ్మీర్ శైవంలో ఎన్నో పుస్తకాలు అనువాదాలకు, వివరణలకు నోచుకోనివి. అదృష్టవంతులైన వారికి ఆ సమాచారం తెలిసేది. నిపుణుడైన గురువుంటేనే తెలిసేది. స్పందన లేక తక్షణ ప్రకంపనవల్లనే ఆత్మబుద్ధి, దేహం, విశ్వంలోని అన్ని స్థాయిలలోని వాస్తవాలు ఏర్పడుతున్నాయని ఈ సిద్ధాంతం చెబుతుంది. గురువుద్వారా శిష్యునిలో శక్తి ప్రవేశించడం (శక్తిపాతం), అంతవరకు నిద్రాణమైవున్న శక్తి మేల్కొనడం అనేది దీని సారాంశం.

ఆ స్వామి ద్వారా స్వామీ రామాకు ఒక యోగి గురించి తెలిసింది. ఆ యోగి ప్రతి వేసవిలోనూ అమర్‌నాథ్ గుహకు వచ్చేవాడు. ఆయన స్థిర నివాసం ఎక్కడో ఎవరికీ తెలీదు. లధక్ ప్రజలు ఎన్నోసార్లు ఆయన ఒంటరిగా కొండనెక్కడం చూశారు. ఆయనను కలవాలన్నది రామా కోరిక. తాను కలుసుకున్న వారంతా ఆయనపై ఏదో ఒక విధంగా చెరగని ముద్ర వేశారు. ఆ యోగి వయస్సు ఇరవై ఏళ్ళు. అందగాడు. ఎర్రని బుగ్గలవాడు. బ్రహ్మచారి. యోగాభ్యాసంవల్ల ఎంత చలిలోనైనా, పది పన్నెండు వేల అడుగుల ఎత్తులో కూడా కాళ్ళకు చెప్పలైనా లేకుండా నడిచేవాడు. ఆయనతో వుండడం స్వామీ రామాకు గొప్ప అనుభూతి నిచ్చింది. అక్కడివారు ఆయనను 'బాలభగవాన్' అన్నారు. ఆయన పొగడ్తలకు అతీతుడు. రామా గురుదేవుల దగ్గరున్న శిష్యుల అందరి గురించి అడిగాడు. గురుదేవులు ఆయనకు వంగి నమస్కరించడం, పాదాలు తాకడం, భక్తి ఆవేశంతో పరుగెత్తడం ఆయనకు నచ్చలేదు. ఆయన రామాకు ఒక మంచి ఉదాహరణగా నిలిచారు. కనురెప్ప వాల్చకుండా పది గంటలపాటు ఉండేవాడు. ధ్యానంలో రెండున్నర అడుగుల ఎత్తుకు పైకి లేచేవాడు. ఈ ఎత్తును రామా స్వయంగా కొలిచేవారు. అయితే, అది ఆధ్యాత్మిక అభ్యాసం కాదని స్వామీ రామా అభిప్రాయపడ్డారు. దీర్ఘకాలం అభ్యాసంవల్ల దీన్ని సాధించగలం. అయితే, ఆయన ఉద్దేశం ఆ స్వామితో ఆధ్యాత్మిక అనుభూతిని పొందడం.

ఆయనను 'ఆత్మ జ్ఞానంలో ఉన్నతమైన దశ ఏది?' అని అడిగారు స్వామీ రామా. అప్పుడాయన ఉపనిషత్ మంత్రం గొణిగి ఇలా అన్నాడు.

'ఇంద్రియాలను లోనికి లాక్కుంటే మనస్సులో ప్రతిబింబాలు రావు. ఏకాగ్రత కుదురుతుంది. ఈ సమతుల్య స్థితి చైతన్యానికి దారితీస్తుంది. సత్త్వస్థితిలో ప్రశాంతత ఆత్మజ్ఞానంలో ఉన్నతమైనది. ధ్యానంలో వ్యామోహం లేకపోవడం ముఖ్యం; దృఢ నిశ్చయం కావాలి. బుద్ధిని విశ్లేషించి భావోద్రేకాలను అదుపులో వుంచుకోవాలి. అంతర్వాణి నిజమైన జ్ఞానానికి మూలం. చూసేదంతా మాయ. నిరంతరం మారేది. ఈ మార్పుల వెనుక దాగివున్నదే వాస్తవం' అన్నాడాయన. రామాను తన దారిలో నిర్భయంగా సాగమని ఆయన సూచించాడు. ఒక వారం ఆయనతో సత్సంగం

జరిపిన తర్వాత రామా, ఆయన గురుదేవులు సెలవు తీసుకున్నారు. అక్కడినుంచి రామా శ్రీనగర్‌కు, తర్వాత హిమాలయాలలోని గుహకు వెళ్ళిపోయారు.

## 8.4 క్రీస్తు దర్శనం

మన దేశానికి స్వతంత్రం వచ్చిన తర్వాత కొన్నాళ్ళకు స్వామీ రామా టిబెట్‌నుంచి మన దేశానికి తిరిగివచ్చారు. దారిలో కొందరు టిబెట్ యోగులను కలిసేందుకు సిక్కింలో కొన్నాళ్ళున్నారు. తర్వాత అస్సామ్‌లోని షిల్లాంగ్‌కు వెళ్ళారు. మన దేశంలో క్రైస్తవ ప్రాబల్యం ఎక్కువగావున్న ప్రదేశమది. అక్కడ ఘర్‌వాల్‌కు చెందిన ఒక క్రైస్తవ యోగిని కలిశారు. ఆయన ప్రేమపాత్రుడు. ప్రాపంచిక ప్రభావాలకు అతీతుడు. బైబిల్‌లోని సెర్మన్ ఆన్ ది మౌంట్, బుక్ ఆఫ్ రెవెలేషన్స్ గురించి, పతంజలి యోగ సూత్రాలతో వాటి పోలిక గురించి చెప్పారాయన. ఎన్నో భాషలు మాట్లాడాడు. అక్కడ నాగా, గైరో కొండలలోని అడవులలోవున్న క్రైస్తవ గిరిజనుల దగ్గరకు స్వామీ రామాను తీసుకువెళ్ళాడాయన. ప్రొటెస్టెంట్‌లకు కాథలిక్‌లకు మధ్య ఆయన వారధిగా పనిచేశాడు. 'నాకు క్రైస్తవం ఇష్టమే, కానీ చర్చీలు కావు' అనేవాడాయన. ఇది కొందరికి మనస్తాపం కలిగించింది. దేవుని రాజ్యం ప్రతి మనిషిలోనూ వుందని, ఏసు కూడా అభిషిక్తుడు అయిన తర్వాతే క్రీస్తుగా మారాడనీ ఆయన అన్నాడు. క్రీస్తు అన్నది విశ్వజనీనమైన చైతన్యం. అది తెలుసుకోలేనివారు పరమ సత్యాన్ని తెలుసుకోలేరు. ఈ సత్యం క్రైస్తవులకు అర్థం కాదు. క్రైస్తవ యోగులకు మాత్రం ఇది బాగా తెలుసు. ఆయనవల్ల క్రైస్తవతత్త్వం గురించి స్వామీ రామా సందేహాలు తొలగిపోయాయి. అంతకుముందు రామాకు క్రీస్తు అన్నా, ఆయన బోధనలన్నా ప్రేమ పెరిగింది. అయితే, క్రీస్తుద్వారా మాత్రమే మోక్షం సాధ్యం అనే సూత్రం ఆయనకు అర్థం కాలేదు. అయితే, అది తండ్రి కొడుకుల పరంగా వివరించాక, అందరికీ ఆ పరిపూర్ణత సాధ్యమే అని తెలిశాక సందేహం తీరిపోయింది.

ఆయనతో రెండు రోజులు గడిపిన తర్వాత యాజమాన్యంతో రామాకు కొన్ని సమస్యలు వచ్చాయి. నగరంలో పురపాలక ఎన్నికలకు ప్రచారం జరిగింది. స్వామీ రామా అభిప్రాయం అడిగారు. పాలక పక్షం తమ విశ్వాసాన్ని కోల్పోయినట్లు భావిస్తే తాము ఓటు వేయనక్కర్లేదన్నారాయన. అక్కడివారికి ఆయన గురించి అంతగా తెలియదు. పోలీసులు ఆయనను అరెస్టు చేశారు. ఆయనను నవభారత ప్రభుత్వానికి విరోధిగా భావించారు. నిజానికి ఆయనకు ఎటువంటి రాజకీయమైన ఉద్దేశాలూ లేవు. అప్పటికి దేశంలో ప్రజాస్వామ్యం ఇంకా కొత్త. దాని గురించి ఎవరికీ బాగా తెలియదు.

'ఇన్నాళ్ళుగా ఎవరినీ నొప్పించకూడదని ప్రయత్నించిన నాకు ఈ బాధ ఏమిటి?' అని బాధపడి భగవంతుని ప్రార్థించారాయన. ఆ రాత్రి నిద్రలో రామాకు క్రీస్తు దర్శనం అయింది. 'విచారించకు. నీకు చెడు ఏమీ జరగదు' అని క్రీస్తు రామా భుజం తట్టారు.

మర్నాడు కేసు విచారణకు వచ్చింది. జడ్జి క్రైస్తవుడు. రామా అవతారం చూసి ప్రజలు కూడా క్రైస్తవుడేమో అనుకున్నారు. జడ్జి అదే అడిగాడు. 'నీవు

క్రైస్తవుడివా?' 'జన్మతః అయితే మాత్రం కాదు' అన్నారాయన. 'నిన్నెందుకు అరెస్ట్ చేశారు?' జడ్జి మళ్ళీ అడిగాడు. 'నా అభిప్రాయం అడిగారు. ఎవరికి ఓటు వేయాలో చెప్పమన్నారు. అది మీపైనే ఆధారపడి వుంటుంది అన్నాను' జవాబు చెప్పారు రామా.

జడ్జికి అంతా అన్యాయంగా, పోలీసుల కుట్రవల్ల రామాను అరెస్టుచేయడం జరిగిందేమో అనిపించింది. ఆయనను విడుదల చేయమని ఆదేశించాడు.

షిల్లాంగ్‌లో రామా నాలుగు నెలలు ఉన్నారు. అటువంటి క్రైస్తవ సాధువును ఆయన మరెన్నడూ కలవలేదు. భగవద్గీతను, బైబిల్‌ను అంత గొప్పగా సమన్వయంచేసి బోధించినవారు మరొకరు కనబడలేదాయనకు. క్రమం తప్పని ధ్యానం, ప్రశాంతత, నిర్భయత్వం ఆయన లక్షణాలు. బైబిల్ చాలాకాలం రామాకు అభిమాన గ్రంథం అయింది. అయితే బోధించేవారు దానిని గందరగోళం చేశారని రామాకు అనిపించింది. ఆ క్రైస్తవ ఋషి రామాతో ఇలా అన్నాడు:

'అన్ని మతాలను పోల్చి చూస్తే అన్నీ చెప్పేది ఒక్కటే అనిపిస్తోంది నాకు. ఇది నిజమైతే ఇంత అసూయ, ద్వేషం ఎందుకు! విశ్వజనీనమైన వైదిక మతం పోయింది. ఆ ఋషుల వాక్కులను పురోహితులు ప్రజలకు సవ్యంగా అందించలేదు. అయినా, వారు తాము వేదజ్ఞులమని చెప్పుకుంటారు. భగవద్గీతా వ్యాఖ్యానంలో శంకరులు వేదాల మరో రూపమే భగవద్గీత అనీ, కృష్ణుడు గాథాకారుడనీ చెప్తారు. సత్యం చిరంజీవి. మత ప్రవక్తలు, స్థాపకులు కేవలం వాటిని చెప్పేవారు మాత్రమే. నిజానికి ఉన్నతమైన సత్యాలను బోధించేది అవతార స్వరూపులు కాదు – ఋషులే. అవతారాలు వాటిని సంస్కరించి చెప్పాయనేందుకు ఇదే రుజువు. అవతార పురుషులు వైదిక ఋషుల దూతలు మాత్రమే. బుట్టలు మార్చినా గుడ్లు అవే.'

సంఘాన్ని కలిపివుంచే శక్తి మతం. ఆధ్యాత్మిక నాయకులు, మతస్థాపకులు ఘనాపాటీలుగా అంతా అనుకుంటారు. కానీ, నా విశ్లేషణ ప్రకారం ఋషుల సందేశమే శాశ్వతమైనది. పరిపూర్ణమైనది. మహోయత నాయకులు, దూతలు వారికి కేవలం వాహకులు. వారిని ఆరాధించడం తత్వాన్ని తెలుసుకోకుండా ఒక పథాన్ని సృష్టించడమే. ఋషి పథంలో ఒకరిని నాయకునిగా పూజించే ప్రసక్తి లేనేలేదు. వారి బోధనలు విశ్వజనీనాలు, శాశ్వతాలు. మతాధిపతులు ఆచరణీయమైన జ్ఞానాన్ని బోధించకపోవడంతో అన్ని మతాలు కాలుష్యానికి గురైనాయి. 'దేవుని నమ్ము' అన్నారు. దానితో అసలైన ఆత్మాన్వేషణ మూలపడింది. విశ్వాసం అనే సిద్ధాంతాన్ని ప్రాచ్యులు, పాశ్చాత్యులు పెంచి పోషించారు. దానితో నేటి మనిషికి తన సమస్యలకన్నా వారి బోధనలే గందరగోళాన్ని సృష్టించాయి. సాంఘిక, మత సమస్యలు చాలా ఇబ్బంది కలిగిస్తాయి. మనిషికి బంధనాలు, దుఃఖం పెంచే మతం ఎందుకు? ఋషుల సందేశం స్వేచ్ఛగా ఉండమనే. ఈనాటి మతావలంబికి అన్నీ బంధనాలే. అడ్డంకులే. భయం! దెయ్యాల భయం! దైవాన్వేషణకన్నా, ఆత్మజ్ఞానం కన్నా పాపభీతి ఎక్కువైపోయింది. ఈనాడు తత్వం విప్లవాత్మకంగా మారవలసి వుంది. అయితే దురదృష్టవశాత్తూ అటువంటి విప్లవం ఇంకా రాలేదు. సాంఘిక, మత విప్లవ ప్రక్రియలు జరగకుండా మత కుసుమం వికసించలేదు. సంస్కరణ, విప్లవం మానవుని ఎదుగుదలకు సంకేతాలు. నిత్యజీవితంలో అహింసను ఆచరిస్తే ఈ విప్లవం సాధ్యం. మార్చే శక్తి ప్రేమకే వుంది. అటువంటి విప్లవం నేటి

మానవుని ఆత్మజ్ఞానంలో మరో మెట్టు పైకి తీసుకువెళ్తుంది. మానవాళిని ఒకటిగా చేస్తుంది.

ఆ క్రైస్తవ యోగి మాటలు స్వామీ రామాపై చెరగని ముద్రను వేశాయి. రామా అంతర్నేత్రం తెరుచుకుంది. యోగి చెప్పిన సమాజంకోసం స్వామీ రామా కూడా ఎదురుచూస్తున్నారు. అప్పుడు అసూయకు, ద్వేషానికి తావుండదు. క్రీస్తు దర్శనం, క్రైస్తవయోగి సందర్శనం స్వామీ రామాకు ఎంతో హాయినిచ్చాయి.

## 8.5 యోగం - యూదుమతం

ఒకసారి పూనాలో బహాయీలు మూడు రోజుల సమావేశం జరిపారు. అక్కడికి స్వామీ రామా వెళ్ళారు. మనదేశానికి చెందిన యూదు రబ్బీలను కలిశారు. వారు 'కబ్బల' గురించి చర్చించారు. వారితో మాట్లాడిన తర్వాత ఆయనకు యూదు మతం గురించి ఎంతో తెలిసింది. మన దేశంలో తప్ప అన్నిచోట్ల యూదులు బాధలకు గురైనారు. అగ్ని ఆరాధకులైన పార్శీలు, స్టార్ ఆఫ్ డేవిడ్ ఆరాధకులైన యూదులు తక్కిన అందరిలాగానే మన దేశపౌరులుగా హాయిగా వున్నారు. యోగం, కబ్బల ఒకేవిధంగా వుంటాయి. వీటిని చదివాక విశ్వమతాలన్నిటిలోనూ ఆధ్యాత్మిక భావాలు, ఆచరణలు ఒకేవిధంగా వుంటాయని స్వామీ రామా నిర్ధారించుకున్నారు.

ఆయన అభిప్రాయం ప్రకారం యోగానికి మూలమైన సాంఖ్యానికి, కబ్బలకు ఒకే మూలం వున్నట్లుంది. కబ్బల పద్ధతి ప్రకారం జీవితానికి సంఖ్యలతో సంబంధం వుంది. ప్రాచీనమైన సాంఖ్య పద్ధతి ఇదే. గీతా బోధలు చాలావరకు యూదు బోధనలను పోలి వుంటాయి. హైందవం, యూదుమతం ఒకే విధంగా వుండే ప్రపంచ ప్రాచీన మతాలు. బహాయీ దేవాలయం, ధర్మం ఈ విషయాన్ని స్పష్టం చేస్తాయి. మనదేశంలో ఆత్మజ్ఞానానికి పేరెన్నికగన్న శ్రీయంత్రం స్టార్ ఆఫ్ డేవిడ్‌పై కేంద్రీకరించింది. దీనినే క్రైస్తవులు శాక్రెడ్ హార్ట్ అనీ, మన యోగులు అనాహత చక్రం అనీ అంటారు. సోలోమన్ ఆలయానికి చెందిన పూర్వీకులకు బహుశః శ్రీయంత్రం గురించి తెలిసివుండాలి. వారి ప్రకారం ఇది అతి పవిత్రమైన యోగప్రక్రియ. అందరితోనూ, విశ్వంతోనూ, సృష్టికర్తతోనూ మనల్ని అనుసంధించేందుకు తోడ్పడుతుంది.

యోగం-స్త్రీపురుషులు, పిల్లలు - అందరికీ పనికొచ్చే పరిపూర్ణ విజ్ఞానం. మానవ సమాజ నైతిక నిర్మాణానికి ఊతనిచ్చి, సంస్కృతి సంప్రదాయాలను పెంచేందుకు తోడ్పడే సామాజిక విజ్ఞానశాస్త్రమే మతం. ఆత్మ వికాసానికి, ఆత్మ జ్ఞానానికి పనికొచ్చే యోగం విశ్వజనీనమైన విజ్ఞానం. ప్రతి మతంలోనూ ఈ రంగంలో పనికొచ్చే సమాచారం అంతా యోగ సాహిత్యంలో ఎప్పుడునుంచో వుంది.

ఈ చర్చా సమయంలో స్వామీ రామాకు ఇలాగే అన్ని మతాల అధిపతులు ఆధ్యాత్మిక వేత్తలు కలిసి తమ భావాలను పంచుకోవడం అవసరం అనిపించింది. 'దారులు వేరైనా అన్ని మతాలూ ఒక్కటే. ఆత్మజ్ఞాన పథాలు వేరైనా లక్ష్యం ఒక్కటే. అందరూ కలిసి చర్చిస్తే మేలు. నా మతమే నిజమైన మతం అనేవాడు అజ్ఞాని. అతను అందరినీ తప్పుదారి పట్టిస్తాడు. దురభిమానం అనేది మానవ వికాసాన్ని చంపే విషం. ప్రేమయే అన్నిటినీ కలుపుకునిపోయేది. అన్ని గొప్ప మతాలకూ పునాది'- అంటారు స్వామీ రామా.

## 8.6 మహర్షులు మానవాళి ఉమ్మడి సంపద

హిమాలయాలలోనే అసలైన ఋషులు కనిపిస్తారని స్వామీ రామాకు ఒక దురభిప్రాయం ఉండేది. అటువంటిది ఒక నదీతీరంలో వున్న స్వామిని చూసేందుకు వెళ్ళారాయన. నగరానికి సమీపంలో, చిన్న నదీతీరంలో అసలైన సాధువు ఉండలేడని ఆయన నమ్మకం. అయినా, ఆయన గురించి తెలుసుకోవాలని వెళ్ళారు.

కుటీరానికి నాలుగైదు కిలోమీటర్లుండగానే రామాకు ఆ స్వామి ఆహారం పంపారు. 'ఇందులో విశేషమేమీ లేదు. నాకోసం ఎవరైనా వచ్చేటట్లు అనిపిస్తే నేనూ ఇలా చేస్తాను. ఇది నిజమైన జ్ఞానం కాదు' అనుకున్నారాయన. తీరా అక్కడికి వెళ్ళాక, 'నీవు ఆలస్యంగా వచ్చావు రేపు ఉదయం నా దేహత్యాగం చేస్తున్నాను' అన్నారు స్వామి. 'ఇంకో పన్నెండు గంటలు ఆగి నాకేమైనా చెప్పకూడదా?' అడిగారు రామా. ఆయనకు వివిధ మతాలకు చెందిన శిష్యులున్నారు. ఆయన మరణానంతరం ఏ మతంవారు ఆ మతం పద్ధతుల ప్రకారమే అంత్యక్రియలు చేయాలని పట్టుదలతో వున్నారు.

మర్నాడు ఆయన దేహత్యాగం చేశారు. డాక్టర్ ఆయన మరణాన్ని నిర్ధారించాడు. తర్వాత కొన్ని గంటలపాటు అక్కడంతా గందరగోళంగా వుంది. ఆయన దేహంకోసం అందరూ పోట్లాడుకుంటున్నారు. ఎవరికి వారు పంతం వదలడంలేదు. జిల్లా మేజిస్ట్రేట్ రామా దగ్గరకు వచ్చి, 'మీరు ఆయనతో వున్నారు కదా! బహుశ ఆయన నిజానికి ఎవరో మీకు తెలిసే వుంటుంది. ఈ సమస్యను పరిష్కరించడంలో నాకు సాయం చేయండి' అన్నాడు. 'నాకేమీ తెలియదండీ!' చెప్పారు రామా. ఆ తర్వాత– 'ఏ రకం ఋషి ఇతను? చచ్చి అందరికీ సమస్య తెచ్చాడు. పైగా, నాకూ ఏమీ చెప్పలేదు. నిజంగా గొప్పవాడైవుంటే, ఇటువంటి గొడవ తెస్తాడా?' అనుకున్నారు.

నాలుగు గంటలు గడిచాక ఆయన లేచి కూర్చున్నారు. 'మీరు పోట్లాడుకుంటున్నారు కాబట్టి నేను చావకూడదనుకున్నాను' అన్నారు. అందరూ దిగ్భ్రమకు లోనై వున్నారు. 'హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు అంతా పొండి. మీరంతా బుద్ధిహీనులు. నేను దేవునికి తప్ప మరెవరికీ చెందను' అన్నారాయన. తర్వాత రామా వైపు తిరిగి, 'నాయనా! విచారించకు. ఇప్పుడు నీతో మూడు రోజులు గడిపి నీకు చెప్పవలసింది చెప్పిన తర్వాతనే ప్రశాంతంగా దేహత్యాగం చేస్తాను' అని అభయం ఇచ్చారు. అలాగే చేశారాయన. ఆ మూడు రోజులూ స్వామీ రామా జీవితంలో కొన్ని మహత్తరమైన ఘడియలు. ఆయన రామాకు ఎంతో చెప్పారు. 'నీవు నీవుగానే వుండు. నీవు కానిది ఉన్నట్లు నటించకు' అని పదేపదే చెప్పారు. నాలుగవ రోజున నేను నీటిలోకి వెళ్తాను, అని నదీగర్భంలోకి వెళ్ళి అదృశ్యులైనారు. అంతా వచ్చి రామాను జరిగిందేమిటని అడిగారు. ఆయన జరిగిందంతా చెప్పారు. ఆయన శరీరంకోసం జరిగిన ప్రయత్నాలు ఫలించలేదు.

'మహర్షులు తాము ప్రత్యేకించి ఒక మతానికి, ఒక శాఖకు చెందినవారమని చెప్పుకోరు. అటువంటి తేడాలకు వారు అతీతులు. వారు మానవాళి మొత్తానికి చెందినవారు' అంటారు స్వామీ రామా–

★ ★ ★

అధ్యాయం తొమ్మిది

# ఆత్మసమర్పణం - దివ్యరక్షణం

"ఆత్మజ్ఞానానికి సులభమైన, ఉన్నతమైన మార్గం ఆత్మసమర్పణమే. తనను తాను సమర్పించుకున్నవాడికి దివ్యశక్తి రక్షణ ఎప్పుడూ వుంటుంది. ఏమీ లేనివాడిని, ఏ రక్షణా లేనివాడిని దేవుడే నిరంతరం కాపాడుతాడు."

## 9.1 కాపాడే చేతులు

స్వామీ రామా అలసిపోయినప్పుడల్లా మళ్ళీ శక్తిని పొందేందుకు హిమాలయాలకు వెళ్ళేవారు. హిమాలయాలలో ఏ గొడవ లేకుండా ధ్యానం చేసుకునే ప్రశాంత స్థలాలు ఎన్నో ఆయనకు తెలుసు. అటువంటి ప్రదేశాలలో చుట్టూ ఫిర్ వృక్షాలు దట్టంగా వున్నచోటు ఆయనకెంతో ఇష్టం. అది ఆరువేల ఐదువందల అడుగుల ఎత్తున, ఘర్‌వాల్ జిల్లాలో లాండ్స్‌డౌన్‌కు దాదాపు ఇరవై కిలోమీటర్ల ఉత్తరాన వుంది.

ఆ హిమాలయా ప్రాంతంలో దేవుడికి అర్పించకుండా జొన్నలు కూడా తినరు. తింటే వారి ఇళ్ళు కంపిస్తాయనీ, వారు వింతగా ప్రవర్తిస్తారనీ అక్కడి ప్రజల నమ్మకం. రామా పధ్నాలుగు సంవత్సరాల వయస్సున్నప్పుడు ఆ దేవాలయం చూడాలనుకున్నారు. ప్రజలు ఏవేవో కల్పిస్తారనీ అందులో ఏ మాత్రం వాస్తవం వుండదనీ ఆయన నమ్మకం. స్వయంగా వెళ్ళి నిజం తేల్చుకుందామనుకున్నారు. అక్కడికి చేరేసరికి రాత్రి ఏడు గంటలైంది. చీకట్లో కొండవాలుపై నడుస్తున్నారాయన. చేతిలో దీపంకూడా లేదు. అప్పట్లో రామా కొయ్యపాంకోళ్ళు వాడేవారు. అవి జారి ఆయన జరజరా కిందికి వెళ్ళిపోయారు. లోతుకు పడిపోయే సమయంలో తెల్లని బట్టలు ధరించిన పొడవాటి ముసలాయన తన చేతుల్లోకి రామాను తీసుకుని కాలిబాట దగ్గర తెచ్చి వదిలిపెట్టారు 'ఇది పవిత్ర స్థలం. నీకు పూర్తి రక్షణ వుంది. నీ లక్ష్యానికి నిన్ను నేను చేర్చుతాను' అని ఆయన రామాకు అభయం ఇచ్చారు. దగ్గరున్న కుటీరం దగ్గర రామాను వదిలిపెట్టి ఆయన అదృశ్యులైనారు. ఆయనకు కృతజ్ఞతలు చెప్పాలని రామా వెనక్కి తిరిగారు. ఆయనుంటేగా? రామా అరిచిన అరుపులకు కుటీరంనుండి ఒక సాధువు వచ్చి అతిథిగా పిలిచాడు. రామా తనను కాపాడిన వృద్ధుని విషయం చెప్పాడు. వెంటనే ఆ సాధువు ఏడవడం మొదలుపెట్టాడు. 'నీదెంత అదృష్టం. ఆ మహనీయుణ్ణి చూశావు. నేనిక్కడెందుకున్నానో తెలుసా? పదేళ్ళ క్రితం అదే స్థలంలో నేనూ దారి తప్పాను. ఆయనే నన్ను ఇక్కడికి చేర్చారు. తర్వాత ఆయనను నేను చూడలేదు. ఆయనను నేను సిద్ధబాబా అని పిలుస్తాను. ఆయన ప్రేమ హస్తాలు నన్నూ కాపాడాయి' అన్నాడు.



గ్రంథాలయ
70,579

మర్నాడు ఉదయం ఎంత వెతికినా రామాకు ఆయన కనిపించలేదు. తాను జారిపడిన చోట చూస్తే కాలి అడుగులున్నాయి. బతికేందుకు ఏ ప్రయత్నమూ అవకాశం లేనిచోట తన్ను కాపాడిన ప్రేమ హస్తాలను రామా తరచూ గుర్తుకు తెచ్చుకునేవారు. తర్వాత గ్రామస్థులకు తన అనుభవాలు చెప్పినప్పుడు వారు తమకు ఆ సిద్ధుని గురించి తెలుసునన్నారు. ఆ సమయంలో రామా గురుదేవుల ఆజ్ఞప్రకారం కఠోర నియమాలు పాటిస్తున్నందువల్ల దగ్గరేమీ ఉంచుకోలేదు. ఏమైనా ఆయన అనుభవం ఎవరూ లేనివారికి దేవుడే దారి చూపుతాడనే నమ్మకాన్ని బలపరిచింది.

శివాలయానికి సాధువు కుటీరం వందగజాల దూరంలోనే వుంది. ఆ గుడి దగ్గర ఆరువందల సంవత్సరాల క్రితం ఒక మహా సిద్ధుడు నివసించాడని అంటారు. ఆయన మౌనం పాటించినా అక్కడివారిని అవసరాలలో ఆదుకునేవారు. ఆయన జ్ఞాపకార్థం శివాలయాన్ని నిర్మించారు అందులో శివలింగం ప్రతిష్ఠించారు. శతాబ్దాలు గడిచినా ప్రజలు ఆ గుడిని దర్శిస్తూనే వున్నారు. రామాను రక్షించిందాయనే అంటారు వారు. ఆ గుడి దగ్గరే చిన్న గదిలో వుంటూ రామా నియమనిష్ఠలతో - చాలా నెలలు గడిపారు.

కొన్నాళ్ళ తర్వాత కొందరు బ్రాహ్మణులు ఆ గుడిని పెద్దదిగా చేయాలనుకున్నారు. అయితే, అక్కడ కూలీలు తవ్వేకొద్దీ పాములు గుట్టలు గుట్టలుగా వచ్చేవి. అక్కడ గుడిలో దీపం వెలిగించే అవ్వ ఆ ప్రయత్నం మానుకోమంది. ఇంజనీరు ఒప్పుకోలేదు. ఎంత తవ్వినా పాములే ఎనిమిది అడుగులు లోతుకు తవ్వినా శివలింగం ఊడిరాలేదు. ఎనిమిదవ రాత్రినాడు ఇంజనీరుకు ఒక కల వచ్చింది. రామాను కాపాడిన వృద్ధుడు కనిపించి, ఆ ప్రయత్నం మానుకోమని చెప్పారు. దాన్తో యధాతథంగా పాత దేవాలయాన్ని పునరుద్ధరించారు.

1973వ సంవత్సరం వసంతకాలంలో స్వామీ రామా, ఆయన శిష్యులు స్వామీ అజయ తదితరులు కలిసివెళ్ళారు. అక్కడో రెండంతస్తుల మట్టి మిద్దెలో ఆరు రోజులున్నారు. అక్కడ గుడి వ్యవహారాలు చూసే సాధువు అందరినీ ఆదరించారు. అక్కడి నుండి హిమాలయాల శిఖరాలు కలసికట్టుగా కలకాలం వుంటామన్నట్లు కనిపిస్తాయి - అంటారు స్వామీ రామా.

## 9.2 యోగానుభవాలు చిత్తభ్రమలు కావు

హిమాలయాలలో జ్ఞానగంజ్ అనే గ్రామం గురించి ఎంతో విని, అక్కడికి వెళ్ళాలనుకున్నారు స్వామీ రామా. అక్కడికి అన్ని కష్టాలూ ఓర్చుకుని చేరేవారు అరుదు. హిమగిరులు చుట్టూ వున్న ఆ లోతట్టు గ్రామంలో అధ్యాత్మిక సాధకులు కొందరున్నారు సంవత్సరంలో ఎనిమిది నెలలు ఆ ప్రాంతం ఎవరికీ అందుబాటులో వుండదు. అక్కడ యోగులు మౌనంగా వుంటారు. ఎక్కువకాలం ధ్యానంలోనే గడుపుతారు. కొయ్య దుంగలతో కట్టిన చిన్న ఇల్లు వారికి నివాసం. బంగాళాదుంపలు, బార్లీ వారి ఆహారం. సంవత్సరానికి సరిపడా దాన్ని సేకరించి వుంటారు. వారిలో భారతీయులు, టిబెటన్‌లు, నేపాలీలు వున్నారు. టిబెట్, పితోరాఘర్‌ల మధ్య హిమాలయాల సరిహద్దుల్లో జ్ఞానగంజ్ వుంది. ఆ గ్రామం చూడాలని రామా నలుగురితో కైలాసపర్వతానికి బయలుదేరారు. అల్మోరా నుండి డోర్ ఛోలా,

గా(బ్రియాన్క్, రక్షాస్థల్ మీదుగా వెళ్ళారు. అది జూలై నెల. హిమాలయాలలో మంచుకరిగే కాలం. రక్షాస్థలంలో దారితప్పారు. నడిచే దారిలో కొండచరియలు విరిగిపడడంతో ఏమీ కన్పించలేదు. రామాకు అది అలవాటే. తక్కినవారు భయపడ్డారు. రామాను 'తిండి తిప్పలు లేకుండా మమ్మల్ని చంపేలా వున్నావు' అని నిందించారు.

అక్కడ ఒక చెరువు దగ్గర ఆగారు. మంచు కరిగిపడ్డంవల్ల చెరువులో నీటిమట్టం పెరుగుతూంది. రెండవరోజు అందరూ భయభ్రాంతులైనారు. 'మనం మామూలు మనుషులం కాము, సన్యాసులం. చావైనా సంతోషంగా చావాలి. దేవుని తలచుకోండి. భయంవల్ల ఏమీ లాభం వుండదు' అన్నారు రామా. వెంటనే ఎవరికివారు తమ మంత్రం స్మరిస్తున్నారు. ప్రార్థిస్తున్నారు. అయినా లాభం కనిపించలేదు. వారి నమ్మకానికి ఇది పరీక్ష. అయినా వారు నమ్మితేగా? 'మీరంతా చస్తే మీ సంస్థలు, ఆస్తులు శిష్యులు వగైరాల మాటేవిటి?' ఎగతాళిగా అన్నారాయన. ఆ హాస్యం వారికి రుచించలేదు. 'మేం చనిపోయేది నిజమే. అయితే, ముందు నిన్ను చంపిన తర్వాతే మేము పోయేది' అన్నారు వారు కోపంగా.

హాస్యాన్ని అనుభవించడం అందరి తరం కాదు. ఆపదలు వచ్చినప్పుడు కొందరు కోపంగా వుంటారు. జీవితంలో హాస్యం ఎంతో మంచిది. సోక్రటీస్కు విషం ఇచ్చినా, అప్పుడు కూడా ఆయన ఛలోక్తులు విసురుతూనే వున్నాడు. 'దీనిని నేను దేవుళ్ళతో పంచుకోవచ్చా?' అని నవ్వుతూ అడిగారాయన. 'విషం ఋషిని చంపలేదు. కారణం ఏమిటంటే, ఋషి వాస్తవంలో జీవిస్తాడు. వాస్తవం శాశ్వతం' అని నవ్వుతూ విషం తాగేశాడా మహనీయుడు.

'మనం బతకాలని రాసిపెట్టివుంటే మనం సరైన మార్గంలో వుంటే దేవుడే మనల్ని కాపాడుతాడు. మనకెందుకు చింత?' అన్నారు రామా. చీకటి పడుతోంది. మంచు కరుగుతోంది. హఠాత్తుగా తెల్లనిబట్టలతో, పెద్ద గడ్డంవున్న వ్యక్తి వారు ముందు నిలిచి 'దారి తప్పారా?' అని అడిగారు. 'రెండు రోజులుగా మాకు తినడానికి కూడా ఏమీలేదు. ఇక్కడినుండి ఎటు వెళ్ళాలో కూడా తెలియడంలేదు' అన్నారంతా. 'నా వెంట రండి' అంటూ వారిని తీసుకువెళ్ళారాయన. సమీపానవున్న గ్రామాన్ని చూపించి, రాత్రి అక్కడే గడపమని చెప్పి అదృశ్యుడైనాడు. 'ఇది దేవతల భూమి. ఇందులో ఆశ్చర్యం ఏమీలేదు' అన్నారు గ్రామస్తులు. ఆ రాత్రికి రామాబృందం అక్కడే గడిపారు. మర్నాడు రామాను వదిలి తక్కినవారు తిరిగి వెళ్ళారు. ముందేంవుందో? అని వారి భయం. తర్వాత రామా జ్ఞానగంజ్కు ఒంటరిగా వెళ్ళారు. అక్కడ ఒక సాధువు ఆయనకు ఆశ్రయమిచ్చాడు. అక్కడ రామా నెలన్నరపాటు వున్నారు. తాను చూసిన అందమైన ప్రదేశాలలో అది ఒకటి అనిపించిందాయనకు.

తిరుగు ప్రయాణంలో ఆయన మానససరోవరం వైపు వెళ్ళారు. అక్కడ ఎందరో భారతీయ, టిబెటన్ యోగులను కలిశారాయన. కైలాస పర్వతం పాదాల చెంతవున్న లామాలను చూశారు. తర్వాత గొర్రెల మందలతోపాటు గర్వియాక్ ప్రాంతం వెళ్ళారు. దారిలో గొర్రెల కాపరులు ఆయనకు ఎన్నో కథలు చెప్పారు. వీరివి దేవతలంటారు. వీరు సాధకులకు సాయపడేందుకు భౌతికంగా కన్పిస్తారు. అభౌతికంగానూ సంచరించగలరు. శాస్త్రజ్ఞులు మాత్రం ఇందుకు ఒప్పుకోరు. ఇవి ఊహలు, చిత్తభ్రమలు అంటారు. మామూలు వృద్ధాప్యం అయితే అది నిజం

కావచ్చు. ఆధ్యాత్మికులు వయసు పెరిగేకొద్దీ మరింత తెలివితేటలతో వుంటారు. వారు చిత్తభ్రమలు చెందే అస్కారమే లేదు. వారు చిత్తాన్ని సంస్కరించుకుని చైతన్యంలో ఉన్నతస్థాయిని చేరేవారు.

శాస్త్రజ్ఞులు జీవితంలో ఎన్నో కోణాల గురించి అధ్యయనం చేయవలసి వుంది. భావాతీత మనోవిజ్ఞానం గురించి వారికి తెలియదు. ప్రాచీనులు శతాబ్దాల తరబడి నిత్యనూతనంగా వుంచిన మనోవిజ్ఞానం కచ్చితమైనది. అంతర్వాణిపై ఆధారపడ్డది. భౌతిక శాస్త్రాలకు పరిమితులున్నాయి. అవి పదార్థం, శరీరం, మేధస్సులను ప్రాథమిక స్థాయిలోనే పరిశీలిస్తాయి— అంటారు రామా.

## 9.3 హంసలభూమి గంగోత్రి - నిర్భయుడైన కృష్ణాశ్రమ్

స్వామీ రామాను గంగోత్రి కన్నా ఆకర్షించిన ప్రాంతం మరోటి లేదు. దీనినే 'హంసల భూమి' అంటారు. రామా యౌవనంలో అక్కడి చిన్న గుహలలో గంగకు ఇరువైపులా దాదాపు యాభై మంది యోగులుండేవారు. చాలావరకు వారు దిగంబరులు. చలిమంట అనేది వారికి తెలియదు. స్వామీ రామా మూడు చలికాలాలు అక్కడ గడిపారు. అక్కడ ఎవరూ ఎవరినీ కలుసుకోరు. అక్కడ గడిపిన కాలం రామాకు మరపురానిది. యోగాభ్యాసం చేస్తూ గోధుమలు, పప్పులు తింటూ గడిపారాయన. గోధుమలు, పప్పులు నానబెట్టి, మొలకెత్తిన తర్వాత కొంత ఉప్పు కలిపి తినేవారు.

దగ్గరున్న గుహలో కృష్ణాశ్రమ్ అనే స్వామి ఉండేవాడు. ఆయనకు భారత దేశమంతటా ఎంతో ఆదరణ వుండేది. ఒకనాడు అర్ధరాత్రి మంచు తిప్ప కూలి బాంబు పేలినంత హడావిడి చేసింది. ఆ వెన్నెల రాత్రిలో అవలిగట్టున వున్న కృష్ణాశ్రమ్ కథ ముగిసిందనుకున్నారు. వెంటనే రామా పొడవాటి టిబెట్ కోటు, టార్చి తీసుకుని బయలుదేరారు. అక్కడ గంగ ఒక చిన్న కాలువ. అంచేత దాన్ని సులభంగా దాటివెళ్ళారు. అక్కడ చూస్తే కృష్ణాశ్రమ్ విలాసంగా నవ్వుతున్నాడు. 'హుమ్' అంటూ 'నన్నేమీ భయపెట్టలేవు ఈ శబ్దాలూ, మంచు తిప్పలూ. నా గుహ సురక్షితం నేను చాలాకాలం బతకాలి' అని రాసి చూపించాడాయన. తర్వాత రామా తిరిగివచ్చారు మరోసారి ఉదయం చూస్తే కృష్ణాశ్రమ్ గుహ తప్ప తక్కినవన్నీ మంచులో కూరుకుపోయాయి. తరచూ ఆయనను రామా కలిసేవారు. రామా అడిగిన ప్రశ్నలకు ఆయన పలక పైన రాసి చూపించేవారు. ఎటువంటి బట్టలూ లేకుండా అంత చలిలో ఆయనెలా వున్నాడో మరి! పైన ఒక కిలోమీటర్ దూరంలో వున్న గోముఖం నుంచి ఒక స్వామి ఆయనకు ఆహారం తెచ్చి ఇచ్చేవాడు. రోజుకోసారి వేయించిన బంగాళాదుంపలు, గోధుమ రొట్టెముక్క తినేవాడాయన.

అక్కడంతా గంగా తులసితో చేసిన టీ తాగేవారు. అక్కడ కలసిన వారు స్వామీ రామాకు ఎన్నో మూలికలు వగైరాల గురించి, శాస్త్రగ్రంథాల గురించి అమూల్యమైన విషయాలు చెప్పారు. వీరికి దేశంలోకి రావడం ఇష్టంలేదు. ఈనాటికీ బుద్ధి, శరీరాలపై ఆత్మకున్న బలాన్ని చూడాలనుకునేవారికి అటువంటి యోగులు మనకు అక్కడ కన్పిస్తారు అంటారు స్వామీ రామా.

# 9.4 నాస్తికస్వామి

ఒకప్పుడు స్వామీ రామాకు ఒక నాస్తికస్వామి తారసపడ్డాడు. అతను తన వాదనతో ఎవరినైనా పడగొట్టేవాడు. అంచేత అతని దగ్గరకెవరూ వెళ్ళేవారు కారు. అయినా అతనూ, రామా మంచి మిత్రులు. 'నా దగ్గర నేర్చుకునేందుకు ఎందుకు రారు?' అన్నాడాయన. 'వాళ్ళ నమ్మకాలు, విశ్వాసం నాశనం చేస్తావు కదా! వాళ్ళకు నీవంటే భయం – అందుకే రారు' అన్నారు రామా.

ఆ నాస్తికస్వామి షడ్దర్శనాలలో దిట్ట. ఆయనను టిబెటన్‌లు–చైనీయులు తమ దేశాలకు ఆహ్వానించేవారు. భారతదేశంలో ఎక్కడైనా పండితుడని వుంటే అది ఈయనే అని వారి అభిప్రాయం. నాస్తికస్వామికి దేవునిపై నమ్మకం లేదు. అయినా ఆ స్వామి సన్యాసి. ఆయనకు మఠాలు, స్వాములు అంటే మంట. దేశానికి వారు పెద్ద భారం అనీ, వారిని నాశనం చేసేందుకు తాను సన్యాసినైనానని ఆయన అంటాడు. అప్పుడు వారిద్దరి మధ్య కాసేపు వాదం జరిగింది. 'దేవుడు వున్నాడని నిరూపించినవారికి శిష్యుడిని అవుతాను' అన్నాడు నాస్తికస్వామి. 'నిన్ను శిష్యుణ్ణి చేసుకునేవాడు బుద్ధిహీనుడు.' కచ్చితంగా చెప్పారు రామా. 'ఎందుకు?' అడిగాడు స్వామి. 'నీవంటి అల్ప మనస్కుడ్ని అతనేం చేసుకుంటాడు? నీవు బుద్ధికి ఒకవైపు పదును పెట్టావు. మరోవైపు గురించి నీకేమీ తెలియదు' అన్నారు రామా. 'నీవే మూర్ఖుడివి. నీవు కూడా తెలియని లోకాల గురించి మాట్లాడుతున్నావు. అదంతా చెత్త' అన్నాడు నాస్తికస్వామి కోపంగా.

ఒకరోజు, 'హిమాలయాలు చూశావా?' అని అడిగారు రామా. 'లేదు ఎప్పుడూ లేదు' అన్నాడాయన. వేసవిలో చాలా బావుంటుంది చెప్పారు రామా. 'నాకూ ఇష్టమే. అటువంటి పర్వతాలుంటే దేవుడెందుకు?' అడిగాడు స్వామి. 'వీటిని నమ్మకస్థితికి తీసుకెళ్ళాలి' అనుకుని రామా కైలాసపర్వతం వెళ్ళేందుకు సిద్ధపడ్డారు. చిన్న గుడారం, బిస్కెట్‌లు ఎండబెట్టిన పండ్లు – ఇదీ వారి సరంజామా. అది సెప్టెంబర్ నెల. మంచు కరుగుతోంది. స్వామి రామాకు భగవంతుడంటే గాఢమైన నమ్మకం. నాస్తికస్వామిని మార్చేందుకు ఒక పరిస్థితిని సృష్టించమని ప్రార్థించారు. అప్పట్లో యౌవనంలో రామా నిర్లక్ష్యంగా వుండేవారు. నాస్తికస్వామిని ఇబ్బందికరమైన దారిలో తీసుకువెళ్ళారు. ఎటువెళ్తున్నారో ఆయనకే తెలియదు ఆఖరుకు వారు దారితప్పారు.

రామా పుట్టి పెరిగింది హిమాలయాలలో కావడంవల్ల ఆయనకు చలి బాధ లేదు. పైగా ఆసనాలు, ప్రాణయామం నేర్చినవారు నాస్తికస్వామి పాపం, అలవాటు లేకుండా వణికిపోయాడు. రామా దయతో తన గొంగళి కప్పుకోమని ఇచ్చారు పధ్నాలుగు వేల అడుగుల ఎత్తుకు వెళ్ళేసరికి 'నాకు ఊపిరి పీల్చడం ఇబ్బందిగా వుంది' అన్నాడా స్వామి. 'నాకు బాగానే వుందే!' అన్నారు రామా 'నీవు యువకుడివి. నీకేం ఫర్వాలేదు.' కోపంగా అన్నాడతను. 'ఓటమిని అంగీకరించకు' అన్నారు రామా. ప్రతిరోజూ ఆయన వేదాంతం చెప్పేవాడు. రామా హిమాలయాల గురించి చెప్పేవాడు. 'ప్రకృతికి సన్నిహితంగా వుంటే ఎంత బావుంటుందో!' అనేవారు రామా.

నాలుగు రోజుల తర్వాత మంచు పడసాగింది. అప్పుడు పదిహేనువేల అడుగుల ఎత్తున వున్నారు. అయిదడుగుల పొడవు, నాలుగడుగుల వెడల్పు ఉన్న చిన్న గుడారం

వారిది రెండడుగుల మేర మంచు పేరుకుంది. 'ఒక్కోసారి ఏడెనిమిది అడుగులదాకా మంచు పేరుకుంటుంది. అందులో సమాధి అయిపోతాం' అన్నారు రామా. 'అలా అనకు' భయంగా అన్నాడాస్వామి. 'వెనక్కి వెళ్ళలేమా?' అడిగాడాయన రామాను. 'దారిలేదు' రామా చెప్పారు. 'ఏం చేద్దాం మరి?' అన్నాడు స్వామి. 'నేను దేవుని ప్రార్థిస్తాను' అన్నారు రామా. 'నేను నిజాలను నమ్ముతాను. నీవు మాట్లాడే అల్పమైన విషయాలను నమ్మను.' మొండిగా అన్నాడు స్వామి. 'దేవుని దయవల్ల మంచు ఆగిపోతుంది. నీ వేదాంతంతో, తెలివితో మంచును ఆపగలిగితే మంచిదే – ప్రయత్నించు' అన్నారు రామా. 'నీ ప్రార్థన ఫలిస్తుందని నాకెలా తెలిసేది? నీవు ప్రార్థించి మంచు ఆగిందనుకో. అప్పుడైనా మంచు ఏదో విధంగా ఆగిందనుకుంటానే కానీ దేవుని నమ్మను' అన్నాడతను మొండిగా. అప్పటికి మంచు అన్నివైపులా నాలుగు అడుగులదాకా పేరుకుంది. అతనికి ఊపిరాడడం లేదు. చిన్న రంధ్రం చేస్తే పూడిపోతూంది. 'ఏదో ఒకటి జరుగుతుంది. అతను దేవుని నమ్మడమో! చావడమో!' అనుకున్నారాయన.

'ఏదో ఒకటి చేయి. మీ గురుదేవులు మహానుభావులు. నేను ఆయనను ఎన్నోసార్లు అవమానించాను. అందుకే ఇలా జరిగిందేమో?' బాధగా అన్నాడు స్వామి.

'నీవు దేవుని స్మరిస్తే అయిదు నిమిషాలలో మంచు ఆగుతుంది. ఎండకాస్తుంది. లేకుంటే నీవు చస్తావు. నన్నూ చంపుతావు. దేవుడు ఇప్పుడే గుసగుసలాడాడు నాతో.' చెప్పారు రామా. 'నిజమా? నీకెలా వినిపించింది?' ఆశ్చర్యంగా అడిగాడు స్వామి.

'ఆయన నాతో మాట్లాడుతున్నాడు' రామా చెప్పారు. రామా పట్ల ఆయనకు నమ్మకం ఎక్కువైంది. 'ఎండ కాయకపోతే నిన్ను చంపేస్తాను. ఎందుకంటే, దేవుని నమ్మకూడదనే నా భీష్మప్రతిజ్ఞను విరమించబోతున్నాను' అన్నాడు. చావు భయంతో తన నమ్మకం సడలిపోగా గొప్ప భక్తి పెరిగిందాతనిలో. కన్నీళ్ళతో ప్రార్థించాడు. అయిదు నిమిషాలలో మంచు కరిగిపోకుంటే అతను మరింత బండబారుతాడు. అంచేత రామా కూడా ప్రార్థించారు. దేవుని దయవల్ల అంతా అనుకున్నట్లుగా జరిగింది. ఇద్దరూ విస్తుపోయారు. 'మనం బతుకుతామా?' ఆశ్చర్యంగా అడిగాడు నాస్తికస్వామి. 'కచ్చితంగా! మనం బతకాలన్నది దేవుని కోరిక' అన్నారు రామా.

'నిజమే. నాకు అర్థం కానిది ఏదో వుందని తెలిసింది' అన్నాడు స్వామి. తర్వాత అతను జీవితాంతం మౌనం పాటించాడు.

'అతను ఇరవై ఒక్క సంవత్సరాలకు పైగా ఎవరితోనూ ఏమీ పలికి ఎరగడు. ఎవరైనా భగవంతుని గురించి మాట్లాడితే అతని కళ్ళలో ఆనందభాష్పాలు రాలేవి. ఆ తర్వాత అతను ఎన్నో పుస్తకాలు రాశాడు. అందులో 'మహిమ్నాస్తోత్రం' అనే దేవుని స్తోత్రాల పుస్తకం ఒకటి.'

'మేధస్సులో వ్యాయామాలు అయ్యాక దానికి దూరంగా ఏదో ఉందనిపిస్తుంది. అప్పుడు అంతర్వాణి మాత్రమే దారి చూపుతుంది. మేధస్సు పరీక్షించి, లెక్కించి, నిర్ణయించి – లోపల జరిగేవి అంగీకరించడం, తిరస్కరించడం వంటివి చేస్తుంది. లోపల ఎక్కడినుంచో వచ్చే నిరంతరవాణిని అంతర్వాణి వినిపిస్తుంది. మనస్సు ప్రశాంతంగా, సమతులస్థితిలో వున్నప్పుడే అంతర్వాణి పనిచేస్తుంది. ఆ స్వచ్ఛమైన

అంతర్వాణి మానవుని చైతన్యపరిధిని విస్తరింపచేస్తుంది. అప్పుడు అన్నీ స్పష్టంగా అర్థం చేసుకోవడం మొదలౌతుంది. కొన్ని అనుభవాల పరంపరల తర్వాత ప్రత్యక్ష అనుభవం సహాయంతో అంతర్వాణిని అయత్నంగా తెలుసుకోవడం వీలౌతుంది.'

'దైవభీతి లేకుండా దేవుని ప్రేమించలేము. దేవుని ప్రేమించకుండా ఆత్మజ్ఞానం రాదు. దైవభీతి వల్ల దైవచైతన్యం గురించి తెలుస్తుంది. ప్రాపంచిక భయంవల్ల ప్రమాదం ఏర్పడుతుంది. దైవచైతన్యం అనుభవానికి వచ్చినప్పుడే ఈ నాస్తికస్వామి మారాడు. మేధస్సుతో కుస్తీలవల్ల భయంపోదు. దైవప్రేమ వల్లనే అన్ని భయాలనుండి విముక్తి లభిస్తుంది'– అన్నారు రామా.

## 9.5 మరణంతో ముఖాముఖీ

ఈ ఉదంతం పూర్వభాగం జరిగినప్పుడు స్వామీ రామా వయస్సు ఏడేళ్లు. ముగింపు జరిగినప్పుడు ఇరవై ఎనిమిది ఏళ్ళు.

చిన్నప్పుడు జ్యోతిష్కులు 'వీడు ఇరవై ఎనిమిదవ ఏట చనిపోతాడ'ని కచ్చితంగా తేదీతో సహా చెప్పారు. దాన్ని చాటుగా విన్న రామాకు ఏడుపు ఆగలేదు. 'ఇంత తక్కువ అయుష్షుతో నా జీవితాశయం నెరవేర్చుకోవడం ఎలా?' అనిపించిందాయనకు. 'ఎందుకేడుస్తున్నావు?' అడిగారు గురుదేవులు. 'నేను చావబోతున్నాను' భయంగా, ఏడుస్తూ చెప్పారు రామా. 'ఎవరు చెప్పారు?' అడిగారు గురుదేవులు. 'ఈ జ్యోతిష్కులు' చెప్పారు. రామా 'ఇటురా' అని గురుదేవులు రామాను తీసుకువెళ్ళారు. జ్యోతిష్కులతో పోట్లాడారు. 'వీడు ఇరవై ఎనిమిదోయేట పోతాడని కచ్చితంగా చెప్పగలరా?' కోపంగా అడిగారు. 'కచ్చితంగా' అన్నారు వారు ఏకగ్రీవంగా. 'నిజమా?' రెట్టించి అడిగారు గురుదేవులు. 'నిజమే. దాన్ని ఎవరూ ఆపలేరు' అన్నారు వారంతా.

గురుదేవులు రామావైపు తిరిగి – 'నీకు తెలుసా? అంతదాకా వీరెవరూ బతకరు. నీవే ఎక్కువకాలం జీవిస్తావు. నా అయుష్షు కూడా నీకే ఇస్తున్నా కదా!' అన్నారు. 'అదెలా సాధ్యం?' అడిగారు రామా. 'మీ జ్యోతిష్యం తప్పు. జ్యోతిష్యానికి అతీతంగా మరొకటి వుంది' అని జ్యోతిష్కులతో అన్నారు గురుదేవులు. రామావైపు తిరిగి, 'విచారించకు. అయినా, ఆ రోజు నీకు చావుతో ముఖాముఖీ వుంటుంది' అన్నారు.

తర్వాత ఆ విషయం రామా మరిచిపోయాడు. రామాకు ఇరవై ఎనిమిదేళ్ళు రాబోతుండగా గురుదేవులు రామాను రిషీకేశ్ నుండి తొంభై కిలోమీటర్‌ల దూరాన, పదకొండువేల అడుగుల ఎత్తుకు వెళ్ళి దుర్గాపూజ చేయమన్నారు. అప్పుడు రామా కాషాయం, శాలువ, చందనం పావుకోళ్ళు ధరించారు. కుండలో నీళ్ళు తప్ప మరే సామగ్రి వెంటలేదు. దుర్గాస్తోత్రం జపిస్తూ ఆయన హాయిగా తిరిగారు. పర్వతాలే ఆయన నివాసం. ఒకసారి ఇరవై వేల అడుగుల ఎత్తువరకు వెళ్ళారాయన. ఊపిరి పీల్చేందుకు ప్రత్యేకమైన పరికరాలు ఏమీ లేకుండా ఎక్కగలనని ఆయన గాఢ నమ్మకం.

ఒకరోజు ఎత్తైన వాలు ప్రాంతాలలో తానే ఏకాంతంలో సాక్షాత్తూ భగవంతుని మాదిరి పాడుకుంటూ వెళ్తున్నారు. పైన దుర్గా మందిరం వుంది. చుట్టూ పైన చెట్లున్నాయి. ఉన్నట్లుండి పైన ముళ్ళమీద జారి కిందికి దొర్లుకుంటూ వెళ్ళారు. తన జీవితం దానితో ఆఖరు అనిపించిందాయనకు. అయిదువందల అడుగులు జారిన తర్వాత ఒక ముళ్ళపొద ఆయనకు అడ్డుకుంది. పెద్దముల్లు ఆయన పొత్తికడుపులో

గుచ్చుకుంది. ఆయనకు పైన హిమాలయాలు, కింద ఎక్కడో గంగ కనిపించాయి. కళ్ళు మూతలు పడ్డాయి. తెరచి చూసేటప్పటికి రక్తం ఏరులై పారివుంది. చావు భయంతో ఆయన దానిని కూడా లెక్కచేయలేదు.

తెలిసిన మంత్రాలన్నీ జపించారు. క్రైస్తవ, బౌద్ధమంత్రాలనూ చెప్పారు. ఏదీ పనిచేయలేదు. ఏ దేవుడూ సాయపడలేదు. అప్పుడు తన ధైర్యాన్ని పరీక్షించుకున్నారు. 'చావడం జరగదు. ఆత్మకు చావు లేదు కదా! శరీరానికి చావు వున్నా పట్టించుకోనక్కర్లేదు. నేను శాశ్వతుడిని. భయమెందుకు? ఇంతకాలం శరీరం కోసం పాకులాడానే! ఎంత బుద్ధిహీనత?' అనిపించిందాయనకు.

అలాగే ఇరవై నిమిషాలపాటు వేలాడారు. గురుదేవులు చెప్పింది గుర్తుకువచ్చింది. 'అలవాటుగా చేసుకోకు. అయినా చెబుతున్నా. నా అవసరం ఉన్నప్పుడు తలచుకో. నేను వస్తాను. సాయం చేస్తాను' అని గురుదేవులు చెప్పి వున్నారు. 'ఇప్పుడిక గురుదేవులను పరీక్షిస్తాను' (గురువును శిష్యుడు ఈవిధంగా పరీక్షించాలనుకోవడం మామూలే!) అనుకున్నారు రామా.

రక్తం ఎక్కువగా కారడంవల్ల స్పృహ తప్పే పరిస్థితి ఏర్పడింది. అప్పుడే కొందరు ఆడవాళ్లు అటు వెళ్తున్నారు. వారిలో ఒకామె రామాను చూసి 'ఇదిగో, ఇక్కడ ఎవరో చనిపోయినట్లుంది' అని అరిచింది. 'నేను చనిపోయానని వారు నన్ను వదిలి వెళ్తారేమో? ఎలా?' అనిపించింది రామాకు. అయినా ఏమీ చేయలేని పరిస్థితి. పైగా తలకిందులుగా ఉన్నాడాయె! వారింకా కొన్ని వందల అడుగుల దూరంలో ఉన్నారు. మాట్లాడలేకపోవడంవల్ల కాలు ఆడించారు. అప్పుడు వారు ఆయన చనిపోలేదని దగ్గరకు వచ్చారు. తాడుకట్టి కిందికి దించారు. ఇంకా కొమ్మ కడుపులో గుచ్చుకుని వుంది. 'ఇది ధైర్యంగా ఉండవలసిన సమయం' అనిపించిందాయనకు. కడుపును గట్టిగా అదిమి, కొమ్మను లాగిపారేశారు. తర్వాత వారు ఆయన్ని కొండబాటకు తీసుకువెళ్ళారు. 'నడవగలరా?' అని అడిగారు. 'నడుస్తాను' అన్నారాయన. నిజంగా పరిస్థితి ఏమిటో తెలియదు. రామా స్వామి కావడంవల్ల తన సంగతి తాను చూసుకుంటాడని విడిచివెళ్ళారు. ఆ దారమ్మటే వెళ్తే ఓ గ్రామం వస్తుందని చెప్పి వెళ్ళారు. కొన్ని నిమిషాలు నడిచేందుకు ప్రయత్నించి మూర్ఛపోయారు. అప్పుడు గురుదేవులను తలచుకుని, 'నా జీవితం అయిపోయింది. మీరు నన్ను పెంచారు. నాకోసం ఎంతో చేశారు. నేను ఏమీ సాధించకుండానే పోతున్నాను' అనుకున్నారు. వెంటనే గురుదేవులు కనిపించారు. మనసు మాయాజాలమా అనిపించింది రామాకు. 'మీరు నిజంగా ఉన్నారా? నన్ను వదిలి వెళ్ళారనిపించింది' అన్నారు.

'ఎందుకు విచారం? నీకేమీ ప్రమాదం లేదు. జ్యోతిష్కులు చెప్పినకాలం ఇదే. నీకు గుర్తులేదా? ఇక నీకు చావు భయంలేదు. అంతా బావుంటుంది.' చెప్పారు గురుదేవులు. క్రమంగా రామాకు అంతా తెలిసింది. గురుదేవులు పసరుపోశారు. దగ్గరున్న గుహలోకి తీసుకువెళ్ళారు. అక్కడున్న కొందరితో చూసుకోమని చెప్పారు. 'చావును కూడా నివారించవచ్చు' అంటూ వెళ్ళిపోయారు. రెండువారాల తర్వాత గాయాలు మానినా మచ్చలు మిగిలాయి.

నిజమైన గురువు, స్వార్థంలేని గురువు. ఎంత దూరానవున్నా శిష్యుణ్ణి ఎలా ఆదుకుంటారో రామాకు అర్థం అయింది. 'గురుశిష్యుల బంధం అన్నిటికన్నా మిన్న అయినది, స్వచ్ఛమైనది, వర్ణనాతీతమైనది' అంటారు స్వామి రామా.

★ ★ ★

అధ్యాయం పది

# మనస్సుకున్న శక్తులు

"మనస్సు అసంఖ్యాకమైన శక్తుల నిధి. గుప్తంగా వున్న వనరులను వాడుకుంటే ఎవరైనా ప్రపంచంలో విజయ శిఖరాలను అందుకుంటారు. మనస్సుకు శిక్షణ ఇచ్చి, ఏకాగ్రంగా, అంతర్ముఖంగా మార్చితే – అది మరింత లోతులకు వెళ్లగలదు. మనస్సు మనిషికున్న పరికరాలలో అతి సూక్ష్మమైనది."

## 10.1 గణితంలో వేదాంతం - ఇసుకపై పాఠాలు

మనం ఇతరులవైపు తదేక దృష్టితో, పూర్తి ఏకాగ్రతతో బుద్ధిని కేంద్రీకరించి, వారిని ప్రభావితులను చేయవచ్చు. స్వామి రామాకు ఈ విషయం చిన్నప్పుడే మరో స్వామి నేర్పించాడు. అయన పేరు చక్రవర్తి. 'చక్రవర్తి గణితం' అనే సుప్రసిద్ధ గ్రంథకర్త తర్వాత స్వామిగా మారాడు. గురుదేవుల దగ్గర శిష్యుడుగా చేరాడు. తదేకంగా చూడడం (త్రాటకం) ఏకాగ్రతను పెంచుతుంది. బాహ్యంగా వున్న దేనినైనా ప్రభావితం చేస్తుంది అంటాడాయన.

బుద్ధిని బాహ్యంగా కేంద్రీకరిస్తే త్రాటకం. అంతర్ముఖం చేస్తే ఏకాగ్రత. కేంద్రీకరించిన బుద్ధికి వున్న శక్తి అపారం. త్రాటకం పలురకాలు. రెండు కనుబొమల మధ్య, నాసికారంధ్రాలమధ్య, చీకటి గదిలోని క్రొవ్వొత్తిని, ఉదయ సూర్యుని, చంద్రుని – దేనితోనైనా త్రాటకం నేర్చుకోవచ్చు. ప్రతి పద్ధతివల్ల ఒక ప్రయోజనం చేకూరుతుంది. అయితే, తగు జాగ్రత్తలు తీసుకోకుంటే భౌతికంగా, మానసికంగా ఇబ్బందులు తప్పవు.

భావనాశక్తి గురించి ప్రపంచమంతటా తెలినదే. ఏకాగ్రబుద్ధి అద్భుతాలు చేస్తుంది. ప్రాపంచిక విషయాలపై చేస్తే మాత్రం స్వార్థపూరితమైన కోరికల సుడిగుండంలో పడిపోవలసి వస్తుంది. ఈ సిద్ధులపట్ల వ్యామోహంతో, అసలైన లక్ష్యం మరిచి పతనమైన వారెందరో వున్నారు.

ఒక రోజు ఆ స్వామి 'నీకీ రోజు ఒకటి చూపుతాను. కోర్టుకు వెళ్ళి అన్యాయంగా శిక్షపొందే వ్యక్తిని చూసుకుని రా' అన్నాడు. రామా ఒక లాయర్‌ను దాని గురించి అడిగారు. లాయర్ అటువంటి కేసు ఒకటి ఉందన్నాడు. స్వామితో ఆ విషయం చెప్పగానే ఆయన 'వీడు విడుదల అవుతాడులే. జడ్జి ఇవ్వబోయే తీర్పు నీకు చెప్తాను. కావాలని మూడు తప్పులు రాశాను. తీర్పు ఇలాగే వుంటుంది చూడు' అన్నాడు. తాను లాయర్ కాకున్నా అలాగే తీర్పు చెప్పాడు. తీర్పు ఇచ్చాక చూస్తే అంతా అలాగే వుంది. 'స్వామీజీ! మీరు ప్రపంచం తీరుతెన్నులే మార్చేస్తారు' అన్నారు

రామా. 'అంత శక్తి నాకు లేదులే. అది నా ఉద్దేశ్యమూ కాదు. నీకీ శక్తిని ఎందుకు చూపుతున్నానంటే మంచి కారణంతో ఒక వ్యక్తి మరొకతణ్ని ప్రపంచంలో ఎక్కడున్నా ప్రభావితుణ్ణి చేయవచ్చు అనేందుకే. దూరానవున్నా ఇతరులకు మనం మేలు చేయవచ్చు' అన్నాడాయన. 'దీని రహస్యం చెప్పండి' రామా అడిగారు, 'చెప్తాను కానీ, నీవు అభ్యసించవద్దు.' చెప్పాడాయన. కొంతకాలం రామా దాన్ని అభ్యసించాడు. బాగానే ఉందనిపించింది. అయితే, అందువల్ల కాలహరణం, పని చెడడం జరగడంవల్ల మానేశారు.

గణితం ద్వారా రామాకు తత్వం నేర్పాడాయన. ప్రతి అంకెనూ ఉపనిషత్ శ్లోకాలతో వర్ణించాడు. సున్ననుండి వందవరకు గణితశాస్త్ర తత్వార్థం వినిపించాడు. గణితం అంకె ఒకటి. మిగతావన్నీ దాని గుణకాలు. అదే విధంగా పరమసత్యం ఒకటే. విశ్వంలో ఇతర నామరూపాలన్నీ అతనినుండి వచ్చినవే అంటాడాయన. గంగాతీరంలో ఇసుకతో బొమ్మలు, గీతలు గీసి చూపించాడు. జీవితం సమభుజ త్రిభుజంలాగా వుండాలన్నాడు. శరీరం, లోపలి స్థితులు, బాహ్య ప్రపంచం – మూడూ మూడు కోణాలు. జీవితం వృత్తం లేక సున్నతో పోల్చతగిన చక్రం. ఈ వృత్తం ఒక బిందువుకు విస్తృత రూపం.

ఇంకో పోలిక చెప్పాడాయన:

జనన మరణాలు రెండు బిందువులు. జీవితం ఆ రెండు బిందువులను కలిపే రేఖ. జీవితం మనకు తెలియని అనంత రేఖ. ఆ స్వామివల్ల రామాకు గణితంపట్ల ఆసక్తి పెరిగింది. గణితం నేర్చుకున్నారాయన. గణితం అన్నిటికీ మూలం. అది సాంఖ్యంపై ఆధారపడింది. శరీరం, బుద్ధి వగైరాల గురించి కచ్చితంగా చెప్పే ప్రాచీన శాస్త్రం సాంఖ్యం. ఉన్నత చైతన్య స్థితికి దారితీసే ప్రత్యక్ష శాస్త్రం యోగం. సాంఖ్యాన్ని అర్థం చేసుకున్న తర్వాత అన్ని తాత్విక ప్రశ్నలకూ జవాబులు దొరికాయి స్వామీ రామాకు. శాస్త్రాలు అర్థం చేసుకోవడం మరింత సులభం అయింది.

ఆఖరిరోజు ఆ స్వామి ఇలా అన్నారు: 'ముందు సున్న తర్వాత అంకె పెట్టు సున్నకు విలువ వుండదు. అదే అంకె తర్వాత సున్న పెడితే ఎంతో విలువ. ఈ ప్రాపంచిక విషయాలు సున్న వంటివి. ఉన్న ఒక వాస్తవాన్ని గుర్తించకుంటే వాటికి విలువలేదు. పరమ సత్యాన్ని గుర్తుంచుకుంటే జీవితం కూడా విలువైనదిగా వుంటుంది. లేకుంటే భారంగా వుంటుంది.'

తర్వాత స్వామీ రామా ఆయనను కలవలేదు. తనకు అమూల్యమైన విషయాల గురించి బోధించిన గురువులందరికీ కృతజ్ఞతలు తెలుపుకున్నారు స్వామీ రామా.

## 10.2 అఘోరీ అనుభవం

1942 వ సంవత్సరంలో ఒకసారి స్వామీ రామా బదరీనాధ్‌కు వెళ్లారు. దారిలో శ్రీనగర్ సమీపంలోవున్న అఘోరీ బాబాను చూడాలనుకున్నారాయన. ఈ అఘోరీలు తాంత్రికులు. వ్యాధులను నయం చేయగలరు. ప్రాణశక్తికన్నా సూక్ష్మమైన రహస్యాలు వారికి తెలుసు. ఈ సూక్ష్మశక్తి ఇహపరాలకు వారధి. అయితే ఈ అఘోరీల విచిత్ర ప్రవర్తనవల్ల ప్రజలు వీరిని అంతగా పట్టించుకోరు.

శ్రీనగర్ పరిసర ప్రజలకు అఘోరీలంటే భయం. ఎవరైనా వెళ్తే అఘోరీ బాబా

తిట్టి, రాళ్ళు విసిరేవాడు. ఆయన ఆరడుగుల అయిదంగుళాల ఎత్తరి, బలిష్ఠుడు; పొడవాటి జుట్టు, గడ్డం, జనపనార గోచీ – ఇదీ ఆయన అవతారం. గోనెపట్టా ముక్కలు తప్ప ఆయన గుహలో మరేమీ ఉండవు.

ఆయన దగ్గరేమైనా నేర్చుకోవాలని అక్కడి పండితులను కలిశారు రామా. 'వాడు ఋషికాదు. దరిద్రుడు. అసహ్యంగా వుంటాడు. వాడిని చూడడం దేనికి?' అన్నాడొక పండితుడు. అయితే, అతనికి రామా గురుదేవులు బాగా పరిచితులు. అంచేత రామా అయన్ను బతిమాలితే చూపించేందుకు ఒప్పుకున్నాడు.

చీకటి పడేముందు వెళ్ళారిద్దరూ. అఘోరీ ఒక రాతిమీద కూర్చుని వున్నాడు. తన పక్కన కూర్చోమన్నాడు. పండితుడి వైపు తిరిగి 'చాటుగా నన్ను తిట్టి, ఎదురుగా నమస్కరిస్తావా?' అన్నాడు. పండితుడు పారిపోవాలనుకున్నాడు. అఘోరీ వదల్లేదు. 'నది దగ్గరకు వెళ్ళి కుండలో నీళ్లు పట్రా పో' అన్నాడు. పండితుడు వణుకుతూ వెళ్ళి నీళ్ళు తెచ్చి యిచ్చాడు. 'సరే నదిలో శవం తేలివస్తూంది. దానిని ఒడ్డుకు లాగి, తాడ, కండరాలు కోసి, కొంత మాంసం పట్రా' అన్నాడు. పండితుడికి షాక్ కొట్టినట్లు అనిపించింది. రామాకు కూడా అదోలా అనిపించింది. పండితుడు అఘోరీ మాట వినదలుచుకోలేదు. అఘోరీకి కోపం వచ్చింది. 'మాంసం తెస్తావా? లేకుంటే నిన్ను కోసి తీసుకోవాలా? నీకేది ఇష్టం?' అన్నాడు.

పాపం, పండితుడు గత్యంతరం లేనట్లు శవాన్ని కోయడానికి వెళ్లాడు. కంగారులో తన ఎడమ చేతివేళ్ళు రెండు కోసుకున్నాడు. రక్తం ధారగా కారుతూంది. ఎలాగో అఘోరీకి మాంసం ఇచ్చాడు. రామా కానీ, పండితుడుకానీ ఈ లోకంలో లేరు. పండితుడు దగ్గరకు రాగానే అఘోరీ అతని వేళ్ళు తాకాడు. తెగిన వేళ్ళు అతుక్కున్నాయి. తెగినచోట మచ్చకూడా లేదు. తర్వాత ఆ మాంసం ముక్కలు కుండలో వేసి వండమన్నాడు. 'ఈ చిన్న స్వామికి ఆకలిగా వుంది. నీవూ తినాలి కదా' అన్నాడు. 'అయ్యా, మేము శాకాహారులం.' జంటగా జవాబు చెప్పారు. 'అయితే నేనేనా మాంసం తినేవాడిని అందరితోపాటు మీరు నన్ను అశుభ్రంగా వున్నావు అంటారా? నేనూ శుద్ధ శాకాహారినే' చెప్పాడాయన కోపంగా.

పది నిమిషాలు గడిచాయి. పండితునితో కుండ తెమ్మన్నాడు. ఆకులలో వడ్డించమన్నాడు. వణికే చేతులతో వడ్డించాడు పండితుడు. మూడు మట్టిపాత్రలకోసం అఘోరీ లోనికి వెళ్లాడు. ఈలోగా పండితుడు రామాతో 'నేను ఇదంతా చూస్తాననుకోలేదు. ఇంతకాలం నేను చదివిందీ, ఆచరించిందీ అన్నిటికీ ఇది వ్యతిరేకం. నేను ఆత్మహత్య చేసుకోవాల్సిందే. ఇదంతా నీవు చేసిందే! నన్నెందుకు తెచ్చావు?' అన్నాడు. 'ఊరుకో. మనం పారిపోలేము. అంచేత కనీసం ఏం జరుగుతుందో చూద్దాం.' రామా చెప్పారు.

అఘోరీ పండితుని వడ్డించమన్నాడు. వడ్డించేటప్పుడు ఆశ్చర్యం, మాంసానికి బదులు రసగుల్లా వుంది. అది రామాకు చాలా ఇష్టమైనది. అఘోరీ బాబా గుహకు వచ్చేముందు ఆయన ధ్యాస దానిపైనే వుంది. అంతా వింతగా అనిపించింది రామాకు. 'ఇందులో మాంసం లేదులే, తినండి' అన్నాడు అఘోరీ.

ఇద్దరూ తిన్నారు. చాలా బావుంది. మిగిలినవి ఊర్లో పంచిపెట్టమని పండితునికి ఇచ్చాడు అఘోరీ. వాళ్ళు ఇంద్రజాలానికి గురికాలేదని చెప్పేందుకు ఆ విధంగా

చేశాడాయన. పండితుడు చీకట్లో ఒంటరిగా వెళ్లాడు. రామా అక్కడే వున్నారు. అసలు సంగతేమిటో కనుక్కోవాలని ఆయన అక్కడే వున్నారు. అఘోరీల గురించి ఇంతకుముందు వినివున్నా, వారిని చూడ్డం రామాకు ఇదే మొదలు. 'మాంసం వండడం ఎందుకు? అది తీపి మిఠాయి కావడం ఏమిటి? ఈయన ఇక్కడ ఒంటరిగా ఎందుకున్నాడు?' అని రామాకు ఆశ్చర్యంగా వుంది.

రెండు గంటల ధ్యానం తర్వాత ఇద్దరూ పురాణాల గురించి చర్చించారు. అఘోరీ మహామేధావి. పండితుడు. ఆయన సంస్కృత భాష రామాకు క్లిష్టంగా అనిపించింది. అథర్వవేదంలో అఘోరీ మార్గం గురించి వుంది. 'ఎందుకు శవాలు తింటారు?' రామా అఘోరీని అడిగారు.

'ఇది శవం ఎందుకైంది? ఇది ఇప్పుడు మనిషిది కాదు. దీనిని ఎవ్వరూ వాడడం లేదు. నీవు ఇది మనిషిదనుకుంటావు. ఎవరూ వాడనిదాన్ని నేను వాడుకుంటాను. నేనో శాస్త్రజ్ఞుణ్ని. పదార్థం, శక్తి నియమాల గురించి ప్రత్యక్షంగా ప్రయోగాలు చేస్తున్నవాడిని. పదార్థాన్ని ఒక రూపంనుండి మరోరూపానికి మార్చుకున్నాను. ప్రకృతి మాత నా గురువు. ప్రకృతి పలు రూపాలు చేస్తుంది. నేను ఆమెనే అనుసరిస్తున్నాను. ఈ విధంగా చేస్తే పండితుడు ఇతరులను ఇటువైపు రానివ్వడని ఇలా చేశాను. ఈ గుహలో పదమూడు సంవత్సరాలుగా వున్నాను. ఇంతవరకూ నాకోసం ఎవ్వరూ రాలేదు. నా రూపం చూస్తే అందరికీ భయం. నేను మురికిగా వుంటాననీ, చేపలు, శవాలు తింటాననీ అనుకుంటారు. నేను రాళ్ళు విసురుతాను. అయితే, ఎవ్వరినీ గాయపరచను' అన్నాడాయన. ఇతరులపై దేనికీ ఆధారపడకూడదని ఆయన ఆ విధంగా వున్నాడు. తర్వాత కూడా ఎనిమిదేళ్ళున్నాడాయన.

ఆ రాత్రి మొత్తం ఆయన అఘోరీ మార్గం గురించి చెప్పాడు. రామా ఆ బాటను అనుసరించలేకపోయినా ఆసక్తిగా విన్నారు. అఘోరీకి రూపాలు మార్చే శక్తి వుంది. శిలను చక్కెరగా మార్చడం అందుకో ఉదాహరణ. మర్నాడు ఉదయం అటువంటివి మరిన్ని చూపించాడు. రామాకు ఆ శాస్త్రంతో పరిచయం వున్నా, ప్రత్యక్షంగా చూడడం అదే మొదలు.

మధ్యాహ్నం వెళ్లేముందు ఏమైనా తిని వెళ్లమని అఘోరీ మరో మంచి మిఠాయి ఇచ్చాడు. రామాను చాలా ఆదరంగా చూశాడు. తంత్ర శాస్త్రాలు నేర్పాడు. 'ఈ శాస్త్రం నశిస్తోంది. పండితులకు ఇది అక్కర్లేదు. క్రమంగా దీనిని అందరూ మర్చిపోతారు' అన్నాడాయన. 'ఇదంతా చేయడంవల్ల లాభం?' రామా అడిగారు. 'లాభం అంటావేమిటి? ఇది ఒక శాస్త్రం. శాస్త్రజ్ఞుడు వ్యాధి నివారణకు దీనిని వాడాలి. ఇతర శాస్త్రజ్ఞులతో పదార్థాన్ని శక్తిగా, శక్తిని పదార్థంగా మార్చవచ్చు అని చెప్పాలి. రెండింటినీ నడిపే నియమం ఒకటే. అన్ని పేర్ల వెనక, రూపాల వెనక ఐక్య సూత్రం ఒక్కటే. దీనిని నేటి శాస్త్రజ్ఞులు పరిపూర్ణంగా తెలుసుకోలేరు. వేదాంతం, ప్రాచీన విజ్ఞానం జీవితంలో అంతర్లీనంగా వున్న ఈ సత్యాన్ని ఎప్పుడో చెప్పాయి. ఉన్న జీవశక్తి ఒక్కటే. తక్కినవన్నీ దీని రూపాలే. మూలం కాబట్టి, ఒకటే కాబట్టి వీటి మధ్యవున్న సంబంధాలు అర్థం చేసుకోవడం కష్టంకాదు. నీరు గడ్డకట్టితే మంచుముక్క (ఐస్) అవుతుంది. కరిగి వేడెక్కితే ఆవిరి అవుతుంది. ఇవి మూడూ ఒకటే అని పిల్లలకు తెలియదు. రూపంలోనే తప్ప సంఘటనంలో తేడా లేదని కూడా వారికి తెలియదు. నేటి శాస్త్రజ్ఞులు ఇటువంటి పిల్లలు.

వారికి అన్ని పదార్థాల వెనుక వున్న ఐక్యత అర్థం కాదు. ఒక రూపం మరొకటిగా మారే నియమాలు తెలియవు' అన్నాడాయన.

రామా ఆయన దగ్గర సెలవు తీసుకున్నాడు. ఆయన మేధస్సును మెచ్చుకున్నా, ఆయన జీవన విధానం మాత్రం నచ్చలేదు. పండితుడి గతి ఏమైందో అనుకున్నాడు. అతనికోసం వెళ్తే – ఆశ్చర్యం! పండితుడు పూర్తిగా మారిపోయాడు. అఘోరీ శిష్యుడుగా మారాలనుకున్నాడు!

## 10.3 చాకలి ధ్యానం

ఉత్తరప్రదేశ్‌లోని 'మౌ' అనే చిన్న ఊర్లో స్వామీ రామా ఒక కుటీరంలో వుండేవారు. అది సంచార స్వాములకు, సాధువులకు నిర్దేశించిన కుటీరం. అక్కడ ఉదయం, సాయంకాలం కాసేపు బయటకు రావడం మినహా, ఎప్పుడూ ధ్యానంలో వుండేవారు.

అక్కడికి దగ్గరగా ఒక చాకలి వుండేవాడు. అతనికి ఒక గాడిద తప్ప మరేమీ లేదు. ఒకరోజు ఆ గాడిద తప్పిపోయింది. అతను దిగ్భ్రాంతికి లోనై నిశ్చలంగా వున్నాడు. అంతా అతను సమాధిలో వున్నాడని అనుకున్నారు. మన దేశంలో ఆ విధంగా కూర్చున్న వారికి గౌరవం ఎక్కువకదా! అలాగే ఆ చాకలికి కూడా ఆదరణ పెరిగింది. కానుకలు సమర్పించారు. రెండురోజుల తర్వాత ఇద్దరు శిష్యులు తయారైనారు. క్రమంగా పెద్ద సందడి ఏర్పడింది. ఈ విషయం రామా దాకా వచ్చింది. ఏమిటో చూద్దాం అనుకుని వెళ్లారాయన. 'ఏం చేస్తున్నారు?' రామా అడిగారు అక్కడున్నవారిని. 'ఆయన మా గురువులు. సమాధిలో వున్నారు' అన్నారు వారు. రామాకు ఆసక్తిగా వుంది. ఏం జరుగుతుందో చూద్దాం అనుకున్నారు. రెండురోజుల తర్వాత అతను కళ్లు తెరిచాడు. గురువులు ఏం చెప్తారో అని అంతా ఎదురు చూస్తున్నారు. తీరా ఆయన్ని చూస్తే 'నా గాడిద ఏదీ?' అని అడిగాడు.

ఈ సంగతి చెబుతూ, 'ధ్యానం ఎందుకు చేస్తున్నామనేది ముఖ్యం. బుద్ధిహీనుడు నిద్రపోయి లేచినా బుద్ధిహీనుడుగానే వుంటాడు. అయితే, ఆత్మజ్ఞానంకోసం ధ్యానం చేసేవాడు ఋషి అవుతాడు' అన్నారు స్వామీ రామా. ధ్యానానికి, చాకలి సమాధికి వున్న తేడా గురించి చెబుతూ ఆయన ఇంకా ఇలా అంటారు:

"ధ్యానానికి, ఆలోచనలలో మునిగిన వాడికి తేడా వుంది. చింతతో వున్న వాడికికూడా ఏకాగ్రత కుదురుతుంది. అది వ్యతిరేక దిశలో వుంటుంది. ధ్యానంలో అది సత్ఫలితం ఇస్తుంది. బుద్ధి స్వచ్ఛంగా వుండడం ధ్యానానికి అవసరం. ఒక మహనీయుడు ప్రపంచంలో అందరి బాధల గురించి ఆలోచిస్తే తప్పులేదు. వ్యక్తిగతమైన ఆలోచనలైతే చింత అవుతుంది. పాట్ మోస్ అనే దీవిలో ఏకాంతవాసంలో వున్న జాన్ 'అందరికీ క్రీస్తు సందేశం అందదేమో!' అని చింతించాడు. బాధ సంకుచితత్వానికి, ధ్యానం విస్తరణకు సాయపడుతుంది. అందువల్ల మనస్సు స్వచ్ఛంగా వుంచుకుని ధ్యానం చేయాలి. ఇందుకు త్రికరణశుద్ధి కావాలి. క్రమబద్ధమైన ఆహార నియమాలు, ఇతర క్రమశిక్షణలు పాటించాలి. ధ్యానం, చింత – రెండూ తీవ్రమైన ప్రభావం చూపుతాయి. చింతవల్ల వ్యాధులు వస్తాయి. ధ్యానంవల్ల చైతన్యం పెరుగుతుంది.

ఆ చాకలి ధ్యానం నిష్ఫలం. అతని దుఃఖం తీవ్రంగా వుండి మతిస్థిమితం తప్పింది. అప్పుడు తానెక్కడున్నాడో తనకే తెలియదు. స్వచ్ఛమైన మనసు లేకుండా ధ్యానానికి కూర్చుంటే అంతరాయాలు ఏర్పడుతాయి. సమాధి అనేది భావాతీతమైన ధ్యానం."

## 10.4 ఇద్దరు గోపీనాథ్‌లు

ఒకప్పుడు స్వామీ రామా కాన్పూరుకు పది కిలోమీటర్ల దూరంలో గంగకు ఆవలి ఒడ్డున వున్నారు. అక్కడ ఒక తోటలో వున్నారు. అప్పుడాయన దేనినీ పట్టించుకోలేదు. నగరానికికూడా వెళ్లేవారుకాదు. అయినా, ఆయనను చూసేందుకు ప్రజలు వచ్చేవారు. పళ్ళూ అవీ తెచ్చేవారు. వచ్చినవారు మాట్లాడకుండా రామా కొన్ని నియమాలు సిద్ధంచేసి వుంచారు. ఎవరు వచ్చినా, 'ముందు కూర్చో. ఈ మంత్రం రెండువేలసార్లు జపించు. తర్వాత మాట్లాడుకుందాం' అనేవారు. దాన్తో చాలామంది చల్లగా జారుకునేవారు.

అప్పుడు కాన్పూర్‌లోని 'రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా'లో గోపీనాథ్ అనే కోశాధికారి (ట్రెజరర్) వుండేవాడు. ఒక మధ్యాహ్నం నలుగురు మిత్రులతో అతను రామా దగ్గరకు వచ్చాడు. అంతా ధ్యానంలో నిమగ్నులైనారు. సమయం తెలియడం లేదు. రాత్రి తొమ్మిది గంటల సమయంలో హఠాత్తుగా కళ్లు తెరిచి 'భయంకర సంఘటన ఏదో జరిగింది' అన్నాడతను. అందరూ 'ఏమిటి?' అని అడిగారు.

'నా మేనకోడలు పెళ్లి ఈ రాత్రి ఏడు గంటలకు. నగలన్నీ నా బీరువాలో వున్నాయి. ఆ తాళాలు నాదగ్గరున్నాయి. స్వామీజీ! ఎంతపని చేశారండీ?' అన్నాడు గోపీనాథ్ విచారంగా. అప్పుడు స్వామీ రామా, 'నేనేమీ చేయలేదు. ఇక్కడి వాతావరణం ప్రభావం అది. ఇక్కడికి ఎవరు వచ్చినా అలాగే జరుగుతుంది. అయినా, నీవేమీ కంగారు పడకు. ధ్యానం చేయి. ఎందుకంత విచారిస్తావు?' అన్నారు. 'ఆ నగలు వారికివ్వాలి' అన్నాడు గోపీనాథ్. 'చూడు. ఈరోజు ధ్యానంలో నిజంగా నిన్ను నీవు మరిచావా?' అడిగారు స్వామీ రామా. 'అందుకేగా నేనిక్కడున్నది!' అన్నాడు గోపీనాథ్. 'అయితే విచారించకు. అంతా దేవుడు చూసుకుంటాడు. దైవధ్యానంవల్ల చెడు జరిగే పక్షంలో జరగనివ్వు. లేకుంటే మరింత ఘోరం జరిగేదేమో?' అన్నారు రామా.

వారు గుర్రబ్బండిలో వేగంగా నగరంవైపు వెళ్లారు. ఇంటికెళ్లగానే అతని కంగారుచూసి అందరికీ గందరగోళంగా వుంది. 'ఏమైంది నీకు? శుభకార్యం చక్కగా జరిగింది' అన్నారు. 'తాళాలు నాతో వున్నాయి. నేను గంగకు అవతల వున్నాను. నగల విషయం....' 'నీవే ఇచ్చావు కదా! అప్పుడే మరిచిపోయావా?' అన్నారు వారు. ఇంతలో గోపీనాథ్ భార్య వచ్చింది. 'శుభకార్యానికి పదినిమిషాలముందు నగలు మీరే ఇచ్చారు కదండీ! ఇప్పుడంతా అయిపోయింది, అందరూ భోంచేస్తున్నారు' అంది. గోపీనాథ్‌తో వున్న నలుగురు మాత్రం తామంతా స్వామీ రామా చెంతనే వున్నట్లు ధృవీకరించారు. 'అయితే మీరో, మేమో తెలివితక్కువ వాళ్లం అయివుండాలి' అన్నారు ఇంట్లోనివారు. 'తమ జ్ఞాపకశక్తికి ఏమైంది?' అని అందరికీ గొడవగా

వుంది. గోపీనాథ్‌కు మతి స్థిమితం తప్పింది. 'నేను గోపీనాథ్‌ని, ఇక్కడికి వచ్చిన గోపీనాథ్ ఎవరు?' అంటున్నాడు. ఆఫీసుకెళ్లినా అవే మాటలు. మూడేళ్ళు అలాగే వున్నాడాయన. ఆఖరికి ఉద్యోగం రాజీనామా చేయవలసి వచ్చింది. అతని భార్య స్వామీ రామాను కలిసినా లాభం లేకపోయింది. 'ఆయన నీతో మాట్లాడుతాడా?' అని అడిగారు స్వామీ రామా. 'మాట్లాడుతారు. ఆ గోపీనాథ్ ఎవరు? నాలాగే వుంటాడా అని!' అందామె.

ఆ సంఘటన తర్వాత చాలామంది రామాతో 'మీరు అద్భుతాల యోగి' అన్నారు. నాదేమి లేదన్నారు రామా. అసలేం జరిగిందో ఆయనకూ తెలియదు. గురుదేవుల నడిగారు. 'మన ఋషి పరంపరలో ఒకరు గోపీనాథునికి సాయం చేశారు' అన్నారాయన. ఇలా మహర్షులు దయామయులనీ, భక్తులను కాపాడుతారనీ అన్నారు. 'ఒక ఋషి హిమాలయాలలో వుండగానే ప్రపంచంలో ఎక్కడైనా కనిపించవచ్చు' అని స్వామీ రామా అభిప్రాయపడ్డారు. (ఇటువంటి సంఘటన – ఒకేవ్యక్తి రెండు రూపాలు అనేది – పరమహంస యోగానంద అనుభవాల సంపుటి 'ఒక యోగి ఆత్మకథ'లో కూడా వుంది.)

## 10.5 నకిలీలున్నారు జాగ్రత్త!

1973 లో ఒక సారి స్వామీ రామా రిషీకేశ్ వెళ్తూ న్యూఢిల్లీలోని ఒక హోటల్‌లో దిగారు. ఆయనకు అమెరికాలోని మనోవైజ్ఞానిక ఆచార్యుడు డా॥ రుడాల్ఫ్ బాలెన్‌టైన్ కలిశాడు. తనకు ఢిల్లీలోని కన్నాట్ ప్లేస్‌లో జరిగిన అనుభవం గురించి చెప్పాడాయన. అక్కడ ఒక అపరిచితుడు ఆయన పేరును, ఇంగ్లాండులో వున్న ఆయన స్నేహితురాలి పేరును పిలిచాడు 'నీకెలా తెలుసు?' అడిగాడు బాలెన్‌టైన్ ఆశ్చర్యంగా. ఆయన పూర్తి వివరాలు చెప్పాడా అపరిచితుడు. దానితో 'ఇతని కోసమే నేను వచ్చింది' అనుకున్నాడు బాలెన్‌టైన్. 'అయ్యా! ఐదు డాలర్‌లు ఇవ్వండి' అని అడిగాడు. బాలెన్‌టైన్ అలాగే ఇచ్చాడు. అతను అటూ ఇటూ కంగారుగా చూస్తున్నాడు. 'ఇక్కడే వుండండి. వస్తాను' అని వెళ్లి, మళ్లీ రానేలేదు. అతని గురించి చెబుతూ, 'స్వామీజీ! అతను మహానుభావుడు' అన్నాడు బాలెన్‌టైన్. 'అతనేం చేశాడు?' స్వామీ రామా అడిగారు. 'నాగురించి చాలానే చెప్పాడు. నాకేమో అతనెవరో కూడా తెలియదు' అన్నాడు బాలెన్‌టైన్. 'మీకు అవి ఇంతకుముందు తెలిసినవే కదా!' అడిగారు రామా. 'అవును' అన్నాడు బాలెన్‌టైన్. 'మరి అతను చేసిందేవుంది? మీ ఆలోచనలను అతను పసిగట్టి చెప్పాడంతే!' చెప్పారు స్వామీ రామా.

– ఈ ఉదంతం ద్వారా నకిలీలుంటారు జాగ్రత్త అని స్వామీ రామా హెచ్చరిస్తున్నారు.

★ ★ ★

అధ్యాయం పదకొండు

# రోగనివారణ శక్తి

'ప్రతి మనిషిలోనూ రోగనివారణ శక్తి అంతర్లీనంగా వుంటుంది. దానిని వెలికి తీసుకున్ననాడు డాక్టర్ అవసరమే వుండదు. దైవంపై మనస్సు నిలిపి నిస్వార్థంగా వున్న వ్యక్తి ఎవరైనా రోగాన్ని పోగొట్టగలరు. అన్ని బాధల నుండి విముక్తి పొందడమే అన్నిటిలోకి గొప్ప నివారణ.'

## 11.1 రోగనివారణ - తొలిఅనుభవం

ఒకసారి స్వామీ రామా పన్నెండవ ఏట గురుదేవులతో వెళ్తున్నారు. అప్పుడు ఈటా అనే రైల్వేస్టేషన్‌లో ఆగారు. గురుదేవులు స్టేషన్‌మాస్టర్‌తో 'అబ్బాయి ఆకలిగా వున్నాడు. తినేందుకు ఏమైనా పెట్టించండి' అన్నారు. స్టేషన్‌మాస్టర్ భార్యను అడిగాడు. ఆమె 'మీకు తెలియదా? మనబ్బాయికి అమ్మవారు పోసింది. వాడి ప్రాణం పోయేలా వుంది. ఈ సమయంలో ఎవరో సాధువుకోసం అన్నం అడుగుతున్నారా? వెళ్ళండిక్కడి నుంచి' అని కోపంగా అరిచింది. స్టేషన్‌మాస్టర్ విచారంగా తిరిగి వెళ్ళాడు. 'నా భార్య 'ఆయన నిజమైన స్వామి అయితే మన పరిస్థితి గ్రహించి మనవాడిని బాగుచేయకూడదా? ఆయనకేమైనా బుద్ధుందా? మరణ శయ్యపై పిల్లవాడుంటే వారికి భిక్ష కావాల?' అన్నది. నేనేం చేయను చెప్పండి?' అని క్షమాపణ చెప్పుకున్నాడు.

గురుదేవులు నవ్వుతూ, 'పద' అన్నారు రామాతో. స్టేషన్‌మాస్టర్ ఇంటికెళ్ళాడు. ఈలోగా రామా 'నాకు ఆకలిగా వుంది బాబోయ్! అన్న మెప్పుడు పెడ్తారు?' అని అడిగారు. 'కాసేపు ఆగు' అన్నారు గురుదేవులు. ఈ విధంగా ఇంతకుముందెన్నిసార్లో జరిగింది. ఓపిక నేర్చుకోమని గురుదేవులనేవారు. స్టేషన్‌మాస్టర్ ఇంటిదగ్గర ఆయన భార్య వీరిని బయటకు పొమ్మంది. అక్కడ వారి బాబు ఒంటిపై పుళ్ళు, చీము. 'రెండు నిమిషాలలో మీవాడికి నయమౌతుంది. విచారించకండి' అన్నారు గురుదేవులు నవ్వుతూ. ఒక గ్లాసులో నీళ్ళు తీసుకుని అబ్బాయి మంచంచుట్టూ తిరిగారు. మూడుసార్లు అవిధంగా చేసి ఆ నీళ్ళు తాగేశారు. 'ఇప్పుడు చూడండి. మీ అబ్బాయి బావున్నాడో లేదో' అన్నారు. ఆశ్చర్యం! అబ్బాయి ఒళ్ళు శుభ్రంగా, ఆరోగ్యంగా వుంది. అయితే, పుళ్ళు గురువుగారిమీద కనిపించాయి. రామాకు ఏడుపొచ్చింది. 'ఏడవకు, నాకేమీ కాదులే' అన్నారు గురుదేవులు. రెండు నిమిషాలలో అబ్బాయి బాగుపడ్డాడు. గురుశిష్యులు బయటకు వచ్చి ఒక మర్రిచెట్టుకింద కాసేపు కూర్చున్నారు. కాసేపటికి ఆయన శరీరంపై పుండ్లు పోయాయి. రామా ఆయనను కౌగిలించుకుని, ఏడుస్తూ, 'ఇంకెప్పుడూ ఇలా చేయకండి. మీరు చూసేందుకు బాగా లేరు. నాకు భయం వేసింది' అన్నారు.

కాసేపటికి వీరిని వెదుక్కుంటూ చాలామంది వచ్చారు. 'మావల్ల ఏమైనా

చెడు జరిగిందా?' అడిగారు రామా. 'లేదు. మాతో రండి' అన్నారు వారు. యమునా నదీ తీరాన వున్న ఒక ఇంటిముందు ఆగారు. అక్కడ వారికి ఆహారం దొరికింది. ఈ ఉదంతం చెబుతూ –

'ఇతరులకు మేలు చేయడంలోనే ఋషులకు ఆనందం వుంటుంది. ఇది సాధారణ బుద్ధికి అందేది కాదు. ఇతరులకోసం తాము బాధలుపడ్డ ఆధ్యాత్మిక నాయకులు ఎందరో వున్నట్లు చరిత్ర చెబుతుంది. ఆ విధంగా ఉదాహరణలుగా నిలిచిన కొందరు మహనీయులను ఈనాటికీ కొందరు అనుసరిస్తున్నారు. వ్యక్తి చైతన్యం విశ్వ చైతన్యానికి వ్యాపిస్తే, ఇతరులకోసం బాధపడడంలో ఆనందం తెలుస్తుంది. అది లేనప్పుడు ఎవరి బాధ వారికే. మహనీయులు తమకోసం బాధ పడరు, ఇతరులకోసమే ఎక్కువగా బాధపడుతారు. చైతన్యం ఇంద్రియాల స్థాయిని దాటితే– బాధ, ఆనందం ఏమీ వుండవు. ఇంద్రియాలను అంతర్ముఖం చేస్తే నివారణ శక్తి లభిస్తుంది. ఇది విశ్వచైతన్యంనుండి వస్తుంది. నివారణ చేసే వ్యక్తికి ఈ శక్తి తనదే అనిపించిననాడు ఈ శక్తి అంతరిస్తుంది. ఇది మనిషిలో సహజంగా వుండే శక్తి. అధమస్థాయి మనస్సు అడ్డుకోకుంటే ఇతరుల బాధా నివారణం చేయడం చాలా సులభం, అంటారు స్వామీ రామా.'

## 11.2 బాధ నివారణ మన చేతిలోనే వుంది

ఒకరోజు గురుదేవులు, స్వామీ రామా గుహ బయట కూర్చుని వున్నారు. ఉన్నట్లుండి ఆయన రామాతో 'నీవో బస్సు పట్టుకో. ఇక్కడినుంచి ఏడు మైళ్లు వెళ్లు' అన్నారు. ఎందుకో తెలియకపోయినా రామా బయలుదేరారు. కుండతో నీళ్లు తీసుకున్నారు. 'హరిద్వార్ రైల్‌రోడ్ స్టేషనుకు వెళ్ళే బస్సు ఎక్కు. అక్కడ నీకో టికెట్ దొరుకుతుంది. అక్కడ డా॥ మిత్రా నాకోసం కలవరిస్తున్నాడు. బ్రెయిన్ హెమరేజ్ వుంది. అతని భార్యేమో హాస్పిటల్‌కు వద్దంటూ వుంది. అతని బావమరిది డా॥ బసుకు అది హెమరేజ్ అని తెలుసు. సర్జరీకి సౌకర్యాలు లేవు' అన్నారు. 'నేనేం చేయాలి?' రామా అడిగారు.

'ప్రేమగా అతని చెక్కిలి తాకు. నీవు రోగ నివారకుడి వనుకోకు. నీవో పరికరం మాత్రమే. వారికెప్పుడూ సాయంచేస్తామని మాటిచ్చాం కదా!' అన్నారు గురుదేవులు. 'నా తరపున నాకు తెలియకుండానే భలే ప్రమాణాలు చేస్తారే?' అన్నారు రామా. ఆయనకు అంత పెద్ద ప్రయాణం ఇష్టంలేదు. అయినా, గురుదేవులు చెప్పారు కాబట్టి తప్పదు. రోడ్డుమీదకు వెళ్ళగానే బస్సు వచ్చింది. రామా బస్సెక్కి హరిద్వార్‌లో దిగారు. చేతిలో పైసా లేదు. గడియారం అమ్మి అయినా టికెట్ కొనాలి. రైల్వేస్టేషన్‌లో ఓ పెద్దమనిషిని వాచీ కొంటారా అని అడిగారు. 'నా కొడుకు రాలేదు. ఒక టికెట్ వుంది. అది మీరు తీసుకోండి, వాచీ వద్దు' అన్నాడు అతను ఆశ్చర్యకరంగా.

రామా రైలెక్కారు. రైల్లో డా॥ మిత్రా దగ్గరి బంధువు ఒకామె వుంది. ఆమె రామా గురించి, గురుదేవుల గురించి విని వుంది. రామాకు ఆమె తినేందుకు పెట్టింది. తెల్లవారిన తర్వాత కాన్పూరు చేరారు. బయట ఒక తెలిసిన వ్యక్తి కనిపించాడు. తన ఇంటికి రమ్మన్నాడు. అయితే, రామా చెప్పిన మీదట డా॥ మిత్రా ఇంటికెళ్ళారు.

'అమ్మయ్య! మీరు వచ్చారు. నిశ్చింతంగా నా భర్తను మీకు అప్పగిస్తాను' అంది మిత్రా భార్య రామాను చూడగానే. 'నేను వైద్యుణ్ణి కాదు. చూద్దామని వచ్చానంతే' అన్నారు రామా. మిత్రా కూర్చునేందుకు వీలులేదు. ముక్కునుండి రక్తం కారుతోంది. 'గురుదేవులు ఎలా వున్నారు?' అడిగాడాయన రామాను చూడగానే. రామా మిత్రా చెక్కిలిని తాకారు. రక్తం కారడం ఆగిపోయింది. అక్కడున్న ఒక డాక్టర్ 'ఆ విధంగా చేయడంవల్ల తెరచుకున్న రక్తనాళం మూసుకుని వుంటుంది' అన్నాడు.

మిత్రా లేచి కూర్చోవడం ఊరంతా గొప్ప సంచలనం కలిగించింది. ఎంతోమంది రోగులు స్వామీ రామాను వెతుక్కుంటూ వచ్చారు. రామా గురుదేవుల దగ్గరకు వెళ్ళిపోయారు. 'నాకు హెమరేజి అపుచేయడం తెలుసు' అన్నారు రామా చిలిపిగా. 'నీకు చెప్పిన డాక్టర్ అజ్ఞాని. బాధకు చాలా స్థాయిలున్నాయి. అజ్ఞానం వాటన్నిటికీ తల్లివంటిది' అన్నారు గురుదేవులు నవ్వుతూ.

ఈ విధంగా ఎన్నోసార్లు స్వామీ రామా గురుదేవుల ఆజ్ఞలు పాటించవలసి వచ్చింది. ఋషుల పద్ధతులే వేరు అనిపించే సందర్భాలు అయన ఎన్నిటినో చూశారు. మనస్సుపై అధికారం చేయగల మహనీయులే నివారణ చేయగలరని అనుకున్నారాయన. ఒకసారి రామా 'మనస్సు పెట్టే బాధలనుండి మనిషికి విముక్తి వుంటుందా? మీలాంటివారిలాగా శక్తులు పొందాలంటే హిమాలయాల్లో వుండాలా?' అని అడిగారు. గురుదేవులు 'జీవిత పరమార్థం తెలుసుకుని, దానిని నెరవేర్చేందుకు అన్ని చర్యలూ కేంద్రీకరిస్తే అసాధ్యం ఏముంది? ఇది తెలియని వారే బాధల సుడిగుండంలో చిక్కుకుంటారు' అన్నారు. ఇంకా అయన ఇలా అన్నారు:

'తన పనులు చేయకుండా ఎవడూ ఉండలేడన్నది ఒక నియమం పనులు వ్యక్తిని బానిసగా చేస్తాయన్నదీ నిజమే. నిస్వార్థంగా, నైపుణ్యంతో చేస్తే అన్ని విధులూ కర్తను బంధించవు. ప్రేమతో చేసే పనులు, విధులు మోక్షకారకులు. కర్తవ్యపాలన ముఖ్యం. ప్రేమ మరింత ముఖ్యం. మనిషికి నివారణ శక్తి వుంది. దాని వాడకమే తెలియదు. తనలోని శక్తులను తెలుసుకున్ననాడు తనను తాను బాగు చేసుకోవచ్చు అన్ని శక్తులూ భగవంతునివే. మనిషి కేవలం ఒక ఉపకరణం.'

## 11.3 రోగాలకు చికిత్సలు

స్వామీ రామా తన పర్యటన సమయంలో దెయ్యాలు, భూతాలు, చేతబడులు వగైరాల గురించి చదువుకున్న వాళ్ళు కూడా భయపడడం గమనించారు. ఇది మానసికమైన లోపాలవల్ల వస్తుందని అంటారు. హిస్టీరియా వల్ల ఇది కనిపిస్తుంది. శృంగారపరమైన కోరికల అణచివేత ఇందుకు కారణం. వీటిని నయం చేసేటప్పుడు కొరడాతో కొట్టడం వగైరా పనులు చేస్తారు. పూజారి దేవుడు ఆదేశించినట్లు మాట్లాడుతాడు.

కొన్నేళ్ళక్రితం డా॥ ఎల్మర్‌గ్రీన్, అలెస్‌గ్రీన్ తదితరులు మెనిడ్జర్ ఫౌండేషన్ తరపున మన దేశానికి వచ్చారు. యోగుల జీవక్రియలు పరిశీలించే యంత్రాలు తెచ్చారు. వారు స్వామీ రామాను కలిశారు. అంతకుముందే, కొందరు యోగులు ప్రయోగాలకు ఒప్పుకున్నారు. అయితే, గ్రీన్ బృందం ఒక సంవత్సరం ఆలస్యంగా రావడంతో అది వీలుకాలేదు. స్వామీ రామా హరిసింగ్ అనే వ్యక్తిని కాపలాగా నియమించారు. అతను ప్రయోగానికి ఒప్పుకున్నాడు. నలభైమంది అమెరికన్ పరిశీలకుల సమక్షంలో

అతను ఉక్కుబ్లేడ్‌లను నిప్పుతో ముంచి వేడెక్కిన తర్వాత వాటిని నాకాడు. బుస్సుమని శబ్దం వచ్చింది. కెమెరాతో దానిని ఫోటో తీశారు. అయితే, ఇటువంటి సాహసాలను యోగులు కానివారైనా చేస్తారు. అయినా, ప్రజలు అందరినీ యోగులనే అనుకుంటారు. పాశ్చాత్యులు అటువంటివారికోసమే హిమాలయాలకు వెళ్తుంటారు. అయితే, అది యోగంలో భాగంకాదు. ఏ యోగులూ వాటిని నేర్చుకోరు. నేర్పరు.

1945 లో ఒకసారి ఆస్ట్రేలియా నుండి న్యూరాలజిస్ట్ ఒకాయన రామా కోసం వచ్చి పదిరోజులున్నారు. అప్పట్లో పర్వతాలలో కొన్ని ఆసుపత్రులు మాత్రమే వుండేవి. ఈ డాక్టర్ అక్కడి వారికి ఉపయోగపడుతారు అని రామా అనుకున్నారు. అయితే, తన దీర్ఘకాల శిరోవేదన నివారణ కోసం ఆయన రామా దగ్గరకు వచ్చాడు. ఎక్కడా అతనికి నివారణ దొరకలేదు. రామాకు పాలు పోసే మహిళ అతనిని చూసి, 'డాక్టరా?' అని అడిగింది. 'నేను అతని తలనొప్పి రెండు నిమిషాలలో పోగొట్టనా?' అంది, 'సరే, ప్రయత్నించు' అన్నారు రామా. ఆమె పర్వతాలలో నిప్పు చేసేందుకు వాడే మూలికను తెచ్చింది. రెండు రాళ్ళతో నిప్పు సృష్టించి దానిని కాల్చింది. ఆ భస్మాన్ని డాక్టర్ నుదుటిపై పెట్టింది. 'నన్ను నమ్ము. నీ నొప్పి శాశ్వతంగా ఎగిరి పోతుంది. పడుకో' అంది. తర్వాత నిప్పులో ఇనుప మేకును ఎర్రగా కాల్చి ఆ మూలికపై వుంచింది. డాక్టర్ ఎగిరి గంతేశాడు. రామా కూడా భయపడ్డాడు. ఆమె తన ఊరికి వెళ్ళింది. డాక్టర్‌కు నయమైంది.

అటువంటి చికిత్సలు గ్రామస్తులకు మామూలే. ఆ డాక్టర్ 'ఇదేం శాస్త్రం? నేను నేర్చుకుంటాను' అన్నాడు. రామా చెప్పలేదు. ఈ వైద్యం ఒక్కోసారి పని చేయవచ్చు. కాని, శాస్త్రీయమైనది కాదు, ఇందులో పని చేసేదేమిటో. చేయనిదేమిటో గుర్తించడం చాలా కష్టం అయినా, డాక్టర్ నేర్చుకోవాలనే పట్టుదలతో ఘర్‌వాల్ పర్వతాలలో వున్న భైరవదత్తును కలిశాడు. అతనికి మూడువేల రకాల మూలికల గురించి తెలుసు. ఆరునెలల తర్వాత అతను రామా దగ్గరకు వచ్చాడు. 'ఆ ముసలామె చికిత్స నాకు అర్థమైంది. అది చైనీయుల సూచీచికిత్స. సూది మందులతో చేసే అక్యుపంచర్. చరకుడు దీనిని సూచీవేధ అన్నాడు' అని సంతోషంగా చెప్పాడు. 'ఇతను ఇంకొక తలనొప్పి తెచ్చి పెట్టుకున్నట్లుందే?' అనుకున్నారు స్వామీ రామా. గ్రామస్తులు అర్థం చేసుకున్న వాటిని మనం కూడా సవ్యంగా అర్థం చేసుకుని ఆచరించాలి. రకరకాల చికిత్స లున్నాయి. నీరు, మట్టి, ఆవిరి, రంగులు, సూర్యస్నానం, పండ్లరసాలు, కూరగాయలు మొదలైనవాటితో ఆయుర్వేద చికిత్సలు ఎన్నో వున్నాయి. నిద్రలో మార్పు, తిండిలో మార్పు మొదలైన వాటితో రోగికి హాయిగా చికిత్స జరుగుతుంది.

హిమాలయవాసులకు ఎటువంటి అనారోగ్య సమస్య లేకపోవడం స్వామీ రామాకు చాల ఆశ్చర్యంగా వుంటుంది. బహుశ స్వచ్ఛమైన గాలి, నీరు, ఆహారం, ఆందోళన లేని జీవితం కారణం అయివుండవచ్చు అంటారాయన. మానసిక ఆందోళనవల్ల రోగాలతో బాధపడేవారు సరైన ఆహారం, పళ్ళరసాలు, ప్రాణాయామం, ధ్యానంవల్ల బాగుపడుతారు. ప్రత్యామ్నాయ వైద్య పద్ధతులను నిర్లక్ష్యం చేయకూడదని ఆయన అభిప్రాయం.

## 11.4 సంగీతంతో బాధ నివారణ

ఒకసారి కాన్పూర్‌కు చెందిన జైపూరియా అనే వ్యాపారి కొందరు వ్యాపారులు,

డాక్టర్‌లు ఉన్న బృందాన్ని బదరీనాథ్‌కు తీసుకువెళ్ళాడు. స్వామీ రామాను కూడా తమతో బలవంతంగా తీసుకెళ్లాడు. డా॥ శర్మ అనే వ్యక్తి కూడా ఆ బృందంలో వున్నాడు. జైపూరియా పల్లకిలోనూ, తక్కినవారు నడిచి వెళ్ళారు. కర్ణ ప్రయాగ నుండి కాలినడకతో చాలా రోజుల ప్రయాణం తర్వాత బదరీనాథ్ చేరారు. అప్పటికే ఎవరికీ అలవాటులేని ప్రయాణం కావడంవల్ల అంతా మోకాలి నొప్పులు వగైరాలతో బాధపడుతున్నారు. బదరీనాథ్ చేరగానే వేడినీటి బుగ్గలలో స్నానాల కోసం పరుగెత్తారు.

స్వామీ రామా రాత్రిళ్ళు మేలుకుని మధ్యాహ్నం ఒకటి రెండున్నర గంటల మధ్య విశ్రాంతి తీసుకునేవారు. రెండున్నరకు ఎవరో తలుపు తట్టారు. 'స్వామీజీ! రండి నా సోదరుడు గుండె నొప్పితో బాధపడుతున్నాడు డాక్టర్లు ఏమీ చేయలేరు. మీ సాయం కావాలి' అని జైపూరియా పిలుస్తున్నాడు. అయితే, రామాకు కొంచెం ఇబ్బందిగా వుంది. 'మా వంటి యోగులం ఇటువంటిచోట దేహ త్యాగం చేయాలనుకుంటాం. అయినా అది జరగదు. మరి మీ సోదరుడికి మాత్రం ఎలా జరుగుతుంది? అతనికేమీ జరగదు. వెళ్ళండి. నా ఏకాంతాన్ని భంగపరచకండి' అన్నారు స్వామీ రామా. ఉదయానికల్లా ఆయన మామూలు మనిషి అయ్యారు. రామా వ్యాఖ్య వ్యాపారులలో ఛలోక్తిగా మారింది.

మర్నాడు దగ్గరున్న గుహలలోని స్వాములను కలిశారు రామా. సాయంకాలం డా॥ శర్మ వచ్చి, శ్రీమతి జైపూరియా రక్త విరేచనాలతో బాధ పడుతున్నారని చెప్పాడు. ఆమెను రామా తన తల్లిలాగా చూశారు. ఆమెను చూసేందుకు వెళ్ళారు. ఎవరికీ ఆమె బతుకుతుందనే ఆశలేదు. ఇద్దరు కొడుకులూ ఆమె చెంతనే వున్నారు. డాక్టర్‌లు మందిచ్చారు. అయినా, లాభం లేదు. ఊపిరి బలహీనంగా వుంది. రామా సానుభూతితో ఆమె తలపై తన చేతినుంచారు. ఇంతలో ఒక యువక స్వామి రామాను పిలిచాడు. డాక్టరెక్కడ అని అడిగాడు. డాక్టర్ వచ్చాడు. ఆ స్వామి, 'ఇంతేనా మీరు వైద్యం చేసేది? మీరు మందులు ఎక్కువ ఇచ్చి చంపుతున్నారే! అయ్యో! మీదేం తెలివి?' అన్నాడు. డాక్టర్‌కు కోపం వచ్చింది. 'మరి ఇద్దరు స్వాములు ఏంచేస్తున్నట్లు? మేము ఏమీ చేయలేకపోయాం – నిజమే' అన్నాడు.

జైపూరియా ఓ మూల కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. కొడుకులు, కోడళ్ళు ఏడుస్తున్నారు. రామా స్వామివైపు చూశారు. స్వామి 'ఏదైనా పువ్వుందా?' అని అడిగారు. ఎవరో గులాబి పువ్వును ఇచ్చారు. ఆ స్వామి శ్రీమతి జైపూరియాను లేవమన్నారు. గట్టిగా భుజంలాగి, బలవంతంగా కూర్చోబెట్టి, రోజారేకులు వేసిన నీటిని తాగించాడు. ఏదో మంత్రంలాగా గొణిగాడు. తర్వాత ఆమెను పడుకోబెట్టాడు. 'ఆమె గాఢనిద్ర పోతుంది. మీరంతా వెళ్ళండి' అన్నాడు. వారు అపార్థం చేసుకుని ఏడవడం మొదలుబెట్టారు. యువస్వామితో పాటు స్వామీ రామా కుడా నవ్వుతున్నారు. అప్పుడామె కొడుకు 'బాధ్యతారహితులైన మీకు పోయేదేమీలేదు. నా తల్లిని నేను పోగొట్టుకుంటే, మీకు నవ్వులాటగా వుందా?' అన్నాడు కోపంగా. గది బయట స్వాములిద్దరూ వేచివున్నారు. తక్కినవారు ఆమె దహనానికి ఏర్పాట్లు చేస్తున్నారు. అరగంట గడిచాక చిన్న స్వామి జైపూరియాను గదిలోకి వెళ్ళమన్నాడు. అక్కడ ఆమె హాయిగా వుంది.

ఈ ఉదంతం చెబుతూ స్వామీ రామా ఈ విధంగా అంటారు:

'మందులంటే నాకు ద్వేషం లేదు. అయితే, రోగ నివారణ మందులున్నాయని అందరూ గుర్తించాలి. ఆత్మశక్తి ద్వారా ప్రజలకు సాయం చేయవచ్చు. ఏకాగ్ర బుద్ధి, ధ్యానం, ఆధ్యాత్మిక క్రమశిక్షణ ఈ శక్తిని పెంచుతాయి. అందరూ ఈ శక్తిని పెంచుకోవాలి. రోగ చికిత్సలో మందులతోపాటు, డాక్టర్ ప్రవర్తన కూడా ఎంతో ముఖ్యం. అందువల్ల డాక్టర్ దీన్ని అర్థం చేసుకుంటే రోగి తన అంతఃశక్తిని వాడి రోగనివారణ చేసుకునేందుకు సాయపడే వీలుంది.'

ఈ సంఘటన జరిగిన తర్వాత స్వామీ రామాను, యువ స్వామిని అంతా కానుకలతో ముంచెత్తారు. వారివైపు చూసి స్వామీ నవ్వారు. 'నిజంగా ఆధ్యాత్మిక పథంలో వున్నవారికి కానుకలు అనవసరం. పైనున్న కానుకల వైపే వారి దృష్టి వుంటుంది. సాధన దశలో వున్నవారికి ప్రలోభం ఎక్కువ. ప్రాపంచిక సుఖాలపై అనుబంధం పెంచుకోవడమే అజ్ఞానం ఏకాగ్రబుద్ధి, దృఢమైన నిర్ణయం, దైవకృపవల్ల కొందరు భాగ్యశీలులు ప్రలోభాలకు లొంగరు.'

బదరీనాథ్ బృందానికి వీడ్కోలు పలికిన తర్వాత స్వామీ రామా పర్వతికర్ మహారాజ్ అనే గొప్ప ఋషిని కలిశారు. ఆయన గొప్ప సంగీతకారుడు. రామా, ఆయన మిత్రుడు పళ్ళుతిని, పాలుతాగి జీవించే ఫలాహారి బాబా గుహలో వున్నారు. రోజూ మహారాజ్ సంగీతం కోసం సాయంకాలాలు వచ్చేవారు. ఆయన విచిత్ర వీణలో నిపుణుడు. వాయిద్యానికి శృతి కూర్చుతూ ఆయన 'మిత్రులారా! నేను వాయిద్యాన్ని శృతి చేస్తున్నా. మీరు మీ హృదయాలను శృతి చేయండి. అప్పుడే భగవంతుడు మీ ద్వారా పలుకుతాడు. లొంగిపొండి. శృతి చేసిన మీ హృదయాలను ఆ సంగీతకారునికి సమర్పించండి' అన్నారు. ఆయన మాటలు అందరికీ అర్థం కాలేదు. ఆయన కళ్ళు మూసుకుని వాయించడం మొదలు పెట్టారు. ఆ గానవాహినిలో అంతా మునిగిపోయారు. రెండున్నర గంటలపాటు ఎవరూ కదల్లేదు. సంగీతం ధ్యానానికి ఎంతో తోడ్పడుతుందని రామాకు అర్థమైంది. నాదం అటువంటిది. దైవసాన్నిధ్యానికి తీసుకువెళ్తుంది. సప్తస్వరాలు చైతన్యాన్ని పలు స్థాయిలలోనికి తీసుకు వెళ్తాయి. మనలోని అనాహత నాదాన్ని వినగలిగితే అంతకన్నా గొప్ప పనిలేదు. కబీరు కూడా అదే అంటాడు – 'సాధూ! మాయ తెరను తొలగించు. నీవూ, దేవుడూ ఒకటే అవుతారు. నీ గుండె గదిలో ప్రేమ దీపం వెలిగించు దేవుని చూస్తావు. అనాహతనాదం వింటావు.'

భక్తి మార్గంలో యోగులు ఈ నాదాన్ని వింటారు. భక్తి సంగీతం సాధకుని మంచి మార్గంలో నడిపిస్తుంది. ప్రేమను సంగీతం ద్వారా పలికించడమే సంగీతంలో ధ్యానం క్రమంగా బుద్ధి ఏకాగ్రం అవుతుంది, క్రమంగా సాధకుడు అనాహత నాదాన్ని వింటారు. ప్రేరణ కలిగించే నాదాలెన్నో వున్నాయి. వాటితో సాధకుడు పరమానందం అనుభవిస్తాడు. భక్తిమార్గంలో సంగీతం ఆత్మజ్ఞాన సాధన అవుతుంది. వీణానాదం తర్వాత మహరాజ్ మళ్ళీ మౌనం పాటించారు. ఆ అనుభూతి స్వామీ రామాను ఎంతగానో సంతోషపరచింది.

## 11.5 గురుదేవుల చెంత!

స్వామీ రామా అల్మోరాలో కాసర్‌దేవికి వెళ్ళినప్పుడు ఒక పాశ్చాత్య చిత్రకారుణ్ణి,

ఒక బౌద్ధ సన్యాసిని కలిశారు. వారు హిమాలయాలలోని కుటీరంలో వుంటూ ఏకాంతాన్ని అనుభవిస్తారు. పర్వతాలలో మాట్లాడేవారు. ఆల్ప్స్ పర్వతాలకన్నా హిమాలయాలకే జీవం ఎక్కువ అంటారు వారు. 'పర్వతాలు మాట్లాడ్డం ఎలా?' అడిగారు రామా. 'రామా! నీవు పర్వతాలలోనే పుట్టి పెరిగావు కదా! అయినా చనువు ఎక్కువైతే అంతేలే. గుర్తుంచుకో. ఈ పర్వతాలు పవిత్రమైనవి. సాధకునికి ఆధ్యాత్మిక వాతావరణాన్ని సృష్టిస్తాయి. వీటి అందం చూడగలిగేవారికే కనిపిస్తుంది. ఈ దేవుళ్ళను మెచ్చుకోవడం మరచిపోయావు' అన్నారు వారు.

తర్వాత స్వామీ రామా అక్కడికి ముప్పై మైళ్ళ దూరంలోని శ్యామదేవికి వెళ్లారు. అక్కడ శక్తి ఆలయంలో ఒక స్వామి ఒంటరిగా వున్నాడు. ఆయనతో కొంతకాలం గడపాలనుకున్నాడు రామా. కొంతకాలం తర్వాత నన్తిన్ బాబా వచ్చి కలిశాడు. ఆయనతో రామా అంతకుముందు బాగేశ్వర్, రామ్‌గర్ గుహల దగ్గర గడిపారు. శక్తి ఆలయంలోని స్వామి తాను సోంబేరీ బాబా ప్రత్యక్ష శిష్యుడినని చెప్పకున్నాడు. అంతకు నలభై ఏళ్ళకు ముందు ఈ సోంబేరీ బాబా వుండేవాడు. ఈయన, హారియాఖాన్ బాబా కలిసి తిరిగేవారు. గురుదేవులు, హారియాఖాన్ బాబా ఒకే గురువు శిష్యులు. ఆ గురువు ఇండియాలో పుట్టినా టిబెట్‌లోనే ఎక్కువకాలం గడిపారు. ఆయనను బాబాజీ అనేవారు. ఈనాటికీ నేపాల్, నైనిటాల్, కాశీపూర్, అల్మోరాలలో వారి గురించిన అద్భుతాలు, వారి రోగ నివారణ శక్తులు వగైరాలు గురించిన కథలు ఎంతో ప్రచారంలో వున్నాయి. రామాకు అక్కడ ఆతిథ్యం ఇచ్చిన వ్యక్తి గురుదేవుల గురించి గంటల తరబడి విసుగూ విరామం లేకుండా చెప్పాడు. ఈయన ఒక సిద్ధుడు, రోగనివారణ శక్తి కలవాడు. అపరిచితులను పేరు పెట్టి పిలిచేవాడు. ఇతని దుర్భాషలు విన్న ప్రజలు ఇతనికి అదే పేరుగా పెట్టి 'దుర్వాసా' అని పిలిచేవారు. పంచాగ్నిసిద్ధితో అగ్నిపై ఆధిపత్యం సంపాదించాడీయన. దేవుడు అగ్ని రూపంలో వున్నాడని ఈయన అభిప్రాయం. పొరవిజ్ఞానం గురించి ఈయన రామాకు చెప్పాడు. దానిని ఆచరించవద్దని రామాకు గురుదేవులు చెప్పారు. అంతకన్నా గొప్ప పనులున్నాయని ఆయన అన్నారు. రామా పాట పాడినా, రాగం కూర్చినా, రంగుల బొమ్మలు వేసినా గురుదేవులు వద్దని చెప్పారు. మౌనంగా వుండమన్నారు. 'మౌనం స్వరం గొప్పది. అన్ని చైతన్యాలకన్నా, అన్ని సమాచార ప్రసార విధానాలకన్నా అది అతీతమైనది. మౌనాన్ని వినడం నేర్చుకో, శాస్త్ర చర్చలు, ఋషులతో వివాదాలు వద్దు. వారి ఉనికిని ఆనందించు. నీవు ఒక యాత్రలో వున్నావు. ఒక చోట ఆగి దానిపై అనురాగం పెంచుకోకు. ప్రపంచం ఎప్పటికీ ఇవ్వలేని దానిని మౌనం నీకిస్తుంది' అన్నారాయన.

తర్వాత రామా తన నివాసానికి తిరిగి వెళ్ళారు. బుద్ధకేదారవాసులు ఆయనకు ఒక చిన్న రాతి కట్టడం ఇచ్చారు. ఆరువేల అడుగుల ఎత్తున అది నేటికీ వుంది. అక్కడ రామా మౌనం పాటించారు. అడపాదడపా ఎవరో ఒక యోగి వచ్చి మౌనభంగం చేసేవారు. సాధారణ యాత్రికులు ఆ దారిలో నడిచే వారు కాదు. 'హిమాలయాలలోని పరిణతి చెందిన యోగుల దగ్గర ఎంతో నేర్చుకోవచ్చు' అంటారు స్వామీ రామా.

★ ★ ★

## అధ్యాయం పన్నెండు

# గురుకృప

"మానవజీవిత లక్ష్యం పరిపూర్ణత. అయితే, మానవ ప్రయత్నాలు పరిమితం. మానవయత్నం వల్లనే సంతోషం రాదు. కృప వల్ల వస్తుంది. భగవత్ కృప, గురు కృప – రెండింటినీ పొందినవారు ధన్యులు."

## 12.1 గురువు - జ్ఞాన సాగరుడు

'గురువు' అనే పదం ఉన్నతమైనది. అద్భుతమైనది. దీనిని సవ్యంగా వాడకపోతే బాధగా వుంటుంది. అంటారు స్వామీ రామా. గురువుల ప్రాముఖ్యం గురించి స్వామీ రామా అభిప్రాయాలు ఈ విధంగా వున్నాయి:

'అమ్మ జన్మనిస్తుంది. అమ్మా నాన్నా పెంచి పోషిస్తారు. తర్వాత గురువు బాధ్యత మొదలౌతుంది. గురువు జీవితపరమార్థం నెరవేర్చేందుకు సాయపడతారు. ఎవరైనా దుర్మార్గుణ్ణి కూడా 'గురువు' అని పిలిస్తే వాడు చచ్చినట్లు మంచిగా మారాల్సిందే. 'గు' అంటే చీకటి, 'రు' అంటే వెలుతురు. అజ్ఞానాంధకారం పోగొట్టే వ్యక్తి గురువు అవుతాడు. అతి పవిత్రమైన మహా గురువును 'గురుదేవులు" అనడం మామూలు.

సాధారణ ఉపాధ్యాయునికి, ఆధ్యాత్మిక గురువుకు తేడా వుంది. గురువును అనుసరించే వారంతా వయోభేదం లేకుండా శిష్యులే అవుతారు, గురువు వారికి అన్నం పెట్టి, ఆశ్రయం ఇచ్చి, ప్రతిఫలం కోరకుండా బోధిస్తారు. ఎందుకలా చేస్తారని గురుదేవుల నడిగితే 'గురువుకు సిద్ధంగా వున్న శిష్యులకు బోధించడంకన్నా వేరే కోరిక వుండదు. చెప్పడం చేయకపోతే మరేం చేయగలడు?' అన్నారాయన.

గురువు దగ్గరకు శిష్యుడు వెళ్ళేటప్పుడు కట్టె పుల్లలు చేత పట్టుకుని వెళ్ళాలి. గురువుకు సాష్టాంగ నమస్కారం చేసి, దానిని సమర్పించాలి. త్రికరణ శుద్ధిగా అత్యున్నతమైన జ్ఞానంకోసం ఆత్మ సమర్పణ చేసుకుంటున్నందుకు అది గుర్తు. గురువు వాటిని కాల్చి, 'నీకు నేను సాయం చేస్తాను, ఎప్పటికీ రక్షిస్తాను' అని శిష్యునికి అన్నీ బోధిస్తాడు. అటువంటి పవిత్రమైన సంబంధంతో పోల్చదగినది మరేదీలేదు. గురువు దగ్గరున్నవన్నీ శిష్యుని సొంతమే అవలక్షణాలు మాత్రమే గురువు సొంతం. 'ఇది నీకు శాశ్వత మిత్రుడు. ఈ పదం గుర్తుంచుకో. ఇది నీకు మేలు చేస్తుంది' అని గురువు చెప్పే పదమే మంత్రం. గురువు ఆటంకాలు తొలగిస్తాడు. నిర్ణయాలు తీసుకోవడంలో శిష్యునికి తోడ్పడుతాడు. 'ఉదాత్తమైన ఆలోచనలు వచ్చినప్పుడు కార్యరూపానికి తీసుకురా. మనస్సును ఏకగ్రీవం చేయి. నీవు శక్తిశాలివి. నా ఆశీస్సులు నీకున్నాయి' అంటాడు.

గురువుగారికి ఏదైనా చేయాలని తపిస్తాడు శిష్యుడు. కానీ, గురువుగారికి అది

అవసరం లేదు. 'ఆయన నాకెందుకింత చేస్తున్నారు? నా నుంచి ఏం కావాలాయనకు?' అని శిష్యునికి సందేహం వస్తుంది. నిజానికి ఆయనకు ఏమీ అక్కర్లేదు. ఆయన తన కర్తవ్యం, జీవిత పరమార్థం నెరవేరుస్తున్నాడు. శిష్యునికి దారిచూపడమే ఆయన కర్తవ్యం.

గురువులు మానవాళికి మార్గదర్శకులు. సూర్యుడు పైన ఎక్కడో వుండి ప్రకాశిస్తున్నాడు. అదేవిధంగా గురువు తన ఆధ్యాత్మిక ప్రేమను అందిస్తూ కూడా బంధాలు లేకుండా వుంటాడు. గురువు భౌతిక ప్రాణి కాదు. గురువు ఆ శక్తి తనదే అనుకుంటే అతను గురువు కాలేడు. గురువు అనేది ఒక సంప్రదాయం. జ్ఞానవాహిని. గురువు జ్ఞానసాగరుడు. గురుజ్ఞానవాహిని ఎన్నో మార్గాల గుండా ప్రవహిస్తుంది. క్రీస్తు ప్రజల వ్యాధులు నయం చేశాడు. ప్రజలు ఆయనను దేవుడే అన్నారు. అప్పుడు ఆయన కూడా 'ఇది నా తండ్రి వల్ల జరిగిందే. నేను కేవలం ఒక మార్గాన్ని మాత్రమే' అన్నాడు.

ఏ మనిషి స్వయంగా గురువు కాలేడు. శక్తి వాహకంగా, మార్గంగా ఆత్మ సమర్పణ చేసుకున్న మనిషే గురువు కాగలడు. అందుకు మనిషి నిస్వార్థంగా వుండాలి. సాధారణంగా ప్రేమ, స్వార్థం కలిసి వుంటాయి. మనకేదో కావలసి వస్తే ఇంకొకరితో నిన్ను ప్రేమిస్తున్నాను అంటాము. అప్రయత్నంగా, నిస్వార్థంగా చేసే పనుల వల్ల ఏర్పడేది నిజమైన ప్రేమ. దానికి మనం ప్రతిఫలం ఆశించము. నిజమైన గురువులు నిస్వార్థంగా వుంటారు. అదే వారి ఆత్మజ్ఞానానికి మూలం. వారు ఈ లోకంలో తెలియని మూలల నుండి కాంతిని, జీవనాన్ని వెదజల్లుతారు. లోకానికి వారి గురించి తెలియదు. వారూ గుర్తింపు కోరరు.

ఎవరైనా వచ్చి 'నన్ను పూజించు' అంటే ఆ వ్యక్తిని నమ్మకూడదు. క్రీస్తు, బుద్ధుడు ఆ విధంగా అడగలేదే? గురువు లక్ష్యం కాదు. నదిని దాటించే పడవ వంటివాడు. మంచి పడవ వుంటే నదిని సులభంగా దాటగలం. నదిని దాటాక పడవను అంటిపెట్టుకోనక్కర్లేదు.

చాలా మంది దురభిమానులు గురువును పూజించాలని అనుకుంటారు. గురువుకు చేయవలసింది పూజ కాదు. ప్రేమ, గౌరవం చూపితే చాలు. గురువు, దేవుడు వస్తే ముందు గురువుగారికి నమస్కరించి, 'నాకు భగవంతుని పరిచయం చేసినందుకు ధన్యుణ్ణి. కృతజ్ఞతలు' అనాలి. అంతేకానీ, భగవంతునితో 'కృతజ్ఞుణ్ణి నా గురువు నిచ్చినందుకు' అనకూడదు.

## 12.2 ఎక్కడున్నా గురుకృప వుంటుంది

హిమాలయాలలోని ఉత్తర బృందావన్ ఆశ్రమంలో ఇద్దరు యూరోపియన్ ప్రొఫెసర్‌లు ఉండేవారు. వారిలో కృష్ణప్రేమ్ (ప్రొఫెసర్ నిక్సన్) ఇంగ్లీష్ ప్రొఫెసర్ ఆనందభిక్షు (డా॥ అలెగ్జాండర్) వైద్యంలో ప్రొఫెసర్. వారు బెంగాల్ యోగిని యశోదామా శిష్యులు. స్వామీ రామా ఒకసారి వారితో సత్సంగం చేశారు. సాధారణంగా వారు ఎవ్వరితోనూ మాట్లాడరు. అప్పుడు కృష్ణప్రేమ్ భగవద్గీతా యోగం, కఠోపనిషత్ యోగం అనే పుస్తకాలు రాస్తున్నారు. అవి తర్వాత లండన్‌లో ప్రచురితాలైనాయి. వారి నిత్యావసరాలకు కావలసిన ఆర్థిక స్తోమత వుండేది. అంచేత వారు ఎవరిపైనా ఆధారపడలేదు. చాలా నిరాడంబరంగా, శుభ్రంగా వుండేవారు.

వారు వంటగదిలోకి ఎవరినీ రానిచ్చేవారు కాదు. తమ వంట తామే చేసుకునేవారు.

అప్పటికే యశోదామా సమాధి చెందింది. ఆమె సమాధిపై కృష్ణుని పాలరాతి విగ్రహం ఉంచారు. తర్వాత ఒకసారి రామా కృష్ణప్రేమ్‌ను కలిశారు. ఆయన ఒక తాయెత్తు వంటి దాన్ని కట్టుకుని వున్నారు. 'ఏమిటది?' అడిగారు రామా. 'చెప్తే నమ్మవు' అన్నారు కృష్ణప్రేమ్. 'పర్లేదు. దయచేసి చెప్పు' అన్నారు రామా. 'నేను చెప్పేది విని నీవు తర్కం పెట్టుకుంటావు. నన్ను పిచ్చివాడిననుకుంటావు. అయినా చెప్తాను. 15 రోజుల క్రితం కృష్ణ విగ్రహం నుండి కన్నీరు కారింది. నీరు కారుతుందేమో అని విగ్రహం తీసి చూశాము. నీరు కంటి ద్వారా వచ్చే మార్గమే లేదు. విగ్రహం యధాస్థానంలో వుంచాము. మళ్ళీ కన్నీరు కారింది. నా సాధనలో ఏమైనా లోపం వుందేమో? అమ్మ అలా సూచిస్తూ వుందేమో అనిపించింది. అందుకే విగ్రహం కన్నీటిని పత్తితో అద్ది ఇలా తాయెత్తులో వుంచుకున్నా. ఇదీ జరిగింది. నిజం దీనిగురించి ఎవరికీ చెప్పను. చెప్తే నాకు పిచ్చి పట్టిందనుకుంటారు' అన్నారాయన. 'నాకేమీ అనుమానం లేదులే. దయచేసి వివరంగా చెప్పు' అన్నారు రామా.

'గురువులు పరోక్షంలో కూడా ఎంతో సహాయపడుతారు. ఇది నాకు సూచన. నేను సోమరినైనాను. సాయంకాల సాధన మరిచాను. అమ్మ నాకు గుర్తు చేస్తూ ఉంటుంది. అది ఆమె అలవాటు. ఇదీ అందుకే జరిగింది' అంటూ వెక్కి వెక్కి ఏడ్చారు. గురువుగారి మీద ఆయనకున్న ప్రేమ అంత గాఢమైనది. స్వామీ రామాకు ఇదొక ప్రేరణ అయింది. గురువుపట్ల ప్రేమ అనేది దివ్యత్వం అనే నిచ్చెనకు తొలిమెట్టు. ఇది గురువు మానుషరూపం పట్ల మాత్రమే వున్న ప్రేమ కాదు.

బ్రాహ్మణులు తప్ప మిగిలినవారు ఈ ఇద్దరినీ ఆదరించారు. వీరు స్వచ్ఛంగా వున్నా తక్కిన ఆలయ పురోహితులకన్నా ఆధ్యాత్మికంగా ఎంతో పురోగతి సాధించినా బ్రాహ్మణులకు వీరంటే ఆదరణ లేదు. వీరిని అంటరానివారుగా చూసేవారు. ఈ బ్రాహ్మణులను స్వామీ రామా ఖండించేవారు. మౌఢ్యం ఏ మతంలోనూ భాగం కాదు. మన దేశం కులమతాలతో చాలా బాధపడింది. విదేశాలలోనూ జాతి, వర్గ వ్యవస్థలతో బాధ వుంది. మానవ సమాజాన్ని రెండు దెబ్బతీసేవే అంటారు స్వామీ రామా.

## 12.3 గురుదేవుల ఫోటో మాయ

1939 వ సంవత్సరం సెప్టెంబర్ నెలలో ఒకసారి స్వామీ రామా గురుదేవుల పట్ల అపచారం చేశారు. ఫ్రాన్స్‌కు చెందిన ఇద్దరు ఫోటోగ్రాఫర్‌లను పిలుచుకుని వచ్చి నూటయాభై రూపాయలు అరువు తీసుకుని గురుదేవుల ఫోటో తీయమన్నారు. అక్కడ గంగాతీరంలోని చిన్న కుటీరంలో పదిహేను రోజుల నుండి వున్న గురుదేవులను చూడాలని ఇరుకైన కొయ్య వంతెన దాటి అంతా వెళ్ళారు.

'దుర్మార్గుడివి. ఎందుకంత మొండితనం నీకు? వాళ్ళకేమీ రాదులే' అన్నారు గురుదేవులు. రామాకు ఏమీ అర్థం కాలేదు. గురుదేవులు తన సొత్తు అనుకునేవారాయన మొండిగా. కొత్త ఫిల్మ్ తెచ్చి రామాను, గురుదేవులను ఎన్నో ఫోటోలు తీశారు. గురుదేవులు మౌనంగా కళ్ళుమూసుకుని కూర్చున్నారు. రెండు కెమెరాలలోనూ నాలుగు ఫిల్మ్‌రోల్స్ తీశారు. తీరా డెవలప్ చేశాక చూస్తే

ఏముంది? గురుదేవులున్న చోట ఖాళీగా వుంది. ఆ విధంగా రామా నాలుగైదుసార్లు ప్రయత్నించారు. 'నా మానుష శరీరం తాలూకు బొమ్మ నీదగ్గరుంటే నాలోపలి జ్యోతిని చూసేందుకు అది నీకు అంతరాయం కావచ్చు. ఈ శరీరం పట్ల వ్యామోహం వద్దు. మన దివ్యానుబంధాన్ని గుర్తుంచుకో' అన్నారు గురుదేవులు. తర్వాత యూరప్, జపాన్‌లలో పర్యటించే ముందు, 'నన్ను నీవు విదేశీ మార్కెట్‌లో అమ్మడం నా కిష్టం లేదు' అన్నారాయన. ఆ తర్వాత ఆయన భావాలను గౌరవించి రామా ఎప్పుడూ ఆ ప్రయత్నం చేయలేదు. రామా సహవాసి ఒకతను గతంలో శ్రీనగర్‌లో బాక్స్ కెమెరాతో తీసిన గురుదేవుల ఫోటోను రామాకు ఇచ్చాడు.

ఈ సంఘటనను వివరిస్తూ, 'యోగి తలచుకుంటే ఫోటోలో కనిపించకుండా పోవచ్చు. ఆ ఒక్కసారి మాత్రం గురుదేవులు అలా చేయలేదు' అన్నారు రామా.

## 12.4 శాశ్వతమైనదానిని ఎవరూ చంపలేరు

ఒకసారి స్వామీ రామా గురుదేవులతో వెళ్తున్నారు. ఉన్నట్లుండి కొండచరియ విరిగిపడి వారివైపు వచ్చింది. 'మనం చనిపోతాం' అన్నారు రామా. 'శాశ్వతమైన దానిని ఎవరు చంపగలరు?' అన్నారు గురుదేవులు. 'ఒకవైపు కొండ విరిగి మనమీద పడబోతూంది. మీరేమో శాశ్వతమైన దానిని ఎవరు చంపగలరు అంటున్నారు. ఒకసారి అటువైపు చూడండి' చూపించారు రామా. 'ఆగు. మమ్మల్ని దాటనివ్వు.' అరిచారు గురుదేవులు. కొండచరియ ఆగిపోయింది. తాము దాటివెళ్ళాక 'ఇక పడు' అన్నారు గురుదేవులు. అది విరిగిపడి దొర్లుకుంటూ పోయింది.

మరోసారి గురుదేవులతో కొందరు పర్వతం వైపు వెళ్తున్నారు. మూడు గంటలపాటు మంచు కురిసింది. ఎవరికీ దాన్ని తట్టుకునేందుకు వీలైన బట్టలు లేవు. అందుచేత వారు గురుదేవులతో 'మీరు శాశ్వతులు. మీకు అద్భుతశక్తులు ఉన్నాయంటారు కదా! ఈ మంచును ఆపలేరా?' అన్నారు. 'అదెంతపని?' అని, 'ఆగు. ఎండ రావాలి' అని అరిచారాయన. ఆయన చెప్పిందే జరిగింది.

'ఈ నాటివారికి ఇచ్ఛాశక్తి గురించి తెలియదు. శక్తులు మూడు రకాలు. ఈ శక్తి గుప్తంగా వుండవచ్చు. క్రియాశీలంగానూ వుండవచ్చు. క్రియాశక్తితో మనం పనులు చేస్తాం. ఇచ్ఛాశక్తితో పనిచేయాలని కోరుకుంటాం. జ్ఞానశక్తితో నిర్ణయిస్తాం. ఈ శక్తులలో దేనినైనా మనం అభ్యసించవచ్చు. యోగులు కొందరు తమ పనులను నేర్పుగా చేసి నెగ్గుతారు. కొందరు ఇచ్ఛాశక్తిని ఎక్కువగా వాడుతారు. కొందరు బుద్ధికి పదనుపెట్టి ఐక్య ప్రశాంత స్థితి అయిన ప్రజ్ఞను పొందుతారు. అయితే, ఏ శక్తిని పెంచుకోవాలన్నా క్రమశిక్షణ తప్పనిసరి. ఇచ్ఛాశక్తివల్ల నిగ్రహ శక్తి పెరుగుతుంది. దానితో ఎవరికైనా తమపై పూర్తి అధికారం వస్తుంది. ఈ శక్తితోనే గురుదేవులు ప్రకృతి శక్తులను శాసించారు' అంటారు రామా.

## 12.5 సగం ఇక్కడ...సగం అక్కడ

ఒకసారి రామా గురుదేవులతోపాటు కర్ణ ప్రయాగలో వున్నారు. గురుదేవులు దాదాపు నగ్నంగానే వుంటారు. ఆయన ఎప్పుడూ బాహ్యాన్ని పట్టించుకోలేదు.

అంతరంగమైన ఆనందంతో వుంటారు. ఉన్నట్లుండి రాత్రివేళ 'పదవెళ్దాం' అన్నారాయన. అప్పుడు చిమ్మచీకటి. వర్షం కురుస్తోంది. 'ఇప్పుడు వద్దన్నా ఆయన పాటికి ఆయన వెళ్తారు. ఒంటిమీద ఏమీ లేకుండా హాయిగా వెళ్తారు' అని గొణుక్కుంటూ రామా లేచారు. గొంగళి కప్పుకుని ఆయనతో బయలుదేరారు. బయట చాలా చల్లగా వుంది. అరమైలు దూరం చెప్పల్లేకుండా నడిచే సరికి రామా శరీరం అంతా గడ్డకట్టుకుని పోతూంది. ఒంటిమీద గొంగళి తప్ప మరేమీ లేదు. ఏం చేయాలి? రెండు మైళ్ళు నడిచాక కూడలి వచ్చింది. 'ఎటు వెళ్ళాలో తెలుసా మీకు?' అడిగారు రామా. 'ఇటు' అన్నారాయన. 'కాదు – అటు' అన్నారు రామా. తిరిగి యధాస్థానం చేరారు. చీకట్లో ఎక్కడున్నారో తెలియలేదు వారికి. 'ఇప్పుడు ఇక్కడే వుందాం' అన్నారు గురుదేవులు. 'సరే, అన్నారు రామా. గొంగళి పరిచారు. గురుదేవులు నిప్పుదగ్గర కూర్చున్నారు.'

ఉదయం లేవగానే గురుదేవులు కళ్ళు తెరిచి పకపకా నవ్వారు. 'రాత్రి అంత నడిచీ బయలుదేరినచోటే వున్నామన్న మాట! ఎలా జరిగిందిది?' అన్నారు. 'నేను మోసం చేశాను' అన్నారు రామా. 'ఎందుకని?' అడిగారు గురుదేవులు. 'చలికి గడ్డకట్టిపోతున్నా మీకేమీ పట్టలేదు మరి.' చెప్పారు రామా.

అటువంటి అనుభవాలను ఆయన ఆనందించారు. ప్రాపంచిక విషయాలను ఆయన పట్టించుకునే వారు కారు. అయినా ఒక్కోసారి పిల్లవాడిలా ఆనందించేవారు. మరోసారి గురుదేవులతో ఇంకో అనుభవం:

అది జూన్‌లో ఎండకాస్తున్న రోజు. వారణాసి దగ్గర అడవిలో వున్నారు వారు. కాస్త వెచ్చగా వుండడంతో 'స్నానం చేస్తారా?' అని అడిగారు రామా. సరేనన్నారు గురుదేవులు. దగ్గరే ఒక బావి వుంది. 'బకెట్ తెస్తాను ఉండండి' అని రామా వెళ్లారు. తిరిగి వచ్చేసరికి గురుదేవులు ఏరీ? రామా అరిచారు. బావి అడుగునుండి గురుదేవుల గొంతు వినిపిస్తోంది. చూస్తే ఆయన బావిలో ఆడుకుంటున్నారు. అరవై అడుగుల ఎత్తునుంచి దూకినా ఆయనకు ఏ ప్రమాదమూ జరగలేదన్నమాట! ఆయనను ప్రకృతి మాత రక్షించింది. ఎంతసేపు పిలిచినా ఆయన రాకపోయేసరికి, దగ్గరున్న పల్లెనుంచి ముగ్గురిని పిలుచుకు వచ్చారు రామా. 'బకెట్‌లో కూర్చోండి. పైకి లాగుతాము' అన్నారు. 'ఒంటరిగా వదిలేయండి నన్ను. నా స్నానం కానివ్వండి' ఆనందంగా అన్నారాయన. అప్పుడు రామాను బావిలో దించారు. పదండి అన్నారు రామా.

'కానివ్వు నా స్నానం అన్నారు' గురుదేవులు. 'గంటపైగా అయింది. చాలాసేపు స్నానం చేశారు' చెప్పారు రామా. 'నిజమా?' అడిగారు గురుదేవులు. అవునన్నారు రామా. ఆఖరుకు ఆయన బయటకు వచ్చారు. ఆయన మనిషి ఇక్కడున్నా మనసు ఎక్కడో. అలాగే గడిపారాయన.

## 12.6 బాల వితంతువుకు రక్షణ

ఒకప్పుడు రాజస్తాన్‌లో పిలానీకి పడమరగా యాభై మైళ్ళ దూరంలో వున్న కుగ్రామంలో ఒక భూస్వామి వున్నాడు. అతని ఒక్కగానొక్క కొడుకు పెళ్ళి అయిన వెంటనే తీవ్రమైన జ్వరంతో మరణించాడు. అతని భార్య వయసు పదిహేడేళ్ళు. ఆమె వితంతువైంది. ఏ ఆశా తీరలేదామెకు. ఆమె మామగారింట రెండో అంతస్తులో

పవిత్ర జీవనం గడుపుతూ వుండేది. ఆమె గదిలో రెండు బొమ్మలుండేవి. ఒకటి దుప్పటి పరుచుకునేందుకు, మరొకటి కప్పుకునేందుకు. గదిలో వెనుకవైపు కిటికీ, ముందువైపు బలమైన ద్వారం వుండేవి.

ఒక రాత్రి ముగ్గురు బందిపోట్లు ఆ ఇల్లు దోచుకోవాలని వచ్చారు. ఆ వితంతువును మానభంగం చేసి తీసుకుపోవాలని వారి కోరిక. కుటుంబ సభ్యులందరినీ ఒక గదిలోవుంచి ఆమె గది తలుపులు బద్దలు కొట్టాలనుకున్నారు. అప్పుడామె, 'గురుదేవా! నేను స్వచ్ఛంగా వున్నాను. కాపాడండి. ఎక్కడ మీ కాపాడే చేతులు? ఏమైనాయి?' అని ఆక్రోశించింది.

వెంటనే వెనుకవైపు కిటికీ దగ్గర ఒంటెమీద కూర్చుని గడ్డం వ్యక్తి ఒకాయన కనిపించాడు. 'అమ్మాయి! నాతో రా లేకుంటే నీకు ప్రమాదం. వారు నిన్ను మానభంగం చేస్తారు. ఆత్మహత్యే శరణ్యం' అన్నారు. దొంగలు తలుపు తీసుకుని వస్తే లోపల ఎవరూ లేరు. వృద్ధుడు ఆమెను పుట్టింటికి చేర్చాడు.

1951 లో రామా ఆమెను చూసినప్పుడు ఆమె స్వయంగా ఈ విషయం చెప్పింది. గురుదేవుల గురించి అడిగింది. ఆమె తండ్రి రామాకు పరిచితుడే. గదిలోని బొమ్మల్లో ఒకటి మీరాబాయిది. మరొకటి గురుదేవులది అని రామా గమనించారు. 'ఆనాడు ఆమెను కాపాడింది గురుదేవులే. అది ఎలా జరిగిందో చెప్పడం కష్టం. గురువుల మార్గాలు పలు రకాలు. వారు ఎక్కడ వున్నా తమ శిష్యులను కాపాడుతారు. వారు భౌతికంగానే వుండాలని ఏమీ లేదు' అన్నారాయన.

## 12.7 మునిగే వ్యక్తికి గురుదేవుల రక్షణ

ఒకసారి రాజస్తానీ పండితు డొకాయన రామా వున్న ఉత్తర కాశీ ఆశ్రమానికి వచ్చాడు. అయన గంగోత్రికి వెళ్తూ వచ్చాడు. ఒకరోజు అయన గంగలో మునగాల నుకున్నాడు. అయితే, అయనకు ఈత రాదు. అక్కడ కోతులు ఈతకొట్టడం చూసి 'కోతులకే ఈతవస్తే పండితుడిని నాకు రాదా?' అనుకున్నాడు. దూకేశాడు. మునిగిపోయాడు. రామా సహచరుడు ఒకాయన దానిని చూసి అరవడం మొదలు పెట్టాడు. 'ఏం జరిగింది?' అన్నాడు రామా. 'అతను మునిగిపోతున్నాడు' అన్నాడు సహచరుడు. 'నా ఆశ్రమంముందు ఇతను చనిపోతాడా' అనుకున్నాడు రామా. అయన వెళ్ళి చూసేసరికి ఆ ముసలాయన గట్టుమీద కూర్చుని గసపోసుకుంటున్నాడు. కుదుటపడ్డాక 'ఏం జరిగింది?' అని అడిగారు రామా. 'నీళ్ళు నన్ను లాక్కుపోయాయి' అన్నాడాయన. 'అయితే ఎలా బయటపడ్డావు?' అన్నారు రామా. 'ఒక స్వామి నన్నులాగాడు.' ఆ స్వామి వివరాలు కనుక్కుంటే అయనెవరో కాదు గురుదేవులే! ఎవరికీ అంతవరకు చూపని గురుదేవుల ఫోటోను రామా అయనకు చూపించారు. 'అయనే నన్ను లాగింది. నేను మునిగాను. ఈ ప్రదేశం పవిత్రమైనదైతే ఎవరో ఒకరు నన్ను కాపాడుతారు అనుకున్నాను. అలాగే అయన నన్ను కాపాడారు' అన్నాడాయన. 'అది నీ భ్రమ ఏమో?' అన్నారు రామా. 'లేదు. నేను నమ్ముతున్నాను. ఈయనతోనే వుండాలి' పట్టుదలగా చెప్పాడతను. 'అయితే మీ కుటుంబం మాటేమిటి?' రామా అడిగారతన్ని. 'అంతా పెద్దవారైనారు. నేను హిమాలయాలలోకి వెళ్తాను' చెప్పాడతను.

గురుదేవులు మరింత సిద్ధపడిన తర్వాత రమ్మన్నారు. తర్వాత అతను ధ్యానంలోనే గడిపాడు. రామా విదేశాలకు బయలుదేరేటప్పుడు కూడా ఆయన గురుదేవుల ఆజ్ఞకోసం వేచివున్నాడు. 'నేను సిద్ధపడిన రోజున వెళ్ళి చూస్తాను' అన్నాడాయన.

## 12.8 శక్తిపాతం

చిన్నప్పటినుంచీ స్వామీ రామాకు సమాధి స్థితిని అనుభవించాలని కోరికగా ఉండేది. 'కనీసం నాలుగు గంటలైనా స్థిరంగా కూర్చోకపోతే అది జరగదు' అన్నారు గురుదేవులు. అంచేత చిన్నప్పటినుంచి కూర్చోవడం నేర్చుకున్నారు రామా. సమాధికోసం ఎంత ప్రయత్నించినా అది జరగనే లేదు. పుస్తకాలు చదివి ఉపాధ్యాయుడైనాడు. అయితే, ప్రత్యక్ష జ్ఞానాన్ని అనుభవించి బోధించాలని ఆయన కోరిక. పరోక్షజ్ఞానం విశ్వవిద్యాలయాలలోనూ, మరెక్కడైనామూ సరిపోతుంది. ఆశ్రమాలకు పనికిరాదు. ఆ ఉద్దేశంతోనే గురుదేవుల దగ్గరికి వెళ్ళి 'ఈ రోజు మీకు చివరి హెచ్చరిక' అన్నారు. 'ఏవిటది?' గురుదేవులు అడిగారు. 'నాకు సమాధి ఇవ్వండి. లేకుంటే ఆత్మహత్య చేసుకుంటాను' అన్నారు రామా. 'నిశ్చయంగా?' రెట్టించారు గురుదేవులు. 'నిశ్చయంగానే!' అంత దృఢంగా అన్నారు రామా. 'సరే నాయనా, అలాగే' అన్నారు గురుదేవులు నెమ్మదిగా.

అటువంటి జవాబును రామా ఎదురు చూడలేదు. 'పది, పదిహేనురోజులు వేచి ఉండు' అంటారనుకున్నారు. గురుదేవులు అంత కఠినంగా ఎప్పుడూ ఉండలేదు. 'రాత్రి నిద్రపోతే పగలు మళ్ళీ సమస్యను ఎదుర్కొనక తప్పదుకదా! ఆత్మహత్య చేసుకున్నా అంతే మరో జన్మలో అనుభవించక తప్పదు. ప్రాచీన గ్రంథాలూ అవీ చదివావు. అర్థం చేసుకున్నావు. అయినా, ఆత్మహత్య గురించి మాట్లాడావు. నిజంగా అలాగే చేయాలనుకుంటే కానివ్వు మరి' అన్నారు ఆయన.

శక్తిపాతం గురించి రామా విని ఉన్నారు. మనలో శక్తిని, జ్యోతిని వెలిగించడం అని దాని అర్థం. 'మీరు నాకు శక్తిపాతం చేయలేదు. అంటే – మీకా శక్తిఅయినా లేకుండాలి. లేకుంటే ఇష్టమైనా లేకుండాలి. ఎంతోకాలంగా కళ్ళు మూసుకుని ధ్యానం చేస్తున్నా తలనొప్పి తప్ప మరేమీ రావడం లేదు. సమయం వృథా అయింది. నాకు జీవితంపట్ల ఆనందం లేదు' అన్నారు రామా. గురుదేవులు మౌనంగా ఉన్నారు. రామా కొనసాగించారు. 'నేను శ్రద్ధగా కష్టపడ్డాను. పద్నాలుగు సంవత్సరాలన్నారు మీరు ఇప్పుడు నాకు పదిహేడేళ్ళు. మీరేం చెప్తే అది చేశాను.' నిష్ఠూరంగా అన్నారు.

'నిజంగానా? నేను చెప్పిందంతా చేశావా? అయితే, నా బోధనల ఫలితం ఇదా? నీవు ఆత్మహత్య చేసుకుంటావా? సరే, ఎప్పుడు?' అడిగారు గురుదేవులు. 'ఇప్పుడే. ఆత్మహత్యకు మునుపు చెప్తున్నా, ఇక మీరు నా గురుదేవులు కారు. నేను అన్నిటినీ వదిలేశాను. నావల్ల మీకూ, లోకానికీ ఉపయోగం లేదు' అంటూ గంగలో మునిగేందుకు వెళ్ళారు రామా. 'నీకు ఈత తెలుసు. సహజంగానే గంగలో దూకిన తర్వాత నీవు ఈత కొడ్తావు. ఏదో దారి చూసి మునిగే పద్ధతి చూడు. బహుశ ఏదైనా బరువు కట్టుకుంటే మంచిదేమో?' ఎగతాళిగా అన్నారు గురుదేవులు. ఏమైంది మీకు? నన్నెంతో ప్రేమించారు మీరు. నేను వెళ్తున్నా. కృతజ్ఞుణ్ణి' అంటూ

రామా వెళ్ళిపోయారు. బండరాతిని కట్టుకున్నారు. నిజంగా చేస్తున్నాడని తెలిశాక గురుదేవులు 'ఇదిగో ఆగవోయ్. అక్కడే ఉండు. నిమిషంలో నీకు సమాధి ఇస్తాను' అన్నారు.

రామాకు ఏమీ అర్థం కాలేదు. 'అయినా, ఒక నిమిషమే కదా? చూద్దాం' అనుకున్నారు. ధ్యాన భంగిమలో కూర్చున్నారు. గురుదేవులు రామా నుదుట తాకారు. తొమ్మిది గంటలు అలాగేవున్నా ఏ ఆలోచనా లేదు. ఆ అనుభవం రామాకు వర్ణనాతీతమైంది. ఉదయం తొమ్మిదిగంటలే అన్నట్లుంది. సమాధివల్ల కాలం స్తంభించిపోయింది. 'క్షమించండి గురుదేవా!' అన్నారు రామా. గురువుల స్పర్శ భయాన్ని, స్వార్థాన్ని పోగొట్టింది. దానితో రామా జీవితమే మారిపోయింది. తర్వాత రామాకు జీవితం గురించి సరిగ్గా అర్థమైంది. 'గురుదేవా! అది నా ప్రయత్నమా, మీ ప్రయత్నమా?' రామా అడిగారు. 'కృప' అన్నారాయన క్లుప్తంగా.

కృప అంటే? దేవుని దయవల్లనే ఆత్మజ్ఞానం కలుగుతుందని చాలామంది అనుకుంటారు. అది నిజం కాదు. గురువులు అన్నారు కదా – 'మనిషి అన్ని ప్రయత్నాలూ శ్రద్ధగా చేయాలి. అవన్నీ అయిన తర్వాత విఫలమై, నిరాశతో, భక్తి ఆవేశంతో రోదిస్తే పరమానందం సిద్ధిస్తుంది. అదే దైవకృప. నమ్మకంగా, శ్రద్ధగా చేసే ప్రయత్నాల ఫలమే ఆ కృప'. ఆ తర్వాత శక్తిపాతం అనేది చాలాకాలం క్రమశిక్షణ, కఠోరదీక్ష, ఆధ్యాత్మిక అభ్యాసాల తర్వాతనే వస్తుందని రామాకు తెలిసింది. శిష్యుడు సిద్ధంగా ఉన్నాక గురువులు సరైన దీక్ష నిస్తారన్నది నిజమని గ్రహించారాయన. శిష్యుడు పూర్తి నమ్మకంతో, సత్యంతో, శ్రద్ధతో సాధన చేసినప్పుడే గురువులు అడ్డంకులు తొలగిస్తారు. గురుశిష్యులిద్దరూ శ్రద్ధతో చేసే ప్రయత్నాలవల్ల ఆత్మజ్ఞాన అనుభవం వస్తుంది. నేర్పుగా, మనస్ఫూర్తిగా పనులు చేస్తే ఫలితాలూ దానికి తగ్గట్లే ఉంటాయి. కర్మ పూర్తి కాగానే కృప కలుగుతుంది. శక్తిపాతం అంటే గురువుద్వారా దైవకృప ప్రసరించడమే. రామా తరచూ ఒంటరిగా ధ్యానంలో సమాధి అనుభవించాలనుకునేవారు. అంతకన్నా ఆనందకరమైనది ఏదీ లేదాయనకు.

## 12.9 పావన టిబెట్‌లో పరమ గురువులు

1939 లో ఒకసారి రామా టిబెట్‌కు వెళ్ళాలనుకున్నారు. ఆ సరిహద్దు రామా గురుదేవుల ఆశ్రమానికి తొమ్మిదిమైళ్ల దూరంలో ఉంది. అయితే మానా కనుమద్వారా టిబెట్‌కు వెళ్ళేందుకు రామాకు అనుమతి లభించలేదు. 1946 లో టిబెట్ రాజధాని లాసాకు డార్జిలింగ్, కలింగ్‌పాంగ్, సిక్కిమ్, పెడ్గాన్, గ్యాన్‌సీ, షిగాట్‌సీ పట్టణాలగుండా వెళ్ళాలనుకున్నారాయన. గురుదేవుల గురువులు (పరమ గురువులు) అక్కడ ఉన్నారు. ఆయన దగ్గర మరింత నేర్చుకోవాలని రామా కోరిక.

డార్జిలింగ్‌లో కొన్నాళ్ళుండి ఆయన ఉపన్యాసాలిచ్చారు. బ్రిటిష్ అధికారులు రామా విప్లవకారుడని, ఆయన లాసా ప్రయాణం వెనుక బ్రిటిష్ పాలనకు ముప్పు తెచ్చే ఆలోచన ఉందని అనుకున్నారు. పది రోజుల తర్వాత కలింగ్‌పాంగ్ వెళ్ళారు. చిన్నతనంలో ఆయన అక్కడి మఠంలో కుంగ్‌ఫూ నేర్చుకున్నారు. నాటి గురువును కలిసి తర్వాత సిక్కిమ్ వెళ్ళి దలైలామా సన్నిహిత బంధువులతో గడిపారు. సిక్కిమ్‌లో హాప్‌కిన్‌సన్ అనే రాజకీయ అధికారి టిబెట్ పాలకులను

రామా బ్రిటిష్ వ్యతిరేకులుగా మార్చుతారేమో అనుకున్నాడు. రామా భారతీయ కాంగ్రెస్ గూఢచారి ఏమో అనుకున్నారు. ఆయన దగ్గరున్న గాంధీ, నెహ్రూల ఉత్తరాలు ఆందోళన కారణాలైనాయి. అవి రాజకీయపరమైనవి కాకపోయినా పరిస్థితి అటువంటిది. అనుమానంతో రామాను గృహనిర్బంధంలో వుంచారు. రెండు నెలలపాటు రామా ఎవరినీ కలవడం కానీ, ఉత్తరాలు రాయడం కానీ జరగలేదు. 'నీవేదో చేశావని నేను రుజువు చేయలేను. అయినా, నీవు రాజకీయ గూఢచారివే అని అనుమానంగా వుంది. నీ గురించి రిపోర్టు అందేవరకు నీవు ఇక్కడే వుండాలి' అన్నాడు హాప్‌కిన్‌సన్. బంగళా బయట గార్డు ఉన్నాడు. ఆ కాలంలోనే టిబెటన్ భాష నేర్చుకున్నారు. రెండు నెలలు గడిచినా ఫలితం లేదు. దొంగచాటుగా తప్పుకోవాలనుకున్నారు రామా. ఒక చలిరాత్రిపూట పదకొండు గంటలపుడు గార్డు నిద్రపోతున్నాడు. రామా పాత కోటు తొడుక్కుని మారువేషంలో వెళ్లారు. అది జూలై 15 వ తేదీ, వెళ్ళే ముందు తాను ఢిల్లీ వెళ్తున్నట్లు ఒక కాగితంపై రాసిపెట్టి వెళ్లారాయన. అబద్ధం అయినా బాధపడలేదు. టిబెట్‌కు పోనివ్వకుండా అడ్డుపడితే ఏం చేయాలిమరి? రామా పెడాన్గ్ వెళ్ళారు. మూడురోజుల తర్వాత అయన చివరి చెక్ పాయింట్ చేరారు. అక్కడొక గుర్ఖా యోధుడున్నాడు. అతనితో నేపాలీ భాషలో మాట్లాడగానే అతను రామాను టిబెట్‌కు పోనిచ్చాడు.

రామాకు టిబెట్‌లో మరింత కష్టంగా వుండింది. ఆయన శాకాహారి. అక్కడ మాంసం తప్ప మరేమీ దొరకదు. అక్కడి వాతావరణంవల్ల మాంసాహారం తప్పనిసరి. రామా కూడా గుడ్లు తినడం మొదలుపెట్టారు. కొన్ని కూరగాయలూ దొరికేవి. ఆహారం మార్పువల్ల డయేరియా (నీళ్ళ విరేచనాలు) వచ్చింది. రామా ఆరోగ్యం పాడైంది. అయినా, యాత్ర లక్ష్యం నెరవేర్చుకునేందుకు రామా నానా తిప్పలూ పడ్డారు.

రాత్రిళ్ళు అయన బసచేసే చోట కొందరు అయన సామాన్లు పరిశీలించేవారు. దొంగతనం చేయాలని వారి ఉద్దేశ్యం. రామా దగ్గరేమున్నాయి? కొన్ని బిస్కెట్‌లు, పప్పులు, నీళ్ళసీసా, రెండు వేల రూపాయల పైకం. డబ్బును అయన మేజోళ్ళలో దాచుకున్నారు. రామా రోజు పది, పదిహేనుమైళ్ళు నడిచేవారు. ఒక్కోసారి కంచరగాడిదపై వెళ్ళేవారు. కొందరిని కలిసి జ్యోతిషం చెప్పేవారు. దానితో వారు సంతోషంగా గుర్రాలు వగైరాలు సమకూర్చేవారు. టిబెట్‌లో భోతియాజాతి కాపలా కుక్కలను రామా ఎదుర్కోవలసి వచ్చేది. అయినా, అయనకు హిమాలయ గురువుల బోధనలు తెలుసుకోవాలనే పట్టుదల ఎక్కువగా వుంది. ఇండియాకు తిరిగివెళ్తే బ్రిటిష్‌వారు. ముందుకు సాగాలనుకున్నారు.

దేవునిపై భారం వేసి రామా ముందుకు సాగారు. ఆ రోజుల్లో అయనకు భయం అంటే తెలియదు. పరమగురువులను చూచి, వారితో కొన్నాళ్లు గడపాలనే కోరిక అయనలో తీవ్రంగా వుంది. హరియాఖాన్ బాబా మొదలైనవారు అయనతో చాలాకాలం వున్నారని గురుదేవులు చెప్పారు. పరమగురువులైన బాబాజీని అక్కడివారు శాశ్వతుడని అంటారు.

రెండు నెలల కఠినమైన యాత్ర తర్వాత రామా లాసా చేరారు. అక్కడ ఒక కాథొలిక్ క్రైస్తవ పూజారిని కలిశారు. లాసాలో మూడు క్రైస్తవ అలయాలున్నాయి. వాటిపై టిబెట్ ప్రభుత్వం నిఘా వుంది. రామా వారితో పది రోజులుండి,

విశ్రాంతి తీసుకున్నారు. అప్పటికి రామా టిబెట్‌లో వున్నట్లు పోలీసులు కనిపెట్టారు. సి.ఐ.డి.లకు కేసు అప్పగించారు.

ఒక లామాను కలిసి తన యాత్ర పరమార్థం వివరించారాయన. పదిహేను రోజులు గడిపాక ఆయనకు కూడా రామాపై నమ్మకం కుదిరింది. తానూ అధికారులతో మాట్లాడుతాననన్నా డాయన. పరమ గురువుల ఆశ్రమం సమీపంలో వున్న లామా ఆయన మిత్రుడు. అక్కడికి వెళ్ళాలంటే డెబ్బైఅయిదు మైళ్లు ఈశాన్యంగా వెళ్ళాలి.

మఠంలో మూడువందల మంది లామాలున్నారు. వారు సంస్కృత మంత్రాలను కొన్ని మార్పులతో వాడుకుంటారు. నలందా విశ్వవిద్యాలయంలో చదువుతున్నప్పుడు రామా లామా మతం గురించి తెలుసుకున్నారు. వెయ్యేళ్ళక్రితం టిబెట్ పండితుడొకాయన మనదేశం వచ్చి శాస్త్రగ్రంథాలు తీసుకుని వెళ్ళాడు. ఎంతోమంది పండితులు టిబెట్‌కు వెళ్ళారు. టిబెట్ బౌద్ధం తంత్రం కలిసినది. అది వామమార్గ తంత్రం. వారికి ఉపాసనలో మందు, మాంసం, మగువ, చేపలు వుండాలి. పచ్చిమాంసం ముక్కలకు సుగంధద్రవ్యాలు, కారం కలిపి తింటూ పూజ చేసేవారు. పదిహేను నిమిషాల తర్వాత లామా స్వామీ రామాను అడిగాడు. ఆయన రామాను నమ్మలేదు. 'నీవు నన్ను చూడ్డానికి రాలేదు' అంటూ రామా గురించి మొత్తం చెప్పాడు. తంత్రం గురించి నేర్పమని రామా ఆయనను కోరారు. లామా ఇచ్చిన పుస్తకాన్ని రామా అంతకుముందే ఛదివి వున్నారు మరో లామాకు హిందీ తెలుసు.

టిబెటన్ సాహిత్యం చాలావరకు పురాణసాహిత్య అనువాదమే. కొంత టావోయిజం, కన్‌ఫ్యూషియస్ మతం తాలూకు సాహిత్యానికి అనువాదం, తాత్వికంగా అచ్చంగా వారిది అంటూ భావజాలం ఏదీలేదు. ఆ లామా హిందీలో మాట్లాడాడు. రామా కూడ కష్టపడి చదివేవారు అక్కడ ఒక సంస్కృత గ్రంథానికి లామాలు పూజలు చేసేవారు. దాన్ని ఎవరైనా చదివితే కుష్టురోగం వస్తుందని వారి నమ్మకం. రామా రహస్యంగా చదివి యథాస్థానంలో వుంచేశారు. అయినా ఆ రహస్యం అక్కడివారికి తెలిసిపోయింది. ఇంతాచేస్తే అది లింగపురాణం! రామాను ఆ లామాలు నిర్బంధించారు. 'హిమాలయ యోగుల ఆజ్ఞానుసారం వచ్చాను. అంచేత చెడు అంటూ ఏమైనా జరిగితే అది లామాలకే జరుగుతుంది' అన్నారు రామా, దానితో అంతా శాంతించారు. ఎవరో యువ లామా భారతదేశం నుండి వచ్చారని, ఆయన మహిమాన్వితుడని రామా గురించి ప్రచారం జరిగింది. టిబెటన్ సహాయకులు రామాను వెళ్ళిపోమని చెప్పారు. ఆధ్యాత్మికపథంలో అజ్ఞానమే రహస్యజ్ఞానంగా, మూఢనమ్మకాలు ఏవిధంగా వుంటాయో రామాకు తెలిసింది.

ఎట్టకేలకు పరమగురువుల దర్శనం జరిగింది. 'చాలా కష్టపడ్డావు. అలిసిపోయావు. ఆత్మజ్ఞానపథం కఠినమైన మార్గం. అన్వేషణ కఠినమైన సమస్య' అంటూ ఆయన రామాను కౌగిలించుకున్నారు. రామా జరిపిన యాత్రను ఆయనకు సవిస్తరంగా వర్ణించి, విశ్రాంతి తీసుకోమన్నారు. రామా కూడ అంతవరకు చేసిన అభ్యాసం వదిలేశారు. పరమగురువుల కౌగిలితో రామా తన బాధలన్నిటినీ మరచిపోయారు. ఆయన చూపు గురుదేవులు చూచినట్లే వుంది. ఆయన కరుణ వర్ణనాతీతం. యోగులు, ఋషులు తమ శిష్యులను చూచినప్పుడు ప్రేమ సంపూర్ణంగా ప్రసరిస్తుంది. అది కోరికలను తీర్చేది.

పరమ గురువులు బ్రాహ్మణులనీ, బాల్యంలోనే హిమాలయాలలో పర్యటించారనీ, ఆయనది అవిచ్ఛిన్నమైన ఋషి పరంపర అనీ గురుదేవులు చెప్పి వున్నారు. వయసుమీరినా ఆయనెంతో ఆరోగ్యంగా వున్నారు. రోజూ ఉదయం ఒకసారి, సాయంకాలం ఒకసారి తను కూర్చున్న చోటినుండి లేచేవారు. ఆయన ఎత్తు అయిదు అడుగుల పది అంగుళాలు. సన్నగా వున్నా శక్తివంతులు. ఆయన కనుబొమలు దట్టంగా వుండేవి. ఆయన వదనం కళకళలాడుతూ, ప్రశాంతంగా వుండేది. ఎప్పుడూ చెరగని నవ్వు ఆయన సొంతం. జడలబర్రె పాలుతాగి గడిపేవారాయన. ఎప్పుడైనా బార్లీ గంజి తాగేవారు, ఒక్కోసారి కొందరు లామాలు వచ్చి, ఆయన దగ్గర చదువుకునేవారు. ఆయన ఏడువేల అడుగుల ఎత్తున వున్న ఒక సహజమైన గుహలో వుండేవారు. పాలు, నీరు కాచుకునేవారు. గుహద్వారం దగ్గర ఆయన శిష్యులు క్వార్యతో ఒక వసారా చేశారు అక్కడినుంచి అందమైన దృశ్యాలు కనిపిస్తాయి.

పరమ గురువులతో వున్నప్పుడు రామా ఎన్నో సాధనల గురించి తెలిసుకున్నారు. అయినా, రామా ఏదో అడిగేందుకు జంకుతున్నట్లు అనిపించింది పరమ గురువులకు, మరీమరీ అడిగితే పరకాయప్రవేశం గురించి చెప్పమన్నారు రామా.

మర్నాడు ఆయన శిష్యుడైన లామా ఒకడు వచ్చాడు. అప్పుడు సమయం త్రొమ్మిదిన్నర. తన శరీరం వదిలి మళ్ళీ వస్తానన్నారాయన. రామా ఆయన సమాధి గురించి మాట్లాడుతున్నారేమో అనిపించింది. లేదన్నారాయన. రామా ఆలోచనలను ఆయన పసిగట్టినట్లున్నారు. గుహలోనికి వెళ్ళి ఏదైనా రహస్య మార్గం వుందా చూడమన్నారు. లేదన్నారు రామా. మళ్ళీ చూడు అన్నారు. మళ్ళీ చూసి లేదన్నారు రామా. ఒక కొయ్యపలకను రామాకు ఇచ్చి పట్టుకోమన్నారాయన. 'చూస్తున్నారా నన్ను?' అడిగారాయన. 'చూస్తున్నాం' అన్నారు రామా, లామా ఇద్దరూనూ, 'దయచేసి నన్ను కనికట్టుకు గురిచేయకండి. నేను మీ కళ్ళకేసి చూడను' అన్నారు రామా అజ్ఞానంతో. 'అదేమీ లేదులే' అన్నారాయన.

కాసేపటికి ఆయన శరీరం మసకబారింది అది వీరివైపు వచ్చింది. కాసేపటికి అదృశ్యమైంది. కొయ్యపలక బరువెక్కింది. తర్వాత మళ్ళీ తేలికైంది. పది, పదిహేను నిమిషాల తర్వాత మళ్ళీ పరమగురువుల గొంతు వినిపించింది. 'లేచి పలకను పట్టుకోండి' అన్నారాయన. మళ్ళీ పలక బరువైంది. తర్వాత గురువుగారి రూపం వారిముందు నిలిచింది. ఇదేవిధంగా ఆ క్రియను ఆయన మరోసారి చేసి చూపించారు. అటువంటి ఋషుల గురించి అందరూ తెలుసుకోవాలని అంటారు స్వామీ రామా. సిద్ధుల గురించి చెబుతూ –

'మనిషికి ఇటువంటి సిద్ధులు వస్తాయని పతంజలి యోగశాస్త్రం చెబుతుంది. అయితే, ఆత్మజ్ఞానానికి ఇవి అవసరం కావు. మనిషి శక్తి పాటవాలు మహత్తరమైనవి. శాస్త్రజ్ఞులు బాహ్య ప్రపంచాన్ని పరిశీలించినట్లే యోగులు అంతర్గత శక్తి సామర్థ్యాలు గురించి పరిశోధించవలసిందే' అంటారాయన.

'బయటకు మనది శంకరుల పరంపరలా అనిపిస్తుంది. కానీ భారతదేశంలోని ఇతర మార్గాలకన్నా భిన్నమైనది' అన్నారు పరమ గురువులు.

'మీరు భారతదేశంలో వుండకుండా టిబెట్‌లో ఎందుకున్నారు?' రామా ఆయనను అడిగారు. 'నే నెక్కడున్నానని కాదు ప్రశ్న. ఇక్కడ నా శిక్షణలో సాధన చేస్తున్నవారు చాలామంది వున్నారు. భవిష్యత్తులో అక్కడికి వస్తానేమో'

అన్నారాయన. రామా గురుదేవులతో వున్నట్లే పరమ గురుదేవులతోనూ ప్రవర్తించారు, అయన క్లుప్తంగా మాట్లాడేవారు. 'నిశ్శబ్దంగా వుండు. మాటలద్వారా కన్నా ఎక్కువ తెలుసుకోవచ్చు. 'అంతర్నేత్రం ద్వారా చూడు; లోపలి చెవి ద్వారా విను" అన్నారాయన.

రామా అయన చెప్పిన విషయాలతో తన డైరీ నింపేశారు. శిష్యులను ధ్యానం, వాక్యం, అచరణం ద్వారా ప్రేమించమని చెప్పారాయన. అంతర్ ధ్యానంవల్ల అది వీలౌతుంది. మౌనంవల్ల ఈ శక్తి పెరుగుతుంది. ఇందువల్ల శిష్యుల భయాలు, సందేహాలు, సమస్యలు తీరుతాయి. గురువు నిస్వార్థంగా కోరే ఏ కోరికైనా తీరుతుంది అన్నారాయన.

అయన సౌరశాస్త్రం గురించి ఎంతో చెప్పారు. అది సౌరనాడిని ధ్యానించడం వల్ల వస్తుంది. మణీపూరక చక్రంపై ధ్యానంవల్ల వస్తుంది. దీనిద్వారా రోగ నివారణ కూడా సాధ్యం. ఈ శాస్త్రాన్ని ఉపనిషత్తులు వర్ణిస్తాయి. దీన్ని అభ్యసిస్తే మనిషికి భౌతిక, భౌద్ధిక, ప్రాణిక స్థాయిలలో అధిపత్యం లభిస్తుంది. ఇందులో నిపుణుడైన వ్యక్తి ఎంత దూరంలో వున్నా ఎవరికైనా జబ్బులు నయం చేయగలడు.

పరమ గురువులు శ్రీ విద్య గురించి కూడా చెప్పారు. శ్రీ యంత్రం పరమ శక్తివంతమైనది. అందులోని బిందువు శివశక్తి సంగమం. గురువులు బిందువేధను గురించి చెప్పలేదు. అమ్మను కొలిచినప్పుడు మహర్షులు బోధించిన పరమ విజ్ఞానం అర్థమవుతుంది. ఇందుకు శాస్త్రాలు చదవాలి. అనుభవజ్ఞుడైన గురువు ఇచ్చే ప్రత్యక్ష అనుభవం అవసరం. ఈ విద్యను నేర్చినవారిని వేళ్ళతో లెక్కించవచ్చు. ఈ విధంగా స్వామీ రామా టిబెట్ యాత్ర సార్థకమైంది.

రెండున్నర నెలల తర్వాత ఒకరోజు తన అనుభవాలు రాసుకునేందుకు డైరీ వుంటే బావుంటుందనిపించింది స్వామీ రామాకు. పరమ గురువులు 'తెప్పించనా?' అన్నారు. అటువంటి అనుభవం రామాకు ముందే వుంది కాబట్టి అదేమీ అద్భుతం అనిపించలేదాయనకు. అయినా, చూద్దామనుకుని, 'అవును. కొన్ని పెన్సిళ్ళు కూడా కావాలి' అన్నారు. రామా డైరీ నైనిటాల్ దగ్గర భవాలీలోని శానిటోరియంలో వుంది. ఉన్నట్లుండి 475 పేజీల ఆ డైరీ పెన్సిళ్లు వచ్చాయి. 'అయినా, నాకు ఆధ్యాత్మికంగా మరింత ప్రత్యేకమైనది ఇవ్వండి' అని కోరారు స్వామీ రామా.

'అది నీకు ముందే ఇచ్చాను దాన్ని జాగ్రత్తగా దాచుకో. నీకు నా ఆశీస్సులు. ఇక భారతదేశానికి వెళ్లు' అన్నారు పరమగురువులు. 'నేను అరెస్ట్ అవుతాను, వీలుకాదు' చెప్పారు రామా. 'మన దేశానికి స్వాతంత్ర్యం వస్తుంది. ఆలస్యం చేస్తే కొండ చరియలు విరిగిపడతాయి. వెళ్లు' అని ఆదేశించారు. పరమగురువులు.

తర్వాత అయనను స్వామీ రామా మళ్ళీ కలవలేదు. అయన దేహత్యాగం చేశారని తెలిసింది. కొందరు అయన కాళీగంగపై పద్మాసనంలో కూర్చుని మాలలు ధరించి, తేలి వెళ్తుండగా చూశారు. 'ఇప్పటికీ వున్నారా?' అని అడిగారు రామా గురుదేవులను. 'నీవే కనుక్కో' అన్నారు గురుదేవులు. జూన్ 1947 లో రామా స్వదేశానికి తిరిగి వచ్చారు. అప్పటికే దేశానికి స్వాతంత్ర్యం ప్రకటించారు.

గాంగ్‌టక్‌లో వున్నప్పుడు ఒక లామా మఠాన్ని చూశారు రామా. ఆ లామా నిజమైన బౌద్ధ యోగి. సంస్కృత పండితుడు. సాధారణంగా బౌద్ధులు శంకరులను విమర్శిస్తారు. అయన రెండింటినీ సమన్వయం చేశారు. పరమ సత్యానికి

సంబంధించినంతవరకు రెండింటికీ అంతగా తేడా లేదు. పైపైకి తేడాలున్నట్లు బౌద్ధులు ధ్యానాన్ని వదిలేసి కర్మకాండలవైపు మళ్లుతున్నారని ఆయన బాధపడ్డారు. 'బుద్ధుడు నీ జ్యోతి నీవే వెలిగించుకో. ఎవరూ నీకు మోక్షం ఇవ్వరు. నీవే తెలుసుకో. నిర్వాణం పొందు. నీవే బుద్ధుడివి కావాలి' అన్నాడు. అలాగే శంకరుని అనుయాయులు అద్వైతాన్ని సవ్యంగా బోధించడం లేదు. అందువల్ల గందరగోళంగా వుంది. శంకరుని వేదాంతం వేదాలు చెప్పిన తత్వం, బౌద్ధమతం మేలుకలయికవల్ల ఏర్పడింది. వేదాలు కూడా 'అసద్వా ఇదం అగ్రఆసీత్' (పూర్వం శూన్యం నుండి దృశ్య ప్రపంచ ఏర్పడింది) అన్నాయి. అదే విధంగా మాండూక్య ఉపనిషత్, బౌద్ధ పండితుడైన ఈశ్వర కృష్ణని సాంఖ్యకారిక ఒకే విధంగా ఉంటాయి' అన్నాడాయన.

తర్వాత కొన్నాళ్ళకు హిమాలయాలకు వెళ్ళమని రామాను కోరాడాయన.

## 12.10 మాయ తెరను చింపివేయడం

'ప్రతి శిష్యుడికీ తన గురువుపట్ల కొన్ని నిర్దిష్టమైన అభిప్రాయాలుంటాయి. గురువును గురువుగా చూడడు. అతని అభిప్రాయాలు వేరు. అవి నెరవేర్చని గురువు అతని దృష్టిలో మంచి గురువుకాదు. అయితే, ఇది సరికాదు. దృఢమైన నిర్ణయం, నేర్చుకోవాలనే కోరిక వుంటే అసాధ్యం ఏదీ లేదు.'

శిష్యుడు సిద్ధంగా వున్నప్పుడు గురువు ప్రత్యక్షమౌతాడు అని శాస్త్రాలు చెప్తున్నాయి. సిద్ధంగా లేనప్పుడు గురువు చెంతనేవున్నా గుర్తించడం కష్టం. వజ్రం గురించి తెలియనప్పుడు వజ్రం దొరికినా అది గాజు ముక్క అనుకుని పారేస్తారు. ఒక్కోసారి గాజుముక్కను వజ్రంగా దాచుకోనూవచ్చు.

సాధనలో శిష్యుడు మేధస్సును ఎక్కువగా వాడవచ్చు. సహజ భావాన్ని నిర్లక్ష్యం చేయవచ్చు. లేకుంటే భావోద్రేకం ఎక్కువై తర్కం వదిలేయవచ్చు. రెండూ ప్రమాదమే. క్రమశిక్షణలో నమ్మకం లేనివారు ఆత్మజ్ఞానాన్ని ఆశించనక్కర్లేదు. కావాలన్నంత మాత్రాన ఏ గురువూ ఆత్మజ్ఞానాన్నివ్వరు.

నిజమైన గురువులు సంప్రదాయబద్ధంగా బోధించేందుకు శిష్యుల కోసం అన్వేషిస్తారు. కొన్ని లక్షణాలున్నాయా, లేదా చూస్తారు. గురువుల నెవరూ మోసం చేయలేరు. శిష్యుడెంతవరకు తయారుగా వున్నదీ గురువులు చెప్పగలరు. శిష్యులు తయారుగా లేకుంటే వారు తయారు చేస్తారు. వత్తి, నూనె సరిగా వుంటే దీపం వెలిగించడం గురువు చేసే పని. దివ్యజ్యోతి వెలగడమే ఫలితం.

మన కెవరు దారి చూపుతారా అని మనం కంగారుపడనక్కర్లేదు. మనం సిద్ధంగావున్నామా అనేది అసలైన ప్రశ్న. క్రీస్తుకు పన్నెండుగురే సన్నిహిత శిష్యులు. ఎంతో మందికి ఆయన మేలుచేసినా రహస్యజ్ఞానం మాత్రం సిద్ధంగా వున్న కొందరికి మాత్రమే బోధించాడు. ఆయన గుట్టమీద చేసిన బోధనలు అర్థమైంది కొందరికే. ఆ మార్గంలో లేనివారు ఉదాహరణకు బలహీనంగా, పేదగా ఎందుకుండాలో అర్థం చేసుకోలేరు.

గురుబోధనలు గూఢంగా వుంటాయి. మాటలద్వారా, చేతలద్వారా, ఒక్కోసారి మౌనంద్వారా వారి బోధనలు వినిపిస్తాయి. అంతర్వాణిద్వారా వెలువడిన బోధనలు మాటలకు అందనివి. మన విధులను ప్రేమపూర్వకంగా చేయాలి. అప్పుడే

ఆత్మజ్ఞానపథంలో పురోగతి. నిర్దేశకుడు అవసరమే. లోపలి గురువును కనిపెట్టేందుకు బయటి గురువు కావాలి. ఒక్కోసారి అహం పెరిగి, నాకు గురువెందుకు? అనిపించవచ్చు. దీన్ని అదుపులో వుంచుకోవాలి.

మనం మంచి శిష్యులమైతే చెడ్డ గురువు కనిపించడు. అలాగే చెడ్డ శిష్యునికి మంచి గురువు కూడా దొరకడు. ఎందుకాయన వాడి బాధ్యత తీసుకోవాలి? ఎవ్వడూ చెత్తను పోగుచేయడు కదా? గురువును అన్వేషించేముందు మన లోపల వెదకాలి. యోగి కావడం అంటే ఇక్కడ ఇప్పుడు మన పరిస్థితిని తెలుసుకుని మన పని మనం చేయడం. గురువు లేడని గొణగడం వృథా. 'గురువును ఆకర్షించే శక్తి మనకుందా అని చూడాలి' అన్నారు స్వామీ రామా.

ఒకసారి స్వామీ రామా 'నాకేమీ చెప్పడం లేదు మీరు' అన్నారు గురుదేవులతో. 'సరే. నీకు నేను శిష్యుణ్ణి అవుతాను. నీవు నాలాగా ప్రవర్తించు' అన్నారాయన. 'నాకేం చేయాలో తెలియదు' కంగారుగా అన్నారు రామా. 'ఏమీ కంగారుపడకు. నీవే తెలుసుకుంటావు' అభయం ఇచ్చారు గురుదేవులు. తర్వాత ఆయన చేత ఒక భిక్షా పాత్రను పట్టుకుని వచ్చారు. దానికో కన్నం వుంది. 'అయ్యా! నాకేమైనా ఇవ్వండి?' అడిగారాయన రామాను. 'చిల్లిగిన్నెతో వస్తే ఏమివ్వను?' అన్నారు రామా. 'చూశావా? నీవూ అదే విధంగా చిల్లితలతో వచ్చావు మరి. నీకు నేను ఏం బోధించాలి?' అన్నారు గురుదేవులు తమాషాగా.

'మన సామర్థ్యం పెంచుకోవాలి. పండితులం కావాలి. లోపలి శక్తి పెంచుకోవాలి. అప్పుడు దేవుడే వచ్చి 'ఈ సజీవ దేవాలయంలో నేనుంటాను' అంటాడు. ఆ పరిస్థితికి సిద్ధం కావాలి. మలినాలు తొలగించుకోవాలి. అప్పుడు వాస్తవం తెలుసుకోవాలనుకునే వ్యక్తికి తానే ఆ వాస్తవ మూలం అని తెలుస్తుంది' అని రామా గ్రహించారు. తాను కలిసిన గురువులలో కొందరే పూర్తిగా ఆత్మజ్ఞానులని ఆయన గమనించారు. అదే విషయం ఆయన గురుదేవులతో అన్నారు. 'గురుదేవా! ఎంతో మంది తాము స్వాములమనీ, ఋషులమనీ చెప్పుకుంటారు. ప్రజలు మోసపోతున్నారు. పూర్తిగా గురువులు కాలేనివారు ఎందుకలా చేయాలి?' అడిగారాయన. గురుదేవులు నవ్వుతూ – 'నీకు తెలుసా? పూలతోట చుట్టూ ముళ్ళకంచె వుంటుంది. వీరంతా మనకోసం దేవుడు సృష్టించిన ముళ్ళకంచెలు, వారినలా నటించనివ్వు. ఒకనాటికి వారు పూర్తిగా తెలుసుకుంటారు. ఇప్పుడు వాళ్లు తమను తాము మోసం చేసుకుంటారు' అన్నారు.

ఈ ఉదంతం చెబుతూ – 'నిజమైన గురువు, పూర్తిగా తెలిసిన గురువు లభించాలంటే ముందు మనం తయారు కావాలి. అప్పుడే ముళ్ళపొదలు దాటి వెళ్ళగలం' అన్నారు స్వామీ రామా.

* * *

అధ్యాయం పదమూడు

# జనన మరణాలపై అధికారం

'మన విధికి మనమే కర్తలం. చావు పుట్టుకలు జీవితంలో రెండు ఘటనలు – మన అసలు స్వభావం మరిచిపోయాం మనం. అదే బాధలకు మూలం. అది తెలుసుకుంటే విముక్తి సాధించినట్లే.'

## 13.1 చావు పుట్టుకలు రెండూ కామాలే

చిన్నప్పటినుంచీ స్వామీ రామాను గురుదేవులే పెంచారు. అందుకే రామా ఎప్పుడూ ఆయననే అంటిపెట్టుకుని వుండేవారు. అయితే, ఒక్కోసారి గురుదేవులు చెప్పింది నమ్మేవారుకారు. ప్రశాంతంగా వున్నప్పుడు మనస్సులోపలి సందేహాల పుట్ట పగిలేది. గురుదేవులు ఎంతో మంది స్వాములను కలవమనేవారు. మొదట్లో 'ఎందుకు నా సమయమంతా వృథా చేసుకోవాలి? వీళ్ళంతా పనికి మాలినవాళ్ళు. లోకంతో సంబంధం లేకుండా చెట్లకింద ఎందుకు కూర్చుంటారు?' అనుకునేవారు రామా. తర్వాత 'ముందు మన అనుమానాలనే విశ్లేషిద్దాం' అనుకున్నారు.

రామా పదిహేడేళ్ళ వయసులో గురుదేవులు చూపించిన ఒక మహనీయుని కలిశారు. గంగోత్రి దగ్గర గుహలో ఆయన నివాసం. ఆయన శరీరం చాలా బాగా వుంటుంది. అప్పట్లో రామాకు శరీరం అందంగా, బలంగా వుండడం అంటే ఇష్టం వుంది. ఎనభై అయిదు సంవత్సరాల వయస్సులో ఆ స్వామికి అంత విశాలమైన ఛాతీ, సన్నని నడుము, గట్టి కండరాలు ఎలా వున్నాయో అని ఆశ్చర్యపడ్డారాయన. ఆయనను చూడగానే రామా అడిగిన మొదటి ప్రశ్న – 'మీరేంతింటారు? అప్పట్లో ఆయనకు ఆహారంపట్లకూడా మోజు ఎక్కువ.'

'నీకు ఆకలిగా వుందా?' అడిగారాయన. 'అవునండీ!' చెప్పారు రామా. 'అయితే, ఆ గుహలో ఆ మూల కొన్ని వేర్లున్నాయి. ఒకటి తీసుకో. నిప్పుమీద కాల్చుకుని తిను.' చెప్పారాయన. రామా ఆయన చెప్పినట్లే చేశారు. అది పాయసంలాగా అద్భుతంగా వుంది. అయితే, ఎక్కువ తినలేకపోయారు. 'ఇంత మంచి తిండి వుంది కాబట్టి ఇక్కడ కొంతకాలం వుండవచ్చు' అనుకున్నారు. తర్వాత స్వామీజీ 'నీకు మాటల ద్వారా చెప్పను' అన్నారు. మూడురోజులపాటు సంభాషణ జరగలేదు. మూడవ రోజున 'ఈయన ఊరికే వుండే మనిషి. ఈయన దగ్గర సమయం వృథా కావడం తప్ప మరేమీ జరగదు' అనుకున్నారు. ఈ విధంగా ఆలోచించే సమయంలో ఆయన 'బాబూ! పుస్తక జ్ఞానం తెలుసుకునేందుకు కాదు నీవిక్కడికి వచ్చింది. ప్రత్యేకమైన అనుభవం కోసం వచ్చావు. రేపు నేను దేహత్యాగం చేయబోతున్నాను' అన్నారు.

ఎవరైనా ఎందుకు దేహత్యాగం చేస్తారో రామాకు అర్థం కాదు. 'ఎందుకంటీ అది ఆత్మహత్యతో సమానం కదా? మీవంటి ఋషులు ఆత్మహత్య చేసుకుంటారా?' అన్నారు. అప్పట్లో ఆయన ఆలోచనా విధానం ఆ విధంగా వుండింది. 'నేను ఆత్మహత్య చేసుకోవడం లేదు. పుస్తకానికి పాత అట్ట తీసి కొత్తది వేస్తే పుస్తకం పాడవదు కదా! దిండు గలీబు మార్చితే దిండు (తలగడ) పాడవదు కదా!' చెప్పారాయన.

రామాకు అది రుచించలేదు. 'మీకు మంచి శరీరం వుంది. అందులో సగం అందంవున్న శరీరం నాకు వున్నా బావుణ్ను. ఎందుకు దీనిని వదిలేస్తున్నారు? అది పాపంకదా?' అన్నారు రామా ఆయనకేదో బోధిస్తున్నట్లు. ఆయన మౌనంగా వింటున్నారు. ఇంతలో సహ శిష్యుడొకడు వచ్చాడు. ఆయనను చూడగానే రామా ఆశ్చర్యంగా, 'నీవు ఇక్కడికి ఎలా వచ్చావు. అప్పుడు నేను చూసినప్పుడు నీవు ఎంతో దూరంలో వున్నావు కదా?' అన్నారు.

అతను 'ఆయనను చిరాకు పెట్టకు. పనికిమాలిన ప్రశ్నలు అడుగుతావు. ఋషులను అర్థం చేసుకోవు. ఆయనను ప్రశాంతంగా దేహత్యాగం చేయనీ' అన్నాడు. కానీ రామా వినలేదు. 'అంత అందమైన శరీరం వదలడం ఎందుకు? ఇది యోగంకాదు – ఆత్మహత్య. పోలీసులకు చెప్పి అరెస్ట్ చేయిస్తాను. ఇది అన్యాయం.' వాదించారాయన. 'ఊరుకో. నీవు ఇంకా చాలా నేర్చుకోవాలి. బుద్ధిని వికసింపచేసుకో. అప్పుడు అర్థం అవుతుంది. జీవితంలో ఎన్నో అద్భుతాలు ఉన్నాయి' అన్నాడు సహచరుడు. స్వామీజీ మౌనంగా వున్నారు.

ఒక రోజు గడిచాక రామా 'మౌనం ద్వారా నేను నేర్చుకున్నదేమీలేదు. అంచేత ఇక్కడినుంచి వెళ్ళాలనుకుంటున్నాను' అన్నారు. 'ఆయన దేహత్యాగ ప్రక్రియ చూడవా?' అడిగాడు సహచరుడు. 'ఇది మరీ అసహ్యంగా వుంది. నేను మంచి డాక్టర్ చేతిలో ఆసుపత్రిలో చస్తాను కానీ, ఈ విధంగా గుహలో మాత్రం చావను. ఏమిటీ బుద్ధిహీనత?' అన్నారు రామా. 'నీకు అర్థం కాదులే. ఇక్కడ కూర్చో. వాదనలు నీలో నీవే చేసుకో. నన్ను మాత్రం ఇబ్బంది పెట్టకు' అన్నాడు సహచరుడు.

చివరికి స్వామీజీ అన్నారు – 'నిజంగా నేనేమీ చేయడం లేదు. మనం దేహత్యాగం చేసేటప్పుడు మనకు ముందుగానే తెలుస్తుంది. ప్రకృతికి మనం అడ్డుపడకూడదు. మరణం ప్రకృతికి సహాయపడుతుంది. చావు మనలను ఏమీ చేయదు. ఇక భయమెందుకు? అర్థమైందా?'

'నాకు చావాలని లేదు. అంచేత నాకు అర్థం చేసుకోవలసిన అవసరం లేదు.' మొండిగా అన్నారు రామా. 'నీ దృక్పథం మంచిది కాదు. చావంటే అర్థం చేసుకో. చావుకు భయపడకు. మనం ఎన్నింటికో భయపడుతాం. అది కాదు బతికే పద్ధతి. చావు మనల్ని బాధపెట్టదు. కేవలం మనల్ని మన శరీరం నుండి వేరుచేస్తుందంతే.' చెప్పారా స్వామీజీ. 'శరీరం లేకుండా వుండాలని నాకు లేదు.' స్థిరంగా అన్నారు రామా. 'చావు అనేది శరీరానికి ఒక అలవాటు. ఒక దేహంలో ఎవరూ శాశ్వతంగా వుండలేరు. మార్పు, మరణం, నాశనం సాధారణం. అది అర్థం చేసుకో. జీవితానికి అంటిపెట్టుకోవడం నుండి స్వేచ్ఛను పొందే పద్ధతి తెలిసింది కొందరికే. దానిని యోగం అంటారు. ఇది ఈనాడు అంతా చెప్పుకునే యోగం కాదు. ధ్యానంలో ఉన్నతమైన స్థితిని, సరైన పద్ధతిని తెలుసుకుంటే నీపై నీకు

అధికారం వస్తుంది. ప్రాణం, శ్వాసల ద్వారా మనస్సుకు, శరీరానికి అనుసంధానం కుదురుతుంది. శ్వాస ఆగిపోతే, ఆ అనుసంధానం పోతుంది. అదే మరణం. అయినా, నీవుంటావు' అన్నారు స్వామీజీ. 'శరీరం లేకుండా వుంటే ఎలా వుంటుంది?' రామా అడిగారు. 'షర్టులేకుండా వెళ్తే నీకెలా వుంటుంది? అదీ అంతే!' చెప్పారు స్వామీజీ.

మర్నాడు దేహత్యాగం అనగా ఆయన – 'ఉదయం ఐదుగంటలకు నేను దేహత్యాగం చేస్తాను. మీరు దానిని గంగలో కలపండి. చేయగలరా?' అని అడిగారు 'నేనే ఒంటరిగా చేయగలను' అన్నారు రామా. ఒకసారి తనబలం చూపేందుకు స్వామీజీని పైకెత్తారాయన. గంగ అక్కడికి కేవలం కొద్ది గజాల దూరంలోనే వుంది.

రాత్రంతా రామా ఆలోచనలు ఆయన గురించే! 'ఎందుకింత మంచి శరీరం వదిలేస్తాడీయన?' అని బాధపడ్డారు. తెల్లవారి మూడు గంటలకు లేచే అలవాటాయనకు. ఆ రాత్రి మాత్రం నిద్ర రాలేదు. అంతా కూర్చుని మాట్లాడుకున్నారు. 'నీకేం కావాలి చెప్పు. ఏం కోరినా ఇస్తాను' అన్నారు స్వామీజీ. 'మీరు చనిపోతున్నారు, నాకేం చేయగలరు?' అన్నారు రామా అనుమానంగా. 'బాబూ! నిజమైన గురువుకు చావు లేదు. మరణానంతరం కూడా శిష్యులకు మేలు చేయగలడాయన' అని సహ శిష్యునివైపు తిరిగి 'వీడు నీకు తలనొప్పిగా మారాడా?' అని అడిగారు. 'నిజమేననుకోండి. అయినా నేనేం చేయగలను?' అన్నాడతను, ఇలా మాట్లాడుతుండగా అయిదూ, అయిదున్నర గంటల మధ్య స్వామీజీ – 'ఇక ధ్యానంలో కూర్చుండి, అయిదు నిమిషాలలో నేను దేహత్యాగం చేస్తాను. దానికి కాలం చెల్లింది. అది నాకిక ఇవ్వగలగిందేమీలేదు. అందుకే వదిలేస్తాను' అన్నారు.

అయిదు నిమిషాల తర్వాత ఆయన ఓంకార ధ్యానం సాగించారు. తర్వాత మౌనం. రామా ఆయన నాడి, గుండె చప్పుడు పరిశీలించారు. 'కాసేపు సరదాకు అవి రెండూ ఆపి వుండవచ్చు. మళ్ళీ లేస్తారేమో!' అనుకున్నారు. కళ్ళు చూశారు. ఒంటి వెచ్చదనం చూశారు. సహశిష్యుడు, 'ఇకచాల్లే – సూర్యోదయానికి ముందు శరీరాన్ని నదిలో ముంచాలి' అన్నాడు. 'విచారించకు, నేనే చేస్తాను' అని రామా చెప్పారు. 'నేనూ సాయం చేస్తా' అన్నాడు సహచరుడు. ఇద్దరూ కలిసి స్వామీజీ శరీరాన్ని పైకి లేపారు. శరీరం లేవలేదు. చెట్టుకొమ్మతో పైకిలేపుదామని గంటసేపు ప్రయత్నించినా ఒక అంగుళం కూడా కదల్లేదు. తర్వాత 'ఇప్పుడు ఆయనను మోసుకుపోదాం' అని వినిపించింది. అక్కడెవరూ లేరు! 'బహుశా నా భ్రమ అయి వుంటుంది.' రామా అనుకున్నారు 'నీకేమైనా వినిపించిందా?' సహచరుణ్ణి అడిగారు. 'వినిపించింది.' చెప్పాడతను. 'భ్రమ ఏమో! సరే పద' అన్నారు రామా.

హఠాత్తుగా స్వామీజీ శరీరం పైకి లేచి గంగవైపు తేలియాడుతూ వెళ్ళి గంగలో మునిగిపోయింది. దానిని చూసి రామా తట్టుకోలేకపోయారు. తర్వాత కూడా చాలాకాలం దానినే తలచుకున్నారు. ఎవరు మహిమలు చేసినా, 'అందులో ఏదో ట్రిక్కు ఉంది' అనుకునే ఆయనకు ఆనాడు నమ్మక తప్పలేదు. రామా ఆశ్రమానికి తిరిగి రాగానే అక్కడ చర్చ జరుగుతూంది. 'దేవుడు అందరినీ సృష్టించిన మాట నిజమైతే ఈ బాధలెందుకు?' అనేది చర్చనీయమైన అంశం.

'మన ఉనికిలో భౌతిక విశ్వం ఒక అంశం మాత్రమే. ఇతర అంశాలను తెలుసుకునే సామర్థ్యం మనకుంది. అయితే, ఈ సామర్థ్యాన్ని మనం సవ్యంగా వాడుకోవడం లేదు. భౌతిక అంశంపైనే మన దృష్టి వుంది. సంపూర్తిగా ఎరుగక పోవడంవల్లనే

బాధపడుతున్నాడు' అని తెలుసుకోగానే రామాలోని అనిశ్చితత్వం తొలగిపోయింది.

'మామూలు వ్యక్తుల జీవితాలు తెలుసుకోవడం సులభం. ఋషుల జీవన సరళిని అర్థం చేసుకోవడం కష్టం. అయితే వారిదే నిజమైన జీవితం. పరమాత్ముని తెలుసుకునే జీవితం. అది లేకుంటే అన్నీ వృధాయే. మామూలు మనిషి కొన్నిటిని అద్భుతాలనీ, మహిమలనీ అనుకుంటాడు. అజ్ఞానపు తెర తీస్తే అది స్పష్టంగా అర్థమవుతుంది. మరణ ప్రక్రియ యోగ విజ్ఞానంలో విపులంగా వుంది. జనన మరణ రహస్యాలు తెలుసుకునే భాగ్యశీలురు కొద్దిమందే.'

మనకు తెలిసిన జీవితం జనన మరణాలనే రెండు బిందువులను కలిపే సరళరేఖ. ఈ రెండు బిందువులకు అవల ఎంతో వుంది. ఒక అనంతమైన పెద్ద వాక్యంలో మధ్య వున్నదే మన జీవితం. శరీర త్యాగానికి నిర్దిష్టమైన మార్గాలు వున్నాయని యోగశాస్త్రాలు చెబుతాయి. ప్రాణశక్తి వెళ్ళిపోయే పదకొండు ద్వారాల గురించి యోగులకు తెలుసు. యోగులు సాధారణంగా బ్రహ్మరంధ్రం ద్వారా ప్రాణ త్యాగం చేస్తారు. అటువంటి వారికి మరణానంతరం జీవితం కూడా బాగా తెలుస్తుంది అని అయన తెలుసుకున్నారు.

## 13.2 మరణంపట్ల దృక్పథాలు

'మన జీవితానికి మనమే నిర్మాతలం. మన తత్వాన్ని మనమే తయారు చేసుకుంటాము. మన దృక్పథాలను మనమే ఏర్పాటు చేసుకుంటాము. సరైన దృక్పథం లేకుంటే మొత్తం కట్టడం కదలిపోతుంది. ఈ విషయం గమనించిన నాడు లోపలికి చూడడం మొదలై, పరివర్తన జరిగి, చేతలోని పలుస్థాయిలు అర్థమౌతాయి. అప్పుడు శక్తి మనలోనే వుందని తెలుస్తుంది. కోరిక నెరవేర్చే బలం మనలోనే వుంది. ఋషులు దీనిని రుజువు చేశారు. నేటి మనిషి అర్థం చేసుకోడు. అతను ఇంకా బాహ్యప్రపంచంలో సంతోషం కోసం అన్వేషిస్తాడు.'

చిన్నతనంలో రామా కూడా అలాగే అనుకున్నారు. ఒకరోజు మరణశయ్యపై వున్న ధనికుని చూచి రమ్మని గురుదేవులు పంపారు. రామా వెళ్ళగానే 'మీ అశీస్సులు కావాలి' అన్నాడతను విచారంగా, కన్నీళ్ళతో. 'ఎందుకలా పిల్లవాడిలాగా నిస్పృహయంగా ఏడుస్తావు?' రామా అడిగారు. 'పిల్లవాడుగా వున్నా బావుండేది. ఇప్పుడు నేను అతి పేదవాణ్ని. అతి బలహీనుణ్ని అని తెలిసింది. నా సుఖాలు, నా డబ్బులు సాయం చేయడంలేదు. అవన్నీ వట్టివే. వృథా' అన్నాడతను.

అతని లోపలి దరిద్రాన్ని గుర్తించారు రామా. ఎంతో మంది కవులు, రచయితలు, తాత్త్వికులు, రాజకీయ నాయకులు మరణశయ్యపై దయనీయంగా వుండడం అయనకు తెలుసు. ప్రాపంచిక విషయాలకు అతుక్కుని వుండడమే వారు చేసిన పొరపాటు. లోపలి అమరత్వం తెలిసినవారికి ఈ వ్యామోహం వుండదు. వారు సవ్యమైన భావాలతో వుంటారు.

చైతన్య మహా ప్రభువు ఉన్న గదిలో అయన మరణం తర్వాత కూడా మంత్రాలు వినిపించేవి. కాన్పూరులో ఒక ఇంట్లో రామాకు అదే అనుభవం కలిగింది. ఒక డాక్టర్ కుటుంబంలో తల్లికి రామా దీక్ష యిచ్చారు. ఆమె మరణానికి ఆరు నెలల ముందు నుంచీ దైవధ్యానం చేస్తూ వుండేది. అరు నెలల తర్వాత అమె జబ్బు

పడింది. మరణం అనివార్యం అయింది. డా॥ ఎ.యస్. టాండన్ ఆమె పెద్దకొడుకు. ఆయనకు తల్లి పట్ల అనుబంధం ఎక్కువ. తల్లి చెంతనే ఉండాలనుకున్నాడు. 'నాపై బంధం పెంచుకోకు నాయనా! నా పక్కన కూర్చోవద్దు. నేను నీపట్ల నా విధులు నెరవేర్చాను. ఈ ప్రయాణంతో నేను ఒంటరిగా వెళ్ళాల్సిందే. నీ బంధం నాకేవిధంగానూ సహాయపడదు' అన్నదామె.

సాధారణంగా మరణించేటప్పుడు ఒంటరితనం, భయం వుంటుంది. భద్రతా రాహిత్యంపెరిగి, వారు పిల్లలపై, ఆస్తిపై మమకారం పెంచుకుంటారు. ఆమె చాలా ప్రశాంతంగా దైవధ్యానం చేసుకుంటూంది. 'నా కెంతో ఆనందంగా వుంది. ఈ లోకంలో నీ బంధం కూడా బంధించలేదు నన్ను' అందామే. 'అమ్మా! నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను. ఇంకా నన్ను ప్రేమించవా? నీకేమైందమ్మా?' ఏడ్చాడతను. 'జరగవలసింది జరిగింది. నేను స్వేచ్ఛగా, ఆనందంగా వున్నాను. విశ్వసాగరంలో నేనొక ఆనంద తరంగాన్ని. అన్ని భయాందోళనలకూ దూరంగా వున్నాను. నీవింకా నా పార్థివ శరీరంపై వ్యామోహంతో వున్నావు. కానీ, ఇది కేవలం ఒక గుల్లవంటిది. దీనిని ఇంకా నీవు అమ్మా అంటున్నావా?' అంది.

అప్పుడు రామా అక్కడే వున్నారు. ఆమె రామాను తప్ప గదిలోకి వేరెవరినీ అనుమతించలేదు. మరణానికి అయిదు నిమిషాల ముందు ఆమె నవ్వుతూ రామా చెవిలో చెప్పింది – 'నా మతి చెదిరిందనుకుంటారు వీరు. నిజానికి నేను ఎంత పొంది వున్నానో వారికేం తెలుసు?' తర్వాత అందరినీ పిలిచి, చేయెత్తి దీవించి దేహత్యాగం చేసింది.

మరణానంతరం కూడా ఆమె మంత్రధ్వని ఆ గదిలో వినిపించింది. గదిలోకి వచ్చినవారంతా దానిని అనుభవించారు. ఇంకా ఆ మంత్ర ధ్వని వుందని అంటే రామా మళ్ళీ వెళ్లి చూశారు. నిజం అన్నారు.

'మంత్రాన్ని మననం చేస్తే అది అచేతనంగా వుంది. మరణ సమయంలో బుద్ధి క్షీణిస్తుంది. వ్యామోహం ఎక్కువౌతుంది. జీవితం భారంగా అనిపిస్తుంది. అటువంటప్పుడు అంతశ్చేతనలో దాగివున్న మంత్రశక్తి సాయపడుతుంది. అజ్ఞానికి ఈ పరిస్థితి భయంకరమైనది. మంత్రాన్ని గుర్తుంచుకుంటే హాయిగా వుంటుంది. పరిస్థితిని ఎదుర్కోనవచ్చు. మరణం బాధాకరంకాదు. చావు భయం మరింత భయంకరమైనది. మంత్రం చీకటిని తొలగిస్తుంది. వెలుగు దారిని చూపుతుంది. మంత్రం మీద నమ్మకం అనే పద్ధతి ప్రపంచంలో చాలా సంప్రదాయాలలో వుంది. శుద్ధమైన, సుశిక్షితమైన బుద్ధి, మంత్రం సాయంతో సంధికాలంలో చీకటిని పోగొట్టుకోవచ్చు. అవసరమైనప్పుడు ఇహపరాలలో సాయపడే అరుదైన నేస్తం మంత్రం. చావు భయాన్ని పోగొట్టే ఆధ్యాత్మిక మార్గమే మంత్రం.'

యోగులకు దేహం వస్త్రం వంటిది. పనికిమాలిన వస్త్రాన్ని వదిలేసినట్లు వారు శరీర త్యాగం చేస్తారు. అలహాబాద్ కుంభమేలాలలో అటువంటి అరుదైన, సంఘటన రామా అనుభవానికి వచ్చింది. ప్రతి పన్నెండేళ్ళకు ఒకసారి జరిగే కుంభమేళాలో సన్యాసులు, యోగులు కలుస్తారు. తమ అనుభవాలు పంచుకుంటారు.

అటువంటి సందర్భంలో ఒకసారి గంగాతీరంలోని ఇంట్లో వున్నారు రామా. ఒకరోజు ఉదయం మూడు గంటలకు వినయ మహారాజా అనే స్వామి దేహత్యాగం

చేస్తారని తెలిసింది. ఆ స్వామి రామా గురుదేవుల దగ్గరే చదువు కున్నారు. వెంటనే రామా ఆయనను కలిశారు. అరగంటసేపు ఆయన యోగంలో ఉన్నత సాధనల గురించి చెప్పి, సరిగ్గా నాలుగున్నర గంటల సమయంలో 'దేవుడు మిమ్మల్ని చల్లగా చూస్తాడు. మరోలోకంలో కలుద్దాం అన్నారు. తర్వాత ఆయన మౌనంగా వున్నారు. కళ్ళు మూసుకుని నిశ్చలంగా వున్నారు. హఠాత్తుగా ఆయన పుర్రె నుండి 'టిక్' అనే శబ్దం వచ్చింది. బ్రహ్మరంధ్రం ద్వారా ఆయన దేహత్యాగం చేశారు. తర్వాత వారి దేహాన్ని గంగలో కలిపారు. అటువంటి సంఘటనలు రామా మరెన్నో చూశారు.'

'మనిషికి సంఘంలో ఎలా వుండాలో, ఏం తినాలో, ఏం మాట్లాడాలో, ఏ బట్టలు వేసుకోవాలో తెలుసు. సుఖప్రసవం చేయించడం తెలుసు. అయితే స్వతంత్రంగా, ఆనందంగా దేహత్యాగం చేయడం గురించి మనిషి నేర్చుకోలేదు. సాంకేతికంగా ఎంతో ఎదిగినా జనన మరణాల అద్భుతాల గురించి, తనలోని వనరుల గురించి మనషికి ఇంకా తెలియదు. మరణం శరీరానికి తప్పనిసరి మార్పు. చనిపోయే వ్యక్తిని ఆ ఘటనకు సిద్ధం చేయాలి. చావుభయమే బాధలకు మూలం. సంఘంలో గెలుపు సాధించేందుకు నేర్పిస్తారు కానీ చావు భయంనుండి స్వేచ్ఛ పొందే మార్గం చెప్పరు. అది నేర్చుకుంటే సుఖంగా మరణించవచ్చు.' అని రామాకు తెలిసింది.

## 13.3 శరీర త్యాగం పద్ధతులు

ఒకసారి వర్షాకాలంలో రామా ఇద్దరు మిత్రులతో గంగోత్రి నుండి బదరీనాథ్‌కు వెళ్ళారు. అది ఇరుకుదారి. కొద్దిమంది యోగులకు, ఋషులకు మాత్రమే తెలిసిన దారి. నాలుగు రోజుల ప్రయాణం తర్వాత వారు గమ్యం చేరారు. పన్నెండు వేల అడుగుల ఎత్తున మంచుకప్పిన పర్వతాలు ఎంతో అందంగా వున్నాయి. గంగోత్రికి తొమ్మిది మైళ్ళ దూరంలో రాత్రి బస చేశారు. అక్కడి నుండి గంగకు అవతల భోజ భాష అనే ప్రాంతం వుంది. భోజపత్రాలు గ్రంధరచనకు పనికొస్తాయి. మర్నాడు ఉదయం గంగకు మూలం అయిన గోముఖానికి వెళ్ళారు దారిలో మద్రాస్ స్వామిని కలిశారు. ఆయన హిమాలయాలలోని తపోధనం స్వామికి శిష్యులు. తమిళుడు అయినా హిందీలో మాట్లాడారు. నలుగురూ కలిసి గోముఖం చేరారు. అక్కడ హంసస్వామి కలిశాడు. ఆపైన ఏ యోగీ వుండడు. హంసస్వామి అంతకు ముందు నౌకాదళంలో పనిచేసేవాడు. జీవితంపై విరక్తి పుట్టి హిమాలయాలు చేరాడు. మంచి మనిషిగా, పెద్దమనిషిగా పేరు తెచ్చుకున్నాడు. ఆయనకు ఈ సాహస యాత్ర ఇష్టం లేదు. అయినా మర్నాడు రామా బృందం సెలవు తీసుకుంది. తర్వాత పదహారువేల అడుగుల ఎత్తున ఒక రోజు, పద్దెనిమిది వేల అడుగుల ఎత్తున మరొకరోజు వారున్నారు. ఆపైన పరికరాలు లేకుండా ఊపిరి తీసుకోవడం కష్టమైంది. మూడు రోజుల పాటు అంతరిక్షంలో నడుస్తున్నట్లు భావించారు. అక్కడి నుంచి నీలాకాశం, నక్షత్రాలు చక్కగా కనిపించాయి.

రామా బృందం గుడారం చిన్నది. అర్ధరాత్రి మద్రాసు స్వామి అక్కడ దేహత్యాగం చేస్తాననన్నాడు. మంచులో ఎవరికైనా గడ్డ కడుతుంది. సమాధిలో ఒళ్ళు గట్టకట్టేట్లు చేయడం హిమ సమాధి అంటారు. రామా వాళ్ళకు తమిళం

రాదు. అంచేత వారు అతన్ని వారించలేకపోయారు. చేసేది లేక ఆయనను వదిలి వెళ్ళారు. భారతంలో యుధిష్ఠిరుడు కూడా అలాగే చేశాడు.

నీటిలో మునగడం ద్వారా దేహత్యాగం చేసే పద్ధతిని జల సమాధి అంటారు. ఆసనంలో కూర్చుని బ్రహ్మరంధ్రం భేదనం చేయడాన్ని స్థల సమాధి అంటారు. యోగులకు బాధ వుండదు. అది పాశ్చాత్య దేశాలలో అసాధారణం కానీ, హిమాలయాలలో కాదు. అది ఆత్మహత్య కాదు. దేహం ఆత్మజ్ఞానానికి పనికిరాని పరికరంగా మారినప్పుడు యోగులకు దేహత్యాగం తప్పదు. పరిణతి చెందిన యోగులు మామూలు పద్ధతిలో దేహత్యాగం చేయరు.

మరొక అరుదైన పద్ధతిలో యోగాగ్నితో శరీరాన్ని క్షణంలో దగ్ధం చేస్తారు. ఈ వైనం కఠోపనిషత్తులో వుంది 'మహాకళానిధి' వంటి శాస్త్రగ్రంథాలు ఈ పద్ధతిని క్రమబద్ధంగా వివరిస్తాయి. హిమాలయ యోగుల దృష్టిలో చావు పుట్టుకలు రెండు జీవిత ఘటనలు. ప్రసవం గురించి తెలుసుకున్నట్లే ఎవరైనా దీనిని గురించి కుడా నేర్చుకోవచ్చు – అంటారు స్వామీ రామా.

## 13.4 శవంతో సహజీవనం

అస్సామ్‌లో ఒక బ్రిటిష్ సైనికాధికారి గురుదేవులను ఆరాధించేవాడు. గురుదేవుల సలహాతో ధ్యానం చేశాడు. 1938 లో రిషీకేశ్‌కు నలభై మైళ్ళ దూరంలోని రూర్కీలో ఆయన గురుదేవులను కలిశాడు. కొందరు భారతీయ అధికారులు గురుదేవుల గురించి అతనికి చెప్పారు. ఆయన రామాను అస్సాం రమ్మని కోరారు.

రామా తన పదహారవ ఏట నాగా కొండలలోని బుఢేబాబా (బుఢే అంటే వృద్ధుడని అర్థం)ను కలిశారు. బుఢేబాబా గుప్త కాశీ గుహలో గురుదేవులను కలిశారు. సన్నగా, వెదురుగడలా, తెల్లని దుస్తులతో, గడ్డంతో వున్న ఆయన తరచుగా గురుదేవులను కలిసేవాడు. పరకాయ ప్రవేశం గురించి ఆయన మాట్లాడుతూ వుంటే రామాకు అర్థమయ్యేది కాదు.

పది రోజుల తర్వాత ఆయనతో అస్సామ్ వెళ్ళమన్నారు గురుదేవులు. రైల్లో అస్సాం వెళ్ళారు. అక్కడ సైనికాధికారిని కలిశారు. ఆయన ప్రాణాయామం, ధ్యానం తక్కినవారికి అర్థం కాలేదు. ఒక ఇండియన్ మేజర్ ఆయన గురించి చెప్పాడు. 'నన్ను కుర్చీ తెమ్మని అందులో కూర్చుంటాడు. తర్వాత కుర్చీ తీయమంటాడు. కుర్చీ తీసినా అలాగే వుంటాడు!' అతనితో వున్న ఇంకో మేజర్ 'యోగం నేర్చుకున్నాక ఆయన వ్యక్తిత్వం చాలా మారింది. కోపం రాదు. మద్యం మానేశాడు. చాలా దయగా వుంటాడు అన్నాడు. రామా అక్కడ వుండగా బుఢేబాబా ఒక కమాండర్‌తో తొమ్మిది రోజులలో మరో దేహంలో చేరబోతున్నట్లు చెప్పగా విన్నారు.

కొన్నాళ్ళ తర్వాత బుఢేబాబా, రామా మిలిటరీ కాంప్ వదిలి నాగా కొండలకు వెళ్ళారు. అక్కడ దోమలు, పాములు, క్రూరమృగాలు ఎక్కువ. అందువల్ల అక్కడ తక్కువ మంది యోగులుంటారు. ఆ ప్రదేశాలలో 'యోగి గురుతాంత్రిక గురు, వేదాంత గురు' మొదలైన పుస్తకాలు రాసిన కీ।శే స్వామీ నిగమానంద గుహలో వున్నారు. రామా బుఢేబాబాతో 'నా కండలు చూడండి. నాకెంత బలం వుందో?'

అన్నారు. 'త్వరలో నీ బలానికి పరీక్ష జరుగుతుంది' అన్నారు బుఢేబాబా. 'ప్రశ్నలు వద్దు. నీ మంత్రంపై ధ్యాసవుంచు' అన్నారాయన. రామా ఏదో అడగబోతూ వుండగా, అయనకు సంస్కృతం, హిందీ, పాలీ, టిబెటన్, చైనీస్, ఇంగ్లీష్ మొదలైన భాషలు వచ్చు. రామాతో ఒక్కోసారి 'షటప్' (నోర్మూయ్యి) అనేవారు. రామాకు మౌనం ఇష్టమే అయినా, అద్భుతాల గురించి అయన దగ్గర్నుంచి ఎక్కువ తెలుసుకోవాలని ప్రశ్నించేవారు. 'గుహను వదిలే సమయం వచ్చినప్పుడు మరో దేహం మీ కెందుకు?' అన్నారాయన బాబాతో. 'నాకు తొంభై ఏళ్ళు. సమాధిలో వుండేందుకు ఈ దేహం అనుకూలంగా లేదు. పైగా, రేపు ఒక యువకుని శవం కనిపిస్తుంది. ఆ యువకుని ఒక పాము కరుస్తుంది. ఇక్కడికి పదమూడు మైళ్ళ దూరంలో నదిలో ఆ శవం పారేస్తారు' అన్నారు బాబా. రామాకు నోట మాట రాలేదు. ఉదయం గుహ వదిలి సాయం కాలానికి గమ్యం చేరుదామన్నారు. అయితే, ఉదయం గుహను వదల్లేదు. రాత్రి ఒక ఏనుగు గుహ బయట గదిలో తొండం దూర్చింది. ఆ మూలనున్న తేలు ఆ ఏనుగు తొండంపై కుట్టింది. ఆ స్థానంలో ఏనుగు అలాగే మరణించింది. దాని ముందు కాళ్ళు, తొండం, తల గుహ లోపల వున్నాయి. ఆ తేలును తీసుకుని 'దుష్టుడా! ఎంత ఘోరం చేశావో చూడు' అన్నారు బాబా. 'అలా చేయకండి అది కరుస్తుంది' భయంతో అరిచారు రామా.

'దాని, కాయన, 'అంత ధైర్యమా దానికి?' అన్నారు. అది అయిదంగుళాల తేలు. దాన్ని చెప్పుతో చంపుతానన్నారు రామా. 'ఏ ప్రాణినీ చంపే అధికారం ఎవరికీ లేదు. అవి వాటి బాకీలు తీర్చుకున్నాయి. కర్మ గురించి తెలిస్తే అది నీకు అర్థమౌతుంది. అన్నారాయన. అంతకన్నా ఎక్కువ చెప్పలేదాయన. వారు ఎక్కువ దూరం వెళ్ళాల్సి వుంది. అదీ వారి ఇబ్బంది. రెండు గంటల పాటు కష్టపడి ఏనుగు శవాన్ని కొంత నెట్టి బయటకు పాకే వీలు కల్పించారు రామా. గుహ పదమూడు మైళ్ళ ఉత్తరాన నది కన్పించింది. రాత్రి బస అక్కడే. ఉదయం నదిలో రామా స్నానం చేశారు. నాలుగున్నరకు ధ్యానంలో కూర్చున్నారు. కళ్ళు తెరిచేసరికి బాబా లేరు రోజంతా వెదికినా ఆయన కనపడలేదు. అందువల్ల ఇక హిమాలయాలకు వెళ్దాం అనుకున్నారు రామా.

అంతా అద్భుతంగా, నిష్ఫలంగా అనిపించిందాయనకు. తిరుగు ప్రయాణం దారి కూడా కఠినమైనది. ముళ్ల పొదలూ అవీ ఎక్కువ. అస్సాం చేరగానే బ్రిటిష్ కమాండర్ 'బుఢేబాబా అద్భుతం సాధించారు. అయన కొత్త శరీరంలో చేరారు' అన్నాడు రామాతో. రామాకేమీ అర్థం కాలేదు. మర్నాడు ఉదయమే అయన హిమాలయ గుహలకు వెళ్ళారు. అక్కడ గురుదేవులు – 'బుఢేబాబా వచ్చారు. రాత్రి ఇక్కడే గడిపారు. నీ గురించి అడిగారు' అన్నారు. కొన్నాళ్ళ తర్వాత ఒక యువ సాధువు వచ్చి రామాతో 'క్షమించు. నా దేహం మార్చేటప్పుడు నీవు లేకపోవడం నాకు చాలా విచారంగా వుంది' అంటూ అస్సాం యాత్రా వివరాలు చెప్పాడు. అయన్ను రామా క్షుణ్ణంగా పరీక్షించారు. అదే తెలివి వగైరా. కొత్త శరీరంలో వున్న అయన బుఢేబాబానే. బుఢేబాబా మాదిరే అయనకూడా నిటారుగా, వెదురుగడలా నడిచారు. తర్వాత గురుదేవులు అయనకు మరో పేరు పెట్టారు.

'పేరు దేహానికే, ఆత్మకు కాదు' అన్నారాయన, బుఢేబాబా 'ఆనందబాబా'గా మారారు. హిమాలయాలలో తిరుగుతూ వున్నారాయన. తర్వాత చాలా కాలం

అయనను చూసేవారు. అయనను చూసినప్పుడల్లా పాత జ్ఞాపకాలు గుర్తుకు వచ్చి, కొత్త శరీరంతో సర్దుకోవడం కష్టంగా వుండేది.

'ఇన్ని నిదర్శనాలవల్ల పరకాయ ప్రవేశం యోగికి అసాధ్యం కాదు' అని తెలిసింది రామాకు. 'సామాన్యులకు అది అభూతకల్పనగా వుండవచ్చు. కాని ఈ యోగులకు మాత్రమే పద్ధతి తెలుస్తుంది' అని అయన గ్రహించారు. ఈ విధంగా స్వామీ రామా మహర్షుల నుండి ఎంతో నేర్చుకుని తమ జీవితం పండించుకున్నారు. భవిష్యత్తును చూడలేకపోయినా వారి గొంతు వినిపిస్తూనే వుంటుంది.

## 13.5 గురుదేవుల దేహ త్యాగం

అది 1945వ సంవత్సరంలో ఒక రోజు గురుదేవులు దేహత్యాగం చేస్తానన్నారు. 'బుద్ధిహీనుడైన శిష్యుడిని అలాగే వదిలివెళ్ళే గురుదేవులు పాపం చేసినట్లే. అతను నరకానికి పోతాడని శాస్త్రాల్లో వుంది' అని వాదించారు రామా. 'సరే. నీవింకా బుద్ధిహీనుడివి. అజ్ఞానివి. కాబట్టి అప్పుడే దేహత్యాగం చేయనులే' అన్నారు గురుదేవులు.

తర్వాత 1954లో జర్మనీ వెళ్ళేముందు ఒకరోజు గంగా స్నానం చేసే స్వామీ రామాకు – 'నేను చేసింది సరికాదేమో! అయనను ఇక్కడే వుండి పొమ్మని బలవంతం చేయడం సమంజసం కాదు. ఇప్పటికే నాకాయనెంతో ఇచ్చారు' అనిపించింది. తర్వాత గురుదేవులను కలిసినప్పుడు రామా తన ఆలోచనలు అయనతో చెప్పలేదు. అయినా, గురుదేవులు 'అందరినీ సాయంకాలం అయిదున్నరకు రమ్మను. ఆఖరు సారిగా చెప్పేవి చెప్పాలి' అన్నారు. అప్పుడు వారు వసుధార బదరీనాథ్ మధ్య పదకొండువేల ఆరువందల అడుగల ఎత్తున వున్నారు.

గురువుల నిర్యాణం చూడడం అనేది ఒక అనుభవం. 'ఎందుకు దేహ త్యాగం చేస్తున్నారు?' అని అడిగారు రామా. 'నీవు స్నానం చేస్తున్నప్పుడు నీకు వచ్చిన ఆలోచనలు గ్రహించాను. ఇప్పుడు నీవు కొంత నేర్చుకున్నావు. దృఢంగా వున్నావు. నీ కాళ్ళపై నీవు నిలబడగలవు. ఇంకేం కావాలి? నా యాత్రలో నేను స్వేచ్ఛగా వెళ్తాను' అన్నారు గురుదేవులు. పర్వతశిఖరాగ్రంపై అయిదుగురున్నారు. అయన అందరి మధ్యలో వున్నారు. 'ఎవరికైనా ఏమైనా చెప్పాలా?' అడిగారాయన. రామాకు దుఃఖం ఆగలేదు. అయినా, నిగ్రహించుకున్నారు. 'నీ కేమైనా కావాలా?' అన్నారు గురుదేవులు. 'ఎప్పుడు బాధలో వున్నా, నాకు చేతకాని పరిస్థితి ఏర్పడినా, కావాలనుకున్నప్పుడు మీరు నాతో వుండాలి.'

'తథాస్తు!'

తర్వాత ఓంకారం జపించి గురుదేవులు విగతజీవులైనారు. అందరూ ఏడ్చారు. అయన శరీరాన్ని దహనం చేయాలో, పూడ్చాలో అర్థం కాలేదు. నిర్ణయం రామాదే అయింది. గుహకు దేహాన్ని మోసుకుపోదామా అంటే అది అరవై మూడు మైళ్ళ దూరంలో వుంది. చాలాకాలం పడ్తుంది. అయినా, బయలుదేరారు. రాత్రిళ్ళు ప్రయాణం కష్టం. దగ్గరున్న చిన్న గుహలో ఆగారు. ఉదయం మళ్ళీ శరీరాన్ని మోయడం. రెండు రాత్రులు గడిచాయి. తర్వాత గొయ్యి తవ్వి, అందులో

గురుదేవుల శరీరాన్ని వుంచారు. దానిపై మట్టిపోయాలంటే ఒక్కసారి అందరి చేతులూ చచ్చుపడ్డట్లు అయింది. రామాకు శరీరం బయటకు దుమికినట్లైంది.

అక్కడ అయిదడుగుల దూరంలో ఒక చెట్టుంది. అక్కడినుంచి గురుదేవులు 'నేనిక్కడున్నాను. నిద్రలేవండి బాధపడకండి. శరీరంతో నన్ను మళ్ళీ కోరుకుంటున్నారా? లేక శరీరం లేకుండానే సాయం చేయమంటారా?' అని అడిగారు. 'శరీరంతోనే మీరు కావాలి' అన్నారు రామా. వెంటనే ఆయన శరీరం ఝల్లుమంది. అందరికీ అవయవాలు కదిలాయి. గురువులు గోతినుండి బయటకు దూకారు. 'ఇదేమీ బాగాలేదు. ఇంకా నేను మీకు శరీరంతో కావాలా? మీరు రూపాన్నే ఆరాధిస్తారా? ఇంకా ముందుకు వెళ్ళరా? మీకు నా శరీరంపై వ్యామోహం వుండడం నాకో అంతరాయం. సరే. ఇక మీకు ఆ వ్యామోహం లేకుండా చేస్తాను' అన్నారాయన. ఆయన చాలాసేపు శరీరానికి, ఆత్మకు మధ్యవున్న సంబంధం గురించి చాలా సేపు చెప్పారు. చాలాకాలం ఆయన మౌనంలో వున్నారు. ఒకసారి ఆయన ఇలా అన్నారు:

'మూడు రకాల ప్రాణాలున్నాయి : 1. పరమప్రాణి విశ్వపరమాత్మ, 2. తాము కోరుకున్నప్పుడు పుట్టి, మరణించే యోగులు. దాదాపు అమరులు, 3. మామూలు ప్రజలు. వీరికి చావుపుట్టుకలపై అధికారం లేదు. చావంటే భయపడ్తారు. అటువంటి అజ్ఞానులు బాధపడ్తారు.'

ఋషి, యోగి దేనికి భయపడరు. ఇదే హిమాలయ యోగుల తొలి సందేశం. ఆ నిర్భయత్వమే ఆత్మజ్ఞానానికి తొలిమెట్టు. ఋషులు అమరులు. పరకాయ ప్రవేశం తెలిసినవారు. యోగులకు అది అసాధ్యం కాదు. జీవితకాలం పెంచుకునే మార్గాలు మూడు : 1. యోగశక్తులతో, క్రమబద్ధమైన జీవితంతో ఎక్కువ కాలం బతకవచ్చు. 2. పరకాయ ప్రవేశంతో గత ఆనందాలను అనుభవిస్తూ ఉండవచ్చు. 3. ఆత్మజ్ఞానం అంటే స్వేచ్ఛ. శరీరం అంటే బట్టను అంటి పెట్టుకోనక్కర్లేదు.

ఋషులు జీవితంలో ప్రగాఢమైన సత్యాలను అన్వేషించారు. ఇవి సర్వ కాలీనమైనవి విశ్వజనీనమైనవి. ఇందుకు వర్ణభేదాలు లేవు. జాతిభేదాలు లేవు. జీవితం దేహంద్వారా ప్రకటితమవుతుంది. కోరిక లోపలి ఆత్మ అయితే, రూపం బయటిది. విషయం లేకుండా రూపంలేదు. అది నిర్జీవమే. లయబద్ధమైన ప్రకంపనలు లేకుంటే కోరిక, రూపం వృథా. అంచేత కోరికలు దేహాన్ని, రూపాలు కోరికలను అన్వేషిస్తాయి.

కేవలం దేహాన్ని చూసేవారు ఎక్కువ. లోపలి జీవితాన్ని అర్థం చేసుకోక రేఖాచిత్రమే ఆఖరు అనుకుంటారు. లోనికి వెళ్ళరు. వారి ఆత్మజ్ఞానం అవాస్తవం. విజ్ఞానం అసంపూర్ణం. అంతర్గతమైన జీవన లయను తెలుసుకునేందుకు కోరికలకు దూరంగా వెళ్ళాలి. అంతర్గత సున్నితత్వం, ఏకాగ్రత పెరగాలి. జీవితం లయబద్ధమైనది. ఈ లయగతులు ఎరిగినవాడు ఎంత కాలం కావాలంటే అంతకాలం జీవిస్తాడు.'

* * *

## అధ్యాయం పద్నాలుగు

# పడమటి యాత్ర

'తూర్పు తూర్పే. పడమర పడమరే అనేది పాతకాలం మాట. నేటి మనిషి చంద్రుని చేరాడు. పాశ్చాత్యం సాంకేతికంగా, ప్రాచ్యం ఆధ్యాత్మికంగా ఎదిగాయి. రెండింటికీమధ్య అవగాహన అనే వారధిని ఎందుకు నిర్మించకూడదు? పడమటి దేశాలు తూర్పు దేశాలతో పంచుకోవలసింది ఎంతో ఉందనేది నిస్సందేహం. అలాగే తూర్పు కూడా పడమరకు ఇవ్వాలి. తూర్పు అనే పరిమళం లేకుండా పడమర అనే పువ్వు పనికిరానిది.'

## 14.1 డాక్టర్‌గారికి దివ్య దర్శనం

జర్మనీలోని చిన్నపట్టణంలో ఒక మానసిక వైద్యుడు నవీన వైద్యం నమ్మేవాడు కాదు. ఆధ్యాత్మిక విద్యకోసం పరితపించేవాడు. జనం ఆయన్ను 'పిచ్చి డాక్టరు' అనేవారు. 1955లో ఆయనకు గురుదేవులు పదే పదే కనిపించి ఇండియాకు రమ్మన్నట్లు అనిపించింది. దాన్తో ఆయన ఫ్రాంక్‌ఫర్ట్ వెళ్ళి ఇండియాకు విమానం టికెట్ కొన్నాడు. అయితే, విమానం కోసం చూస్తూ నిద్రపోయాడు. విమానం తప్పింది.

కొన్నాళ్ళకు గురుదేవులు రామాను జర్మనీ వెళ్ళి పాశ్చాత్య మనోవిజ్ఞానం, వేదాంతం నేర్చుకుని రమ్మనారు. బొంబాయి వ్యాపారి ఒకతను రామాకు ఫ్రాంక్‌ఫర్డ్ వరకు టికెట్ కొనిచ్చాడు. తెలిసినవారికి ఉత్తరాలు రాసిచ్చాడు. రామా గురుదేవుల సలహా ప్రకారం జర్మనీ వెళ్ళారు. ఫ్రాంక్‌ఫర్డ్‌లో దిగగానే ఆ డాక్టర్ అక్కడ ఉన్నాడు. రామా ఇండియా నుండి వచ్చారని తెలియగానే కొన్ని బొమ్మలు గీసి 'అటువంటి వ్యక్తినెప్పుడైనా చూశారా?' అని అడిగాడాయన. 'ఈయన పదే పదే నాకు దర్శనం ఇచ్చారు. అది నా భ్రమ కాదు. చూపించి పుణ్యం కట్టుకోండి. ఈయన దర్శనంవల్ల నేను నా పని చేసుకోలేక పోతున్నాను. ఈ విగ్రహమే కనిపిస్తోంది. మీరు ఇండియా నుండి వచ్చారు కదా? బహుశ మీరు సాయపడగలరేమో అనిపిస్తోంది' అన్నారాయన ఆ బొమ్మలు చూడగానే 'ఈయనే మా గురుదేవులు' అన్నారు రామా. ఆ డాక్టర్‌గారు రామాతో ఇండియా వస్తానన్నాడు. అయితే గురుదేవులకు రామా తనకు దూరంగా ఉండాలని ఉంది. అందువల్ల వారి మానసిక బంధం మరింత దృఢపడుతుందని ఆయన నమ్మకం.

రామా ఆ డాక్టర్‌కు కాన్పూరులోని తనవారు డా॥ చంద్రధర్, డా॥ మిత్రాలను కలిసేందుకు వీలుగా ఉత్తరాలు ఇచ్చారు. అందులో ఆయనను గురుదేవులు బసచేసిన

జగేశ్వర్‌కు తీసుకెళ్ళమని రాశారు. అప్పుడు గురుదేవులు ప్రొఫెసర్ నిక్సన్ (కృష్ణప్రేమ్), డా॥ అలెగ్జాండర్ (ఆనందబిక్కు) లకు బోధిస్తున్నారు.

ఎట్టకేలకు ఆ డాక్టర్ గురుదేవులను చూశాడు. ఆయనతో మూడురోజులుండి జర్మనీ తిరిగి వెళ్ళాడు. అక్కడ రామాను యూరప్‌లోని పలు విశ్వవిద్యాలయాలలో, సంస్థలలో మాట్లాడేందుకు ప్రోత్సహించాడు. అక్కడ రామా ఎంతోమందిని కలిసి, ఎంతో చదివి తిరిగి ఇండియా చేరారు. తర్వాత ఆ డాక్టర్ కూడా ఇండియా వచ్చి సన్యాసం తీసుకున్నారు. ఈశాన్య హిమాలయాలలో ఆయన ధ్యానంలోనే గడిపారు. పాశ్చాత్యులు కొందరు అతణ్ణి పిచ్చివాడని అంటారు. భారతీయ స్వాములకన్నా శ్రద్ధ ఎక్కువ ఉన్న అటువంటి విదేశీ స్వాములను రామా చాలామందిని చూశారు. అంతర్వాణి చెప్పే భవిష్యత్తు ఒక్కోసారి పామరునికి కూడా తెలుస్తుంది. అయితే ధ్యానులకు అది తరచుగా కనిపిస్తుంది. అది స్వచ్ఛమైనది. ఖచ్చితంగా జరుగుతుంది అన్నారు స్వామీ రామా.

## 14.2 గుహలో పరివర్తన

ఒకసారి రామా పదకొండు నెలలపాటు ఒక చిన్న గుహలో గడిపారు. ఆ కాలంలో ఆయన మనిషన్నవాణ్ణి చూడలేదు. అంతకాలం అభ్యాసం చేస్తే మందబుద్ధి అయిన సాధకుడైనా ఎంతో కొంత నేర్చుకుంటాడు. అందుకే గురువులు అలా ఆదేశించారు. ఆ కాలంలో స్నానం కూడా చేయనివ్వరు. అంతకన్నా గొప్పగా శరీరాన్ని శుభ్రం చేసే శ్వాసక్రియా పద్ధతులు నేర్పుతారు. పరిమితంగా ఒక పూట భోజనం, కొంతనీళ్ళు ఇస్తారు. సాధారణమైన జీవితం గడిపేందుకు అది సరిపోతుంది. అప్పుడు రామా బార్లీ, కొండ కూరలు, పళ్ళ రసాలు తీసుకుని ఉదయం ఒకసారి, సాయంకాలం ఒకసారి పాలు తాగేవారు. కొన్ని ఆసనాలు వేసుకుని, రెండు మూడు గంటలు మాత్రం నిద్రపోయేవారు. మిగిలిన సమయంలో గురుమంత్రం గుర్తుంచుకుని ధ్యానం, తదేకంగా చూడడం (త్రాటకం) చేసేవారు. రోజుకు మూడుసార్లు జాగ్రత్తగా ప్రాణాయామం చేసే వారు. గుహద్వారం మూసి ఉన్నా మలినాలు, మురికినీరు పోయే దారి ఉంటుంది. పై కప్పు నుంచి రంధ్రం ద్వారా వచ్చే కాంతికిరణం ఏకాగ్రతను పెంచుతుంది. మనం వద్దనుకున్నా అది తక్షణం జరుగుతుంది. ఏకాగ్రతకోసం మనం ప్రయత్నించనక్కర్లేదు. ఎవరైనా ఆ పరిస్థితిలో ధ్యానం చేయక తప్పదు. ధ్యానం చేయకుంటే స్థిమితం తప్పుతుంది. మరోదారి లేదు.

ఋషులు - క్రమపద్ధతిలో దశలవారిగా ధ్యానం నేర్పుతారు. ధ్యానం వచ్చే ఫలితాల గురించి చెప్తారు. దాన్నిబట్టి మన పురోగతి తెలుస్తుంది. ఉత్తమమైన ఏకాగ్రత కుదురుతుంది. మనల్ని వారు చక్కగా పర్యవేక్షిస్తారు. మొదటి రెండు నెలలపాటు గుహలో ఉండడం రామాకు ఎంతో కష్టంగా ఉండింది. తర్వాత దానిని ఆనందంగా అనుభవించడం నేర్చుకున్నారు. ఏకాగ్రత, ధ్యానం, సమాధి ద్వారా రాజయోగం సంయమనాన్ని (అంతర పరివర్తన) నేర్పుతుంది. ఇందువల్ల రామాకు కొంతకాలం పాటు మౌనం లేకుండా ధ్యానంలో తీవ్రస్థితి వీలుకాదని తెలిసింది.

పదకొండు నెలల తర్వాత ఆయన గుహ బయటకు వచ్చారు. ఆ రోజు జూలై

27 సాయంకాలం అయిదు గంటలు. మొదటివారం ఎండలో నిలబడవద్దని గురువాజ్ఞ బాహ్య పరిసరాలకు సర్దుకోవడం కష్టమైంది. కొత్త ప్రపంచంలోకి వచ్చినట్లైంది. మొదటిసారి నగరంలోకి వెళ్ళినప్పుడు అక్కడ వీధి చివర కూడలిని దాటేందుకు నలభై నిమిషాలు పట్టింది. తర్వాత అలవాటైంది. క్రమంగా ప్రపంచ నాటకం రంగం అనీ, అక్కడ మన అంతరిక బలం, మాట, భావోద్రేకాలు, ఆలోచనలు, ప్రవర్తన వగైరాలను పరీక్షించుకోవచ్చుననీ రామాకు తెలిసింది.

రామాకు ఈ శిక్షణ ముగిసిన తర్వాత, 'నీ జీవిత లక్ష్యం నెరవేరాలంటే నీవు విదేశాలకు వెళ్ళాలి. సందేశం మనది. నీవు నా పనిముట్లవు. ముందు జపాన్ వెళ్ళి, అక్కడ ఒకరి సాయం పొంది తర్వాత అమెరికా వెళ్ళు' అన్నారు గురుదేవులు. జేబులో కేవలం ఎనిమిది డాలర్లతో కలకత్తానుండి జపాన్ వెళ్ళే విమానం ఎక్కారు స్వామీ రామా. హాంగ్‌కాంగ్‌లో విమానం ఆగింది. రామా. టీ తాగారు. బిల్లు నాలుగు డాలర్లనగా గుండె రారెత్తింది. టిప్‌కు ఒక డాలర్. టోక్యోలో దిగేటప్పుడు ఆయన దగ్గర కేవలం మూడు డాలర్లే వున్నాయి. విమానంలో పెట్టిన భోజనంలో ఆయన మిగుల్చుకున్న ఒక ఆపిల్ వుంది. ఇంతలో ఒకాయన వచ్చి 'మీరెక్కడి నుండి వచ్చారు? జపాన్‌లో ఎక్కడుంటారు?' అని అడిగాడు. 'నాకో మిత్రుడున్నాడు. అతనితో వుంటాను' అన్నారు రామా. 'ఎవరతను?' అన్న అతని ప్రశ్నకు ఏం జవాబు చెప్పాలో రామాకు తెలియలేదు. నిజానికి ఎవరైనా వుంటే కదా? అఖరుకు ధైర్యంచేసి 'నీవే' అన్నారు. ఆయన రామాను మహికారి పీఠాధిపతి యోకదాసన్‌కు పరిచయం చేశారు. యోకదాసన్‌కు వేలాది మంది శిష్యులున్నారు. ఆయనకు తరచూ ఓ హిమాలయ యోగి కనపడేవారు. రామా పరిచయం కాగానే ఆయన రామాను సంతోషంగా కౌగలించుకున్నారు. 'నీకోసమే వేచివున్నాను. నాకు హిమాలయ యోగుల రహస్య బోధనలు వినిపించు' అన్నారాయన. ఆయనతో రామా ఆరునెలలున్నారు. టోక్యో, ఒసాకా తదితర నగరాలలోని ఆధ్యాత్మిక బృందాలను కలిసి ప్రసంగించారాయన.

యోకదాసన్‌కు గురుదేవుల సందేశాన్ని అందించాక ఆయన రామాకు అమెరికా టికెట్ కొనిచ్చారు. అమెరికాలో చాలామంది శిష్యులు కలుస్తారని గురుదేవులు చెప్పారు. ఆయన ఇచ్చిన వివరాలన్నీ నిజమైనాయి. రామా తన జీవిత పరమార్థం నేరవేర్చారు.

## 14.3 తూర్పు పడమరలు

విదేశాలకు వెళ్ళేముందు గురుదేవులను స్వామీ రామా కొన్ని ప్రశ్నలు అడిగారు. నానుంచి నేర్చుకోవాలనుకునేవారికి నేనేం చెప్పాలి? వారి మతం మార్చాలా?

'భారతీయ సంస్కృతి గురించి నేర్చుకోమని చెప్పాలా?'

'బుద్ధిహీనుడా!' అన్నారు గురుదేవులు.

'అయితే, చెప్పండి నేనేం బోధించాలో. వారి సంస్కృతి వేరు. మన సంస్కృతి వేరు. మన సంప్రదాయంలో కుటుంబ సభ్యుల సమ్మతి లేకుండా పెళ్ళిళ్ళు కుదరవు. విదేశాలలో అలాకాదు. వారి దైవ పూజ స్థిరమైన పద్ధతిలో నడుస్తుంది. మనం

మనకు కావలసింది ఎన్నుకోవచ్చు. మనం సాంఘిక నియమాలకు బందీలం. అయినా స్వేచ్ఛగా ఆలోచిస్తాం. వారు వేరే ఆలోచనలతో పూజా విధులకు బందీలు. మరి ఇవి రెండూ భిన్నమార్గాలే! మీ సందేశం పాశ్చాత్యులకు వినిపించడం ఎలా?'

రామా ప్రశ్నలకు జవాబుగా గురుదేవులు ఇలా అన్నారు:

'ఒకే ప్రపంచంలో, ఒకే జీవిత పరమార్థం వున్నా తూర్పు పడమరలు భిన్నధృవాలు. రెండూ సరైన జీవనం గురించి పరిశోధనలు చేస్తున్నాయి. హిమాలయ గురువుల సందేశం కాలాతీతమైనది అంతరికశక్తి, సంతోషం, నిస్వార్థసేవ జీవితంలో ప్రాథమిక నియమాలు. తూర్పున వున్నరా? పడమర వున్నారా? అనేది అప్రస్తుతం. మనిషి, ముందు మనిషిగా వుండడం ముఖ్యం. నిజమైన మనిషి విశ్వజనీనుడు. మానవాళిని విభజించే అధికారం భౌగోళిక సరిహద్దులకు లేదు.

అన్నిభయాల నుండి స్వేచ్ఛ అనేది హిమాలయ ఋషుల తొలిసందేశం.

లోపలి సత్యం తెలుసుకోవడం రెండవ సందేశం.

మతంతో, సంస్కృతితో నిమిత్తం లేకుండా తక్షణం, స్వచ్ఛమైన ఆధ్యాత్మికతను బోధించేందుకు నీవే పరికరం కావాలి.

అన్ని ఆధ్యాత్మిక అభ్యాసాలు శాస్త్రీయంగా నిరూపించాలి – సైన్సుకు ఆ శక్తి వుంటే! భగవంతుడు సాయం చేస్తాడు.'

కాన్పూర్‌లో జపాన్ టికెట్ కొనిచ్చిన డా॥ సునందా బాయితో రామా కొన్నినెలలు గడిపారు.

## స్వామీ రామా సంప్రదాయం

వీరిది శంకరుల సంప్రదాయం. పన్నెండు వందల సంవత్సరాలనాటిది. 'భారతి' అనేది వీరి సంప్రదాయం పేరు. 'భా' అంటే విజ్ఞానం. 'రతి' అంటే ప్రేమికుడు. అందువల్ల 'భారతి' అంటే విజ్ఞాన ప్రేమికుడని అర్థం. దీనినుంచి మనదేశానికి భారతం అనే పేరు వచ్చింది. హిమలాయ సంప్రదాయం అవిచ్ఛన్నమైన ఋషి పరంపరకు చెందినది. వీరికి 'మాండూక్య ఉపనిషత్' ప్రమాణం. శ్రీవిద్య ప్రయోగ శాస్త్రాన్ని వారు అభ్యసిస్తారు. విశ్వంలో మాతాపితరుల సిద్ధాంతాన్ని అంగీకరిస్తారు. మాయనే తల్లిగా పిలుస్తారు. మంత్రం, బిందువేధనం, శక్తిపాతం, కుండలినీ జాగరణం వీరి ఆధ్యాత్మిక అభ్యాసాలలోని దశలు. వీరికి జాతి మతాలతో నిమిత్తం లేదు. అద్వైత సిద్ధాంతాన్ని ఆచరిస్తారు. నిస్వార్థంగా మానవాళిని ప్రేమించడం, సేవించడం వీరి లక్ష్యం. పతంజలి యోగ సిద్ధాంతం, ధ్యానం మొదలైనవాటిని వీరు ఆదరిస్తారు. వీరు శాకాహారులు. కుటుంబ వ్యవస్థను గౌరవిస్తారు. తమ అనుభవాలను గ్రంథస్థం చేస్తారు.



హిమాలయ యోగులు — డా॥ వి. వి. బాలకృష్ణ

## రచయిత గురించి




పేరు : డాక్టర్ వి.వి. బాలకృష్ణ

స్వస్థలం : తిరుపతి

పుట్టిన తేది : 1-4-1953

విద్యార్హతలు : ఎమ్ ఎస్‌సి. (కెమిస్ట్రి), పిహెచ్.డి.

వృత్తి : అధ్యాపక వృత్తి, శ్రీకృష్ణదేవరాయ యూనివర్సిటీ పోస్ట్‌గ్రాడ్యుయేట్ సెంటర్ కర్నూలు 518 001.


ప్రవృత్తి : సైన్సు ప్రచారం, అక్షరాస్యత ప్రచారం, వేణుగానం, ధ్యానం మొ॥

ఉపన్యాసాలు : రేడియోలో, స్కూళ్లలో, కాలేజీలలో, ఆలయాలలో 300 లకు పైగా సైన్సు, ఆధ్యాత్మిక రంగాలకు చెందిన పలు అంశాలపై

రచనలు : దాదాపు 50 పాపులర్ సైన్సు వ్యాసాలు, ఇతర సాహిత్య వ్యాసాలు, 60 పాపులర్ సైన్సు పిల్లల పుస్తకాలు.

బహుమతులు : రోటరీ సేవా బంగారు పతకం (1969). వయోజన విద్యాశాఖ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి నుండి ఉత్తమ రచయిత బహుమతి (1991).

ఆశయం : సైన్సు, ఆధ్యాత్మికత చెట్టపట్టాలు వేసుకుంటూ నడుస్తూ ఉండే విధంగా చూడడం., మంచితనానికి తగిన ప్రచారం చేయడం.


Cover Printed at Sri Balaji Art Printers, Hydarabad.